# శ్రీ మాతా అమృతానందమయి దేవి జీవిత చరిత్ర



Amrita BOOKS
Amrita Enterprises Private Limited
Amritapuri, Kerala, India

శ్రీ మాతా అమృతానందమయి దేవి
జీవిత చరిత్ర

Published by:
Amrita Books
Amrita Enterprises Private Limited
Amritapuri P.O., Kollam 690 546, Kerala, India
Email: info@amritabooks.in
Website: www.amritabooks.in

First Edition 2017
For more information contact:
Email: info@amritabooks.in
Website: www.amritabooks.in
Ashram Website:
www.amritapuri.org
www.embracingtheworld.org

# కృతజ్ఞతలు

ఈ పుస్తకంలో వివరించిన చాలా సంఘటనలు, మలయాళంలో ఆచార్య ఎం. రామకృష్ణన్ నాయర్ రచించిన అమ్మ జీవిత చరిత్రలో నుంచి తీసుకొన్నవి. ఇందుకు ఆయనకు హృదయపూర్వక కృతజ్ఞతలు.

# తొలి పలుకు

ప్రదీప జ్వాలాభిర్దివసకర నీరాజన విధిః
సుధాసూతేశ్చంద్రోపల జలలవైరర్ఘ్యరచనా
స్వకీయైరంభోభిః సలిలసౌహిత్యకరణం
త్వదీయాభిర్వాగ్భిస్తవ జనని వాచాం స్తుతిరియమ్.

అమ్మా, నువ్విచ్చిన నోటితో నిన్ను గురించి చేసే ఈ స్తుతి, సూర్యకిరణాలతో వెలిగించిన దీపజ్వాలలతో సూర్యుడికి ఇచ్చే హారతిలాగ, చంద్రకిరణాలవల్ల కరిగిన చంద్రకాంతమణి నీటితో చంద్రుడికి ఇచ్చే అర్ఘ్యం లాగ, సముద్రపు నీటినే అర్పించి సముద్రుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకోడంలాగ ఉంది.

-సౌందర్యలహరి
శ్లోకం 100.

ఆమె బ్రహ్మనిష్ఠానిష్ఠితురాలు. ప్రతి ఒక్కరూ ఆమె దగ్గరికి చేరవచ్చు; ఆమెతో మాట్లాడవచ్చు. ఆమె సన్నిధిలో దైవానుభూతి పొందగలరు. ఆమె వినయశీల; అయినా భూమిలా స్థిరమయినది. ఆమె సామాన్యురాలిలా కనిపిస్తుంది; కాని పూర్ణచంద్రబింబంలా సుందరమయినది. ఆమె ప్రేమ; ఆమె సత్యం; వైరాగ్యమూ, ఆత్మసౌఖ్య త్యాగమూ రూపుగట్టినదామె. ఆమె, నేర్పడమొక్కటే కాదు, తాను చేస్తుంది కూడా. ఆమె అన్నిటినీ ఇచ్చేది; ఏదీ తీసుకోనిది. పువ్వులా మృధువయినది, వజ్రంలా కఠినమయినది. ఆమె మహాగురువు; మహామాత. ఆమె

మాతా అమృతానందమయి.

పూర్తి ఎరుకతో పుట్టినదామె. కఠోర సాధన (అది ఏదో మనకు తెలియదు కాని) చేసి లేదా కనబరచి ఆమె, చెప్పనలవికానంత ప్రేమతో, కరుణతో ప్రపంచాన్నంతనూ అక్కున చేర్చుకుంది. ఆ ప్రేమా, ఆ కరుణా ఆమె వ్యక్తిత్వ అస్తిత్వాలు.

చాలా చిన్న వయస్సు నుంచీ ఆమె, గురువు సహాయం లేకుండానే, దివ్యమాతాపితలను అన్వేషిస్తూ వచ్చింది. [ఇంట్లోవాళ్ళూ] చుట్టపక్కాలూ, హేతువాదులూ, దుండగులూ - ఎందరో ఆమెను మట్టుబెట్టాలని చూశారు. కాని అన్ని దాడులకూ ఆమె నిలదొక్కుకొంది. ఈ యుద్ధరంగ మధ్యంలో ఒంటరిగా నిలబడి ఆమె, తొట్రుపడకుండా ధైర్యాన్ని విడవకుండా అన్నిటినీ ఎదుర్కొంది. 21వ ఏట తన దైవసాక్షాత్కార స్థితిని బయటికి కనబరిచింది. 22వ ఏట, సత్యాన్ని అన్వేషించేవాళ్ళు ఆధ్యాత్మిక జీవనం గడపడానికి, దీక్ష ఇవ్వడం ప్రారంభించింది. 27వ ఏడు వచ్చేసరికి ఈ పూజ్యమాత, తాను పుట్టిన ఇంటో, తన అంతర్జాతీయ మిషన్ తాలూకు కేంద్ర కార్యస్థానాన్ని స్థాపించింది. మరో ఐదేళ్ళలో భారతదేశంలోనూ, విదేశాల్లోనూ దాదాపు ఇరవై శాఖారూపమయిన ఆశ్రమాలు ఏర్పడ్డాయి. 33వ ఏట, అమెరికాలోనూ ఐరోపాలోనూ ఉన్న తమ భక్తుల ఆహ్వానం మేరకు, పూజ్యమాత మొట్టమొదటిసారిగా ప్రపంచ పర్యటన చేసింది. ప్రపంచమంతటా ఎంతోమందిని ఉత్తేజితుల్ని చేసింది; ఉద్ధరణ చేసింది.

వీటన్నిటినీ మించి, ప్రపంచం నలుమూలలనుంచి వచ్చిన, అనేక వృత్తి ఉద్యోగ జీవనాల్లో ఉన్న లక్షలాదిమందిని పలకరించి పరామర్శించి కన్నీళ్ళు తుడిచి వాళ్ళ భారాలను తొలగించింది. కాబట్టి, ప్రియ పాఠకులారా, ఆమె ఎవరో, ఆమె చేస్తున్నది ఏమిటో మీ హృదయంలోని అంతర్బోధతో నిర్ణయించుకోండి.

స్వామి అమృతస్వరూపానంద.

# తెలుగు పలుకు

మంచి పుస్తకం మరొకటి తెలుగులోకి వచ్చినందుకు ఆనందంగా ఉంది. తెలుగులో ఆధ్యాత్మిక గ్రంధాలు చాలానే ఉన్నాయి. భక్తులూ జిజ్ఞాసువులూ చాలా మందే ఉన్నారు. అయినా దేని ప్రత్యేకత దానిది; దేని తీరుతెన్నులు దానివి. ఎవరికి ఏది రుచిస్తే అది, ఎవరికి ఏది అందుబాటులో ఉంటే అది చదువుతారు. అందువల్ల, రుచి కలిగించే మంచి పుస్తకాలు అందరికీ అందుబాటులోకి రావాలి. వాటివల్ల తప్పకుండా లాభం పొందుతారు.

ఏ గ్రంథానికయినా ప్రాముఖ్యం వచ్చేది మూడు ప్రధానంశాలవల్ల. మొదటిది: చెప్పిన విషయం. రెండోది: చెప్పిన వ్యక్తి. మూడోది: చెప్పిన తీరు. వీటిలో ఏ ఒక్క అంశంవల్లనయినా గ్రంథానికి ప్రాముఖ్యం రావచ్చు. ఈ మూడు అంశాల పరంగాను ప్రాముఖ్యమున్న గ్రంథానికి అన్నిటికంటె ఎక్కువ విలువ ఉంటుంది.

'మాతా అమృతానందమయి జీవితచరిత్ర, భక్తుల అనుభవాలు' అటువంటి గ్రంథం.

చరిత్ర గతిలో అనేక రాజకీయ, సామాజిక, ఆర్థిక కారణాలవల్ల ఏర్పడిన పరిణామాలూ కలిగిన ప్రభావాలూ నేటి మనిషి దృష్టిని ఆత్మీయత నుంచి మళ్ళించి భౌతిక ప్రయోజనాల మీదే నిలుపుతున్నాయి; భోగలాలసను పెంచుతున్నాయి. దానివల్ల స్నేహం, సౌహార్దం, ప్రేమ, ఆప్యాయత, సానుభూతి, సహాయం, సహకారం, సేవ, సర్వజనహితం, స్వార్థత్యాగం వంటి మేలి గుణాలు కరువయి స్వార్థం, అసూయ, ద్వేషం, వైరం, పగ, కామం, మోసం, దోపిడి, దౌర్జన్యం, హింస వంటి అవలక్షణాలు పెచ్చరిల్లుతున్నాయి. మనిషి విలువకు అతని డబ్బే మారుపేరయింది. అనాదిగా జరుగుతున్న మానవ పరిణామక్రమంలో మనిషికి అలవడిన సున్నితమయిన భావాలు, సంస్కారం, సౌమనస్యం, మార్దవం, మర్యాద అడుగంటిపోయి మొరటుతనం, ఆడంబరం, ఆర్భాటం, అశ్లీలత చోటుచేసుకొంటున్నాయి. చిత్తసంస్కారాన్ని పెంచవలసిన సాహిత్యం, కళలు నకిలీ సరుకులను సృష్టించి హాయిగా వ్యాపారం చేసుకొంటున్నాయి. కష్టపడి పనిచేసే తత్వాన్ని మనిషిలో హరింపజేసి విలాస ప్రదర్శనలతో, వినోద కాలక్షేపంతో వ్యర్థుణ్ణి చేస్తున్నాయి. తప్పుడు విలువలు గొప్పగా చెలామణి అవుతున్నాయి.

ఈ నేపథ్యంలో, అన్నివైపులా ఆబగా చూడటం అలవాటయిన మనిషి తనలోకి చూసుకోడం ఒక్కటే మానేశాడు. అసలు తానెవరన్నది మరిచిపోయాడు. అది తెలియక, తాను నాస్తికుడనిపించుకోడం నాగరికత అయింది; అజ్ఞేయతా వాదిని అనిపించుకోడం నాజూకు అయింది.

ఇల్లలుకుతూ తన పేరు మరిచిపోయిన ఈగలాటి నేటి మనిషిని చక్కదిద్దడమన్నది సామాన్యులవల్ల కాదు. అందుకు ఎందరో మహానుభావులు దిగి రావాలి. వాళ్ళలో కొందరు అంశావతారాలయితే, కొందరు ఆవేశావతారాలు, కొందరు పూర్ణావతారాలు. ఒక్కొక్క పరిస్థితిలో ఒక్కొక్కరి అవసరం ఉంటుంది.

1996 మే మొదటి వారంలో నేను, అమ్మ ఆశ్రమాన్ని సందర్శించాను; అమ్మను దర్శించి వచ్చిన తరువాత ఆనందంగా మొదలుపెట్టిన అనువాదం, ఆమె జన్మదినోత్సవంనాటికి పూర్తి అయింది.

ఈ పుస్తకం చదవబోయే పాఠకుడికి 'అమ్మ ఎవరు?' అన్న ప్రశ్న రావడం సహజం. ఊరూ పేరూ వగైరా వివరాలు ఆమె ఎవరో చెప్పవు. ఆమె జీవిత సంఘటనల వృత్తాంతాలూ భక్తుల అనుభవాలూ శిష్యులు పొందిన శిక్షణా ఒక్కొక్క పార్శ్వంలో వెలుతురు ప్రసరింపజేయవచ్చు. తనను తాను అతి సామాన్యురాలిగా, అందరికీ సేవకురాలిగా తనను తాను భావించుకునే అమ్మ, అన్నిటికీ అతీతంగా ఉంటూనే అందరి సమస్యలనూ తనవిగా చూసుకొని అసమాన నైపుణ్యంతో వాటిని పరిష్కరిస్తుంది; ఓదార్పునిస్తుంది. మహారోగ పీడితుణ్ణికూడా తన స్పర్శతో నీరోగిని చేస్తుంది. అసాధ్యాలను సాధ్యాలు చేస్తుంది. అహంభావుల అంచనాలను తలకిందులూ చేస్తుంది.

అమ్మ- కొందరికి తల్లి; కొందరికి గురువు; కొందరికి ధన్వంతరి; కొందరికి శ్రీకృష్ణపరమాత్మ; కొందరికి జగజ్జనని; కొందరికి ఇవి అన్నీ. అయినా ఆమె మూలస్వరూపం మాటలకు అందేది కాదు. అది అనుభూతి విశిష్టమయినది.

కల్పిత కథకన్న సత్యకథనం అద్భుతమయినదంటారు. ఈ గ్రంథం తెలుగు పాఠకులకు గొప్ప అనుభూతినిస్తుందని నా విశ్వాసం.

- పోరంకి దక్షిణామూర్తి

# పూర్వగాథ

దక్షిణ భారతదేశంలో కేరళ రాష్ట్రంలో కొళ్ళం (కోయిలాన్) జిల్లాలో ఆలప్పాడ్ పంచాయతీలో పరయకడవు అనే చిన్న పల్లె ఉంది. తూర్పువైపు ఉప్పుటేరు (సముద్రపు కయ్యా) వల్ల ప్రధాన భూభాగంనుంచి వేరయిన సన్నని ద్వీపకల్పం పొడుగునా [కనుచూపు అనినంతమేరా] ఎన్నో కొబ్బరిచెట్లు ఉన్నాయి. పడమటివైపు మిలమిల మెరిసే నీలి, ఆకుపచ్చ కలగలుపు వన్నెగల అరేబియా సముద్రముంది. ఈ రెంటికీ మధ్యలో ఉంది ఆ పల్లె [ఉప్పుటేటికి ఇవతల, తూర్పున ఉన్న గ్రామం వళ్ళిక్కావు].

ఈ పల్లెప్రజలు మామూలు బెస్తవాళ్ళు (చేపలవాళ్ళు). తమ వంశపూర్వీకుడు పరాశర మహాముని అని గర్వంగా చెప్పుకుంటారు. పరాశరముని బెస్తవారికన్నె అయిన సత్యవతిని చేపడతాడు. ఆమె కుమారుడే వేదాలను విభజించిన శ్రీవేదవ్యాసుడు. ఈ గ్రామం పవిత్రతను గురించి, గొప్పతనాన్ని గురించి చెప్పే పూర్వగాథలు ఎన్నో ఉన్నాయి. ఇక్కడ నిత్యజీవితం, సాంఘికాచారం ఇప్పటికీ పురాణ కథలతో గట్టిగా ముడిపడి ఉన్నాయి. ఆ కథలు కొన్ని వేల సంవత్సరాల కిందట నిజంగా జరిగినవేనని బెస్తవాళ్ళు గట్టిగా నమ్ముతారు. అలాటి కథ ఒకటి ఇలా ఉంది:

ఒకనాడు శివపార్వతుల కుమారుడైన సుబ్రహ్మణ్యస్వామి పెద్ద తప్పు ఒకటి చేసాడట. కొడుకు చేసిన ఈ అపరాధానికి శివుడు మండిపడి చేపవై పుట్టమని సుబ్రహ్మణ్యస్వామిని శపించాడు. కొడుకు దురదృష్టానికి తల్లి పార్వతి దుఃఖించి సుబ్రహ్మణ్యుడి తప్పు కాచమని ప్రార్థించింది. ఆమెను ఓదార్చకపోగా, శివుడు కోపోద్రేకంతో, పార్వతిని కూడా బెస్తస్త్రీగా పుట్టమని శాపం పెట్టాడు. ఆ తరవాత, కోపం చల్లారాక, శివుడు సుబ్రహ్మణ్యస్వామిని పిలిచి సరైన సమయంలో తానే వచ్చి వాళ్ళిద్దరికీ శాపవిమోచనం చేస్తానని దీవించాడు.

శివుడి శాపం ప్రకారం సుబ్రహ్మణ్యస్వామి చేపగా -పెద్ద తిమింగిలంగా- అవతరించాడు. ఈ తిమింగిలం ఆలప్పాడ్ సముద్రంలో బెస్తవాళ్ళను చాలా బాధపెట్టడం మొదలుపెట్టింది. రాత్రింబగళ్ళు చేపలను వేటాడడానికి అలవాటుపడ్డ ఈ బెస్తవాళ్ళు ఇప్పుడు సముద్రంలో అడుగు పెట్టడానికే భయపడుతున్నారు.

ఈ తిమింగిలం ఒక్కొక్కప్పుడు, వాళ్ళు విసిరిన వలలను ముక్కలు ముక్కలుగా కొరికి పారేస్తోంది. మరొకప్పుడు వాళ్ళ పడవలను తలకిందులు చేసి పారేస్తోంది. వాళ్ళ ప్రాణాలకే ముప్పు తెస్తోంది. కొంతకాలానికి ఆ పల్లె వాళ్ళు పేదరికంలో మగ్గుతూ పస్తులుపడి ఉన్నారు.

బెస్తవాళ్ళ రాజు కూడా ఈ సమస్యకు పరిష్కారం కనుక్కోలేకపోయాడు. అతని ధనాగారం దాదాపు ఖాళీ అయింది: పస్తులున్నవాళ్ళకు భోజనాలు పెట్టడంవల్ల . చివరికి అతను, ఈ సమస్యను పరిష్కరించే ప్రయత్నంలో ఒక ప్రకటన చేసాడు. కష్టాలు పెడుతున్న ఈ తిమింగిలాన్ని ఎవరైనా పట్టుకుంటే అతనికి గొప్పగా కానుకలు ఇవ్వడమే కాకుండా, అందాల బరిణ అయిన, తన ఏకైక పుత్రికను అతనికిచ్చి వైభవంగా పెళ్ళి చేస్తానని ప్రకటించాడు. అయినప్పటికీ ఈ తిమింగిలం చాలా భయంకరమైనది కావడంవల్ల ఈ సవాలునెదుర్కొని తమ అదృష్టాన్ని పరీక్షించుకోడానికి ఎవరూ ముందుకు రాలేదు. రాజూ ప్రజలూ కూడా చాలా నిరాశపడ్డారు.

ఈ పరిస్థితిలో ఉత్తరంవైపు నుంచి ఒక ముసలాయన చాలా చిత్రంగా వచ్చాడు. ఆయన ఎవరో, ఎక్కడ నుంచి వచ్చాడో ఎవరికీ తెలియదు. ఆయన రాజు దగ్గరికి వచ్చాడు. వయస్సు పైబడటంతో ఆయన నడుం వంగిపోయింది. ఆ తిమింగిలాన్ని పట్టి బెస్తవాళ్ళు పూర్తిగా నాశనం కాకుండా చూస్తానన్నాడు. అది విని రాజూ ప్రజలూ కూడా ఆశ్చర్యపోయారు. వాళ్ళు వెంట వస్తూండగా, ఆ ముసలాయన సముద్రం వైపు నడిచాడు.

ఒక రకం మొక్క తీగను పొడుగాటి తాడుగా పేని, ఆ ముసలాయన, దాని కొస ఒకటి తన చేత్తో గట్టిగా పట్టుకొని రెండో కొసను సముద్రంలోకి విసిరాడు. ఈ తీగతాడు, తిమింగిలం మునిగివున్న చోట, చుట్టూ ఒక కడియంలా ఏర్పడింది. తరవాత ముసలాయన, ఆ తాడును బెస్తవాళ్ళ చేతికి ఇచ్చి వాళ్ళకున్న బలాన్నంతనూ వినియోగించి లాగమన్నాడు. అలా లాగుతున్నప్పుడు, తీగతాడుతో తిమింగిలం చిక్కుపడటం కోసం ఒకానొక మంత్రం బెస్తవాళ్ళకు ఉపదేశించాడు.

ముసలాయన ఉపదేశం ప్రకారం ఆ బెస్తవాళ్ళు మంత్రాన్ని జపిస్తూ తాడు లాగడం మొదలుపెట్టారు. కొన్ని గంటలపాటు చాలా పెద్ద పెట్టున ప్రయత్నం జరిగాక, తీగల తాడుకు చిక్కుపడ్డ ఆ తిమింగిలాన్ని ఒడ్డుకు లాగగలిగారు. ఒడ్డుకు చేరీ చేరగానే ఆ తిమింగిలం మాయమయిపోయింది; అందరూ ఆశ్చర్యపోయారు.

తిమింగిలాన్ని పట్టుకున్న ముసలాయన శివుడే కాని మరొకరు కారు. ఈ విధంగా సుబ్రహ్మణ్యస్వామికి శాపవిముక్తి కలిగింది. ఆ తిమింగిలాన్ని ఒడ్డుకు చేర్చిన చోట సుబ్రహ్మణ్యస్వామికి ఒక గుడి కట్టారు. ఈ పాత కథను మనకు గుర్తు చేస్తూ, ఆ గుడి ఇప్పటికీ అక్కడ ఉంది.

అయినా, కథ ఇంతటితో అయిపోలేదు. ముసలాయన రూపంలో ఉన్న శివుడు ముందుకు వచ్చి రాజు ఎదుట నిలబడ్డాడు. దీనికి అర్థం ఏమిటో ఆ రాజుకూ ప్రజలకూ తెలిసింది. చేపను పట్టుకొన్నవాడికి తన ఏకైక పుత్రికనిచ్చి వివాహం చేస్తానన్న రాజు ఇప్పుడు ఇరుకున పడ్డాడు. రాజూ ప్రజలూ మళ్ళీ విచారంలో మునిగారు. పడుచు కన్నె, సాటిలేని మేటి అందకత్తె, అయిన రాజకుమార్తెను, చూసిచూసి, ఒక ముసలివాడికిచ్చి పెళ్ళి చేయడానికి ఏ తండ్రి- ముఖ్యంగా రాజు - సిద్ధపడతాడు? తన రాజ్యం మొత్తంలో, తన కూతురిని తప్ప, మరి దేన్నయినా సరే కోరుకోమని రాజు ముసలాయనకు మనవి చేశాడు. దానికి ఆ ముసలాయన, రాజు తనిచ్చిన మాట నిలబెట్టుకోవాలనీ సత్యసంధుడు కావాలనీ నిబ్బరంగా చెప్పాడు.

రాజు ఇప్పుడు అసలు సంకటంలో పడ్డాడు. సత్యం బెస్తవాళ్ళ బలం. సత్యమే తమకు రక్ష అనీ, సత్యానికి కట్టుబడకుండా ఎవరయినా చేపల వేటకు వెళ్ళినట్లయితే పెద్దగా తెరుచుకొని ఉన్న, భయంకరమయిన, మృత్యు ముఖంలోకి దూకడమేననీ వాళ్ళు గట్టిగా నమ్ముతారు. రాజు ఎటూ తేల్చుకోలేకపోయాడు. తన మాటా తప్పలేడు; అలాగని, ప్రియమయిన రాజకుమారిని ముసలివాడికిచ్చి పెళ్ళి చెయ్యా లేడు.

ఈ సంకటస్థితిలో, ఆ రాజకుమారి - నిజానికి ఆమె పార్వతీదేవే - ముందుకు వచ్చి, జంకు విడిచి ఇలా అంది: "నాన్నా! మహారాజా! ధర్మాన్ని కాపాడటం, నిలబెట్టడం ప్రతి ఒక్కరి కర్తవ్యం. దానికి ఏదీ అడ్డు రాకూడదు." ఆ రాజకుమారి ముసలాయనతో వెళ్ళిపోతూ ఉంటె రాజూ, ప్రజలూ కూడా దుఃఖ సంతప్తులయారు. కాని అంతకంటె మరో దారీ కనిపించలేదు. అతి సామాన్యమయిన తమ బెస్తరాజ్యం, శివపార్వతులు మళ్ళీ కలిసే దివ్యలీలాప్రదర్శనకు రంగస్థలమవుతుందని ఆ బెస్తవాళ్ళు అనుకోలేదు. ఆ దివ్యదంపతులు ఆ రాజ్యంనుంచి వెళ్తూ ఉంటే స్థానికులు బరువు గుండెలతో వారికి వీడుకోళ్ళు చెప్పారు. చాలా దూరం వెళ్ళిన తరవాత వాళ్ళు ఇలా అడిగారు: "మీరెక్కడికి వెళ్తున్నారు? మాక్కూడా మీతో రావాలని ఉంది."

దానికి వారు ఇలా చెప్పారు: "మాకు ఫలానా ఊరంటూ లేదు; మేము చేరేది మాకు ఉండూరు (చెల్లున్న ఊరు) అవుతుంది."

శివుడూ పార్వతీ ముందుకు వెళ్తూ ఉండగా బెస్తవాళ్ళు వారి వెంట వెళ్తూనే ఉన్నారు. చాలాకాలానికి, చివరికి వారొక చోటికి చేరి అక్కడ నిలిచారు. శివుడు తూర్పువైపూ పార్వతి పడమటి వైపూ చూస్తూ నిలిచి ఉండగా శిలావిగ్రహాలయిపోయారు. ఆ 'చెల్లున్న ఊరు'నే ఈనాడు 'చెంగన్నూరు' అంటున్నారు.

కొంత కాలానికి ఒక గుడి కట్టారు; నిత్యపూజ మొదలయింది. కాని, ఈ కాలంలో ఒక విచిత్రం జరిగింది. పూజకోసమని గర్భాలయంలోకి నీళ్ళు తెచ్చినప్పుడల్లా, ఆ నీళ్ళలో పూజారులకొక చేప కనిపిస్తూ ఉండేది. ఇందువల్ల నిత్యపూజ చేయడానికి వీలు కాకుండా ఉండేది. ఈ సమస్యకు పరిష్కారం కనుక్కొనేటందుకు, ఆలయాధికారులు జ్యోతిషశాస్త్రపరమయిన లెక్కలు వేసినప్పుడు శివపార్వతుల గాథా సుబ్రహ్మణ్యస్వామి శాప వృత్తాంతమూ వెల్లడి అయాయి. ఆ ముసలాయనకూ రాజకుమార్తెకూ పెళ్ళి జరగనే లేదని కూడా జ్యోతిషశాస్త్రం ద్వారా తెలియవచ్చింది. సామాజిక ఆచారం ప్రకారం, పార్వతీదేవి బెస్తకన్నెగా పుట్టిన ఆలప్పాడ్ సముద్రతీరపు ప్రజలు వరదక్షిణా తక్కిన కానుకలూ తీసుకొని చెంగన్నూరుకు వచ్చి పెళ్ళి జరిపించాలి. ఉత్తరోత్తరా, అవసరమయిన ఏర్పాట్లు చెంగన్నూరులోనూ ఆలప్పాడ్‌లోనూ జరుగుతూ వచ్చాయి. ఆలప్పాడ్ బెస్తలు, తగిన విధంగా పెళ్ళిసామాగ్రి అంతా కూర్చుకొని, దేవుడి పెళ్ళిపండుగ జరిపించడానికి చెంగన్నూరుకు వెళ్ళేవారు. ఈ నాటికీ కూడా, ప్రతిఏటా ఉత్సవకాలంలో ఈ పూర్వగాథ జ్ఞాపకార్థం ఈ ఆచారాన్ని పాటిస్తున్నారు. ఈ గుడి, వేలాది భక్తులను ఆకర్షించే కేంద్రంగా ఇప్పటికీ విలసిల్లుతూ ఉంది.

పై కథకు సంబంధించి, కొన్ని దశాబ్దాల కిందట ఆసక్తికరమయిన సంఘటన ఒకటి జరిగింది. ఒక ఏడాది ఆలప్పాడ్ తీర ప్రజలు, ఆచారప్రకారంగా ఉన్న నియమాలను, ఏర్పాట్లను మానేసి ఉత్సవంలో పాల్గొనలేదు; అదంతా అర్థంలేనిదనీ బోలెడంత డబ్బు ఖర్చుపెట్టుకుని చెంగన్నూరుకు ప్రయాణం చెయ్యడం వ్యర్థమనీ అనుకొన్నారు. "ఎక్కడో దూరపు ఊళ్ళో జరిగే ఉత్సవానికి మనమెందుకూ తోడుపడటం?" అనుకొన్నారు. దాని ఫలితంగా చెంగన్నూరు ఆలయంలో విచిత్రమయిన సంఘటనలు సంభవించాయి. ఊరేగింపులో దేవుడి విగ్రహాన్ని మోయవలసిన - అలంకరించి ఉన్న - ఏనుగు అడుగు ముందుకు

వెయ్యలేదు. దాన్ని కదిలించడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయాయి. ఈ అమంగళ సంఘటనను గురించి ఆలప్పాడ్‌కు వెంటనే వర్తమానం పంపారు. కాని అప్పటికే ఆలస్యం అయిపోయింది. అప్పటికే ఆలప్పాడ్‌లో మశూచి వ్యాధి పొడచూపింది. అప్పుడు ఆ ఊరివాళ్ళు, తెలివితక్కువగా తాము తప్పు చేసినందుకు పశ్చాత్తాపపడి, ఆచారప్రకారం ఉత్సవంలో పాల్గొనడానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసుకొని మరేమీ ఆలస్యం చెయ్యకుండా చెంగన్నూరుకు ప్రయాణం కట్టారు.

ఈ సముద్రతీర భూమినీ ఇక్కడి ప్రజలనూ సన్నిహితంగా, సుస్పష్టంగా పెనవేసుకొన్న పురాతన గాథ ఇది. అటువంటప్పుడు, ఈ పావన పరిసరాలు దైవలీలా విన్యాసాలకు కేంద్రరంగం కావడంలో ఆశ్చర్యమేముంది?



శ్లో॥ కింతీ మంగేభ్యః కిరణ నికురుంభామృతరసం
హృది త్వా మా ధత్తే హిమకరశిలామూర్తి మివ యః
స స్పాణాం దర్పం శమయతిశకుంతాధిప ఇవ
జ్వరప్లుష్టాన్ దృష్ట్యా సుఖయతి సుధాధార సిరయా॥

- సౌందర్యలహరి

తాత్పర్యము: తల్లి చరణాది సర్వ అవయవములనుండి ప్రసరించుచున్న కిరణముల సమూహమునుండి అమృతమును వర్షించుచున్న చంద్రకాంత శిలా శిల్ప రమణీయమూర్తిగా నిన్ను ఏ సాధకుడు హృదయమున నిల్పుకొని ధ్యానించుచున్నాడో ఆ సాధకుడు పక్షులకు ప్రభువైన గరుత్మంతునివలె సర్పముల దుర్దర్పమైన విషమును శాంతింపడేయుచున్నాడు. సర్వ సర్ప విషబాధలను పోగొట్టుచున్నాడు. జ్వరతీవ్రతతో తాపమును పొందుచున్నవారికి అమృతమును ధారగా స్రవించుచున్న నాడీ యుక్తమైన తన శీతలమైన చూపుచేతనే జ్వర బాధను తొలగించి సుఖానుభవమును కలిగించుచున్నాడు.

# భాగం

# 1

# జీవితం

## మొదటి అధ్యాయం

## పుట్టుకతోనే

దైవనామమంటే గాఢమయిన ఇష్టం నాకు పుట్టుకతోనే ఏర్పడింది. అందువల్ల నేను ప్రతి ఒక్క శ్వాసతోనూ ఎడతెరిపి లేకుండా దైవనామాన్ని జపిస్తూ ఉండేదాన్ని. నేను ఎక్కడ ఉన్నా, నేను ఏ పని చేస్తూ ఉన్నా నా మనస్సులో దైవపరమయిన ఆలోచనల సంతతప్రవాహాన్ని నిలుపు కొనేదాన్ని. దైవసాక్షాత్కారం పొందాలని కోరేవారికెవరికయినా, ప్రేమతోను, భక్తితోను చేసే ఎడతెరిపిలేని ఈ దైవస్మరణ గొప్పగా సహాయపడుతుంది.

- మాతా అమృతానందమయి.

త్రీర్థీ కుర్వంతి తీర్థాని సుకర్మీ కుర్వంతి
కర్మాణి సచ్ఛాస్త్రీ కుర్వంతి శాస్త్రాణి.

మోదంతే పితరో నృత్యంతి దేవతాః
సనాథా చేయం భూర్భవతి.

మహర్షులు [మహాభక్తులు] యాత్రాస్థలాలకు పావనత్వం
కలిగిస్తారు; ధర్మకార్యాలూ సత్కర్మలూ చేస్తారు;
పవిత్ర గ్రంథాలకు ఆధ్యాత్మిక అధికారం ఇస్తారు.

అటువంటి ఋషి పుట్టినప్పుడు తండ్రులు సంతోషిస్తారు;
దేవతలు ఆనందంగా నృత్యంచేస్తారు; భూమికి రక్షకుడు
లభిస్తాడు.

నారద భక్తిసూత్రాలు
శ్లోకాలు 69 71

## వంశపరంపర

ఆలప్పాడ్ పంచాయతిలో ఒక చిన్న భాగమయిన పరయకడవు పల్లెలో ఇడమన్నేల్ వారిది పురాతనమయిన వంశం. చేపలు పట్టడం వారికి తాతలనాటి వృత్తే అయినా వేరే పనులు కూడా చేస్తూ ఉంటారు. మతపరమయిన ఆచారాలు పాటించడం, నోములు పట్టడం వాళ్ళ నిత్యజీవితంలో భాగం. ఈ బెస్తవారు ఔదార్యానికి పేరు పొందినవారు. వాళ్ళు సముద్రంనుంచి తిరిగి రాగానే చేసే మొట్టమొదటి పని ఏమిటంటే, అక్కడికి చేరిన గ్రామస్థులందరికీ, ఏమీ డబ్బు తీసుకోకుండా, కొన్ని చేపలు పంచిపెట్టడం. ఆనాటి వేట అమ్ముడయిన తరవాత ఒక గుప్పెడు నాణేలు [పైసలు] పిల్లలందరికీ పంచిపెట్టేవారు.

ఇడమన్నేల్ వారి వంశంలో పవిత్రాత్ములు చాలామంది పుట్టారు. వారిలో శ్రీవేలాయుధన్ ఒకరు. ఆయన చాలా దయ కలవాడు; ఎప్పుడూ నిజమే చెబుతూ ఉండేవాడు; అహింసా ధర్మానికి దృఢంగా కట్టుబడి ఉన్న ఉదారుడు. చిన్న

ఎలకను కూడా ఆయన చంపనిచ్చేవాడు కాదు. వేలాయుధన్‌కు శ్రీమతి మాధవి వివాహమయింది. ఆమె శీలవతి; చాలా పవిత్రురాలు. ఇంట్లో, దేవుడి గదిలో ఉన్న దేవతలందరికీ పూలదండలు అల్లడం కోసమని వేకువకు ముందే మేలుకొనడం ఆవిడ అలవాటు. అంతసేపూ ఆవిడ దైవనామస్మరణ చేస్తూనే ఉండేది. ఇప్పటికీ కూడా ఆవిడ ఎనభయ్యోవపడిలో పడినప్పటికీ, గుడిముందు కూర్చొని అదే భక్తితత్పరతతో పూలదండలు అల్లుతూ ఉండటం చూడవచ్చు.

వారి ఐదుగురు సంతానంలో పెద్దకొడుకు సుగుణానందన్. భక్తి యుక్త మయిన కుటుంబ వాతావరణం వల్ల ఆయన స్ఫూర్తిపొంది కృష్ణభగవానుడి గాఢభక్తుడు అయాడు. తొమ్మిది పదేళ్ళ వయస్సులో ఆయన కథాకళి నేర్చుకొన్నాడు. కథాకళి దేవీదేవతల లీలలను ప్రదర్శించే, కేరళ ప్రదేశపు శాస్త్రీయ నృత్యనాటకం. నర్తకులు నాట్యాభినయంతోను, ముద్రలతోను కథను ప్రదర్శిస్తూ ఉండగా, గాయకులు పాటల్లో కథను చెబుతూ ఉంటారు. సుగుణానందన్ నటించడానికి ఇష్టపడే పాత్ర శ్రీకృష్ణుడిది. ఒకసారి కథాకళి ప్రదర్శన జరుగుతూ ఉన్నప్పుడు ఆయన, తాను ధరించిన కృష్ణపాత్రలో లీనమయిపోయి వేదికమీద స్పృహ తప్పి పడిపోయాడు.

ఇడమన్నేల్ వారి ఇంటి చుట్టుపక్కలంతా వాతావరణం ప్రశాంతంగా ఉండేది. మూడువైపులా ఉప్పుటేరు చుట్టి ఉండేది. వన్యప్రాణులతోను, కొబ్బరిచెట్లతోను, పండ్ల చెట్లతోను, జీడిమామిడి చెట్లతోను కళకళలాడేది. ఆ రోజుల్లో, పరిసరాల్లో చాలా కొద్దిగానే ఇళ్ళు ఉండేవి. సుగుణానందన్ 13 - 14 ఏళ్ళ వయస్సులో బంధువుల పిల్లవాడితో కలిసి బడి నుంచి వస్తూ జీడిమామిడి చెట్లు ఎక్కి తియ్యగా పళ్ళు తింటూండేవాడు. ఇది వాళ్ళకొక మంచి వినోదం. ఒక శుభదినాన, ఈ కుర్రవాళ్ళిద్దరూ చెట్లలోకి వెళ్ళి జీడిమామిడిపండ్ల ఫలహారం కానిస్తూ ఉండగా పొడుగాటి జుట్టూ గడ్డమూ ఉన్న ఒక సన్యాసి ఇడమన్నేల్ వైపు వస్తూండటం గమనించారు. ఆయన ఆ ప్రాంతంలో అంతకుముందెన్నడూ అవుపించినవాడు కాదు. ఆయన తేజస్సును చూసి కుర్రవాళ్ళు అప్రతిభులయారు. సన్యాసి ఆ భూమిలో కొద్దిసేపు సంచరించాడు. అకస్మాత్తుగా ఆయన ఆనందంగా నవ్వుతూ "ఎంతో మంది తపస్వులు ఈ ప్రదేశంలో కూర్చొని గాఢమయిన ధ్యానంలో మునిగి ఉండటం కనిపిస్తోంది నాకు. పూర్వకాలంలో ఎందరో మహాత్ముల నివాస స్థానమిది. ఈ ప్రదేశంలో, భూమిలో వారి సమాధులున్నాయి. ఎంతోమంది సన్యాసులు ఇక్కడ సమాధి (ముక్తి) పొందుతారు. ఇదొక పవిత్ర స్థలమవుతుంది" అంటూ బిగ్గరగా చాటాడు. ఆ సన్యాసి మళ్లీ ఆనందపారవశ్యంతో నవ్వుతూ తన

దారిన తాను వెళ్ళిపోయాడు. ఆ తరువాత ఆయన మళ్లీ ఎన్నడూ కనిపించనూ లేదు, వినిపించనూ లేదు. సన్యాసి పలికినది విని (ఏమీ అర్థంకాక) కలవర పడిన కుర్రవాళ్ళు మళ్ళీ తమ ఆట మొదలుపెట్టారు. ఆనాడు ఆ పరివ్రాజకుడు భవిష్యత్తును సూచిస్తూ పలికిన మాటలను గుర్తుచేసుకొని సుగుణానందన్, ఆయన బంధువూ (అర్థం చేసుకొని) తలలూపేనాటికి చాలా సంవత్సరాలు గడిచాయి.

మరికొద్ది కాలానికే సుగుణానందన్, వంశపారంపర్యంగా వస్తున్న చేపల అమ్మకం పనిలో మునిగిపోయాడు. ఇరవయ్యొకటో ఏట, భండారతురుత్తు అనే పొరుగూరి అమ్మాయి, ఇరవై ఏళ్ళ దమయంతిని పెళ్ళి చేసుకొన్నాడు. దమయంతి పుట్టింటివారు మంచి భక్తిపరులు; ఏనాడూ నియమం తప్పకుండా మతాచారాలను పాటిస్తూ ఉండేవారు. సొంతంగా వాళ్ళకొక దేవాలయం కూడా ఉండేది. దమయంతి చిన్నప్పటినుంచీ ధార్మిక జీవనం గడుపుతూ ఉండేది. ఆమె తండ్రి పుణ్యాన్, తల్లి కరుత్తకున్య ఆదర్శజీవనులయిన దైవభక్తులు. టూకీగా చెప్పాలంటే, కుటుంబ వాతావరణమంతా, పరిశుద్ధమూ ధార్మికమూ అయిన జీవనం గడపడానికి ఆమెకు అనుకూలంగా ఉంది.

దమయంతి ఎంత పవిత్రంగా ఉండేదంటే, ఊరివాళ్ళు ఆమెను 'పట్టత్తి అమ్మ', అంటే 'బ్రాహ్మణ స్త్రీ' అని మన్ననతో పిలిచేవారు. ఆమె జీవనానికి ముఖ్యాధారం దైవభక్తి కాబట్టి ఆమె, వారంలో దాదాపు ప్రతిరోజూ ఏదో ఒక రకమయిన వ్రతనియమాలను పాటిస్తూ ఉండేది. ఆమె తరచుగా ఉపవాసాలు చేస్తూండేది. అలాటి సందర్భంలో, చెట్లనుంచి గుట్టుగా రాలిపడిన లేత కొబ్బరి బొండాల నీరు తాగి ఉపవాసం ముగించేది.

మొత్తంమీద, దమయంతికీ సుగుణానందన్‌కూ కలిగిన సంతానం పదమూడుమంది. వాళ్ళలో నలుగురు పురుట్లోనే పోయారు; మరో బిడ్డ 53 రోజుల తరవాత. మిగిలిన పిల్లలు ఎనిమిదిమంది. వాళ్ళలో నలుగురు ఆడపిల్లలూ నలుగురు మగపిల్లలూ. వాళ్ళ పేర్లు ఏవంటే: (వయస్సును బట్టి వరసగా, పెద్దవాళ్ళ దగ్గరనుంచి చిన్నవాళ్ళ వరకు) కస్తూర్‌బాయి,* సునీల్‌కుమార్, ** సుధామణి, సుగుణమ్మ, సజని, సురేశ్‌కుమార్, సతీషకుమార్, సుధీర్‌కుమార్. ఈ పిల్లల్లో, ప్రపంచమంతటా మాతా అమృతానందమయిగా ప్రఖ్యాతి పొందినామె సుధామణి.

దమయంతి నాలుగోసారి కడుపుతో ఉన్నప్పుడు అపరిచితమయిన దర్శనాలు

* ఇక నుంచి ఆమెను కస్తూరి అని ప్రస్తావిస్తాం.

** ఇక నుంచి అతన్ని సుభగన్ అని ప్రస్తావిస్తాం.

గోచరమవుతూ ఉండేవి. ఒక్కొక్కప్పుడు ఆమెకు శ్రీకృష్ణ భగవానుణ్ణి గురించి అద్భుతమయిన కలలు వస్తూండేవి. ఇతర సమయాల్లో శివపార్వతుల దివ్యలీలలు కనిపిస్తూ ఉండేవి. ఒకనాటి రాత్రి, ఒక విచిత్రమయిన ఆకృతి వచ్చి చొక్కపు బంగారంతో పోత పోసిన శ్రీకృష్ణ విగ్రహాన్ని తనకు ఇచ్చినట్లుగా దమయంతి కలగన్నది దాదాపు అదే సమయంలో సుగుణానందన్‌కు దివ్యమాతను గురించి కల వచ్చింది. ఆయన కృష్ణభక్తుడు కావడంవల్ల, తనకు అకస్మాత్తుగా దేవి ఎందుకు దర్శనమిచ్చిందో అర్థంకాలేదు. ఈ కథను ఆయన దమయంతికి చెప్పినప్పుడు, తనకు కూడా ఇటీవల విచిత్రమయిన దర్శనాలు చాలా కలుగుతున్నాయని ఆమె చెప్పింది. వాటి ప్రాముఖ్యం ఏమిటో తెలియక వాళ్ళిద్దరూ ఆలోచనలో పడ్డారు. తమకు ఏదయినా గొప్ప భాగ్యం పడుతుందేమోనని అనుకొన్నారు.

ఈ రోజుల్లో సుగుణానందన్, దమయంతి సరిగా సముద్రపు ఒడ్డునే ఒక చిన్న గుడిసెలో ఉంటూండేవారు. దానికి కారణం, ఊళ్ళో, ఇక్కణ్ణించి ఐదు నిమిషాల నడకదూరంలో ఉన్న ఇడమన్నేల్ వంశపు ఇంట్లో ఉండటంకంటే గుడిసెలో ఉన్నట్ల యితే చేపల వ్యాపారానికి అనువుగా ఉండటం. వెనకటి మూడు సార్లూ కడుపుతో ఉన్నప్పుడు, పురిటిరోజుకు కొన్ని వారాలు ముందు దమయంతి ఒళ్ళంతా ఉబ్బిపోయి ఉండేది. తన రోజువారీ పనులను సడలించుకొని భండారతురుత్తులో- పురిటి సమయంలో తనను కనిపెట్టుకొని ఉండేవాళ్ళు ఉన్న- తన పుట్టింటికి వెళ్ళాలన్న దానికి సంకేతమిది. నాలుగో బిడ్డ పురిటికి తాను సిద్ధమయేలోగా ఎలాగూ ఒళ్ళు ఉబ్బుతుంది కదా అని దమయంతి ఊహిస్తూ ఉంది.

ఒకనాటి రాత్రి, తాను కృష్ణుణ్ణి కన్నట్టూ, కృష్ణుడు ఒళ్ళో ఉండి తన చనుబాలు తాగుతున్నట్టూ దమయంతికి అద్భుతమయిన కల వచ్చింది. మర్నాటి పొద్దున ఆమె, సముద్రపు ఒడ్డున ఏదో పని చేసుకొంటూ ఉంది. అకస్మాత్తుగా ఆమెకు, తనకు పురుడు రాబోతున్నట్టుగా అనిపించింది కాని, దమయంతి ఈ అనుమానాన్ని పట్టించుకోలేదు. పురిటిరోజులు రాబోయేముందు మామూలుగా ఒళ్ళు ఉబ్బడం అన్నది ఇంకా జరగలేదు కనక. కాని, మనస్సులో మాత్రం, పురుడు వస్తుందేమోనని అనిపిస్తూనే ఉంది. దమయంతి తన పని పక్కకు పెట్టేసింది. ఏ కారణంవల్లో ఏమో, ఇడమన్నేల్ ఇంటికి వెళ్ళాలన్న తొందర మనస్సులో కలిగింది. తానొక్కతే ఉప్పుటేరు దాటి ఊళ్ళోకి వెళ్ళింది. అక్కడికి వెళ్ళి చిన్న గుడిసెలోకి ప్రవేశించి కొన్ని వస్తువులు సేకరించడం మొదలు పెట్టింది. మరుక్షణంలో, ఆమెకు పరిచితమయిన సంవేదన కలిగింది. పురుడు రాబోతోందని తెలిసిపోయింది.

ఆమె చాప పరిచి పడుకునేసరికి పురుడు వచ్చేసింది! దమయంతి దిమ్మెరబోయింది. పుట్టింది ఆడపిల్ల అని గమనించింది. పిల్ల పుట్టే సమయానికి వాతావరణం నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉంది. మొదట్లో ఆమెకు హెచ్చరికగా తోచినది తప్ప ఆ తరవాత మరేమీ అనిపించలేదు (ఏ బాధా కలగలేదు). నిజానికి, ఇప్పుడు స్మారకం వస్తూ ఉండటంతో ఆమెకు ఆందోళన కలిగింది. పిల్ల బతికే ఉందా? పుట్టగానే పిల్లలు ఏడుస్తారు. అలాటి ఏడుపేదీ ఆమెకు వినిపించలేదు. ఆత్రంతో, పిల్లను పరిశీలనగా చూసింది. ఇప్పుడు ఇంకా ఆశ్చర్యం కలిగింది దమయంతికి. పురిటిగుడ్డు చిన్నారి మొహంమీద చక్కని చిరునవ్వు! ఆ పిల్లచూపు దమయంతి గుండెల్లోకి దూసుకుపోయింది; ఎన్నడూ మరవరానిదయింది.

సరిగా ఈ సమయానికి, పొరుగింటామె ఒకతె, గుడిసె గుమ్మంముందు కనిపించింది. దమయంతి పరిస్థితి ఏమిటో ఆమె చటుక్కున గ్రహించింది; గబగబా ఇటూ అటూ తిరిగి చంటిపిల్లకూ, తల్లికీ సదుపాయంగా ఉండే ఏర్పాట్లు చేసింది. ఈ విధంగా, 1953 సెప్టెంబరు 27వ తేదీన, దగ్గరలో ఉన్న ఒడ్డు వెంబడి ఎడతెరిపిలేకుండా మారుమోగుతున్న సముద్రపు కెరటాల హోరులో, చిన్న తాటాకు గుడిసెలో ఒక పసిపాప వెలిసింది.

ఆ పాప, ముదురు నీలపు ఛాయలో ఉండటం, బొటనవేలు, చూపుడువేలు కొసలను రెండింటినీ ఒకదాని కొకటి వలయాకారంగా చేర్చిన చిన్ముద్రతో,* పద్మాసనం** వేసుకొని పడుకొని ఉండటం చూసి తల్లితండ్రులు తబ్బిబ్బు పడ్డారు. ముదురు నీలపుచాయ ఏదో వింత జబ్బు లక్షణం అయి ఉండవచ్చుననీ చిత్రంగా కాళ్ళు వంచినతీరు, ఎముకలు ఏర్పడటంలో ఉన్న అపసామాన్య లక్షణమో, ఎముకలు జారిపోవడమో అయి ఉండవచ్చుననీ భయపడ్డారు. ఎంతోమంది వైద్యులను సంప్రదించారు. ఎముకల అపసామాన్య లక్షణం ఏదీ లేదని రూఢి అయింది. అలాంటి అవకరం లేదని వైద్యపరీక్షలో తేలింది. ఇక ఒంటిచాయ విషయంలో, అది వంశపారంపర్యంగా వచ్చినదని అనుకోడానికి వీలులేదని తేలిపోయింది. ఎందువల్లంటే, దమయంతీ సుగుణానందనుల ఒంటిచాయ [అంత ముదురునీలం కాదు;] లేతచాయ. అందువల్ల, ఆ వింత జబ్బు నయమవుతుందన్న ఆశతో, పిల్లకు ఆరు నెలలదాకా నీళ్ళు పొయ్యవద్దని తల్లిదండ్రులకు కొందరు సలహా ఇచ్చారు.

---

* *జీవాత్మ పరమాత్మల ఏకత్వాన్ని తెలిపే ముద్ర ఇది.*

** *కుడిపాదం ఎడమ తొడమీదా ఎడమపాదం కుడి తొడమీదా ఉండేటట్లు కూర్చునే హఠయోగ పద్ధతి.*

ఆరు నెలలు గడిచిపోయాయి కాని, పిల్లకు వచ్చిన ముదురు నీలపుచాయ అలా ఉంది; కృష్ణభగవానుడికీ. కాళికా అమ్మవారికీ ఉన్న చాయనే తలపిస్తోంది. చివరికి, కొంత కాలం గడిచేసరికి, ఈ ముదురునీలం నలుపులోకి దిగింది. అయినప్పటికీ కృష్ణభగవానుని దర్శనం కావాలన్న కోరిక గాఢమయినప్పుడు మాత్రం పిల్ల ఒంటిచాయ నీలపు వన్నెల్లోకి మారుతూండేది. ఈనాటికీ కూడా, ముఖ్యంగా ఆమెకు కృష్ణభావం, దేవీభావం కలిగినప్పుడు ఆమె ఒంటిమీద ముదురు నీలపు చాయ మనకు కనిపిస్తుంది.

చిత్రమయిన విషయం ఏమిటంటే, ఈ నీలి - నలుపు చాయవల్ల ఇంట్లో ఉన్న తక్కినవాళ్ళు ఆ పిల్లను చూసి ఏవగించుకునేవారు. నలుపంటే ఉన్న ఏవగింపు, చివరికి ఆ పిల్లను అణగార్చి ఇంటివాళ్ళకూ, చుట్టాలకూ దాసిగా మార్చింది. నిజానికి పురుడు గురించి దగ్గరి చుట్టాలలో కొద్దిమందికే తెలియబరిచారు. కొత్తగా పుట్టిన పిల్లకు అంతగా ప్రాముఖ్యం ఇవ్వలేదన్న మాట. పైగా ఆడపిల్ల! దమయంతి అప్పటికే ముగ్గురు పిల్లలను కన్నది.

అరేబియా సముద్రపు ఒడ్డున ఒక చిన్న గుడిసెలో, ప్రసన్నంగా చిరునవ్వులు ఒలికిస్తూ, వింతనీలపుచాయతో పుట్టిన పసిపాపే, నిజానికి, పీడిత మానవజాతిమీద శాంతినీ, దివ్యప్రేమనూ కురిపించడానికి ఈ లోకంలో అవతరించిన ఆధ్యాత్మిక మహాశక్తి అన్న విషయం ఎవరు ఊహించగలరు? రాకపోకల మహాసముద్రాన్ని* దాటాలని చూసే వేలాదిమందికి సహాయం చేయడానికి ఈ చంటిపిల్లకున్న ఆధ్యాత్మిక వారసత్వాన్ని ముందుగా ఎవరు తెలుసుకోగలరు?

ఈ పాప పుట్టినప్పటినుంచి అసాధారణమయిన సంకేతాలను కొన్నిటిని ఆ కుటుంబం గమనిస్తూ వచ్చింది. అయితే చాలా ఏళ్ళ తరవాత కాని వాటి అర్థం వాళ్ళకు తెలియలేదు. మామూలుగా, ఏ పాపయినా నడక వచ్చేముందు అనేక వికాసదశలను పొందుతూ ఉంటుంది. ముందు, వెల్లకిలా పడుకుని ఉంటుంది. తరవాత దొర్లుతుంది. ఆ తరవాత బోర్లాపడి చేతులూ కాళ్ళూ చాపుతూ ముందుకు జరుగుతుంది. తరవాత పాకడం ప్రారంభిస్తుంది. ఆ తరవాత కొన్ని నెలలకు, ఏదయినా పట్టుకొని తన కాళ్ళమీద తాను నిలబడుతుంది. ఇవన్నీ ఏడాదిలోగా ముగుస్తాయి. ఈ పాప సంగతి పూర్తిగా వేరు; ఆమెకు ఈ దశలేవీ రాలేదు. ఆరు నెలల వయస్సు దాటిన తరవాత ఈ చిన్నపిల్ల అకస్మాత్తుగా లేచి నిలబడి వరండాలో నడవడం మొదలుపెట్టింది. మరికొద్ది కాలానికి ఆమె పరుగెత్తడం మొదలుపెట్టింది. అందరి హృదయాలూ ఆశ్చర్యంతోను, ఆనందంతోను నిండిపోయాయి.

---

*చావుపుట్టుక చక్రగతిని సూచించే ప్రయోగం.

## సుధామణి

తల్లిదండ్రులు తమ అద్భుత శిశువుకు సుధామణి అని పేరుపెట్టారు. సుధామణి అంటే 'అమృతమయమయిన రత్నం'. తన వయస్సు పిల్లల్లో చాలామందికంటే వేరుగా సుధామణి, ఆరునెలలు నిండీనిండక ముందే తన మాతృభాష అయిన మలయాళంలో మాట్లాడటం మొదలుపెట్టింది. కొంచెం బాగా మాట్లాడటం వచ్చిన తరవాత, దైవనామ సంకీర్తన చేయాలన్న గాఢమయిన అభిలాష వ్యక్తమయింది. రెండో ఏడు వచ్చేసరికి, ఎవ్వరూ నేర్పకుండానే, ప్రార్థనలు చెయ్యడం, శ్రీకృష్ణుణ్ణి స్తుతిస్తూ చిన్నచిన్న పాటలు పాడటం ప్రారంభించింది. అలాటి సందర్భాల్లో, పాప పాడేవి చెవిని పడ్డప్పుడు ఇంట్లోవాళ్ళు చకితులయేవారని వేరే చెప్పనక్కరలేదు. మరుసటి ఏడాది, ప్రతిరోజూ దైవనామాలను మధురస్వరంతో గొంతెత్తి పాడటం అలవాటు చేసుకుంది. ఈనాటి వరకు కూడా ఈ అలవాటు అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉంది. ఇప్పుడిక నాలుగేళ్ళు నిండిన తరవాత, తనకెంతో ఇష్టమయిన, భగవంతుడి పటానికి ఎదురుగుండా కూర్చుని భక్తితత్పరతతో ఒకటి రెండు చరణాలు కూర్చి పాడుతూండేది.

పసితనంనుంచీ సుధామణి శక్తితోను, ఉత్సాహంతోను నిండి ఉండేది. అణకువ గల పిల్లగా పెరిగింది; అందరి ప్రేమనూ పొందింది. పరిచయం లేనివాళ్ళకు కూడా చిట్టి సుధామణిమీద చెప్పలేని ఆకర్షణ, అభిమానం కలిగేవి. ఈశ్వరుడిమీద ప్రేమ, ఇతరులమీద సానుభూతివంటి ఉత్తమ గుణాలు బాగా చిన్నప్పటినుంచీ ఆమెలో కనిపిస్తూ వచ్చాయి. ఇలాటి సద్గుణాల వల్ల ఊళ్ళో ప్రతి ఒక్కరూ ఆమెను 'కుంజు' అన్న ముద్దు పేరుతో పిలుస్తూ ఉండేవారు. కుంజు అంటే 'చిట్టి' అని అర్థం. చిత్రమేమిటంటే, ఈ లక్షణాలే, ఉత్తరోత్తరా ఆమె ఇంట్లో వాళ్ళూ, చుట్టాలూ ఆమెను తీవ్రంగా తిట్టిపోయడానికీ రచ్చ చేయడానికీ ప్రధాన కారణమయాయి.

సుధామణికి ఐదేళ్ళు నిండే సరికి, శ్రీకృష్ణ భగవానుడిమీద పుట్టుకతో వచ్చిన భక్తి స్పష్టమయిన ధారగా ఆమె గుండెలోనుంచి జాలువారడం మొదలయింది. మరికొద్ది కాలంలోనే ఆ భక్తి, నిండయిన భక్తిగీతాలుగా రూపుగట్టింది. ఈ చిట్టితల్లి పాటలు, తనకు ప్రియతముడయిన కృష్ణుడి కోసం కలిగిన గాఢమయిన ఆపేక్షతో నిండి ఉన్నాయి. సరళమైనవే అయినా చాలా నిగూఢ మార్మికతతో కూడిన ఈ పాటలను,శ్రోతలను ముగ్ధులను చేసే విధంగాను, సర్వాత్మ నివేదనంగాను ఆమె పాడుతూ ఉండటంవల్ల ఊరంతకూ అవి సుపరిచితమయాయి. జపం చేస్తున్నా, గానం చేస్తున్నా ఆమె తన చొక్కాలోపల దోపి పెట్టుకున్న కృష్ణ పటంమీదే తన కళ్ళను నిలిపి ఉంచేది. ఆ

తరవాత, కదలకుండా చాలాసేపు కూర్చునేది. ఈ అసాధారణ ప్రవర్తనా, గాఢమయిన భక్తీ ప్రతి ఒక్కరినీ ఆశ్చర్యచకితులను చేసేవి; భక్తిపరులయిన గ్రామస్థులందరి దృష్టిని ఆకర్షించేవి. అప్పుడే పొడిచిన పొద్దుకు స్వాగతం పలుకుతూ చిట్టితల్లి చేసే దివ్యగానాన్ని ఆలకించడం కోసం వాళ్ళు వేకువనే నిద్రలేస్తూ ఉండేవారు.

[సుధామణి పాడుతూండే ఒక పాటలో భావం ఇది :]

గోకులాన్ని పాలించిన దేవా ! గోపాలబాలా!
పాలకడలినాథా! మేఘశ్యామా!
పంకజలోచనా! కైమోడ్పులివే నీకు.
పాపపు పనులు చేసిన లోకులందరికీ
పాపవిమోచనం కలిగించు.
ఈ గ్రామంలో ఉన్న బీదవాళ్ళమీద
కారుణ్యం చూపించు, కారుమబ్బువన్నెకాడా!
ఓ మల్లికామాలాధరా!
పీతాంబరధారి వేణునాథా!
మురళి మోగిస్తూ రా!
పూతననిగ్రహా! పాలయ మామ్.
శేషతల్పంమీద పవళించిన ఓ స్వామి!
ప్రచండవర్ష నివారకా! గోకులనాథా!
నాకు శరణు ప్రసాదించు, నీ పాదపద్మాల సన్నిధిలో,
తొలగించు నా ఆత్మలో వేదన.

ఈ వయస్సులో సైతం, సుధామణిలో కొన్ని దివ్యత్వ లక్షణాలు గోచరమయాయి. చిన్నపిల్లల ఆటల్లోనో, రోజువారీ పనుల్లోనో ఉన్న సమయంలో ఆమె, కాలంతో కాని, ప్రదేశంతో కాని నిమిత్తం లేకుండా, అంతర్ముఖి అయ్యేది. అలాటి సందర్భాల్లో ఆమె, ఏ మారుమూలో ఏకాంత ప్రదేశంలో స్థిరంగా కూర్చుని ఉండటం గమనించేవారు, తల్లిదండ్రులు కాని, ఇంట్లో ఉన్న ఇతరులు కాని. ఇతర సమయాల్లో ఆమె ఉప్పునీరు దగ్గర కూర్చుని రెప్పవాల్చకుండా నీళ్ళమీదే చూపు నిలిపి కాని, మరో లోకానికెక్కడికో పోయినట్లుగా, మౌనంగా నీలాకాశంవైపు చూస్తూ కాని కనిపించేది. కళ్ళు మూసుకొని ఒంటరిగా కూర్చుని ఉండటం ఆమెకు మామూలే. ఆమెను ఎవరయినా పలకరిస్తే ఆమె మానసిక స్థితి చెదిరిపోయేది.

తల్లిదండ్రులు, తమ కూతురిలో కనిపించే ఈ విధమయిన అసాధారణ స్థితుల ప్రాముఖ్యాన్ని తెలుసుకోలేక, తక్కిన పిల్లల్లాగ ఉత్సాహంగా ఆడుకుంటూ ఉండనందుకు సుధామణిని తిట్టిపోస్తూ ఉండేవారు. వాళ్ళు తమ కూతురిని తాము ఏవగించుకొంటూ, నిర్భయంగా ఆమె చేసే దైవలోక విహారయాత్రను తప్పుగా వ్యాఖ్యానిస్తూ ఉండే దీర్ఘకాలం ఈ విధంగా మొదలయింది. ఆమె విచిత్రంగా ప్రవర్తించే ఈ తీరు మానసిక వికారానికి దారి తీస్తుందేమోనని తల్లిదండ్రులు ఆందోళన చెందుతూ ఉండేవారు.

ఐదో ఏడు వచ్చాక, సుధామణిని పొరుగూళ్ళో శ్రాయికాడు పాఠశాలలో మొదటి తరగతిలో చేర్చారు. ఆ వయస్సులో కూడా ఆమెలో అద్భుతమయిన తెలివీ జ్ఞాపకశక్తీ కనిపిస్తూ వచ్చాయి. పాఠం ఒక్కసారి విన్నదంటే దాంట్లో ఒక్క ముక్క కూడా మరచిపోయేది కాదు. తరగతిలో చెప్పిన ఏ విషయాన్నయినా లేదా తాను చదివినదాన్నయినా, అలవోకగా అప్పజెప్పేసేది. సుధామణి రెండో తరగతిలోకి వచ్చాక, పై తరగతుల పాఠాలు కూడా, ఎవరయినా పైకి చదువుతున్నప్పుడు వింటే తేలికగా అప్పజెప్పేది. ఆమె పై తరగతి పిల్లలకు, ఆమె అన్నయ్యకూ అక్కయ్యకూ కూడా కావ్యపద్యాలను కంఠస్థం చెయ్యలేకపోయినందుకు ఒక్కొక్కప్పుడు ఉపాధ్యాయుడిచేత కఠిన శిక్షలు పడుతుండేవి. కింది తరగతిలో ఉన్న చిట్టి సుధామణి మాత్రం పద్యాలు ఇంపుగా పాడుతూ రాగాలకు అనుగుణంగా, నాజూకయిన సీతాకోకచిలుకలా ఆడుతూ ఉండేది. ఉపాధ్యాయులందరూ ఆమెను అభిమానించేవారు. కుంజు జ్ఞాపకశక్తికి ఆశ్చర్యపోతూ ఉండేవారు; అలాంటి పిల్లను వాళ్ళెన్నడూ చూసి ఎరుగరు. ఆమె అన్ని సబ్జెక్టుల్లోనూ పూర్తి మార్కులు సంపాదించుకొని తరగతిలో ప్రథమ స్థానం సంపాదించుకొన్నది. నిజానికి ఆమె, ఇంటి పనుల బాధ్యతవల్ల తరచుగా గైర్‌హాజరవుతూ ఉండేది.

సుధామణికున్న అద్భుత జ్ఞాపకశక్తిని తెలిపే సంఘటన ఒకటి ఇలా జరిగింది. ఒకనాడు, దమయంతి ఆమెను కన్న ఐదు నెలలకు, పిల్లను చూస్తూ ఉండమని సుగుణానందన్‌కు అప్పగించి, ఏదో పనిమీద ఇంట్లోంచి బయటికి వెళ్లింది. ఏ కారణంచేతనో పిల్లకు చికాకు కలిగి ఏడవడం మొదలుపెట్టింది. అలాంటిదానికి అలవాటుపడని సుగుణానందన్, ఎంత తంటాలు పడ్డప్పటికీ పిల్లను ఊరుకో బెట్టలేకపోయాడు. ఇలా కాసేపు గడిచింది. చివరికతనికి చిర్రెత్తుకు వచ్చి, ఓరిమి పట్టలేక, ఆమెను మంచంమీదికి విసిరేశాడు.

ఆ తరవాత అనేక సంవత్సరాలకు, సుధామణి వాళ్ళ నాన్నతో ఇలా అంది "అమ్మో! ఆ రోజున నువ్వు నన్ను ఎలా విసిరేశావో! కాస్తుంటే చంపేసేవాడివే!" మొదట సుధామణి మాటలకు అర్థం సుగుణానందన్‌కు తెలియలేదు. కొద్ది క్షణాలకు, పాత సంఘటన మనస్సులో చటుక్కున మెదిలింది; తన కూతురి జ్ఞాపకశక్తికి మరోసారి ఆశ్చర్యపోయాడు.

బడిలో తీరిక సమయం ఏపాటి చిక్కినా సుధామణి తన హోమ్‌వర్కు చేసుకొ ఉండేది. ఇంటికి వెళ్ళాక ఆ సమయాన్ని దైవస్మరణకు వినియోగించుకోవచ్చు ఆమె అభిప్రాయం. ఇంటికి వెళ్ళి, ఆ చిట్టితల్లి, మొదట ఇంటిపనుల్లో వాళ్ళకు సాయంచేసేది. లేకపోతే భక్తిగీతాలు పాడుకుంటూ తనను తాను మరచిపోయేది.

చిన్నప్పటినుంచీ కూడా సుధామణి, కాలాన్ని సద్వినియోగం చేసుకోవ విషయంలో చాలా జాగ్రత్తగా ఉండేది. ఒక్క క్షణమయినా ఊరికే కూర్చు వృధా చేసేది కాదు. నానాటికీ పెరుగుతూ వస్తున్న ఇంటిపనులు చేసుకుంటూ సుధామణి, ఎప్పుడూ కృష్ణభగవానుని దివ్యనామాన్ని జపిస్తూ ఉండటం వినవచ్చేది. ఆ దివ్యనామాన్ని జపిస్తూనే కుంజు, తన హృదయాంతరంగంలో ప్రియతముడయిన కృష్ణుడి సుందర రూపాన్ని దర్శిస్తూ పగళ్ళూ రాత్రులూ గడుపుతూ తన లోకంలో తాను ఉంటూండేది.

సుధామణి చిన్ననాటి రోజులు గడిచిన ఇంట్లో, అన్నీ కలిపి రెండే రెండు చిన్న గదులూ ఒక వంటిల్లూ ఉండేవి. ఇరకాటపు ఇల్లు ఇబ్బందిగా ఉండటం వల్ల సుగుణానందన్ పశువుల శాల* వెంబడి ఒక చిన్నగది కట్టించాడు. దీన్ని పిల్లల చదువుల గదిగా వాడేవారు; కానీ చిట్టి సుధామణి మాత్రం ధ్యానం చేస్తూ, భక్తిగీతాలు పాడుతూ తన చిన్ననాటి రోజులను గడిపినది ఆ పశువుల శాలలోనే. ఆ పశువుల శాలలో మరో ఇద్దరు శరణార్థులు ఉండేవారు. ఒకామె క్షురక కులం వారి పొట్టచ్చి; రెండో ఆమె ఆమె కూతురు. పొట్టచ్చి దిక్కులేని అనాథ స్త్రీ. సుగుణానందన్ ఆమె నిస్సహాయస్థితికి జాలిపడి పశువుల శాలలో ఉండనిచ్చాడు. పొట్టచ్చి సుధామణిని చాలా అభిమానించేది. ఆమె నెప్పుడూ చంకన వేసుకుని తిరిగేది. ఆ రోజుల్లో సుధామణి సంరక్షణ పొట్టచ్చే దమయంతి కంటె ఎక్కువగా చేసేది.

ఈ విధంగా, సౌమ్యురాలయిన సుధామణి తన ఆత్మనూ హృదయాన్నీ మోహనకృష్ణుడిమీదే కేంద్రీకరింపజేసి రోజంతా పశువుల శాలలోనే ఉంటూండేది. శ్రీకృష్ణుడికి ఆవులంటే ఇష్టమున్నట్లుగానే చిట్టితల్లికి కూడా వాటిమీద ఆరాధ భావం ఉండేది. తీరిక సమయం చిక్కినప్పుడల్లా ఆమె అక్కడ ఒంటరిగా కూర్చు దైవచింతనలో మునిగి పోయేది. శోభాయమానమయిన కృష్ణ దర్శన లాలసవల్ల కలిగే ఆనందంతో చిందులు వేయడానికి చిట్టితల్లికి స్వేచ్ఛగా ఉండేది.

* ఇప్పుడు, పాత భావదర్శనాలయం ఉన్న చోటికి దగ్గరిలో.

సుధామణికి అందరినీ ప్రేమించే తత్వం ఉండటంవల్ల ఆమె చుట్టూ పిల్లలు చేరుతూండేవాళ్ళు. వాళ్ళకు అవకాశం వచ్చినప్పుడల్లా ఆమెతో కలిసి ఆడుకోడానికి ఇడమన్నేల్‌కు వచ్చేవాళ్ళు. కలిసి, ఆవులకోసం గడ్డి తేవడానికి వెళ్లేవాళ్ళు. సుధామణి చిట్టి స్నేహితులకు అలాంటి పనంటే ఇష్టం లేనప్పటికీ ఆమెతో ఉల్లాసంగా గడపడానికి సంతోషంగా వచ్చి చేరుతూండేవారు. వాళ్ళందరికీ ఆమె అంటే తెలియని ఆకర్షణ ఏదో ఉంటూండేది. ఆమెతో బలమయిన ప్రేమబంధం ఉండేది. పని అంతా పూర్తి చేసేసుకొని సుధామణి, పిల్లలచేత రకరకాల ఆటలు ఆడిస్తూండేది; చిన్నపిల్లవాడుగా కృష్ణుడు చేసే పనులను కృష్ణలీలలుగా ప్రదర్శించి తక్కిన పిల్లలను ఆకట్టుకొనేది. ఆమె తన మనస్సులో ఎప్పుడూ ప్రవహిస్తూ ఉండే భక్తిగీతాలను బృందగానంగా బిగ్గరగా పాడమని పిల్లలందరినీ చాలా సులువుగా ప్రోత్సహిస్తూ ఉండేది.

సుధామణి భక్తిభావ స్థితులను ఎవ్వరూ అర్థం చేసుకోలేకపోయారు. అవి రోజురోజుకూ గాఢమవుతున్నాయి. వారాలూ నెలలూ గడుస్తూంటే ఆమె తన భక్తి పరమయిన కార్యకలాపాల్లో నానాటికీ ఎక్కువగా మునిగిపోతోంది. తన ప్రభువు దివ్యసౌందర్యాన్ని దర్శించాలన్న గాఢమయిన అభిలాషతో రాత్రింబగళ్ళు ఆమె పాడుతూ ఉండడం కనిపించేది. ఆమెకు భావావేశస్థితులు నానాటికీ తరచుగా వస్తూండేవి. అవి అన్నిసార్లూ పశువులశాలకు పరిమితమయినవీ కావు. ఒక్కొక్కప్పుడు తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని మరిచి భక్తిగీతాలు పాడుతూ గుండ్రంగా తిరుగుతూ ఆనందంతో నృత్యం చేసేది. ఏడో ఏట ఆమె కట్టిన ఒక పాట [భావం] ఇలా ఉంది:

పాహి పరాత్పరా !
గురువాయూరు పురాధిపతే !
బాలగోపాలా !
జగన్నాయకా ! శ్రీధరా!
రాధాపతే !పాహి కృష్ణా !
గోపికాకాంతల కృష్ణా !
నందకుమారా కృష్ణా !
వంద్య వంద్యాత్మజా కృష్ణా

చిట్టి సుధామణి ఉదాత్త మానసిక స్థితులను గురించి ఇంట్లోవాళ్ళకు కాని ఇరుగుపొరుగులకు కాని బొత్తిగా తెలియదు; వాటిని చిన్నపిల్ల చేష్టలనే అనుకున్నారు.

ఆధ్యాత్మిక ఉపదేశం ఏమీ పొందని ఈ ఏడేళ్ళ పిల్ల శుద్ధ ప్రేమానంద మహాసాగరంలో ఈతకొడుతోందన్న సంగతి ఎవరు ఊహించగలరు? ఈ ప్రపంచాన్ని మరిపించి, ఈ చిట్టితల్లి ఒక్కొక్కప్పుడు ఒక గదిలోకి దూరి తలుపులు వేసుకొని ఆనంద తన్మయత్వంతో ఆడుతూ పాడుతూ ఉండేది. ఒకసారి అలాంటి సందర్భంలో దమయంతి, తలుపు సందులోంచి తొంగి చూసింది. ఆశ్చర్యపోయి, "అదిగో చూడు, అమ్మాయి ఎలా నాట్యం చేస్తోందో! దానికి నాట్యం నేర్పించాలి" అంది. అమాయకులు ఆ తల్లిదండ్రులు! లౌకికమయిన నాట్యం సంగతే వాళ్ళకు తెలుసు. దివ్యానందోన్మత్త నాట్యం ఎవరయినా చెయ్యడం వాళ్ళు ఎన్నడూ విననూలేదు, చదవనూ లేదు. [ఆ సమయంలో అక్కడ] మహాత్ముల జీవిత చరిత్రలను చదివిన వాళ్ళెవళ్ళయినా ఉండి ఉంటే బహుశా సుధామణి ఆధ్యాత్మిక స్థితులను గుర్తుపట్టి ఉండేవాళ్ళు. అప్పటికీ కూడా, అంత చిన్న వయస్సు పిల్లకు అలాంటి పారవశ్య స్థితి కలుగుతుందని ఎవరు ఊహించగలరు? మామూలుగాన్నే ఇదంతా వేపకాయంత వెర్రీ, అతిగా ఊహించే అలవాటూ ఉన్న పిల్ల చేసే చేష్టలుగా తలిచారు ఇంట్లోవాళ్ళు.

పరమేశ్వరుణ్ణి దర్శించాలనీ ఆయనలో లీనమయిపోవాలనీ సుధామణికి ఉన్న గట్టి కోరిక ఏమాత్రం తగ్గకుండా నిలిచి ఉంది. భద్రంగా ఆమె తన చొక్కాలో దోపి పెట్టుకున్న కృష్ణుడి చిన్నబొమ్మమీద చూపు నిలిపి ఉండటం చాలా సార్లు కనిపించేది. చిట్టితల్లి ఒక పాటగా కాని ప్రార్థనగా కాని తన హృదయాభిలాషను విన్నవించుకొంటూ ఇలా అంటూండేది:

"ఓ, నా ప్రియతమ కృష్ణా, నా చుట్టూ కష్టాలూ బాధలూ కనిపిస్తున్నాయి. ఓ కృష్ణా. ఈ చిన్నపిల్లను సంరక్షించే సంగతి మరిచిపోకు. నేను నిన్నెప్పుడూ పిలుస్తూనే ఉన్నాను; నువ్వు వచ్చి నాతో ఆడవా?"

సుధామణి ఎనిమిదో ఏట కట్టిన పాట [భావం] ఈ కింద ఉంది. ఆమె ఆధ్యాత్మిక స్థితి ఎంత లోతుగా, ఎంత విశాలంగా ఉందో దీన్నిబట్టి తెలుసుకోవచ్చు:

కనికరాన కాచే ఓ కరుణామయా,
కృష్ణా, అభయమియ్యి !-కృష్ణా, అభయమియ్యి !
కాల్చే ఈ కన్నీళ్ళ ధారాగాథ
తెలియకుండానే ఉందా నీకు, కృష్ణా ? తెలియకుండానే ఉందా?
కాళియ సర్పాన్ని మర్దించిన

నీ పాదపద్మాలకు పూలు అర్పించి పూజిస్తాను కృష్ణా!
కురుక్షేత్రంలో పార్థసారథి వయావు నువ్వు
సత్యాన్నీ ధర్మాన్నీ కాపాడావు.
సత్యాన్నీ ధర్మాన్నీ పాలించే ఈశ్వరా!
మామీద కాసంత కరుణ చిలికించు
ఓ గీతానాయకా ! సంగీతప్రియా !
నీ పాట పాడే శక్తి నాకు ఇయ్యి...
వినడంలేదా నువ్వు, ఓ భజనప్రియా !
నా గుండెలోతుల్లోంచి పలుకుతున్న
నీ పావన నామాలను ?

చిట్టితల్లి బిక్కమొహమూ ఏడుపు పాటలూ ఊరివాళ్ళ చెవులను ఆకట్టుకొని సానుభూతి సంపాదించాయి. అయినప్పటికీ సుధామణి అంతరంగ జీవితపు మహామర్మం ఎవ్వరికీ తెలియకుండానే ఉంది. ఆమె బాల్యప్రాయపు భక్తిలోని ఆనంద పారవశ్యాన్ని ఎవరు ఊహించగలరు? వివేకవంతులు తప్ప మరెవరు తెలుసుకోగలరు?



# రెండో అధ్యాయం

## దివ్య సేవిక

*సేవకులకు సేవకురాలు తల్లి. ఆమె నివాసానికి ప్రత్యేక మయిన స్థానమేదీ లేదు. ఆమె నీ గుండెలోనే ఉంటుంది.*

*- మాతా అమృతానందమయి*

కామినీరితి హి యామినీషు ఖలు కామనీయకనిధే భవాన్
పూర్ణసమ్మద రసార్ణవం కమపి యోగిగమ్య మనుభావయన్
బ్రహ్మశంకర ముఖానపీహ పశుపాంగనాసు బహుమానయన్
భక్తలోకగమనీయరూప కమనీయకృష్ణ పరి పాహిమామ్.

మనోహరత్వానికి నిధి అయినవాడా! రాత్రివేళ నువ్వు గోపికలకు -
కేవలం యోగులకు మాత్రమే ప్రాప్తమయే -
గాఢమూ తీవ్రమూ అయిన రససాగరాన్ని ప్రదానం చేస్తావు. ఈ
ప్రకారంగా ఆ గోపికలను బ్రహ్మకూ శంకరుడికీ
కూడా ఆదరణీయ వ్యక్తులుగా చేస్తావు. ఓ కమనీయ కృష్ణా! కేవలం
భక్తులకు మాత్రమే తెలిసేవాడివి నువ్వు. దయ ఉంచి నన్ను కాపాడు.

శ్రీమన్నారాయణీయం
అధ్యాయం 69, శ్లోకం 11

తొమ్మిదో ఏట, సుధామణి సరిగా నాలుగో తరగతిలోకి వచ్చింది. ఇప్పుడు, చిరరోగి అయిన తల్లి ఆమెకు ఇంటి పనులు చాలా అప్పగించింది. ఆమె తెల్లవారగట్లే లేచి తన

పనులన్నీ చేసేది; పని ముగిసిన తరవాతే హడావిడిగా బడికి పరుగెత్తేది. సాయంత్రం ఇంటికి తిరిగి వచ్చిన తరవాత, ఇంటిపనులు లేని సమయం ఎంతుంటే అంతా ప్రార్థనకూ, ధ్యానానికీ వినియోగించేది. అప్పటికీ తనకు ఇష్టమయిన బొమ్మ శ్రీకృష్ణుడిది తాను వెళ్ళిన చోటికల్లా తీసుకు వెళ్ళి, దాన్ని గుండెలకు హత్తుకొంటూ ముద్దులు పెట్టుకొంటూ కన్నీళ్ళు కారుస్తూండేది. కన్నీళ్ళతో ఆ బొమ్మ తడిసిపోతూ ఉండేది.

ఒక్కొక్కప్పుడు దమయంతి, చిట్టి సుధామణిని ఇంట్లో విడిచి నీళ్ళు తేవడానికి దూరపు ప్రదేశానికి వెళ్తూ ఉండేది; తల్లి కంటబడకుండా వెనకాలే పిల్లకూడా వెళ్తూ ఉండేది; తల్లికేదయినా సహాయపడవచ్చునన్న ఉద్దేశంతో. ఎప్పుడయినా దమయంతి, ఆమె రాకుండా అడ్డుకోడానికి ప్రయత్నించినట్లయితే సుధామణి బిగ్గరగా ఆక్షేపణ తెలిపేది. ఈ విషయంలో ఆమె కనబరిచే మొండితనం వల్ల దమయంతి ఒక్కొక్కప్పుడు ఒక గదిలో పెట్టి తాళం వెయ్యడం కూడా కద్దు. "ఇదుగో, దెయ్యం వస్తోంది, నిన్ను పట్టుకుపోవడానికి వస్తోంది!" అంటూ చిట్టితల్లిని భయపెట్టడానికి ప్రయత్నించేది. ఆమె చిన్నపిల్లయినా చిన్నవయస్సు నుంచీ కూడా నిర్భయంగా, ధైర్యంగా ఉండేది. దీనివల్ల కూడా మజాకూరా గ్రామస్థులు, అంతకు ముందునుంచీ చూపిస్తున్న ఆప్యాయతకు తోడు ఆదరంతో కూడా చూస్తూండేవారు.

చిన్నపిల్లల్ని భయపెట్టడంలో పేరుపొందినామె ఒకతె ఆ ఊళ్ళో ఉంటూండేది. పిల్లలు అల్లరి ఎక్కువ చేస్తూ ఉన్నట్లయితే, వాళ్ళను భయపెట్టి అణకువ నేర్పడానికి తల్లి దండ్రులు ఆమెను పిలుస్తూ ఉండేవారు. ఆమె పేరు అప్పీసిల్ అమ్మ. చిట్టి సుధామణికి బెదురు పుట్టించడానికి ఒక్కొక్కప్పుడు ఈమెను ఇడమన్నేల్‌కు పిలిపిస్తూ ఉండేవారు. సుధామణి కూర్చున్న చోట కిటికీ దగ్గరికి ఈమె గుట్టుగా వచ్చి ఎగబాకేది. ఒక నంబి నెత్తికి ముసుగు వేసుకొని భయంకరంగా చేతులు ఆడిస్తూ గెంతుతూ కీచుగొంతుతో అరుస్తూ ఉండేది. చిట్టితల్లి కిటికీలోంచి చూసి "పో, పో; నాకు తెలుసు నువ్వెవరివో. అప్పీసిల్ అమ్మవి. నన్ను బెదిరించడానికి ప్రయత్నం చెయ్యకు" అంటూ ధైర్యంగా అరిచేది.

దుఃఖసంతప్తురాలిగా, ఉపేక్షితురాలిగా చిట్టి సుధామణి తన ప్రియతమ కృష్ణుణ్ణి పిలుస్తూ ఉండేది. గ్రామస్థులు ఇప్పుడామెను మరోలోకంలో ఉన్నదానిగా పరిగణించేవారు. చిట్టితల్లి ఆవేదనకు కారణమేమిటో తెలియక, ఆమె స్థితిని చూసి జాలిపడుతూ ఉండేవారు. "అయ్యో పాపం, వెర్రిపిల్ల! ఏమయిందో ఏమో? ఎప్పుడూ ఆ కళ్ళనుంచి నీళ్ళు చెంపలమీద ధారగా పడుతూనే ఉంటాయి. ఎంత శోచనీయమయిన స్థితి! కన్నీళ్ళు కారుస్తూ ఉండటానికి పుట్టిందా అది? ఇంట్లోవాళ్ళు కష్టాలు పెడుతున్నారా? అయితే, ఈ కష్టాలన్నీ పడటానికి తను చేసిందేమిటి?" అనుకుంటూ ఉండేవారు. ప్రతి ఒక్కరూ సుధామణిమీద జాలిపడు

ఉండేవారు. కొంతమంది ఓదార్చేవారు. కాని, ఆత్మైక్యం కోసం ఆమె పడుతున్న తపనను ఆ గోపికావల్లభుడు తప్ప మరెవరు తీర్చగలరు?

ఇంతకుముందు చెప్పినట్టు, చిట్టితల్లి సమదృష్టి, ఉదారశీలం, సర్వజీవులపట్ల కారుణ్యం ఆమెను ఊరివాళ్ళకు ఇష్టురాలిగా చేశాయి. ఆమెతో పరిచయమేర్పడే మహాభాగ్యం కలిగినవాళ్ళందరూ త్వరలోనే ఆమెకు హృదయాలను విప్పి చెప్పేవారు. కాని, ఆమె ఇంట్లో వాళ్ళ వైఖరి మాత్రం ఆమెకు దురదృష్టంగానే ఉండేది. ముఖ్యంగా, సుధామణి తల్లి, అన్నా ఆమె అసాధారణ ప్రవర్తనవల్ల, ఆమెపట్ల వ్యతిరేకత కనబరిచేవారు.

ఈ కాలంలో, మరో ఐదుగురు పిల్లలు పుట్టడంవల్ల దమయంతి ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది; ఆమె ఇంటిపనులేవీ చెయ్యలేనంత అశక్తురాలయింది. ఇంతవరకు, ఈ పనుల్లో కొన్నింటిని సుధామణి చేస్తూ ఉండేది; ఇప్పుడు మొత్తం అన్ని పనులూ ఆమెమీద పడ్డాయి. పెద్దమ్మాయి కస్తూరి, స్థానిక కళాశాలలో చదువుకుంటూంది. పెద్దబ్బాయి సుభగన్ కూడా చదువుకుంటున్నాడు. ఇందువల్ల బాధ్యతంతా సుధామణిదయింది. చిట్టితల్లికి, దీంతో కష్టకాలం దాపురించింది.

సుధామణి రాత్రీ పగలూ కష్టపడి పని చేసేది. తెల్లవారగట్ల 3 గంటలకు లేచి ఇల్లు ఊడవడం మొదలుపెట్టేది. వాకిలి ఊడవడం, నీళ్ళు తేవడం, ఆవులకు మేతపెట్టడం, పాలు పితకడంతోబాటు ఇంట్లోవాళ్ళ బట్టలు ఉతకడం, వంటగిన్నెలు తోమడం వంటి చిల్లర పనులుకూడా చేసేది.

ఇన్ని రోజువారీ పనులతో పెద్దవాళ్ళకే వెన్ను విరుగుతుంది. వెర్రితల్లి చిట్టిసుధామణి సంగతి వేరే చెప్పాలా? ఇంటి పశువులకూ కోళ్ళకూ సంరక్షణ చెయ్యాలంటేనే ఒక మనిషికి సరిపడేంత పని ఉంటుంది. అయినా సుధామణి ఏ మాత్రం సణుక్కోకుండా ఓరిమితోను, పట్టుదలతోను మొత్తంపని చేసేది.

ఈ పని భారంవల్ల, ఈ స్థితిలో సుధామణి చదువు దాదాపు ముగింపుకు వచ్చినట్టే. పనితో సతమతమవుతూ, చిట్టితల్లి చాలా రోజులు బడికి వేళకు చేరుకోలేకపోయేది. ఎలాగో పనులు పూర్తి చేసుకుని క్లాసుకు పరుగెత్తేది. అప్పటికే క్లాసులు మొదలయిపోయేవి. ఆలస్యంగా వచ్చినందుకు శిక్షగా ఉపాధ్యాయులు, చిట్టితల్లిని తరగతి గదికి బయట నిలబెట్టేవారు. బయట నిలబడవలసి వచ్చినప్పటికీ కూడా సుధామణి శ్రద్ధగా పాఠాలు వినేది. మొత్తం మీద ఎలాగో నాలుగో తరగతి పూర్తి చేసింది.

అయితే, ఐదో తరగతికి వచ్చేసరికి, అంతూ పంతూ లేని ఇంటిపనులు చూసుకోడానికి తోడు చదువు కొనసాగించడం చిట్టితల్లికి అసాధ్యమయి పోయింది. ఆ విధంగా సుధామణి పదో ఏట బడి మానెయ్యక తప్పింది కాదు. మానేసి, పూర్తిగా

ఇంటిపనుల్లోనే ఇరుక్కుపోయింది. వేకువ వేళకు ముందునుంచి రాత్రి చాలా సేపటివరకు [ఊరు మాటుమణిగే వరకు] ఆమె చెమటోడ్చి పని చేస్తూ ఉండేది. అయినప్పటికీ పనిభారంతో సతమతమవుతూ ఉన్నా కూడా చిట్టితల్లి తన ప్రియతమ కృష్ణుడి పావన నామాలను పాడుతూనే జపిస్తూనే ఉండటం ఎప్పుడూ వినవస్తూ ఉండేది. ఒక్కొక్కప్పుడు తాను చేసే పని మధ్యలో, భక్తిభావోద్రేకంలో లీనమయి బాహ్యస్థితులను మరిచిపోతూండేది. వెనక చెప్పినట్లు, చిట్టితల్లి రోజువారీ పని వేకువ వేళకు ముందే మొదలయ్యేది. తప్పి దారి ఎప్పుడయినా, అలసటవల్ల మరి కాసేపు నిద్రపోవడం జరిగితే దమయంతి కుండెడు నీళ్ళు తెచ్చి సుధామణి మీద కుమ్మరించడానికి వెనుకాడేది కాదు. నిద్రలేవగానే చెయ్యవలసిన మొదటి పని, కొబ్బరి డొక్కలను గుదిపెతో నలగొట్టి మెత్తటి పీచు తియ్యడం. తరవాత ఈ పీచు తాళ్ళు పేనడం వంటివాటికి ఉపయోగపడుతుంది. పీచుపని ఆ ఊళ్ళోనే జరుగుతుంది. దీని తరువాత ఇల్లూ వాకిలీ ఊడ్చి కొంత దూరంలో ఉన్న కుళాయినుంచి నీళ్ళు తేవాలి. అంటుగిన్నెలు తోమాలి. అన్నం వండాలి. తమ్ముళ్ళూ చెల్లెళ్ళూ బడికి వెళ్ళడానికి సిద్ధం చేయాలి. ఇది మొదటి దశలో జరిగే పని. ఇక రెండో దశలో చేయవలసినవి ఆవుల్ని కడుగటం, మేత పెట్టటం, మధ్యాహ్న భోజనాల వడ్డన అయిన తరవాత వంటగిన్నెలు తోముకోడం, ఇంట్లో వాళ్ళందరి బట్టలూ ఉతకడం, ఆ తరవాత ఆవులకు గడ్డి కోసుకు రావడానికి వెళ్ళడం. ఈ పాటికి సాయంత్రం 4 అవుతూ ఉంటుంది; తమ్ముళ్ళూ చెల్లెళ్ళూ బడినుండి తిరిగి వచ్చే వేళ. ఈ పనులన్నీ ఇలా చేస్తూనే, ఆవుల మేతకు పనికి వచ్చే కూరగాయల చెక్కులు కాని బియ్యం గంజి [లేదా కడుగు]కాని తేవడానికి ఇరుగు పొరుగు ఇళ్ళకు వెళ్తూండేది. ఇంతేకాకుండా, తను వెళ్ళే ఇళ్ళలో ఏమయినా పనులు సరిగా జరగనట్లుగా గమనించినట్లయితే ఆ పనులు వాళ్ళకు చేసిపెట్టాలని దమయంతి చిట్టితల్లికి బోధించింది. మళ్ళీ ఇంట్లోవాళ్ళకోసం సాయంత్రం వంట, గిన్నెలు తోమడం ఉండనే ఉన్నాయి.

పాపం చిన్నపిల్ల కదా అని జాలి తలిచి సాయంగా ఒక చెయ్యి వేద్దామని చూసేవాళ్ళు ఎవరూ లేరు. ఇప్పుడామెను ఇంటి పనిమనిషిగానూ వాటిని ఆమె పనులుగానూ చూస్తున్నారు. దమయంతి వాడి చూపులు చిట్టితల్లి ప్రతి ఒక్క చర్యను, పనినీ పరీక్షగా చూస్తాయి. ఒక్క తప్పు, అది ఎంత చిన్నదయినప్పటికీ, కనిపించినట్లయితే శిక్ష అమాంతంగా వచ్చి పడేది. సుధామణి ఏకైక మిత్రుడు కృష్ణుడు. ఆ పేరు ఎన్నడూ మరిచేది కాదు. ఆ పేరే ఆమెకు ఏకైక స్ఫూర్తి. రకరకాల పనుల్లో మునిగి ఉన్నప్పుడు కూడా, తన ప్రియతమ ప్రభువును గురించిన గాఢమయిన తలపు ఆమెకు కన్నీళ్ళు తెప్పించేది. గంటల తరబడి అదే పనిగా ఏడుస్తూ ఉండేది.

చివరికి సుధామణికి రాత్రి సుమారు పదకొండు గంటల వేళకు రోజు ముగిసేది. వెర్రితల్లి విశ్రాంతి తీసుకోడానికి అవకాశం ఉండే ఏకైక సమయం ఇదే. కాని పక్క మీద పడుకొని విశ్రాంతి తీసుకోడానికి కాదు; అంతకన్న తనలో తాను విశ్రాంతి తీసుకోడానికి... తన ప్రభువును సందర్శించడానికి .అందరూ గాఢంగా నిద్రపోతూ ఉన్నప్పుడు చిట్టితల్లి, చిన్నదేవుడి గదిలో కూర్చుని భక్తిగీతాలతో కృష్ణభగవానుడికి విన్నపాలు చేసుకొనేది. రాత్రి చీకట్లో సుధామణి ఏడిచేది; గుండెలవిసిపోయేటట్లు పాడేది; చివరికి నిద్రలోకి జారిపోయేది [ఒక పాటలో భావం ఈ కింది విధంగా ఉంది]:

కృష్ణా ! కారుణ్యం కనబరుచు నామీద !
ఓ విష్ణుభగవాన్, కైమోడ్పులర్పిస్తున్నాను నీకు,
వాఙ్మనోదేహ భారాలు తొలగించు నాకు
వాత్సల్యం చూపించు నామీద !
దీనజనబాంధవా, దయానిధే !
కరుణ లేదా నీకు కాసంతయినా ?
బంగారు గుళ్ళో మాత్రమే ఉంటున్నావా నువ్వు ?
కాంతులీనే నీ కళ్ళు మసకలు కమ్మాయా ?
ఓ కరుణాసాగరా
భక్తులపాలిటి ప్రేమమయుడవు నువ్వు
నీ పాదాలే ఎప్పటికీ శరణు !

ఆ రోజుల్లో కూడా సుధామణి మనస్సు ఉన్నత స్థాయిలో విహరిస్తూ ఉండేది. హృదయాన్ని ఆకట్టుకొనే ఒక దృశ్యం కనిపించడం కాని, పాట వినిపించడం కాని జరిగినట్లయితే ఏ క్షణంలోనయినా ఆమె దైవభావోన్నతస్తరాలకు ఎగిరిపోతూ ఉండేది. ఒకనాడు చిట్టితల్లి ఏవో సరుకులు కొనడానికి బజారుకు వెళ్ళింది. తిరిగి వస్తూ ఉంటే ఏదో దూరప్రదేశం నుంచి భక్తిగీత రాగాలు వినవచ్చాయి. మరో ఆలోచన లేకుండా, సుధామణి ఆ పాటకు హత్తుకుపోయి అర్ధచేతనా స్థితిలో, ఆ పాట వినవస్తున్నవైపు తిరిగి ముందుకు నడవసాగింది. గుండెను ఆకట్టుకునే ఆ పాట వెలువడుతున్న ఇంటికి చేరింది. తీరా చూస్తే, అదొక క్రైస్తవ కుటుంబం వారి ఇల్లు. ఆ రోజున ఆ ఇంట్లో ఎవరో చనిపోయారు. చుట్టాలు శవం చుట్టూ కూర్చుని విషాదసంభరితమైన స్వరంతో దైవకీర్తనలు పాడుతున్నారు. చిట్టితల్లి గుండె కరిగి నీరయింది; బాహ్యస్పృహ పోయింది; దైవోన్మత్త స్థితిలో స్థాణువులా నిలబడిపోయింది. ఆమె కళ్ళు మూసుకొని ఉన్నాయి;

చెంపలమీంచి కన్నీటిబొట్లు రాలిపడుతున్నాయి. బజారులో కొన్న సరుకులు ఆమె చేతిలోంచి కింద పడిపోయాయి; ఈ అపరిచిత బాలికలో అకస్మాత్తుగా మార్పు ఎందుకు వచ్చిందో అక్కడికి చేరినవాళ్ళకు అర్థంకాలేదు. తమ బంధువు మరణం ఆ పిల్లను కూడా కదిపివేసి ఉంటుందని పొరపాటుపడ్డారు.

ఈ విధంగా ఒక అరగంట గడిచింది. అప్పటికి సుధామణికి కొంత మామూలు స్పృహ వచ్చింది. కిందపడ్డ సరుకులు ఏరుకొని గబగబా ఇంటికి పరుగెత్తింది. అనుకున్నటే, దమయంతి కోపంగా [గుమ్మంలో] నిలబడి ఉంది. కోపం పట్టలేక సుధామణిని చివాట్లు పెట్టి కొట్టింది. చిట్టితల్లి అప్పటికింకా కొంతవరకు అంతర్ముఖ స్థితిలోనే ఉంది. దమయంతి కఠిన దండనను నిశ్శబ్దంగా, నిశ్చలంగా స్వీకరించింది. దైవభావనలో మునిగి ఉన్న మనస్సును ఏ బాహ్యశక్తి మళ్ళించగలదు?

అసమానమయిన ప్రతిభకు, మొక్కవోని ఉత్సాహానికి, ఆదర్శవంతమయిన భక్తికి హృదయమథనం కావించే గాన నైపుణ్యానికి మాత్రమే కాక, అన్నింటికన్నా పేదసాదలపట్ల చూపే అపారమయిన కారుణ్యానికి పేరుపొందింది సుధామణి. ఇంటిపనుల్లో తల్లికి సహాయపడటం విషయంలో ఆమె ఎంత శక్తివంచన లేకుండా చేస్తూ ఉన్నప్పటికీ దమయంతిది కోపదారి స్వభావం కావడంవల్ల చాలా చిన్న తప్పుకు కూడా తీవ్రంగా శిక్షించడానికి వెనకాడేది కాదు. వెనక చెప్పినట్టు, చిట్టి సుధామణి మీద దమయంతి ఏవగింపు కలగడానికి ప్రత్యేకమైన కారణం, ఆమె నలుపు చాయ. పైగా ఒక్కొక్కప్పుడు వెన్నదొంగ అయిన కొంటె కృష్ణుడిలాగే చిట్టితల్లి కూడా వెన్న, పాలు, పెరుగు దొంగతనంగా తీసుకొనిపోతూ ఉంటే దమయంతి పట్టుకొనేది. కొంతకాలం దాకా దమయంతి కనిపెట్టలేకపోయినది ఏమిటంటే, సుధామణి వీటిని తీసుకువెళ్ళి తనకు స్నేహం కలిసిన, ఆకలితో అలమటించే, కుటుంబాలవారికి ఇచ్చి వస్తూండటం.

ఇతరులెవరూ చూడకుండా చిట్టితల్లి, పాలూ పెరుగూ రహస్యంగా సంగ్రహించి అవి తీసుకొన్న మేరకు నీళ్ళు పోసేస్తూండేది. కనిపెట్టినప్పుడు మాత్రం దెబ్బలు తప్పేవి కావు. తరచుగా, చిట్టితల్లి జాలిగుండెను సాకుగా తీసుకొని ఆమె అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ తినడానికీ తాగడానికీ పనికి వచ్చేవి సంగ్రహిస్తూ ఉండేవారు. కాని తమకోసం. నేరం సుధామణి మీద నెట్టేస్తూండే వారు. అసలు దొంగ ఎవరో తెలిసినప్పటికీ కూడా ఆమె ఎవరికీ వ్యతిరేకంగా చెప్పేదికాదు. తనమీద పడ్డ పిడి గుద్దులను మౌనంగా ఓర్చుకొనేది.

ఎవరి ఇంట్లోనయినా పస్తులుంటున్నారని తెలిసినట్లయితే సుధామణి, వాళ్ళకేమయినా కొనిపెట్టడానికి వాళ్ళమ్మ డబ్బులు దాచుకునే డబ్బాలోంచి కొన్ని తీసుకొనేది. ఇది సాధ్యం కానప్పుడు కాసిని డబ్బులు ఇచ్చేవరకు వాళ్ళ నాన్నను వేధించేది. ఈ రెండు మార్గాలు

కుదరనప్పుడు, చిట్టితల్లి, వాళ్ళ ఇంట్లో సామాను గదిలోనుంచి కొద్దిపాటి ముడి ఆహార పదార్థాలు తీసుకొనివెళ్ళి అవసరంలో ఉన్నవాళ్ళకు ఇచ్చేది.

కొన్ని చిన్నతనపు కొంటె చేష్టలూ సరదాలూ తప్ప, సుధామణి చేసే అల్లరి పనులన్నిటికీ నిస్వార్థ ప్రయోజనమే ప్రాతిపదికగా ఉండేది. అటువంటి పనులు, బాధిత ప్రజల పట్ల ఆమెకు పుట్టుకతో వచ్చిన కారుణ్యానికి ఫలితాలు. అయితే ఇలాంటి ధర్మార్థసేవ ఆమెను దమయంతికి ఇష్టురాలిని చేయలేదు; పైపెచ్చు దమయంతి, ఒళ్ళు వాచేటట్లు కొట్టడానికి ఆలస్యం చేసేది కాదు. త్యాగం చెయ్యవలసి వచ్చినప్పటికీ బాధ అనుభవించవలసి వచ్చినప్పటికీ, ఇతరులకు శాంతి చేకూర్చడంలోనూ సహాయం చేస్తూండటంలోనూ చిట్టితల్లికి అత్యధికమయిన తృప్తి కనిపించేది; ఆనందం కలిగేది. శిక్ష అనుభవించవలసి వచ్చినా కూడా ఔదార్యాలు చూపించడానికి ఆమె వెనుకాడేది కాదు. పేదరికం అనుభవిస్తున్న గ్రామస్థులకు సేవలందించడానికి తానెంత త్యాగం చెయ్యవలసి వస్తోందో, ఎంత బాధ సహించవలసి వస్తోందో ఆమె ఇతరుల కెన్నడూ తెలియనిచ్చేది కాదు.

చేపల వ్యాపారం పనిమీద బయటికి వెళ్ళి, సుగుణానందన్ రోజుల తరబడి ఇడమన్నేల్‌కు దూరంగానే ఉండేవాడు; పిల్లలందరూ గాఢనిద్రలో మునిగి ఉన్నప్పుడు రాత్రి చాలా ఆలస్యంగా ఇంటికి వస్తూండేవాడు. అలాంటి సందర్భాల్లో దమయంతి చేస్తూండే మొట్టమొదటి పని, చిట్టి సుధామణి మీద నేరారోపణలన్నీ వరసగా ఏకరువు పెట్టడం. అలాటి సందర్భాల్లో ఒకసారి, నిద్రపోతున్నట్టు నటిస్తున్న సుధామణి, హఠాత్తుగా గట్టిగా అరిచింది. "నేను నీ కూతుర్ని కాదు. నీ కోడల్ని అయి ఉండాలి!" సుధామణి మాట విని దమయంతి బిత్తరపోయింది. చిట్టితల్లి మనస్సులో ఉన్న భావం స్పష్టంగా తెలుస్తూనే ఉంది. నిజమయిన తల్లి తన కూతురి తప్పులను ఓరిమితో క్షమిస్తుందనీ, అత్త మాత్రమే కోడలి తప్పులను పదింతలు పెద్దగా చేసి పూసగుచ్చినట్టు చెప్పి పెడుతుందనీ ఆమె దమయంతికి గుర్తు చేస్తోందన్నమాట.

ప్రజల దుఃఖాన్నీ బాధనూ తొలగించాలన్న, తీర్చలేని ఆకలి ఉన్న చిట్టి సుధామణి, త్వరలోనే ప్రపంచమంతా - దాహంతో చస్తున్నవాడు ఒయాసిస్సు కోసం వెతుకుతున్నట్టుగా - దూరాన ఉన్న అరేబియా సముద్ర తీరానికి వచ్చి చేరేటట్టు చేస్తుందని ఎవరు ఊహించగలరు? ఇంకా పదేళ్ళు నిండని చిట్టి సుధామణి, మారుమూల ఉన్న ఒక చేపల వాళ్ళపల్లెలో తన ప్రభావాన్ని ప్రసరింపజేస్తోందనీ, ప్రపంచమంతటా అది అనుభూతం కావలసిన యోగం పడుతుందనీ, దాన్ని పూర్తిగా మెచ్చుకోడం మాట దేవుడెరుగు, ఎవరయినా ఎలా గ్రహించగలరు.

ఆమె అత్యంత చిత్తశుద్ధితో తన విధులను నిర్వర్తించినప్పటికీ కూడా వాళ్ళు చిన్న తప్పుకు సైతం కక్ర తిరగేసేది. పని ఏమాత్రం మందగించినా దమయంతి వెచ్చరిస్తూ ఉండేది, "ఒసేయ్, సోమరి పిల్లవయిపోకు! నువ్వు పని చెయ్యకుం కూర్చుంటే దేవుడు నీకేమీ పని అప్పగించడు. చివరికి నువ్వు ఆకలితో చస్తావు. 'దే నాకు పని అప్పగించు' అని ప్రార్థన చెయ్యి. అందరూ ప్రార్థన చేసేది అలాగే" ఈ మా విని సుధామణి, అప్పటినుంచి ఇలా ప్రార్థన చేసేది. "ఓ కృష్ణా, నాకు తప్పకుండా అప్పగించు; నీ పని అప్పగించు!"

సుధామణి చూపిన ఓరిమి, నిదానం, త్యాగం నమ్మలేనంత అద్భుతమై నిరంతరాయంగా తన ప్రియతముణ్ణి స్మరించుకొంటూ ఎదురయిన వాటిని అన్ని స్వీకరించడానికి ఆమెకున్న సామర్థ్యం, దైవసాక్షాత్కారం పొందిన రక్షకుల అవి భారతీయ వారసత్వంలో మరో మహాత్మ ఆగమనాన్ని ముందుగానే సూచించింది. చి జీవితంలో లెక్కలేనన్ని అగ్ని పరీక్షలు ఎదురయినా, నిర్దాక్షిణ్యమయిన హింసకు అయినా ప్రతిదాన్నీ ఆమె దైవప్రసాదంగానే తీసుకొంది. తన దుఃఖాన్నంతటినీ లో దాచుకొని మురళీ మోహనుడయిన ఆ కృష్ణుడికే నివేదించుకొంటూ వచ్చింది.

ఇంట్లో వున్న దేవుడి గది తలుపులు మూసి, రాత్రి చీకటిలో కూర్చుని నీళ్ళని కళ్ళతో కృష్ణుణ్ణి ప్రార్థిస్తూ ఉండేది: "ఓ కృష్ణా, నువ్వు తప్ప మరెవ్వరూ నా హృదయ అర్థం చేసుకోలేరు. ఈ లోకం దుఃఖంతోను, బాధతోను నిండి ఉంది. స్వార్థం అధి చెలాయిస్తోంది. ప్రజలు తమ సుఖాన్నీ, సంతోషాన్నీ మాత్రమే చూసుకొంటున్నారు నా కన్నా* నీతో పూర్తిగా ఒకటి కావడం తప్ప నేను మరేదీ కోరను. ప్రభూ, ఈ రోజు బాధను నువ్వు చూడలేదా? ఓ ప్రభూ, రా! నీ దివ్యరూపాన్ని చూడనియ్యి! ఈ బా నాకు లెక్కలోకి రావు; నీకు దూరమై ఉండటం నా గుండెను బద్దలు చేస్తోంది"

ఈ కాలంలో సుధామణి కూర్చిన పాట [భావం] ఇది:

ఓ కారుణ్యామూర్తీ, కాయాంబువర్ణా,
నీ కళ్ళు విప్పు, దయ ఉంచి నామీద,
దుఃఖనివారకుడివి కావా నువ్వు?
తాపాన్ని తొలగించు, తాపాన్ని తొలగించు!
ఈ లోకంలో నువ్వే ఆశ్రయం
కెందామర కన్నా, మణివర్ణా!

---

* కృష్ణుడికి మరో పేరు

పూజిస్తాను ప్రతిదినం నిన్ను
నా కన్నీటి పుష్పాలతో, కృష్ణా!
పద్నాలుగు లోకాల్లో నిండి ఉన్న
మానసమోహన గోపాలా!
నీ కళ్ళు విప్పు; నా తాపాన్ని తొలగించు
ఓం ఓం ఓం ఓం ఓం ఓం ఓం.

ఈ విధంగా గాఢమయిన తపనతో, అగ్ని పరీక్షలతో మూడేళ్ళు గడిచాయి. ఇప్పటికి పదమూడేళ్ళు వచ్చిన సుధామణి ఇంకా కష్టపడి పని చేసేది. ఆమె వయస్సు పెరుగుదలతో బాటు బాధ్యతలు కూడా పెరిగాయి. అయినా ఆక్షేపణ తెలపకుండా వెనకటి మాదిరిగానే పెనుగులాడుతూ ఉంది. అలాగే ఆమె ఆధ్యాత్మిక సాధనలు కూడా నానాటికీ గాఢమవుతూ వచ్చాయి. దైవనామాన్ని జపిస్తూ ఉన్నప్పుడు చిట్టితల్లి పెదవులు కదులుతూ ఉండటం కనిపిస్తూండేది. పవిత్రనామ జపం ఎడతెరిపి లేకుండా పారే వాగులాగ, లోపలా బయటా కూడా సాగుతూనే ఉండేది.

## చుట్టాల దగ్గర గడచిన కాలం

సముద్రతీర ప్రాంతంలో వంటపనికీ ఇంటిపనులకూ పనిమనుషులు దొరికేవారు కారు. అంతకంటె లాభకరంగా ఉండే, చేపల వలలు అల్లడం, పీచుపని చేయడం వంటివి ఉంటూండేవి. అంతేకాదు; తరతరాలుగా వస్తున్న బెస్తపని తప్ప మరో పని చెయ్యడం అవమానకరమని బెస్తవాళ్లు అనుకునేవాళ్ళు. ఇందువల్ల, చదువు మానేసిన ఏ పిల్ల అయినా రాత్రీ పగలూ ఇంటిపనులు చెయ్యవలసి వచ్చేది. దీనికి తోడు, చుట్టాలకు సేవ చెయ్యడానికి కూడా వాళ్ళ ఇళ్ళకు పంపడం జరుగుతూండేది. అలాంటి ఆడపిల్లల్ని తమ పనులకోసం పంపమని చుట్టాలు అడుగుతూ ఉండటం ఆచారం.

సుధామణికి కూడా అంతే జరిగింది. తమ ఇంటి పనులకు ఆమెను పంపించమని చుట్టాలు ఒత్తిడి చేశారు. చివరికి, వాళ్ళు పట్టుపట్టి ఇదే విషయంమీద గొడవ చేస్తూ ఉండటంవల్ల సుధామణి తల్లిదండ్రులు ఆమెను అమ్మమ్మగారింటికి పంపక తప్పింది కాదు. ఈ విధంగా సుధామణి ఆ తరవాత నాలుగేళ్లూ ఆయా చుట్టాల ఇళ్ళలో ఇంటి పనిమనిషిగా గడపడం జరిగింది.

సుధామణి అమ్మమ్మ, పరయకడవుకు దక్షిణంగా ఆరు కిలోమీటర్ల దూరంలో ఉండేది. ఆ ఊరిపేరు భండారతురత్తు. అక్కడికి చేరాలంటే ఉప్పుటేట్లో పడవమీద

ప్రయాణం చెయ్యాలి; లేకపోతే అరేబియా సముద్రపు ఒడ్డు వెంబడి నడుచుకుంటూ వెళ్ళాలి. చిట్టి సుధామణికి మత్తు కలిగించడానికి ఈ రెండింటిలో ఏ ఒక్కటయినా చాలని ఊహించవచ్చు. పడవలో ప్రయాణిస్తూ ఆమె, నీలాకాశం వైపు చూస్తూండేది; నీలమేఘశ్యాముడయిన కృష్ణుణ్ణి గురించి తలపోస్తూ ఆనందబాష్పాలు రాల్చేది. పడవ ఇంజను చప్పుడుకు తోడుగా ఓంకారాన్ని జపించడం ఆమెకు అలవాటయింది. నీటి మీద అల్లల్లాడే చిట్టి అలలమీద చూపు నిలిపి అక్కడ తన ప్రియతముడి రూపాన్ని దర్శిస్తూ ఆయన దివ్యలీలలను ఊహిస్తూ ఉండేది. కాస్సేపట్లోనే ఆమె భక్తిపారవశ్యంలో మునిగిపోయేది. ఆమె ఓంకార జపం భక్తి సంకీర్తనంలోకి మారిపోయేది. తోటి పడవ ప్రయాణికులు చిట్టితల్లి మధురగానానికి ఎంతో మురిసిపోతూ ఉండేవారు. ఆమెను ఎప్పుడూ మరో లోకంనుంచి వచ్చినదాన్నిగా చూసేవారు కాబట్టి ఆమె ప్రవర్తనకు ఎన్నడూ ఆశ్చర్యపోలేదు. ఇలాంటి సాధనలవల్ల చిట్టితల్లికి దూరమూ తెలిసేది కాదు, ప్రయాణంలో విసుగూ కలిగేది కాదు.

కాని, పడవ ప్రయాణ ఆనందం కొద్దికాలమే దక్కింది. పడవ చార్జి డబ్బులిమ్మని ఒకనాడు ఆమె అడిగినప్పుడు, దమయంతి ఇలా కసురుకుంది. "పడవలో పయనం చేయడానికి నువ్వెవతివి? కాలేజి పిల్లవా? నడక చాలు నీకు". సరిగా ఈ రోజుల్లోనే కస్తూరి కాలేజి చదువులు మొదలుపెట్టింది. సముద్రతీర ప్రాంతంలో ఇది అరుదు. ఈ విషయంలో దమయంతికి కాస్త గర్వంగా ఉండేది; ఆమె రోజువారీ ఖర్చులకు కావలసినంత డబ్బు ఇస్తూండేది. చాలా కుటుంబాలవాళ్ళు తమ పిల్లలను పై చదువులకు పంపలేనంత పేదవాళ్ళు. అందువల్ల తన కూతురు కాలేజి విద్యార్థిని అయిందంటే తల్లిదండ్రులెవరి కయినా నిజంగా గర్వంగానే ఉంటుంది. తల్లిదండ్రులు తమ పిల్లలను పంపడానికి స్తోమత ఉన్నవాళ్ళయినప్పటికీ కూడా ఆసక్తి చొరవా ఉంటూండేవి కావు. అందువల్ల త్వరగానే ఆ అభిప్రాయాన్ని విడిచిపెట్టేసేవారు. అలాటప్పుడు దమయంతి కాస్త గర్వం కనపరచడంలో ఆశ్చర్యం లేదు.

సుధామణి నల్లగా ఉండటంవల్లా కేవలం పనిమనిషి కావడంవల్లా ఆమెను ఎవరూ చూసేవారు కారు; ఆమె సంగతి పట్టించుకొనేవారు కారు; ఆమె ఇంట్లో వాళ్ళే ఆమెను పూర్తిగా అపార్థం చేసుకొన్నారు. అయినప్పటికీ ఇంత చిన్న వయస్సులోనే ఆమె ద్వేషం, దారిద్ర్యం నిండిన వాతావరణంలో కూడా ప్రశాంతంగా కృష్ణుడు తప్ప మరేమీ లేకుండా ఉంటూండటం గమనించవచ్చు. తల్లి మొరటు ప్రవర్తనకు ఆమె ఎంత మాత్రం అసంతుష్టి చెందలేదు. పైపెచ్చు, అమ్మమ్మగారింటికి సముద్రపు ఒడ్డు

వెంబడి నడచి వెళ్ళడానికి చిట్టితల్లి ఆనందించింది. ఆనంద తన్మయత్వంతో ఒంటరిగా పాడుతూ ఆడుతూ వెళ్ళడం ఎంత అదృష్టం! సముద్రాన్నే తన తల్లిగా భావించిన చిట్టి సుధామణికి, ఆరు కిలోమీటర్ల నడక చెప్పలేని అనుభవమయింది.

సముద్రపు కెరటాలు లయవిన్యాసం చేస్తూ ఉండగా చిట్టితల్లి గొంతెత్తి పాడుతూ ఒడ్డు వెంబడి నడుచుకొంటూ వెళ్తున్న దృశ్యాన్ని ఎవరయినా సులువుగా ఊహించుకోగలరు. బయటి ప్రపంచాన్ని మరిచిపోతూ, ఆమె అడుగుల కదలిక క్రమక్రమంగా మందగిస్తూ ఉంటుంది. ముదురు నీలపు వన్నె సముద్ర దృశ్యం, పైన ముసురుకొన్న కారునీలి మబ్బులూ ఆమె మనస్సును హరించి వేసేవి. సముద్రపు ఘోష ఓంకార నాదాన్ని తలపింపజేసేది; సుధామణికి తప్పకుండా, దైవపరమయిన మత్తు కలిగించేది. కెరటాల్లో కృష్ణుణ్ణే దర్శిస్తూ ఒక్కొక్కప్పుడు వాటిని ఆమె అక్కున చేర్చుకొనేది! సముద్రపు గాలి ఆమెకు శ్రీకృష్ణుడి సుతిమెత్తని లాలింపు తప్ప మరేదీ కాదు. ఒక్కొక్కప్పుడు ఆమె "కృష్ణా! కృష్ణా!"అంటూ ఎలుగెత్తి పిలిచేది. భక్తి పారమ్యస్థితిలో గాఢంగా లీనమయి ఆమె, ఇసుకలో తప్పటడుగులు వేస్తూ నడిచేది. చివరికి, బాహ్యస్పృహ అంతా కోల్పోయి ఇసకలో పడిపోయేది.

కొద్దిగా మామూలు స్పృహ వస్తున్నప్పుడు సుధామణి 'కన్నా, నా కన్నయ్యా, పరిగెత్తుకొని రా! నన్నిక్కడ విడిచి ఎక్కడికి వెళ్ళావు? తెలియని ఈ సముద్రపు ఒడ్డున నన్నెందుకు విడిచిపెట్టావు? నేనెక్కడున్నాను? ఓ ప్రియతమ కృష్ణా, ఈ చావు పుట్టుకల మహాసముద్రపు కెరటాలు నన్ను కబళించకముందే పరుగెత్తుకొంటూ రా! ఓ కృష్ణా, విషయసుఖాల ఇసక పర్రలోంచి ఈ అనాధను లేవనెత్తు. నువ్వు నీ భక్తుల్ని కాపాడేవాడివి కావా? నా గుండెల్లో బాధ నీకు తెలియడం లేదా? నువ్వు, నన్నిలా బాధపడుతూ ఉండనివ్వడానికి నేను చేసిన తప్పు ఏమిటి? ఓ సకల లోకాధిపతీ, అల్పురాలయిన నీ ఈ దాసురాలిమీద కాసంత కనికరం చూపించవా? మధురమయిన నీ దివ్యవేణుగానాన్ని ఆలకించాలని నేను ప్రతిరోజూ ఎదురు చూస్తున్నాను.'ఓ కృష్ణా! దయచేసి రా.. దయచేసి రా!!"

కొంత సేపటికి ఆమె మనస్సు నిలదొక్కుకోగల స్థితికి వచ్చి మైమరిచి పాడుకొంటూ సముద్రపు ఒడ్డు వెంబడి నడక సాగిస్తూ ఉంటుంది. ఇంతలోనే మళ్ళీ ఎన్నోసార్లు చిట్టితల్లి ఇసకలో వాలిపోతుంది; చుట్టూ ఉన్న ప్రపంచాన్ని మరిచిపోతుంది.

ఓ కారుణ్యవారిధి కృష్ణా !- నిత్యం
పెరిగిపోతోంది జీవిత తృష్ణ

లేదు, మనస్సులో శాంతి - అయ్యో!
ఎంతో గందరగోళం, అంతా విభ్రాంతి!
తప్పులనన్నిటినీ కాచి
నా నుదుటి చెమటను తుడిచెయ్యి
ఓ కన్నా, ఇప్పుడు నాకు మరే ఆధారమూ లేదు
నీ పావన పాదపద్మాలు తప్ప
ఎండిపోతోంది కృష్ణా ! నా గొంతు
కనిపించడం లేదు కళ్ళు రెండూ
అలసిపోయాయి పాదాలు రెండూ
పడిపోతున్నాను నేలమీద, కృష్ణా..

ఈ విధంగా, భక్తి ప్రేమ పరమామృతాన్ని ఆస్వాదిస్తూ సుధామణి ఎలాగో అమ్మమ్మగారింటికి చేరేది; నడుము విరిగేటంత పనిభారం ఆమెకోసం అక్కడ కాసుకుని ఉండేది. అయినప్పటికీ కుర్రపిల్ల, కృష్ణభగవానుడి నామాలను మనసారా జపిస్తూ పనులన్నీ చేస్తూ ఉండేది. చిట్టితల్లికి సంబంధించినంతవరకు, జీవితంలో ప్రతి ఒక్క క్షణాన్నీ- అది అనుకూలమయినా, ప్రతికూలమయినా - పరమేశ్వరుణ్ణి సేవించడానికి స్మరించడానికీ కలిగిన అవకాశంగా పరిగణిస్తూ ఉండేది.

సందర్భవశాత్తు, సుధామణిని, వడ్లు ఆడించడానికి అమ్మమ్మ ఇంటి దగ్గరనుంచి కొంత దూరంలో ఉన్న ధాన్యం మరకు పంపిస్తూ ఉండేవారు. ఆమె సంతోషంగా, తను కిష్టమయిన భక్తిపాటలు పాడుకొంటూ ప్రయాణం చేసేది. గాదె కొట్టుకు వెళ్ళే దారిలో నిరుపేద బతుకు బతుకుతున్న అనేక కుటుంబాలున్న గూడెంగుండా వెళ్ళవలసి వస్తూండేది చిట్టితల్లికి. చాలా కనికరపు గుండె కావడంవల్ల, సుధామణి, వాళ్ళ దీనస్థితిని చూసి ఎంతో బాధపడిపోయేది. వడ్లు ఆడించిన తరవాత ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు ఆమె, రోజుల తరబడి పస్తులున్న కుటుంబాల వాళ్ళకు కొన్ని బియ్యం పెడుతూండేది. ఒక్కొక్కప్పుడు బియ్యం తగ్గడం అమ్మమ్మ కనిపెట్టేసేది. చిరుతిండి కొనుక్కోవడానికి సుధామణి బియ్యం పోసిందని అనుకొనేది. చిట్టితల్లిని తిట్టేది, కొట్టేది. ఎంత ఒత్తిడి చేసినప్పటికీ సుధామణి, బియ్యం ఏ ఇంటివాళ్ళకు పెట్టిందీ చెప్పేది కాదు. చెప్పినట్లయితే అమ్మమ్మ వాళ్ళ ఇంటికి తప్పకుండా వెళ్ళి పోట్లాడి వస్తుందని అనుకొంది.

భండారతురత్తులో ఉన్నప్పుడు సుధామణిని ఒక్కొక్కప్పుడు, కొత్తగా విత్తిన పొలాల్లో కాకులూ కోళ్ళూ చొరబడకుండా కాపలా కాయడానికి పంపుతూండేవారు.

పొలం చాలా దూరంలో ఉండేది. అలవాటు ప్రకారం చిట్టితల్లి, ప్రతి ఒక్క పరిస్థితినీ దైవాన్ని తలుచుకొనే అవకాశంగా మార్చుకొనేది. ఇంటివాళ్ళందరికీ దూరంగా ఉండి భగవంతుణ్ణి తలుచుకొంటూ ప్రార్థిస్తూ ఒంటరిగా గడుపడానికి తనకు కలిగిన అరుదయిన అవకాశంగా దీన్ని భావిస్తూ ఉండేది. ప్రతి ఒక్క శ్వాసలో కృష్ణనామాన్ని నింపుకొనేది. ప్రతి ఒక్క అడుగూ ఆయన దివ్యరూపాన్ని తలుచుకొంటూ వేసేది. భక్తిప్రేమల గాఢతవల్ల ఒక్కొక్కప్పుడు చిట్టితల్లి, తన్మయురాలయి అరుస్తూ పొలం దగ్గర సొమ్మసిలి పడిపోయేది.

ఉన్నంతలో మేలు ఏమిటంటే, ఆమె అమ్మమ్మ కృష్ణభక్తురాలు, కృష్ణుడిపటం ఒకటి గోడకు వేలాడుతూ ఉంటుంది. సుధామణి దానికి ఎదురుగా నిలబడి, పని పడేవరకు, చాలా సేపు భక్తిపాటలు పాడుతూ ఉండేది. అలాటి సందర్భాల్లో ఆమె మామ రత్నదాసన్, ఒక మోకాలి పీట తెచ్చి వేసేవాడు. చిట్టితల్లి అంటే అతనికి చాలా ఇష్టం. ప్రార్థన చేసేటప్పుడు ఆమె చాలాసేపు నిలబడి ఉండక్కరలేకుండా కూర్చుంటుందని అతని ఉద్దేశం. అప్పుడు చిట్టితల్లి అనేది, "కృష్ణుడు నిలబడి ఉన్నప్పుడు నేనెలా కూర్చోగలను?" అని. ఆమె దృష్టిలో భగవంతుడి బొమ్మ రంగుల కాయితంముక్క కాదు; రక్తమాంసాలతో [సజీవంగా] నిలబడి ఉన్న కృష్ణుడే. నిజమయిన భక్తుడికి జడపదార్థమంటూ ఏదీ లేదు; ప్రతీదీ భగవంతుడి మహిమకు వ్యక్త రూపమే.

హృదయావర్జకాలయిన సుధామణి పాటలకు ఆకర్షణ పొంది, ఇరుగు పొరుగువాళ్ళు వచ్చి వింటూండేవాళ్ళు. ఉదాత్త స్థాయిలో చిట్టితల్లి పాడే పాటలు వాళ్ళ మనస్సులను ప్రేమతోను, భక్తితోను నింపేసేవి. క్రమక్రమంగా, సుధామణి కూర్చిన పాటలను కూడా నేర్చుకొని వాళ్ళ వాళ్ళ ఇళ్ళలో దేవుడి గదిలో పాడుకొంటూ ఉండేవాళ్ళు. చిట్టితల్లికి దిష్టి తగలకుండా ఉండటానికి వాళ్ళ మామయ్య, ప్రత్యేక ప్రార్థనతో పవిత్రీకరించిన విబూది తెచ్చి మేనకోడలి నుదుట రాసేవాడు.

వానాకాలం, చలికాలం, ఎండాకాలం ఒకదాని వెనక ఒకటి గడిచి పోయాయి. సుధామణికిప్పుడు పద్నాలుగేళ్ళు నిండాయి. ఆమెను దమయంతి అక్కగారింటికి పంపారు. మామూలుగానే, చిట్టితల్లి, పనిభారం అంతా తానే వహించి శ్రమించింది. మొదట, వడ్లు వేణ్ణీళ్ళలో పోసేది; తరవాత ఎండపెట్టేది. వంట వండటం, శుభ్రంచేయడం, బట్టలన్నీ ఉతకడం ఆమె పనులు. ఇంట్లో వాళ్ళ పిల్లలందరూ కాలేజిల్లో చదువుతున్నారు; ఇంటిపని ఏదయినా చేయడం నామోషీ అనుకుంటారు వాళ్ళు. వాళ్ళకు దేవుడిమీద నమ్మకం లేదు. చిట్టితల్లికి భక్తితత్పరత ఉన్నందుకు ఆమెను ఎగతాళి చేసేవారు.

భక్తిగీతాలు పాడనియ్యకుండా అడ్డుకోడానికి ప్రయత్నించేవారు. పాపం సుధామణి! హృదయంలేని ఈ మనుషులకు వ్యతిరేకంగా ఏం చెయ్యగలదు? చివరికి వాళ్ళు, ఆమెచేత పాట ఆపించడంలో తాత్కాలికంగా కృతకృత్యులయినందుకు ఆమె, ముఖానికి చేతులు అడ్డుపెట్టుకొని కన్నీళ్ళు పెట్టుకొనేది. బయట ఆమె నోరు మూయించినప్పటికీ ఆమె హృదయంలోంచి వెలువడే దైవభక్తిని ఎవరు అడ్డుకోగలరు?

సముద్రానికి దగ్గరలో ఉండటంవల్ల ఇంటిచుట్టూ నీళ్ళన్నీ ఉప్పగా ఉండేవి. తాగే మంచినీళ్ళకోసం సుధామణి, పడవ నడుపుకొంటూ ఉప్పుటేరు దాటి అవతలి ఒడ్డుకు చేరేది; దూరాన మంచినీళ్ళ కుళాయికి వెళ్ళేది. ఒక్కొక్కప్పుడు ఆమె పడవ నడుపుతూ చుట్టాల పిల్లలు స్కూలుకూ కాలేజీలకూ వెళ్ళడానికి ఉప్పుటేరు దాటించేది. ఇతరుల పిల్లలను కూడా సంతోషంగా దాటించేది.

తిరిగి వచ్చేటప్పుడు పడవలో కూర్చుని చిట్టితల్లి, ప్రకృతి దృశ్యాన్ని చూస్తూ ఎంతో ఆనందించేది. అలాంటి సందర్భాల్లో, ఎలాంటి ఆటంకం లేకుండా తన స్వామిని ఎలుగెత్తి పిలుస్తూ ఉన్నప్పుడు, కృష్ణుణ్ణి దర్శించాలని తపించే ఆమె హృదయాభిలాష బ్రహ్మాండంగా పెరిగిపోయేది. ఏటిమీద లేస్తూ ఉండే చిట్టిపొట్టి అలలతో ఆమె ముచ్చట్లు చెప్పేది. "ఓ చిట్టి అలల్లారా, కారుమబ్బు నీలి వన్నెకాడయిన నా కృష్ణుణ్ణి మీరెవరయినా చూశారా? ఆయన మోహనమురళి మధుర మంజుల గానాన్ని ఎన్నడయినా మీరు విన్నారా?" చిట్టి అలలు నీటిమీద ఇంకా పైకి లేవడాన్ని చూసి సుధామణి, లేదని అవి సమాధానం చెబుతున్నట్టు తలచేది. 'ఓ! కృష్ణుడు కానరాక, నాలాగే ఈ చిట్టి అలలు కూడా ఎంతో ఆవేదన చెందుతున్నాయి', అనుకొంటూ కళ్ళనీళ్ళు పెట్టుకొనేది. ప్రతి చోటా చిత్రహింస పెడుతున్న తన ఎడబాటు బాధే ప్రతిఫలిస్తూ ఉండటం చిట్టితల్లికి గోచరించింది. ప్రకృతిని చూస్తూ బిగ్గరగా అరుస్తూ అర్థించేది, "అనంతాకాశంలో ఉన్న కారునీలి మబ్బుల్లారా, నా ప్రియతమ కృష్ణుణ్ణి ఎక్కడ దాచారు మీరు? ఆకాశంలో వడివడిగా పారే తెల్లకొంగల్లారా, మీరు బృందావనానికి* వెళ్తున్నారా? మీకు కృష్ణుడు కనిపిస్తే, అతనికోసం ఎప్పుడూ కన్నీళ్ళు కారుస్తూ ఉండే, దీనురాలయిన ఈ చిన్నపిల్లను గురించి కాస్త చెప్పండి!" కాస్సేపట్లో సుధామణికి బాహ్యస్పృహ పోయేది. పడవలో కదలకుండా, విగ్రహంలా కూర్చుని ఉండేది. మెల్లమెల్లగా మామూలు స్పృహ వచ్చేది. తాను పడవలో ఉన్నట్టూ అది అడ్డదిడ్డంగా తిరిగి పోయినట్టూ తెలిసేది. కాలస్థలాలతో నిమిత్తం లేకుండా కలిగే ఆధ్యాత్మిక

* శ్రీకృష్ణుడు తన బాల్యాన్ని గడిపిన స్థలం. ఈ నాటికీ అసంఖ్యాకంగా ఆయన భక్తులు అక్కడ నివసిస్తున్నారు.

తన్మయత్వ స్థితులవల్ల, సులువుగా ఆమె ప్రాణాన్ని హరించగల గొప్ప అపాయాలు ఏర్పడ్డ సందర్భాలు కూడా ఉన్నాయి. ఆమె, వాళ్ళ దొడ్డమ్మ ఇంట్లో ఉన్నప్పటి సంఘటన ఒకటి ఇలా ఉంది:

ఒకనాడు చిట్టి సుధామణి ధాన్యం ఆడించే పని పూర్తిచేసి, తన చిట్టిపడవను నడుపుకొంటూ ఇంటికి వస్తున్నది. పడవ నడిపేటప్పుడు ఆమె చుట్టూ ప్రకృతి దృశ్యాన్ని చూసి ఆనందించింది. ఆకాశంలోకి చూస్తూ క్షితిజ రేఖకు అడ్డంగా కదులుతున్న కారునీలి మబ్బులను గమనించింది. ఈ దృశ్యం ఆ అమాయిక హృదయాన్ని ఆమె ప్రియతమ నీలమేఘశ్యాముడయిన కృష్ణుడి మధుర స్మృతితో నింపేసింది. మరుక్షణంలో చిట్టితల్లికి బాహ్య స్పృహ పోయి సమాధి*లోకి వెళ్ళి పోయింది. పడవ తెడ్డు ఆమె చేతుల్లోంచి జారిపోయింది. ఆమె కళ్ళు ఆకాశంలో నిలిచాయి. పరిసరాల స్పృహ ఏ మాత్రం లేకుండా పోయింది. ఆమె ఏమాత్రం కదలిక లేకుండా కూర్చుండి పోయింది. అడపా తడపా, 'కృష్ణా, కృష్ణా' అంటూ గట్టిగా పిలుస్తుంది. ప్రపంచాన్ని పూర్తిగా మరిచిపోయింది. పడవ ఏటివాలులోకి వచ్చి అడ్డదిడ్డంగా పోవడం మొదలుపెట్టింది. ఆ సమయంలో పెద్ద ఇంజను పడవ చప్పుడు వినిపించింది. అది సుధామణి చిట్టి పడవను ఢీకొట్టే దిక్కుగా వస్తోంది! పెద్ద పడవలో ఉన్న ప్రయాణికులు గాభరాపడి అరిచారు; చిట్టితల్లికి స్పృహ తెప్పించడానికి ప్రయత్నం చేశారు. కాని ప్రయత్నం ఫలించలేదు. ఏటిగట్లమీద నిలబడ్డవాళ్ళు అరిచారు; పడవ చుట్టూ నీళ్ళలోకి కొందరు రాళ్ళు విసిరారు. సరిగా చివరి క్షణంలో, చిట్టితల్లికి కొద్దిగా బాహ్యస్పృహ వచ్చింది. ఏదో విధంగా తన పడవకు ప్రమాదం రాకుండా తప్పించింది.

ఇంకో ఏడాది గడిచింది. ఇప్పుడు సుధామణిని దమయంతి అన్నగారయిన ఆనందన్ ఇంటికి పంపారు. వాళ్ళ ఊరు కరునాగపల్లి; సముద్రానికి దూరంగా, పరయకడవుకు పది కిలోమీటర్లలో ఉంది. రోజువారీ పనులన్నింటినీ సుధామణి, మనస్సుపెట్టి ఉత్సాహంతో చేసింది. ఆనందన్, అతని భార్య చాలా సంతోషించారు. మనస్సుపెట్టి పని చేసినందుకు కానుకగా ఆనందన్ భార్య చిట్టితల్లికి చెవిపోగులు ఇచ్చింది.

బీదవాళ్ళమీదా, అవసరంలో ఉన్నవాళ్ళమీదా జాలి పడుతూండటం చిట్టితల్లి స్వభావంలో చెప్పుకోదగ్గ లక్షణాల్లో ఒకటి. ఆమె తన మామ ఇంట్లో ఉన్నా, దొడ్డమ్మ ఇంట్లో ఉన్నా, తన ఇంట్లోనే ఉన్నా అవసరంలో ఉన్నవాళ్ళను ఆదుకోడానికి ఆమెకు ఏదీ అడ్డువచ్చేది కాదు. వాళ్ళ మామ ఇంటి చుట్టూ చాలా ముస్లిం కుటుంబాలు

---

* ధ్యానం యొక్క ఉన్నత దశలలో జీవాత్మ (ధ్యానించేడివాడి ఆత్మ) పరమాత్మతో సంపూర్ణంగా ఏకమయే స్థితి.

ఉండేవి. వాళ్ళలో చాలా మంది నిరుపేదవాళ్ళు. చిట్టితల్లి కొన్నికొన్ని సరుకులు, వాళ్ళ మామ ఇంట్లోంచి సంగ్రహించి గుట్టు చప్పుడు కాకుండా వాళ్ళకి ఇచ్చి వస్తూండేది. మొదట్లో ఎవరూ గమనించ లేదు. కాని కొంత కాలానికి కని పెట్టారు. చిట్టితల్లిని ఏవగించు కోవడం మొదలుపెట్టారు. చాలా సందర్భాల్లో సుధామణి వాళ్ళ అత్తచేత దెబ్బలు తినేది. అయినా, అత్త చేసినవాటికి ఆమె ఎన్నడూ నొచ్చుకోలేదు. 'నేనెందుకు నొచ్చుకోవాలి? నేను వాళ్ళకు వేరయినదాన్నని అనుకున్నట్లయితేనే ఏవగింపు కలుగుతుంది. నేనెన్నడూ వాళ్ళను వేరుగా తలచను. నేను మా ఇంట్లో ఉన్నా కొడతారు. వీళ్ళు కూడా నన్ను అలాగే చూడటంలో కొత్త ఏముంది?' అనుకుంది.

అనేక సందర్భాల్లో తీవ్రంగా కొట్టినా కూడా, దీనులమీద జాలి చూపే విషయంలో చిట్టితల్లి నిరుత్సాహ పడలేదు. ఇతరులకు సరుకులు పంచి పెట్టే అలవాటు మానలేదు. అలాంటి సంఘటనలు, సుధామణి స్వభావంలోంచి విడదీయలేని గొప్ప ఓరిమిని, జాలిని, శాంతాన్ని కనబరుస్తాయి. ఆమె జీవితంలో ప్రతి సందర్భాన్నీ ఒక గుణపాఠంగా గ్రహించవచ్చు; ఆమెకూడా అలాగే గ్రహించింది. ఉత్తరోత్తరా ఆమె ఇచ్చిన ప్రేమసందేశం, తన జీవన మార్గంగా ఆమె ఎంచుకొన్న ఘనమైన, విశిష్టమైన త్యాగానికి కొనసాగింపే. సారభూతమయిన ఆధ్యాత్మిక నియమాలను గ్రహించడానికి, సుధామణి తీక్ష్ణబుద్ధి ప్రతి ఒక్క విషయంలోకీ సులువుగా చొచ్చుకుపోయేది. ఆమె అనుభవించవలసి వచ్చిన కష్టాలూ బాధలూ అన్నీ భగవంతుడు ఇచ్చిన అరుదయిన దీవెనలన్న సంగతి మనం తరవాత తెలుసుకొంటాం. ఈ ప్రపంచమూ దీంట్లో సంబంధాలూ అన్నీ అశాశ్వతమయినవని ఆమె తెలుసుకోడానికే భగవంతుడు వాటిని ప్రసాదించాడు. తరవాత ఆమె ఇలా చెప్పింది:

"ఈ అనుభవాలన్నిటిని బట్టి, ప్రపంచం దుఃఖ భూయిష్ఠమయినదని నేను స్పష్టంగా తెలుసుకొన్నాను. మనకు నిజమయిన సంబంధాలూ లేవు, చుట్టాలూ లేరు. ప్రతి ఒక్కరూ తమ స్వార్థపూరితమయిన అవసరాలు తీర్చుకోవడానికే మనని ప్రేమిస్తారు. మనుషులు కోరికలవల్లే ఒకరి నొకరు ప్రేమిస్తారు నిస్వార్థంగా ఎవ్వరూ ప్రేమించరు. భగవంతుడి కొక్కడికే అలాంటి నిస్వార్థమయిన ప్రేమ ఉంది".

ఈ మనుషులతో సన్నిహిత సాంగత్యం కొనసాగించినట్లయితే జీవితంలో తన పరమ లక్ష్యానికి అది పెద్ద అడ్డంకి అవుతుందని చిట్టితల్లి స్పష్టంగా గ్రహించింది. చివరికి, ఈ బానిసతనం నుంచి తనను విడుదల చేయబోయే పరిస్థితులను కొన్నిటిని ఆమె సృష్టించింది. ఒకనాడు పొద్దున, కేవలం ఒప్పందానికి గండికొట్టే ఉద్దేశంతో ఆ కుటుంబంవాళ్ళతో గట్టిగా

పోట్లాడి ఇంటినుంచి వెళ్ళిపోయింది. మొరటు మనుషులయిన ఆ చుట్టాలు, చెవిపోగులతో సహా, అంతకు ముందు ఆమెకు కానుకగా ఇచ్చిన వాటినన్నింటినీ ఊడ లాక్కున్నారు. చిట్టితల్లిని ఒట్టి చేతులతో ఇంటికి పంపేశారు. బయటికి వచ్చేసే ముందు సుధామణి ఇలా అంది, "ఒకనాడు మీరు అడుక్కుంటూ నా దగ్గరకి వచ్చే పరిస్థితి వస్తుంది. అప్పటిదాకా నేను మళ్ళీ ఈ ఇంట్లో అడుగు పెట్టను".

తరవాత పదకొండేళ్ళు గడిచాయి. మామ కుటుంబంలో ఆర్థికమయిన ఒడుదుడుకులు పీడించడం మొదలుపెట్టాయి. అప్పుడు వాళ్ళు ఇడమన్నేల్ వచ్చి సుధామణిని సహాయం చెయ్యమని బతిమాలుకున్నారు. అప్పుడే ఆమె వాళ్ళింటికి వెళ్ళి పూజ చేసి వాళ్ళకు దీవనలు ప్రసాదించింది. ఆనాడు సుధామణి అత్త, వెనకటి సంఘటనలకు పశ్చాత్తాపపడి ఇలా వాపోయింది. "అయ్యో! చిన్నది ఇంత గొప్పదవుతుందని ఎన్నడూ అనుకోలేదు. ఎంత క్రూరంగా తిట్టానో, కొట్టానో!"

పరమేశ్వరుడు, తన నిజమయిన భక్తుడు అన్నమాటను నెరవేర్చడంలో ఎప్పుడూ మెలుకువగా ఉంటాడు. దీన్ని నిరూపించే సంఘటనలను మన పురాణాల్లో కూడా చాలా చూస్తాం. భగవంతుడు నిజంగా అతని భక్తుల సేవకుడు.



# మూడో అధ్యాయం

## కృష్ణుడికోసం కన్నీళ్ళు

నీకు ఇవ్వడానికి వెన్నా పాలూ లేక నా బాధలో
పిసరంత ఇస్తున్నాను. ఓ కన్నా, నీ పాద సన్నిధిలో
నా కన్నీటి ముత్యాలు అర్పిస్తున్నాను.

- మాతా అమృతానందమయి.

శ్రీ భగవానువాచ:
మయ్యావేశ్యమనో యే మామ్ నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః.

భగవంతుడు ఇలా అన్నాడు:
నామీదే మనస్సు నిలిపి, నిలకడగా ఉండి, గొప్ప
శ్రద్ధతో నన్ను కొలిచేవాళ్లు యోగుల్లో శ్రేష్ఠులని నా
అభిప్రాయం.
నామీదే నీ మనస్సు ఉంచు. నామీదే నీ బుద్ధిని నిలుపు.
ఇక మీదట నువ్వు నాలోనే ఉంటావు. ఇందులో
సందేహం లేదు.

శ్రీ మద్భగవద్గీత
అధ్యాయం 12, శ్లోకాలు 2,8.

# ఇడమన్నేల్‌కు తిరిగి రాక

మామ ఇంటినుంచి తిరిగి వచ్చిన తరవాత, సుధామణి కొండంత ఇంటి పనుల భారం మోస్తూనే తన ఆధ్యాత్మిక సాధనల్లో పూర్తిగా మునిగి పోయింది. ఆమెకప్పుడు పదహారేళ్ళు. ఈ భారత భూమిలో సైతం, ఎంత పెద్ద ఒడుదుడుకులు ఏర్పడినప్పటికీ లెక్కచేయకుండా ఆధ్యాత్మిక తపస్సాధన చెయ్యాలని చిట్టితల్లికి ఉన్న ప్రగాఢమయిన కాంక్ష విశిష్టమయినదీ సాటిలేనిదీ.

ఆమె పని, ఎప్పటిమాదిరిగానే, పరమేశ్వర పూజతో సమానం. ఆ రోజుల్లో కనక ఎవరయినా సుధామణిని చూసి ఉన్నట్లయితే వాళ్ళు ఆశ్చర్యంతో నోళ్ళు వెళ్ళబెట్టేవారు. ఆ చిన్న శరీరం అంత పెద్ద కార్యభారాన్ని ఎలా మొయ్యగలిగింది? సుధామణి లేని రోజుల్లో ఇంటిపని తానే చేసుకొంటూ ఉండటంవల్ల, దమయంతికి దీర్ఘకాలంగా ఉన్న కీళ్ళవాతం ఇంకా ఎక్కువవుతూ వచ్చింది. దాంతో, ఆమె ఇంకా కోపిష్టిగా తయారయింది. పైగా, సుధామణి, చుట్టాల ఇళ్ళలో వస్తువులు సంగ్రహించడానికి కారణమయిన ఆమె కారుణ్య స్వభావం ఆమెకు చెడ్డపేరు తెచ్చింది. సుధామణి పట్ల దమయంతికున్న వ్యతిరేకతను ఇది రెట్టింపు చేసింది. అందువల్ల, చిట్టితల్లి తన ఇంటిపనులను సక్రమంగా చేసినప్పటికీ కూడా దమయంతి ఆమెను తిట్టేది, కొట్టేది. సొంత తల్లే తనను ఇంత క్రూరంగా హింసిస్తున్నప్పటికీ సుధామణి ఆమెమీద కోపం పెట్టుకోలేదు. నిజానికి, కొన్నేళ్ళ తరవాత, సుధామణి దమయంతిని గురించి చాలా గౌరవ భావంతో ప్రస్తావిస్తూ ఆమెను ఆధ్యాత్మిక గురువుగా పేర్కొంది. సుధామణి స్వయంగా చెప్పిన మాటలు ఇవి:

"దమయంతమ్మ, ఒక విధంగా నాకు గురువు. ఆవిడ నాకు శ్రద్ధ, భక్తి, క్రమ శిక్షణ నేర్పింది. నా పనుల నన్నిటినీ ఆవిడ పట్టిపట్టి చూసేది. ముంగింట్లో ఊడ్చిన తరవాత కాస్త చెత్త వదిలిపెట్టినా సరే నన్ను కొట్టేది". గిన్నెలన్నీ తోమిన తరవాత ఆవిడ వాటిని పరీక్షగా చూసేది. కాస్తంత మట్టిచార కనిపించినా నన్ను తిట్టేది. నేల ఊడ్చేటప్పుడు పొరపాటున ఒక్క చిన్న చీపురుపుల్ల కనిపించినా ఊరుకునేది కాదు. వంటకుండలో ఒక్క దుమ్ము కణం కాని, బూడిద కణం కాని పడినట్లయితే శిక్ష పడేది. మా అమ్మ, తన కూతుళ్ళు పొద్దునే ప్రార్థన చేసుకోవాలని ఆశించేది. అలసట వల్ల మేము లేవడం ఆలస్యమయినట్లయితే కుండెడు నీళ్ళు మా మొహాలమీద - ముఖ్యంగా నా మొహంమీద - పొయ్యడానికి వెనకాడేది కాదు. ఆవుల మేతకు నేను గడ్డి పీకుతున్నప్పుడు, కొంచం దూరంనుంచి నన్ను కనిపెడుతూ ఉండేది; ఎవరితోనయినా కబుర్లు చెబుతూ ఉన్నానేమోనని. నన్ను రోకలితో కూడా కొట్టేది. మా అమ్మ చేసే

అలాంటి పనులు చూసి ఊళ్ళోవాళ్ళు కూడా 'ఆమెనిలా బాధపెట్టకు, ఒకనాడు ఆమెకు పెళ్ళి చెయ్యవలసి ఉంటుంది అంటూండేవారు. కాని అలాటి అనుభవాలు నా మంచికే జరిగాయని అనుకొంటూ ఉండేదాన్ని".

ఆమె జీవిత చరిత్ర చదివేవాళ్ళు, దమయంతి తన సొంత కూతురి పట్ల ఎంత క్రూరంగా ప్రవర్తించేదో చదివి నివ్వెరపోతారు. ముఖ్యంగా ఆమె పవిత్రురాలని మొదట్లో వర్ణించి ఉండటంవల్ల. వాస్తవంగా, జ్ఞానం మీద ఆధారపడని భక్తిని బట్టి చూసి నట్లయితే దీన్ని సులువుగా అర్థం చేసుకోవచ్చు. దేవుళ్ళమీదా దేవతలమీదా గాఢమయిన విశ్వాసగౌరవాలున్న అనేకమంది క్రమబద్ధంగా కర్మానుష్ఠానం చేస్తూ ఉంటారు. కాని దేవుణ్ణి గురించి వాళ్ళకున్న భావన అంతకు మించి ముందుకు విస్తరించదు. దేవుడు అన్ని జీవుల్లోనూ [అందరిలోనూ అన్నింటిలోనూ] ఉన్నట్లుగా వాళ్ళు దర్శించరు; గుడిగోడలు నాలుగింటికీ పరిమితమయిపోతాడు. అటువంటి భక్తులు తమ కోరికలు నెరవేరడం కోసం కాని, దేవుణ్ణి తృప్తిపరచడానికి కాని కర్మానుష్ఠానం చేస్తూంటారు. మతాన్ని గురించి, పూజను గురించి కనబరిచే, వాళ్ళ దృక్పథానికి శీలాన్ని పెంపొందించు కోడం, తమలో ఉన్న వ్యతిరేక వైఖరులను నిర్మూలించడం వంటి వాటితో సంబంధం లేదు. ఈ భక్తులకు, తమ పరమ లక్ష్యంగా దైవాన్ని లేదా ఆత్మను సాక్షాత్కరింప జేసుకోవాలన్న కోరిక ఉండదు. వాళ్ళ తాత తండ్రులు దేవుణ్ణి పూజించారు, కనక వాళ్ళూ పూజిస్తారు; పాపభీతితో పూజిస్తారు. అయితే, భగవంతుణ్ణి అంతటా వ్యాపించి ఉన్నవాడిగా దర్శించి ఆ విధంగా ఆయన్ని సేవించే మరో రకం భక్తులు ఉన్నారు. వాళ్ళుఅన్నీ విడిచిపెడతారు; స్వామి పాదపద్మాల సన్నిధిలో సర్వాత్మనా తమను అర్పించుకొంటారు. వాళ్ళ పరమ లక్ష్యం, పరమ సత్యాన్ని [పరమాత్మను/ పరబ్రహ్మను/ పరమేశ్వరుణ్ణి] సాక్షాత్కరింపజేసుకొని దాంతో ఏకంకావడం. దమయంతి మొదటి రకం భక్తురాలు. అందువల్ల దేవుణ్ణి గురించి, ఆధ్యాత్మికతను గురించి ఆమెకు పరిమిత దృష్టి ఉండటంలో ఆశ్చర్యం లేదు. చిట్టితల్లి పట్ల ఆమె తీసుకున్న కఠిన చర్యల్లో అది ప్రతిబింబించింది.

ఒక్కొక్కప్పుడు దమయంతి ఏదో ఒక కారణంగా సుధామణిని కొట్టబోయేటప్పుడు ఆమె చేతిని చిట్టితల్లి పట్టుకునేది. చిన్నదయినప్పటికీ సుధామణి బలంగా ఉండేది. సుధామణి పట్టులోంచి తన చేతిని విడిపించుకోలేక దమయంతి ఆమెను తన్నడానికి ప్రయత్నించేది. చిట్టితల్లి తన పాత్రను సమర్థంగా నిర్వహిస్తూ దమయంతి కాలిని కూడా పట్టేసేది. దమయంతి వేసే తరువాతి ఎత్తు ఆసక్తికరమయినది. కూతురిని శిక్షించడానికి మరో

దారి కనబడక తల్లి ఆమెను కరిచేది. కొబ్బరికాయలు ఒలిచే కత్తితో సుధామణిని దమయంతి కొట్టిన సందర్భాలు కూడా ఉన్నాయి. నోరు సంభాళించుకోకుండా చిట్టితల్లిని బూతులు తిట్టేది కూడా, ఆ తల్లి.

తల్లితో వ్యవహరించే సందర్భంలో ఒక్కొక్కప్పుడు సుధామణి చాలా ధైర్యంగానూ, అవినయంగానూ ఉండేది. ఎప్పుడయినా దమయంతి,'మాట్లాడకు!' అంటే,'మాట్లాడతా' అనేది ఆమె ఎదురు సమాధానం. ఆ పని చేయకు అని దమయంతి అంటే'చేస్తా!' అని జంకులేకుండా జవాబు చెప్పేది సుధామణి. కాని ఆమె ఎదురు జవాబులు చెప్పినకొద్దీ ఆమెకు పడే శిక్షలు ఇంకా కఠినమవుతూ వచ్చాయి. దమయంతి శాపనార్థాలు పెట్టేది. ఈ పెడసర కట్టె నాశనం కాను! అంతటితో ఆగేది కాదు.'ఇది ఇల్లాగే పెరిగితే ఇంటికి చెడ్డపేరు తెస్తుంది. ఓరి దేవుడా! దీన్నింకా ఎందుకు హతమార్చడం లేదురా?'

సుధామణి మాత్రం, తన పెంపకంలో తల్లి అవలంబించిన ప్రతికూల విధానాన్ని గురించి ఏ మాత్రం దిగులు పడలేదు. చిట్టితల్లి దృష్టిలో అందరూ సమానంగానే కనబడేవారు. చిన్నప్పటినుంచి కూడా ఆమె, మగవాళ్ళలో పెద్దవాళ్ళందరినీ 'అచ్చన్' [నాన్న] అనీ, ఆడవాళ్ళలో పెద్దవాళ్ళందరినీ 'అమ్మ' అనీ పిలుస్తూండేది. బయటివాళ్ళను ఈ వింత పద్ధతిలో పిలవడం కుటుంబానికి అగౌరవంగా భావించిన తల్లిదండ్రులకు ఇంకా చిరాకెత్తేది. "ఈ చెత్త మనుషులందరినీ నీ అమ్మా నాన్నా అని పిలవడం బాగుందా?" అని కూకలేసేవారు. దానికి సుధామణి చెప్పే సమాధానమిది, "నా నిజమయిన అమ్మా నాన్నలను ఎన్నడూ చూడలేదు. అందువల్ల అందరూ నాకు అమ్మా నాన్నలే",

చిట్టితల్లిని, నుదుట విబూది పెట్టుకోనిచ్చేవారు కాదు. "ఏమే, నువ్వు సన్యాసినివవుతున్నావా?" అంటూ ఇంట్లోవాళ్ళు ఎత్తిపొడిచేవాళ్ళు. సుధామణిని అందరు ఆడపిల్లల్లాగా బట్టలు వేసుకోనిచ్చేవారు కాదు. నుదుట కుంకుమ బొట్టు పెట్టుకున్నా, గళ్ళరవిక వేసుకున్నా, శుభ్రమయిన జాకెట్టు వేసుకొన్నా వెంటనే శిక్ష పడేది. ఎత్తిపొడుస్తూ ఇలా అంటూండేవారు, "ఈ రంగుబట్టలు వేసుకొని బొట్టు పెట్టుకున్నావేం? ఎవరికి కనబరుచుకోడానికి?" అంతే కాకుండా, "ఆడపిల్లలు ఎంతో మర్యాదగా బతకాలి" అని బోధించేవారు.

సుధామణిపట్ల వాళ్ళు ఘోరమయిన అనాదరణ చూపడంకన్న ఆశ్చర్యకరమయిన విషయం ఏమిటంటే, ఎలాటి విపత్తు వచ్చినా చెక్కు చెదరని ఆమె తాలిమి. అప్పుడప్పుడు ఆమె పెంకెతనం చూపించినప్పటికీ దాని వెనక రవ్వంత ద్వేషంకూడా

కనబడేది కాదు. తరవాత ఎవరయినా అడిగినప్పుడు చిట్టితల్లి ఇలా అనేది,"దమయంతి నన్ను శిక్షించడం లేదు. ఆవిడ దృష్టి సంకుచితం కావడం వల్ల నన్ను హీనంగా చూసేది. ఆ పరీక్షలన్నీ నన్ను సరైన దారిలో నడిపించాయి. అందువల్ల ఆవిడ మీద నాకు ఏవగింపు లేదు".

పాపం, సుధామణి బాధకు ఇది చాలదన్నట్లు భగవంతుడు ఆమెకు సుభగన్ అనే అన్నను ప్రసాదించాడు. సుధామణికే కాక, ఇంట్లో వాళ్ళకూ ఊళ్ళోవాళ్ళకూ కూడా అతనంటే హడలు. అతను కరడు గట్టిన నాస్తికుడు. పైగా, ఆడవాళ్ళు ఏ మాత్రం కిక్కురుమనకుండా ఒదిగి ఉండాలని అతని అభిప్రాయం. అతని కోపదారితనం అందరికీ తెలిసినదే. సుధామణి తరచుగా అతని బారిన పడుతూండేది. సుధామణి తన ఈడు ఆడపిల్లలెవరితోనూ స్నేహం చెయ్యకూడదని అతను కట్టడి చేశాడు. స్నేహంచేస్తే ఆమె శీలం నాశనమయిపోతుందని అతని దృఢ విశ్వాసం. ఇంటికి మంచినీళ్ళు తేవడానికి సుధామణి వెళ్ళినట్లయితే ఒంటరిగానే వెళ్ళేది. తక్కిన ఆడపిల్లల నెవరినయినా ఆమె కలుసుకొన్నట్లయితే సుభగన్ చేత చావు దెబ్బలు తినవలసి రావడం ఖాయం. ఈ నియమం చిట్టితల్లికి సహజంగానే నచ్చేది కాదు. అంతకంటే, ఏ అడ్డంకీ లేకుండా దేవుణ్ణి తలుచుకొంటూ ఒంటరిగా ఉండటమే మేలని అనుకొంది.

ఆ రోజుల్లో ఊరంతకీ కలిసి, నీటి కుళాయి ఒక్కటే ఉండేది. అది గాలిమరవల్ల పనిచేసేది. కుళాయినుంచి నీళ్ళు పట్టుకోడానికి జనం పొడుగ్గా వరసకట్టి నించునేవారు. ప్రతి ఒక్కరూ తమ వంతు వచ్చేవరకు కాచుకుని ఉండాలి. ఊరి ఆడవాళ్ళు కుండలు పట్టుకొని వచ్చేవాళ్ళు. సుధామణికూడా అంతే. ఒక్కొక్కప్పుడు గాలి వీచేవరకు అక్కడ గంటల తరబడి కాచుకుని నించోవలసి వచ్చేది. వరస పొడుగ్గా ఉన్నట్లయితే సుధామణి తన కుండలను వరసలో వదిలేసి, ఆవులకోసం గడ్డి పెరుక్కొని రావడానికి వెళ్ళేది. చిట్టితల్లి కున్న భక్తినీ కష్టపడి పనిచేసే స్వభావాన్నీ ఎరిగిన తక్కిన ఆడవాళ్ళు, ఆమెకోసం కుండ నింపి పక్కకు పెట్టేవారు.

వెనక చెప్పినట్టుగా, సుధామణి, ఆవులకోసం కూరగాయల చెక్కులూ బియ్యంగంజీ తేవడానికి ఇరుగుపొరుగు ఇళ్ళకు వెళ్తూండేది. ఏమయినా ఆలస్యమున్నట్లయితే ఆమె, దేవుడి గదిలోకి వెళ్ళి కొన్ని భక్తిగీతాలు పాడటమో ధ్యానం చెయ్యడమో చేసేది. ఆ తరవాత ఇంట్లో ఉన్న ముసలమ్మలతో కాసేపు కబుర్లు చెప్పేది. ఆప్యాయంగా వాళ్ళ యోగక్షేమాలు అడిగేది. వాళ్ళ కష్టగాథలను ఓర్పుగా వినేది. ముసలితనం వల్లా శరీరపటుత్వం లేకపోవడం వల్లా సొంత పిల్లలే వాళ్ళను అనాదరణ చెయ్యడం,

ఉపేక్షించడం జరుగుతున్నట్టు తెలిసేది. ఈ విధంగా సుధామణి చిన్నవయస్సులోనే మానవ సంబంధాల అశాశ్వతత్వాన్నీ స్వార్థాన్నీ కళ్ళారా చూసింది. వీలయినప్పుడల్లా చిట్టితల్లి ఈ ముసలమ్మలను తనతో ఇంటికి తీసుకువెళ్ళి బాగా వేణ్ణీళ్ళ స్నానంచేయించి సుష్టుగా భోజనం పెట్టి తన ఇంట్లోవాళ్ళ దుస్తులు కట్టేది.

ఎవరయినా వస్తున్నారని తెలిసినట్లయితే చిట్టితల్లి, కనీసం తమ ఇంట్లో ఉన్న ముడి ఆహార పదార్థాలయినా వాళ్ళకు ఇచ్చేది. ఒక్కొక్కప్పుడు, చుట్టుపక్కల తిరుగుతున్న చిన్నపిల్లలను ఇంటికి తీసుకువస్తూ ఉండేది. వాళ్ళ తల్లిదండ్రులే వాళ్ళను సరిగా చూసుకొనేవారు కారు; పోషణ చేసేవారు కారు. ఇది చూసి సుధామణి, వాళ్ళ విషయంలో జాగ్రత్త తీసుకుని ఇంటికి పంపించేది.

ఒకనాడు సుధామణి ఒక బీదవాడికోసం కొన్ని ఆహార పదార్థాలు తీసుకొంటూ ఉండగా పట్టుబడింది. చితక బాదినప్పటికీ, జాలిపడి చేసేపనులు ఆమె మానలేదు. సహాయం అవసరమని తెలిసినప్పుడల్లా ఆమె, తల్లిదండ్రుల కంటబడకుండా అదే విధంగా సహాయం చేస్తూ వచ్చింది. మరో సందర్భంలో, ఒక కుటుంబం తిండి లేక మలమలమాడుతున్న సంగతి తెలిసింది సుధామణికి. ఇంకేమీ కనిపించక, తన తల్లి బంగారు గాజు తెచ్చి వాళ్ళకు ఇచ్చింది; దాన్ని అమ్మి తిండికి కావలసిన పదార్థాలు కొనుక్కోమని చెప్పింది. ఈ సంగతి వాళ్ళ నాన్నకు తెలిసినప్పుడు ఆయన కోపం పట్టలేక ఆమెనొక చెట్టుబోదెకు కట్టేసి నెత్తురు కారేవరకు కొట్టాడు. ఇంత చేసినప్పటికీ చిట్టితల్లి ధైర్యంగానే ఉంది; క్షమిస్తూనే ఉంది. చెప్పుడు మాటలు విన్న తన బంధువులు అజ్ఞానంవల్ల చేసిన ఘోరమయిన పనులకు క్షమించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఉండటం సన్నగా వినవచ్చింది.

సుధామణి ఒంటరిగా కూర్చున్నప్పుడు ఇలా తలపోత పోసేది.'ఓ కృష్ణా! ఏం లోకమిది? కన్నతల్లే పిల్లమీద దయమాలి ఉంది. తన ఇంట్లోవాళ్ళమీదే తనకు స్వచ్ఛమయిన ప్రేమ లేదు. ఈ లోకంలో స్వార్థం లేని స్వచ్ఛమయిన ప్రేమ నాకు ఎక్కడ కనిపిస్తుంది? నేను చూసేది నిజంగా శుద్ధమయిన ప్రేమేనా? ఇదికేవలం మాయ కాదా? ఒక్కొక్కప్పుడు ఇంట్లో దేవుడి గదిలో కూర్చుని, ఇదంతా తలుచుకొంటూ కన్నీళ్ళు పెట్టుకొంటూ బిగ్గరగా అరిచేది,"కృష్ణా! కృష్ణా! ఈ లోకంలో నాకు నువ్వు తప్ప మరెవరూ లేరు. నా మనస్సు ఎప్పుడూ నీ కోసమే ఉరకలు వేస్తోంది; నీ దివ్యరూపంలో నిన్ను దర్శించాలని ఉవ్విళ్ళూరుతోంది. నన్ను నీతో తీసుకుపోవా? ఓ కృష్ణా, ఉరుక్కుంటూ రా!"

ఈ కాలంలో వాళ్ళ కుటుంబానికి దూరపు బంధువు ఒక ముసలాయన

ఇడమన్నేల్‌లో ఉండటానికి వచ్చాడు. ఆయనకిప్పుడు కుటుంబమూ లేదు, పిల్లలూ లేరు. ఆరోగ్యం క్షీణించింది. నడవడానికి కూడా శక్యం కాకుండా ఉండేది. పూర్తిగా మంచం పట్టి ఉండటంవల్ల కాలకృత్యాలు కూడా మంచంమీదే జరిగేవి. సుధామణి తన నెవ్వరూ అడక్కపోయినా, వెంటనే ఆ ముసలాయనకు ఉపచారాలు చెయ్యడం మొదలుపెట్టింది; సేవాబాధ్యత మొత్తం తాను తీసుకొంది. ఇంట్లో తక్కినవాళ్ళు, పని చెయ్యడం మాట దేవుడెరుగు, ఆ ముసలాయన వైపు చూడటమే అరుదు. ఈ విధంగా, తనకున్న ఇంటిపనులతోబాటు చిట్టితల్లి, ఆయన అవసరాలను కూడా మనస్ఫూర్తిగా, ఓరిమితో చూస్తూ ఉండేది. ఆయన బట్టలు ఉతికేది; ప్రతి రోజూ ఆయనకు వేణ్ణీళ్ళ స్నానం చేయించేది; ఆయన మలమూత్రాలు ఎత్తివేసేది; సరైన సమయానికి మందులు ఇచ్చేది. సుధామణి, అసాధారణంగా సమృద్ధమయిన ఉత్తమ గుణాలను కనబరిచినప్పటికీ కుటుంబంలో వాళ్ళు ఎవ్వరూ ఏమీ గమనించలేదు; జీవితాన్ని గురించి ఆమెకున్న సర్వాంగీణమయిన వైఖరిని అర్థం చేసుకోడమూ తక్కువే, హర్షించడమూ తక్కువే. ఆమె ఏది చేసినా, అన్నీ చేసినా ఒక తట్టు వరస తిట్లు తప్పకపోవడం దైవ వైపరీత్యం.

పని చేసుకొంటూ ఉన్నప్పుడు తానే కృష్ణుడిగా, రాధగా, గోపికలుగా కృష్ణుడి జీవితానికి సంబంధించిన మరెవరిగానయినా నటిస్తూ కృష్ణుణ్ణి తలుచుకొంటూ ఉండటం ఒక అలవాటుగా చేసుకొంది ఆమె. ఒక్కొక్కప్పుడు వంట చేస్తూ ఉండగా ఆమె హృదయం కృష్ణుడి తల్లి అయిన - పెరుగు చిలుకుతూ చంటి కృష్ణుడికి పాలిచ్చే - యశోద రూపంతో నిండి పోయేది. సుధామణి తమ్ముళ్ళనూ చెల్లెళ్ళనూ బడికి పంపడానికి వాళ్ళను సిద్ధం చేసే సమయంలో, ఆవులను మేపడానికి వెళ్ళే ముందు కృష్ణ బలరాములకూ గోపబాలకులకూ తాను ముస్తాబు చేస్తున్నట్లే ఊహించుకొనేది. ఇదంతా తాను అంతశ్చక్షువుతో దర్శించి ఆనంద భాష్పాలు రాలుస్తూ ఉండేది. ఇంటికి కావలసిన సరుకులు కొనడానికి బజారుకు వెళ్ళినప్పుడు, బృందావన వీథుల్లో పాలూ వెన్నా అమ్ముతూ తిరిగే గోపికలను తలుచుకొంటూ ఉండేది. "పాలు వెన్న" అంటూ అరిచే బదులు వారు "కృష్ణ, మాధవ, గోవింద, అచ్యుత....!" అంటూ అరిచేవారు. వారి భక్తి అంత గాఢమయినది!

శ్రీకృష్ణుడిమీద గోపికలకున్న విశుద్ధ ప్రేమ, భక్తి సుధామణికి ఎప్పుడూ గొప్పస్ఫూర్తిని ఇస్తూ ఉంటాయి. అప్పుడప్పుడు ఆమె, తనను శ్రీకృష్ణుడికి ప్రియతమురాలయిన రాధగా ఊహించుకొంటూ ఉండేది. రాధ తలపుకు వస్తే చాలు, ఆమె మనస్సును హరించేసేది. ఆమెకు బయటి ప్రపంచ స్పృహ పోయేది. ఆమె పూర్తిగా దైవ భావనలో లీనమయి

ఆనంద పారవశ్యంతో పాడేది, ఆడేది, కన్నీళ్ళు విడిచేది.

ఓ నల్లనయ్యా,
నా కళ్ళు మంటలెత్తుతున్నాయి, నీ పాదాలకోసం చూసి చూసి,
ఓ తామరస నేత్రా, పరుగెత్తుకొని రా,
నీ ఆవులతో, పిల్లనగోవి పాటతో !
ఎన్నినాళ్ళుగా పిలుస్తున్నాను నిన్ను?
జాలి లేదా కాస్తయినా నీకు?
ఏమిటి నేను చేసిన మహాపరాధం?
నువ్వు భక్తజనప్రియుడివి కావా మరి?
ఏకైక వాస్తవమయిన నిన్ను
చూడకుండా బతకలేక
నీ వేణువుతో నువ్వు రావాలని
ఏడ్చి ఏడ్చి నేను కింద పడిపోక ముందే రా , రా....
కారణపురుషా, కామితదాయకా,
కాయాంబువర్ణా రా, రా....
కాలహరణం చెయ్యకుండా, నా దుఃఖాన్ని పెంచకుండా రా, రా!
కారుణ్యామూర్తీ, నువ్వు రా, రా!

నీళ్ళు తేవడానికి వెళ్ళేటప్పుడు సుధామణి, కుండలెత్తుకొని నీళ్ళకోసం యమునానదికి వెళ్ళే గోపికలను తలుచుకొంటూ ఉండేది. ఇంట్లోవాళ్ళ బట్టలు ఉతుకుతున్నప్పుడు ఆమె కృష్ణుడివీ, గోపికలవీ పట్టు బట్టలు ఉతుకుతున్నట్లే భావించు కొని భక్తిగీతాలు పాడుతూ ఉండేది. బట్టలు ఆరవేసిన తరవాత గాలికి అవి అల్లాడుతూ ఉంటే సుధామణి, "ఓ కృష్ణుడి పట్టు పీతాంబరాలు గాలికి ఎంత అందంగా ఆడుతున్నాయో చూడు!" అనుకొనేది. ఆవులకోసం గడ్డి పెరుక్కొని వస్తున్నప్పుడూ వాటిని మేపుతున్నప్పుడూ ఆమె కృష్ణుణ్ణి గాఢంగా తలుచుకొనేది. కృష్ణుడు బృందావనంలోని గడ్డిమైదానాల్లోనూ, అడవుల్లోనూ గోపాలకుడిగా రోజూ ఆవుల్ని మేపుతూ ఉండేవాడు కదా! సుధామణి, ఆ దివ్యగోపాల బాలకుడు గోపికలతో చూపిన లీలలను తలుచుకొని మురిసిపోతూ ఉండేది.

సుధామణికి ఇష్టమయిన సమయం పొద్దుగుంకుల వేళ. పగటిపూట మేతకు పోయిన బాతులు, మేకలు, ఆవులవంటి పెంపుడు జంతువులను వెతకడానికి ఉప్పుటేట్లో కి దిగి నీళ్ళలో నడుస్తూ ఉండేది. ఇలా వెళ్తున్నప్పుడు ఆమెకు కృష్ణుడు గుర్తుకు వస్తూ

ఉండేవాడు. ఆయనకూడా మందలోంచి తప్పుకు పోయిన ఆవులనూ దూడలనూ వెతకడానికి వెళ్తూ ఉండేవాడు. సంజవేళ - భారతదేశంలో చాలా సామాన్యమయిన విధంగా - ఏదయినా భక్తిగీతం చెవిని పడినట్లయితే ఆమె, నిశ్చలంగా నించుని మరో లోకానికి వెళ్ళిపోయేది. ఇలాటి సందర్భాలు అరుదయినవి కావు. ఇంట్లో వారొకరు చిరాకు పడి చిట్టితల్లిని వెతకడానికి బయటికి వెళ్ళేవారు.

సుధామణి ఎప్పుడూ ఏదో పనిలో ఉన్నట్టు కనిపిస్తూ ఉన్నప్పటికీ ఆమె మనస్సెప్పుడూ పనిమీద ఉండేది కాదు. కృష్ణుణ్ణి చూడాలన్న కోరికతో నిండిపోయి ఉండేది. ఆమె మనస్సు ఆయన్నే ఎప్పుడూ వెంబడిస్తూ ఉండేది. ఆయన పవిత్ర నామాలెప్పుడూ ఆమె పెదవులమీద ఆడుతూ ఉండేవి.'కృష్ణ' అనే ఒక్కమాటే ఆమె కళ్ళు చెమర్చేటట్లు చేసేది. చిట్టితల్లి ఎప్పుడూ నీళ్ళు తెస్తూ ఉండటమో, ఇంట్లోవాళ్ళ బట్టలు ఉతుకుతూ ఉండటమో, ఉప్పుటేటి నీట్లో నడుస్తూ ఉండటమో చేసేది కాబట్టి ఇరవై నాలుగు గంటలూ ఆమె వొంటిమీద బట్టలు తడిగానే ఉండేవి. ఆమె మాటల్లోనే చెప్పాలంటే "నా బట్టలు పొడిగా వుంచుకోవాలని ఎంతో ప్రయత్నం చేసేదాన్ని! నాకు పని చాలా ఉన్నప్పటికీ ఇంకా అప్పగించమని నేను దేవుణ్ణి ప్రార్థించేదాన్ని; నా పనులన్నిటినీ ఆయనకు అర్పించే పనిలో నేను ఎప్పుడూ మునిగి వుండాలని. వంటకు మంచినీళ్ళూ, ఆవిర్లు కక్కుతున్న గంజికుండలూ నెత్తిమీద పెట్టుకొని తెస్తున్నప్పుడు, కుండల బరువుకూ వేడికీ, నెత్తిమీద ఆ భాగంలో జుట్టు రాలిపోయింది.

సుధామణి చేస్తున్న పని ఏదయినప్పటికీ ఆమె పెదవులు కదులుతూ ఉండటం కనిపించేది. ఎడతెరిపి లేకుండా భగవన్నామ జపం చేస్తూండటంవల్ల ఇలా కదులుతున్నాయన్న సంగతి ఎవ్వరూ తెలుసుకోలేదు. సుధామణిని తిట్టడం విషయంలో, ఇంట్లో పెద్దవాళ్ళ అలవాటును పుణికి పుచ్చుకున్న ఆమె తమ్ముడు సతీశ్, ఒకనాడు కరుకుగా 'ఎప్పుడూ పెదవులు ఆడిస్తూ ఉండటం పిచ్చికి లక్షణం' అని ఎత్తిపొడిచాడు. సతీశ్ ఎత్తిపొడుపు సుధామణి చెవినపడింది; కాని ఆమె చలించలేదు. అయినప్పటికీ సతీశ్‌కు తీవ్రంగా ఉబ్బసం వచ్చినప్పుడు సుధామణి అతన్ని ఎత్తుకొని ఆస్పత్రికి తీసుకు వెళ్ళింది. ఇంట్లో ఉన్న మిగిలిన వాళ్ళలో ఎవరయినా ఇంతకంటే సులువుగా ఎత్తుకొని వెళ్ళగలిగేవాళ్ళు. నిస్వార్థంగా సేవచేసి ఇతరులకు సాయం చేసే అవకాశంకోసం ఎప్పుడూ ఎదురుచూస్తూండే అమాయకురాలు తప్ప మరెవ్వరూ అతని ఉబ్బసరోగాన్ని పట్టించుకోలేదు. సుధామణి ఇంటి పనులు పూర్తిచేసుకొనేటప్పటికి చాలా రాత్రి అయ్యేది. ఆమె ఇంట్లో కాని, ఇరుగుపొరుగు ఇళ్ళలో కాని ఒక్క దీపంకూడా వెలుగుతూ ఉండేది కాదు. ఇంత రాత్రి వేళ కూడా సుధామణి, ఇంట్లో దేవుడి గదిలో భగవంతుడిమీద గట్టిగా

పాటలు పాడుతూ ఉండేది. చీకట్లో పాటలు పాడుతున్నందుకూ నిద్ర చెడకొడుతున్నందుకు దమయంతీ, సుభగన్ కసురుకొనేవారు. "ఇలా అరిచి బొబ్బలుపెట్టడం ఎందుకు? ఆకాశంలో ఉన్న దేవుడికి వినిపించాలనా? నీ దేవుడికి చెవుడా?" అంటూ వ్యాఖ్యానించే వాడు సుభగన్. దండన, తిట్లు ఎన్ని పడవలసి వచ్చినప్పటికీ సుధామణి, రాత్రి నిశ్శబ్దంగా ఉండే వేళ దైవ సంకీర్తనం మానలేదు. మరోనాటి రాత్రి సుభగన్ కోపంగా దేవుడి గదిలోకి వచ్చి, చీకట్లో పాడుతున్నందుకు ఆమెను విమర్శించాడు. చిట్టితల్లి సమాధానం చటుక్కున వచ్చింది, "నువ్వు బయటి దీపాన్నే చూస్తావు. కాని నాలో, ఎన్నటికీ ఆరని దీపం వెలుగుతూ ఉంటుంది" ఆమె వాక్యానికున్న అంతరార్థం, బండబారిన సుభగన్‌కు తెలియలేదని వేరే చెప్పనక్కరలేదు.

తను భక్తిగీతాలు పాడుతున్నప్పుడు కొట్టినందుకు తన తల్లినీ, తండ్రినీ అన్ననూ దేవుడు శిక్షిస్తాడేమోనని సుధామణికి భయంగా ఉండేది. అంచేత, వాళ్ళు అలాటి చెడ్డపనులు చేసే అవకాశం కలక్కుండా ఉండటానికి, మెల్లగా పాడుకోవడం మొదలుపెట్టింది. తన ఇంట్లోవాళ్ళు పెట్టే అడ్డంకులకు చాలా బాధపడి సుధామణి, దేవుడి గదిలో కూర్చున్న సమయంలో ఏడుస్తూ ఉండేది. తరవాత మరో అభ్యంతరం వచ్చింది. భక్తిగీతాలు పాడుతున్నప్పుడు ఏడవడం పాపమనీ దీనివల్ల వాళ్ళకు గొప్ప ఆపద వస్తుందనీ నొక్కిచెప్పారు. వాళ్ళు తప్పుపట్టడానికి, చిట్టితల్లి ఏం చేసినా ఒకటే. పాపం, చిట్టి సుధామణి! అన్నిటినీ మౌనంగా ఓర్చుకొంది; తన కష్టాలన్నింటినీ శ్రీకృష్ణుడి మధురస్మృతిలో కరిగించేసింది.

చిన్నప్పటినుంచి కూడా సుధామణి, తన బాధలను మానవమాత్రులెవరికీ చెప్పేది కాదు. తన బాధల బరువును దించుకొనేది ఒక్క కృష్ణభగవానుడి సన్నిధిలోనే. [ఇంకో విషయం] జంతువులతోటి, ప్రకృతితోటి కూడా మాట్లాడే అలవాటు సుధామణికి ఉంది. తను పలికే ప్రతీ మాటా కృష్ణుడు వింటున్నాడని ఆమె ఊహిస్తుంది. ప్రతిదాన్నీ కృష్ణుడి గానే దర్శించి సంభాషిస్తూ ఉండేది. చిట్టితల్లికి సంబంధించినంత వరకు, ఆవులే, ఆమె మాటలను శ్రద్ధగా వింటున్న కృష్ణుడు. ఏ ఆవయినా విశ్రాంతిగా పడుకొని ఉన్నట్లయితే చిట్టితల్లి దాని ఒంటిమీదికి వాలి, తను కృష్ణుడి ఒళ్ళో పడుకొన్నట్లు తృప్తిపడేది.

చుక్కలను, నెలవంకను, పూస్తున్న మొక్కలను చూసి సుధామణి, ఇలా అడుగుతూండేది, "స్నేహితుల్లారా, నా కృష్ణుణ్ణి చూశారా? ఓ పిల్లగాలీ, అతని మోహన రూపాన్ని ఎప్పుడయినా లాలించావా? మిలమిల మెరిసే ఓ చుక్కల్లారా, మౌనముద్రలో ఉన్న చందమామా, మీరుకూడా అతని కోసమే వెతుకుతున్నారా? అతను కనిపిస్తే, ఈ

వెర్రి సుధామణి అతని కోసం కాచుకుని ఉందని చెప్పండేం?"

చూశారా మీరెవరయినా నా కన్నయ్యని?
మీరు చూడగలరు. కాని నా కంటిముందే కనిపించడు.
నుదుట గోపీచందన రేఖ పట్టు పీతాంబరాల సొగసు
అల్లల్లాడే ముంగురులతో నెత్తిన నెమలి ఈక....
ఓ, ఎప్పుడు చూస్తాను ఇదంతా నేను?
దేనికి నాకు ఈ దేహమూ, ఈ బతుకూ?
అంతమయిపోయింది నా సౌభాగ్యమంతా...
ఎంత కాలముంటాయి ఇంకా ఈ కష్టాలు?

సుధామణికి ఉత్తమ స్నేహమయుల్లో 'కడలి తల్లి' కూడా ఒకటి. సముద్రాన్ని ఆమె తన సొంత తల్లిగా భావించేది. అవకాశం చిక్కిందంటే చిట్టితల్లి సముద్రంవైపుకు జారుకొనేది; విశాల జలరాశిని వీక్షిస్తూ తన గోడు వెళ్ళబెట్టుకొనేది. ముదురు నీలపు వన్నె ఆమెకు తన ప్రియతముణ్ణి గుర్తుకుతెచ్చేది; కాసేపట్లో ఆమెకు బాహ్యస్పృహ పోయేది.

ఇది ఇలా ఉండగా, చుట్టుపక్కలవాళ్ళు కొందరు కుట్టుపని చేసి పొట్టపోషించుకుంటూ ఉండటం సుధామణి గమనించింది. కుట్టుపని చేస్తే వచ్చే డబ్బుతో ఇతరులకు సహాయం చెయ్యవచ్చునన్న అభిప్రాయం కలిగింది ఆమెకు. అందువల్ల కుట్టుపని నేర్చుకోవాలని ఆశపడింది. ఈ విధంగా, ఇతరులకు సహాయం చెయ్యడానికి ఇంట్లోనుంచి వస్తువులు తీసుకొని వెళ్ళవలసిన అసంతుష్టి లేకుండా చేసుకోవచ్చు. ఎంతో ఆశతో, తన కోరికను తల్లి దండ్రులకు తెలిపింది. దమయంతి సమాధానం ఎంతో నిరుత్సాహపరిచింది. "నిన్నెవరూ కుట్టుపని నేర్చుకోడానికి పంపబోవడంలేదు. కొబ్బరిచెట్లు ఎక్కేవాడికిచ్చి త్వరలో పెళ్ళి చేస్తారు!" కేరళలో, కొబ్బరిచెట్లు ఎక్కేవాళ్ళు కింది తరగతి వాళ్ళు. జనంకోసం కొబ్బరిచెట్లు ఎక్కి కాయలు కోసిపెడితే వచ్చే డబ్బే వాళ్ళు బతకడానికి వచ్చే రాబడి. సుధామణి కొబ్బరికాయలు దొంగిలిస్తూ తరచుగా పట్టుపడేది. అవి తను తినడానికేమోనని దమయంతి అనుకొనేది. కాని, నిజానికి వాటినెప్పుడూ అవసరంలో ఉన్న ఊళ్ళో వాళ్ళకు ఇచ్చేది సుధామణి. దమయంతి, కోపంలో ఈ విషయమే ప్రస్తావించింది.

చివరికి, సుధామణి తన పట్టు విడవకపోవడంతో ఆమె తల్లిదండ్రులు, ఒక్క షరతుమీద, రోజూకొక గంట కుట్టుపని నేర్చుకోడానికి ఒప్పుకొన్నారు. కుట్టుపని నేర్చుకోడానికి వెళ్ళేలోగా ఇంటిపనులన్నీ పూర్తిచేసెయ్యాలి. ఆ రోజుల్లో చిట్టి సుధామణి

రోజువారీ పనుల వరస ఎవరయినా చూసినట్లయితే దిమ్మెరపోయేవాళ్ళు. మధ్యాహ్నంలోగా కావలసిన పనులన్నీ ఎలాగో పూర్తి చేసుకొని కుట్టుక్లాసుకు పరుగెత్తేది. కొన్ని రోజుల్లో సుధామణి బాధలు తెలిసిన - కుట్టుక్లాసు సహాధ్యాయినులయిన పిల్లలు - సుధామణి పనులు పూర్తి చేసుకోడానికి వీలుగా వచ్చి సహాయపడేవాళ్ళు. కుట్టుక్లాసు జరిగేచోటికి మలమల మాడ్చే నట్టెండలో రెండు మూడు కిలోమీటర్లు నడుచుకొంటూ వెళ్ళేది సుధామణి. గంట కాగానే, మధ్యాహ్న భోజనాల వడ్డన సమయానికి ఉరుకులు పరుగులమీద ఇంటికి వచ్చేది.

మిగిలిన రోజంతా నడుములు విరిగే పనితో సరిపోయేది. ప్రార్థన, ధ్యానం అనే అతి ముఖ్యమైన పనులకు ఆమెకు వ్యవధి దొరికే క్షణాలు రాత్రి నిశ్శబ్ద వేళల్లోనే. ఏడ్చి ఏడ్చి చిట్టితల్లి, దైవోన్మత్తస్థితిలో లీనమయిపోయేది. స్పృహ వచ్చీ రాని సమయంలో నిద్రలోకి జారిపోయేది.

చిట్టితల్లికి ఈనాటి వరకు కూడా ఉన్న నిదానం, తాలిమి, అంతు లేనట్లనిపించే సత్తువ లోకాతీతమయిన అద్భుతాలు. ఎంత భారీ ఎత్తున పని నెత్తిన పెట్టినా సణుక్కోకుండా సంతోషంగా చేసేది. కావాలని ఎవరూ అడక్కపోయినా, ప్రతి ఒక్కరికీ సహాయంచేయడం తన జన్మహక్కుగా, ధర్మంగా భావించేది సుధామణి. తరవాత ఆమె ఇలా వివరించింది, "ఇతరుల సంతోషాన్ని చూడటంలోనే నాకు ఆనందం ఉంది. నా సౌఖ్యాన్ని గురించీ పని భారాన్ని గురించీ ఎన్నడూ ఆలోచించలేదు. ఇతరులకు సేవ చెయ్యడానికీ సహాయం చెయ్యడానికీ నాకు అవకాశం కలిగినప్పుడల్లా అత్యంత చిత్తశుద్ధితో, ప్రేమతో శక్తివంచన లేకుండా చెయ్యడానికి ప్రయత్నించాను."

మొదట్లో, సుధామణి, కుట్టుపని రెండు వేరువేరు చోట్ల నేర్చుకొనేది. కొంతకాలం తరవాత, దగ్గరలో ఒక క్రైస్తవ మందిరం కాన్వెంటులో నడిచే తరగతులకు హాజరయేది. కుట్టుపనికి సంబంధించిన యంత్ర పరిజ్ఞానం త్వరలోనే తెలుసుకొని, ఇరుగుపొరుగు పేదస్త్రీలకు కావలసిన కుట్టుపనులు చేసిపెట్టడం మొదలుపెట్టింది. మొదట, తను చేసిన సేవలకు డబ్బు తీసుకోడానికి ఆమె ఒప్పుకోలేదు. అది ఆమె పద్ధతి కాకపోవడమే దానికి కారణం. కాని, కుట్టుక్లాసుల కోర్సుకు ఫీజులు కట్టడానికి వాళ్ళమ్మా నాన్నా ఒప్పుకోనందువల్ల ఆమె కుట్టుకూలి తీసుకోక తప్పిందికాదు. ఈ విధంగా క్లాసు ఫీజు చెల్లించి మిగిలిన డబ్బులు పేదవాళ్ళ సహాయానికి వాడేది. కుట్టు పనులకు ముఖ్యంగా కావలసిన కొన్ని వస్తువులను కూడా ఆమె కొనుక్కోగలిగింది. కుట్టుపనిలో సుధామణి మంచి నేర్పరి అయింది; కుట్టుకూలి బాగా సంపాదించింది. తన సంపాదనలో ఒక్క

పైసా కూడా ఇంట్లో ఇవ్వకుండా పేదవాళ్ళకు సహాయం చేసేది.

క్రైస్తవ మందిరం కార్ఖానాలో పనిచేసేటప్పుడు సుధామణి భక్తిగీతాలు పాడుతూండేది. భక్తిభావంలో మునిగిపోయి ఆమె కార్చిన కన్నీళ్ళు కుట్టుమిషను మీద పడేవి. ఆ చర్చి పూజారి పెద్దవాడు, పవిత్రశీలి. సుధామణి విశిష్ట ప్రవర్తనను ఆయన త్వరలోనే గమనించాడు. తక్కిన ఆడపిల్లలందరూ ముచ్చట్లు చెప్పుకొంటూ ఉండగా సుధామణి భక్తిసంకీర్తనంలో లీనమయిపోయేది. ఇది చూసి పూజారి గుండె కరిగింది. సుధామణి ఆయనకు ఇష్టురాలయింది. తక్కిన పిల్లల మనస్సుల్లో అసూయ రేకెత్తింది. అయినా చిట్టితల్లి వాళ్ళను, ఏమాత్రం ద్వేషం లేకుండా, వెనకటిలాగ ఆప్యాయంగానే చూసేది.

సుధామణి క్లాసుకు వెళ్ళేటప్పుడు సతీశ్ ఆమె వెంటవచ్చేవాడు. చర్చి చుట్టుపక్కలే ఉండేవాడు; లేదా ఒక మూల కూర్చునేవాడు. ఒకనాడు ప్రార్థన సమయంలో సుధామణి ఇలా అడిగింది, "నువ్వు ప్రార్థనలో ఎందుకు కలవవు?" దానికి అతను చెప్పిన సమాధానం, "మనం హిందువులం కామా?" అని. అప్పుడు సుధామణి ఇలా చెప్పింది, "నువ్వుకూడా ప్రార్థనలో కలవవచ్చునేమో పూజారిని అడుగు." పూజారి సంతోషంగా ఒప్పుకొన్నాడు. అప్పటినుంచి సతీశ్ ప్రతి రోజూ ప్రార్థన కార్యక్రమంలో పాల్గొనేవాడు.

కుట్టుపని అయిపోయిన తరవాత సుధామణి, అల్లిక పని చేసుకోడానికి చర్చి గోరీల దొడ్డిలోకి వెళ్ళేది. అక్కడి ఏకాంతం ఆమెకు నచ్చింది. గోరీల దొడ్డిలో కూర్చుని ఆమె ప్రేతాత్మలతో మాట్లాడుతూ ఉండేది."ఎలా ఉంది మీ జీవితం? మీరు ఎక్కడుంటున్నారు? అక్కడ హాయిగా ఉన్నారా? మీకు ఎలా అనిపిస్తోంది?" తను వాళ్ళ దగ్గర ఉన్నట్టుగానే అనుభూతి పొందేది; వాళ్ళను ఓదార్చేది. సుధామణి అక్క కస్తూరికి ఒక స్నేహితురాలు ఉండేది. ఆమె చనిపోయినప్పుడు ఈ గోరీల దొడ్డిలోనే పూడ్చిపెట్టారు. ఈ అమ్మాయి సుధామణిని ఎంతో ప్రేమించేది, చిట్టితల్లిని ఇంట్లో వాళ్ళు ఎంత ఘోరంగా తిడుతున్నప్పటికీ. సుధామణి గోరీల దొడ్డిలోకి రావడానికి బహుశా ఇది మరొక కారణం కావచ్చు. ప్రేతాత్మల దైన్యం కనిపెట్టి ఆమె కన్నీరు కార్చేది. సూక్ష్మ శరీరాల్లో సంచారంచేసే ఆత్మలతో ఆమె మాట్లాడేది. వాళ్ళ శాంతికోసం గుండెలవిసే స్వరంతో పాటలు పాడేది. ఒక్కొక్కప్పుడు సుధామణి ధ్యానంచేస్తూ కూర్చునేది; క్రైస్తవుల గోరీల దొడ్డిలో ఉన్న ప్రశాంతతననుభవిస్తూ కూర్చుని ఉన్నప్పుడు ఆమె సమాధి స్థితి పొందేది.

అల్లిక పని పూర్తి అయిన తరవాత ఇంకా తీరిక ఉన్నట్లయితే క్రైస్తవ

మందిరంలోకి వెళ్ళేది. ఆ మందిరంలో, లోపలి గది ఒకటి - గుహలాగ ఉండేది. ఆ మందకాంతిలో ఆమె, శిలువవేసి ఉన్న ఏసు క్రీస్తు రూపాన్ని చూస్తూ ఉండేది. శిలువమీద క్రీస్తును చూసి ఆయన తన ప్రియతమ కృష్ణుడు అనే భావించేది. వెంటనే ఆమె మైమరిచిపోయేది. మామూలు స్పృహలోకి వస్తూ ఆమె, ఏసుక్రీస్తు కృష్ణుల ప్రేమనూ, త్యాగాన్నీ తలుచుకొంటూ కన్నీరు కార్చేది. 'ప్రపంచంకోసం వారు అన్నీ త్యాగం చేశారు. జనం వారికి ఎదురు తిరిగారు. అయినా వారు జనాన్ని ప్రేమించారు. వారు చేసినప్పుడు అది నేను మాత్రం ఎందుకు చెయ్యలేను? అందులో కొత్త ఏమీ లేదు' అనుకొనేది.

ఊళ్ళోవాళ్ళ నిరుపేదరికం సుధామణికి సుస్పష్టంగా తెలుసు. వాళ్ళ దుఃఖాలూ బాధలూ చూసి ఆమె, దేవుడి గదిలో నిశ్శబ్దవేళల్లో ఏడుస్తూ ఉండేది. "దేవుడా, ఇది బతుకా? ఆకలి తీర్చుకోడానికి కేవలం కాస్తంత అన్నం కోసం జనం, రాత్రనకా, పగలనకా కష్టపడి పని చేస్తున్నారు. ఓ కృష్ణా, వాళ్ళు పస్తులుంటూంటే ఎలా ఊరుకుంటున్నావు,? వాళ్ళకు జబ్బులెందుకు రావాలి? నేను ఎటు తిరిగినా స్వార్థం, దానివల్ల జనాల బాధలూ కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. యువతీ యువకులు దీర్ఘాయుర్దాయం కోసం ప్రార్థిస్తున్నారు; పిల్లలు తమ ముసలి తల్లీ తండ్రీ త్వరగా చచ్చిపోవాలని ప్రార్థిస్తున్నారు. ముసలివాళ్ళను సంరక్షించాలన్న ఆసక్తి ఎవ్వరికీ లేదు. ఓ ప్రభూ, ఏం ప్రపంచమిది? ఇలాటి ప్రపంచాన్ని సృష్టించి ప్రయోజనమేమిటి?. ఓ కృష్ణా, దీనికంతకీ పరిష్కారం ఏమిటి?" ఆ అమాయకపు పిల్ల ప్రార్థనలు ఇలా వుండేవి.

ఈ విధంగా మూడేళ్ళు గడిచిన తరవాత, తాను తీవ్రతరం చేయదలుచుకొన్న ఆధ్యాత్మిక సాధనలకు ఆటంకమవుతుందన్న ఉద్దేశంతో సుధామణి కుట్టుక్లాసులకు వెళ్ళడం మానేయాలని నిశ్చయించుకొంది. కొద్ది వారాల్లోనే హాజరు కావడం మానేసింది. ఆ సమయంలో అక్కడి పూజారి కూడా మరో చోటుకి బదిలీ అయిపోయాడు. బదిలీమీద వెళ్ళిపోయేముందు, తరగతిలో ఉన్నపిల్లల్లో కొందరిని ఇడమన్నేల్‌కు పంపి, సుధామణికి తను వీడుకోలు చెప్పదలచిన విషయం తెలియజేయమన్నాడు. ఆమె సతీశ్‌తో కలిసి పూజారిని చివరి సారి చూడటానికి వెళ్ళింది. చిట్టితల్లివైపు చూస్తూ ఆయన, కన్నీళ్ళు పెట్టుకొని చిన్నపిల్లవాడి మాదిరిగా ఏడ్చాడు. సుధామణి తన మానసికోద్రేకాన్ని నిగ్రహించుకొని నిలబడింది. "అమ్మాయ్, నేనిప్పుడు ఈ ఉద్యోగం మానేస్తున్నాను. సన్యాసిగా జీవితం

గడపాలని నిశ్చయించుకొన్నాను," అన్నాడాయన. సుధామణి, సతీశ్ సెలవు తీసుకొని వెళ్ళబోతుండగా పూజారి, సతీశ్‌తో ఇలా అన్నాడు, "చూడు, ముందు ముందు సుధామణి చాలా గొప్పదవుతుంది". బహుశా, పుణ్యాత్ముడయిన ఆ పూజారి, చిట్టితల్లిలో ఉన్న దివ్యత్వాన్ని అప్పటికే దర్శించి ఉంటాడు.

కుట్టుపనిలో ప్రావీణ్యం పొందిన తరవాత, తన సొంతాని కొక కుట్టుమిషను కావాలని అడిగింది సుధామణి. అంత పెద్ద ఆశ పెట్టుకొన్నందుకు దమయంతి ఆమెను తిట్టింది. కాని సుగుణానందన్, కొనిపెడతానని చాలాసార్లు మాట ఇచ్చాడు. అయినా, కుట్టుమిషను ఎన్నడూ కంటబడలేదు. సుధామణి నిశ్చయించుకొంది, "కుట్టుమిషను కావాలని మళ్ళీ అడగను. దేవుడు ఇస్తేనే వాడుకొంటాను". కొన్నేళ్ళకు, ఇడమన్నేల్‌కు భక్తజన ప్రవాహం మొదలయిన తరవాత, ఆమె డచ్ [హాలెండ్ దేశపు] భక్తుల్లో పీటర్ అనే అతను ఆమెకోసం ఒక కుట్టుమిషను కొని ఇచ్చాడు. అప్పుడామెకు, వెనక తాను చేసిన శపథం జ్ఞాపకం వచ్చింది.

సుధామణి తప్ప పిల్లలందరూ సెకండరీ స్కూలులోనో, కాలేజిలోనో చదువుతూ ఉన్నారు. వాళ్ళందరిదీ చామన చాయ. బాగుంటారు. సుధామణిది ముదురు నీలంవన్నె కావడంవల్లా, కష్టపడి పనిచేసే స్వభావం ఉన్నందువల్లా కేవలం ఆమెను పనిమనిషిలాగ తిరస్కార భావంతో చూసేవారు. ఆమెకు అవసరమయినన్ని బట్టలుకూడా ఇచ్చేవారు కారు. చిట్టి సుధామణికి వచ్చిన కష్టాలు చూసి, తల్లిదండ్రులూ అన్నా కనబరిచే శత్రువైఖరిని చూసి ఊళ్ళోవాళ్ళు అంటూండే వాళ్ళు - "సుధామణిని కొళ్ళంలో వడ్ల ఊక ఇచ్చి కొన్నారు" ఆమె తల్లిదండ్రులు పండగలప్పుడూ ఇతర విశేష సందర్భాల్లోనూ పిల్లలందరినీ గుళ్ళకు తీసుకు వెళ్ళేవారు; సుధామణి సంగతి పట్టించుకోకుండా ఎప్పుడూ ఇంట్లోనే ఉంచేసేవారు.

ఒకనాడు సుధామణికి ఒక గళ్ళ రవిక వచ్చింది. ఆమె దాన్ని సంతోషంగా వేసుకొంది. ఇది చూసి వాళ్ళన్న, వెంటనే దాన్ని విప్పేయమన్నాడు. దాన్ని ఆమె చేతిలోంచి లాక్కొని ఆమె కళ్ళముందే దాన్ని నిప్పుల్లో పడేశాడు. "ఇతరుల దృష్టిని ఆకర్షించడానికా నువ్వు ఈ రంగుబట్టలు వేసుకొంటున్నది?" అని అరిచాడు. మరో సందర్భంలో దమయంతి, చిట్టితల్లి తన సోదరికున్న పసుప్పచ్చ పట్టు జాకెట్టు వేసుకున్నందుకు తిట్టిపోసింది. అప్పటినుంచి సుధామణి, భగవంతుడు ఇచ్చిన బట్టలే వేసుకోవాలని నిశ్చయించుకొంది; అంటే ఇతరులు వేసుకోవడం

మానేసిన, పనికిరాని పాత బట్టలన్నమాట. సుధామణి వీటిని కత్తిరించి ఒక రవిక, పరికిణీ కుట్టుకొనేది. ఏదయినా ఒక పాత బట్టనుంచి ఊడిపోయిన దారాలను, ఈ గుడ్డముక్కలను కలిపి కుట్టడానికి వాడుకొనేది. తానెవరికీ భారం కానందుకు సంతోషించేది. ఆ నాటి పరిస్థితిని గురించి ఆమె ఇలా చెప్పింది,"సరయిన దారం లేకా కత్తెర కాని కుట్టుమిషను కాని లేకా నా బట్టలు నేను కుట్టుకోడానికి ఎలాగో తంటాలుపడేదాన్ని."



# నాలుగో అధ్యాయం

## నిజమయిన పిల్లనగోవి

*నిజమయిన పిల్లనగోవి లోపల ఉంది. దాన్ని వాయించి ఆనందించడానికి ప్రయత్నించు. ఒక్కసారి ఆ శబ్దం విన్నాక చావుపుట్టుకలు లేకుండా ఉండవచ్చు.*

*- మాతా అమృతానందమయి*

వాగ్గద్గదా ద్రవతే యస్య చిత్తం
రుదత్యభీక్ష్ణం హసతి క్వచిచ్చ
విలజ్జ ఉద్గాయతి నృత్యతే చ
మద్భక్తియుక్తో భువనం పునాతి.

భావోద్రేకంతో గొంతుక గద్గదమయి, ప్రేమతో హృదయం ద్రవించిపోయి, మళ్ళీ మళ్ళీ ఏడుస్తూ, అప్పుడప్పుడు నవ్వడానికి ప్రయత్నిస్తూ, సిగ్గు విడిచి బిగ్గరగా పాడటం, ఆడటం ఆరంభించేవాడు ప్రపంచాన్నంతటినీ పవిత్రంచేస్తాడు.

శ్రీమద్భాగవతం
స్కంధం 11, అధ్యాయం 14, శ్లోకం 24.

దైవ సాక్షాత్కారం పొందిన పవిత్రాత్ముడి ఆధ్యాత్మిక మహిమ, తత్సంబంధిత

ప్రవర్తన సాధారణ మానవ చేతన పరిధికి చాలా అతీతమయినదీ గుర్తుపట్టడానికి శక్యంకానిదీ. దైవంకోసం పడే తపనను కొందరు పిచ్చి అనుకొంటారు. ఇతరులు దాన్ని మానసిక నిరోధం అనుకొంటారు. ఇంకొందరు, అది ఉండటమే అసంభవమని కొట్టిపారేస్తారు. ఏది ఏమయినప్పటికీ మహాత్ములు చెక్కుచెదరకుండా ఉంటారు. సంశయాళువుల, విమర్శకుల నిరర్థక వ్యాఖ్యలను వాళ్ళు చెవిని పెట్టరు. ఆ వ్యాఖ్యలు చేసేవాళ్ళకు చైతన్యపు సూక్ష్మసీమలను గురించిన పరిజ్ఞానం పరిమితంగా ఉంటుందని వాళ్ళను నిందించనక్కరలేదు. [ఎలక్ట్రాన్, ప్రోటాన్ వంటి] పరమాణు భాగాలయిన రేణువుల **(sub-atomic particles)** ఉనికిని గురించి, ఉపయోగాన్ని గురించి సామాన్య మానవుడు సంశయిస్తున్నాడు కనక భౌతిక శాస్త్రజ్ఞుడు లేకుండా పోతాడా? వాళ్ళ నిరాధారమయిన విమర్శకు అతను కలతపడతాడా?

సుధామణి గురించి కూడా, పైన చెప్పిన మాదిరి ధోరణులు ఉండటంలో ఆశ్చర్యంలేదు. ఆమె, కొంచం తక్కువగా ఇరవై ఏళ్ళ వయస్సులో ఉన్నప్పటినుంచి ఎడతెగని ఆధ్యాత్మిక చైతన్య వాహినిలో మునిగి ఉండేది. కృష్ణుడిమీద ఆమె భక్తి చెప్పలేనంత గాఢమయినది. ఆమె ఒక చైతన్యస్థాయినుంచి తరవాతి చైతన్యస్థాయిని స్వచ్ఛందంగా, సహజంగా అధిరోహించేది. తన ప్రియతముడినుంచి ఎడబాటు పొందడమంటే ఆమెకు గుండె పగిలినట్లనిపించేది. పెద్ద పనిబరువుకు పరిహారమన్నట్లుగా, ఆమె హృదయాలాప ఒక సంతత ధారగా, సునిశితమయిన భక్తిగీతాల రూపంలో, వెలువడుతూ వచ్చింది. రాత్రీ పగలూ ఆ పాటలు పాడుతూండేది.[ఒక పాట భావం కింది విధంగా ఉంది].

వన్నెలు లేని ఇంద్రధనువులా, వాసన లేని పువ్వులా
ఉన్నప్పుడు, నా హృదయం,
కరుణ చూపమని గగ్గోలు పెట్టడమెందుకు?

నిరాదరమయం అయిపోయింది ఈ జీవితం
ఆదరపు చాయ రవ్వంత కానరాకుండా,
మధుర మంజుల నాదం లేని వీణలా,
శోకమయమైన నిశ్శబ్దమే అయి.
కారడవి కడుపున పారే పిన్నవాగులో,
పొద్దువెలుగు రేకలు సోకలేని చోట,
తామరలు పూలు పూసేదెలా?
రెక్కలు విప్పారుస్తుంది పోతు నెమలి

మింటిలో మబ్బులవంక చూపు నిలిపి, ఏం లాభం?
వాన చినుకులకోసం చాతక పక్షి కాచుకొని ఉంటుంది.

సుధామణి భక్తితన్మయ భావాలను తెలుసుకోలేని ఆమె తల్లిదండ్రులూ అన్నా నిర్దాక్షిణ్యంగా ఆమెను దండించేవారు, హింసించేవారు. దేవుడికోసం ఆమె చేసే పనులన్నిటినీ ఏదో ఒక మానసిక దౌర్బల్యానికీ కుంగుబాటుకూ లక్షణాలని నమ్మకమేర్పరుచుకొన్నారు.

ఇప్పుడు సుధామణి రాత్రులూ పగళ్ళూ ధ్యానం చేస్తూ, పాటలు పాడుతూ భగవన్నామ జపం చేస్తూ గడుపుతూ వచ్చింది. తరచుగా ఆమె, దేవుడిగదిలో గడియవేసుకొని ఆనందపారవశ్యంతో నృత్యం చేసేది. ఆమె అన్నకిది చిరాకు కలిగించింది. ఇతర వేళల్లో ఎడబాటు బాధలో తలమునకలయి వలవలా ఏడుస్తూ కనిపించేది. ఇసకలో, స్పృహ తప్పి పడి ఉండేది. చిట్టితల్లికి కృష్ణుడిమీద అంతగా ప్రేమ పెరగడం ఎలా సాధ్యమయిందో ఊహించుకోవలసిందే కాని ఆ ప్రేమకు హద్దులు లేవు. ఆమె గుండె తలుపులు బార్లా తెరుచుకొని ఉన్నాయి; కృష్ణుడి రాకకోసం సుధామణి ఆత్రంగా ఎదురుతెన్నులు చూస్తోంది. చిట్టితల్లి అంకిత భావానికీ ఆత్మార్పణకూ ఉన్న గాఢతను వర్ణించడం ఎలా సాధ్యం?

కృష్ణకథలు వినాలని సుధామణికి తీరని దాహం ఉండేది. ఎవరయినా అలాటి కథలు చెబుతూ ఉన్నప్పుడు ఆమె చెవిన పడినట్లయితే వెంటనే, ఆమె ధ్యాస తన స్వామి గాథలో లీనమయి, సమాధిస్థితి పొందేది. కథ ముగిసిన చాలా సేపటివరకు కూడా సుధామణి, కూర్చున్నచోట నిశ్చలంగా ఉండిపోయేది. ఆమె పారలౌకిక ప్రవర్తనలో అపరిచితమయినది కాని ఆశ్చర్యకరమయినది కాని ఏమీ లేవని ఇప్పటికి గ్రామస్థులకు తెలిసింది. ఇతర సమయాల్లో సుధామణి, చిన్నపిల్లలను పక్కకు పిలిచి కృష్ణుడికి సంబంధించిన కథలను [నాటకంగా] నటించమని ప్రోత్సాహించేది. వాళ్ళ ఆటలన్నిటినీ కన్నీళ్ళు పెట్టుకొని చూసేది. వాళ్ళు కథ చెబుతున్నప్పుడు, కృష్ణుడు తన పక్కనే కూర్చుని అతడే తనకు చెబుతున్నట్టుగా ఆమె ఊహించుకొనేది. పరిస్థితులను మరిచిపోయి, చిన్నపిల్లలను, వాళ్ళు నిజంగా కృష్ణుడేనని భావించుకొని కౌగిలించుకొనేది. అలాటి ప్రవర్తనకు అలవాటు పడని, సుధామణి అసాధారణ మనోభావాలతో పరిచయంలేని, పిల్లలు జడుసుకొనేవారు. చిన్నపిల్లలను నిజంగా కృష్ణుడిగా చూస్తూ ప్రార్థన గీతాలు పాడుతూ నైవేద్యం, తినుబండారాలు అర్పిస్తూ వాళ్ళను ఆరాధించడం ఈ అమాయకురాలికి అలవాటయింది.

నిశ్శబ్ద నిశీథివేళ ఎవరికయినా మెలకువ వచ్చినట్లయితే గుండెలవిసేలా చిట్టితల్లి

తన స్వామికి చేసే విన్నపాలు వినవచ్చేవి:

"కృష్ణా, కృష్ణా! నా జీవన లక్ష్యమా! నీ సుందర రూపాన్ని ఎప్పుడు చూస్తాను నేను? నా జీవితమూ నిన్ను చూడటానికి నేను చేసే ప్రయత్నమూ అంతా వృథా అయిపోయేవేనా? ఓ కృష్ణా, నీ భక్తులపట్ల నువ్వు కరుణామయుడవని అంటూ ఉంటారు. నీ దయార్ద్ర హృదయానికి నేను అసంతుష్టి కలిగించానా? నీ దాసురాలిగా ఉండటానికి నేను అర్హత లేనిదాన్నా? ఈ విన్నపాలకు నువ్వు మారు పలక్కుండా ఎన్నాళ్ళు ఇలా గడిచిపోతాయి? అధమురాలయిన ఈ అనాథ బాలిక మీద నీకు ఏమాత్రం జాలి కలగడం లేదా? ఎక్కడున్నావు? ........ఎక్కడున్నావు?".....

చివరికి ఆమె నేల మీద కూలిపోయేది. ఆమె రాత్రులు నిద్రలేనివే అయేవి. తన స్వామి ఏ క్షణంలోనయినా వస్తాడన్న ఆశతో కళ్ళు ముయ్యకుండా కాచుకొని కాచుకొని ఉండేది.

ఒక్కొక్కప్పుడు సుధామణి, బంకమట్టితో కృష్ణుడి బొమ్మ చేసి దానికి పూజచేసేది. మనస్సులో తన ప్రియతముడితో ఇలా చెబుతూండేది, 'ఇదుగో, నిన్ను ఎలా సేవించాలో, ఎలా పూజించాలో నాకు ఎవరూ నేర్పలేదు. నా తప్పులు మన్నించు!' పువ్వులు లేక, ఇసకే ఆ విగ్రహం పాదాలకు అర్పించేది. పూజ పూర్తయిన తరవాత, అసలయిన కృష్ణుడు వచ్చినట్టూ తన ఎదురుగా నిలబడి ఉన్నట్టూ అనుభూతి పొందేది. వణుకుతున్న శరీరంతో, నీళ్లు నిండిన కళ్ళతో సుధామణి, భక్తిలో తలమునకలయి ఆ మట్టిబొమ్మ ముందు మళ్ళీ మళ్ళీ మోకరిల్లేది. మరుక్షణంలో, కృష్ణుడు పరుగెత్తి పారిపోతున్నాడని అనిపించేది. అతన్ని పట్టుకోడానికి చిట్టితల్లి గబుక్కున ముందరికి ఉరికేది. ఆ తరవాత, అదంతా తన ఊహ మాత్రమేననీ ఆ మట్టిబొమ్మ వట్టి మట్టిబొమ్మేననీ గ్రహించేది. దీనివల్ల ఏడుపు వచ్చేది. దయనీయమయిన తన పరిస్థితికి ఎంతో దుఃఖిస్తూ ఆయన్ని వేడుకొంటూ ఉండేది, "కృష్ణా, కృష్ణా! రా! నీ దర్శనంకోసం తపిస్తూ కకావికలవుతున్న నన్ను కరుణించు; దీవించు. ఇదంతా నీ మీద నాకున్న ప్రేమను పరీక్షించడానికా? ఎందుకు వెనకాడుతున్నావు? ఓ కన్నా, నేను ఏ హింసనయినా ఓర్చుకొంటాను కాని నీ నుంచి ఈ ఎడబాటును కాదు. ఓ కృష్ణా, నీ గుండెలో జాలి ఎండిపోయిందా?"

సుధామణి నిరుత్సాహపడేది కాదు. సంపూర్ణమయిన ఆశావాదంతో, ఆపేక్షతో, ఈ బెస్తవాళ్ళపిల్ల, స్వామి రాకకోసం ఎదురు తెన్నులు చూస్తూనే వచ్చింది. ఒక్కొక్కప్పుడు తనను కృష్ణుడి ప్రేయసిగా భావించుకొనేది; మరొకప్పుడు ఆయన దాసురాలిననుకొనేది. ఏ శాస్త్రాలూ, వేదాలూ, ఉపనిషత్తులూ నేర్చుకోకపోవడమే కాదు; నాలుగో తరగతికి పైన ఏ చదువూ లేని ఈ అమ్మాయి, కృష్ణభగవానుడి పట్ల పరమ భక్తి తానుగా రూపుదాల్చినట్టు

ఉంది. పరమ భక్తి విభిన్న రూపాలు చిట్టి సుధామణిలో సులువుగానే వ్యక్తమయాయి.

ఈ పరిస్థితిలో, చేపల అమ్మకం వ్యాపారంలో సుగుణానందన్‌కు చాలా నష్టం కలుగటం వల్ల కుటుంబం ఆర్థిక పరిస్థితులు దెబ్బతిన్నాయి. దమయంతీ ఇతర కుటుంబ సభ్యులూ చాలా నిరాశ చెందారు. ఒకనాడు దమయంతి సుధామణితో అంది, "దేవుడు మనకింత దుఃఖం ఎందుకు కలిగిస్తున్నాడు? అమ్మాయ్, మీ నాన్న మేలుకోసం ప్రార్థన చెయ్యి. ఆయన వ్యాపారమంతా నాశనమయింది". సుధామణి ఇలా అనుకుంది, "ఓ కృష్ణా, దుఃఖం ఎలా మొదలవుతుంది? దీనికి మూలకారణం ఏమిటి? మా అమ్మ తన భర్త ద్వారా పొందాలనుకుంటున్నది కనక, హాయిగా బ్రతకాలని కోరుకుంటున్నది కనక నాశచెందింది. దుఃఖాన్ని కలిగించేది కోరికకాదూ? ఓ ప్రియతమ కృష్ణా, నేను దాంట్లో చిక్కుకుపోకుండా చూడు! నేను కనక కోరికల్లోనూ, అజ్ఞానంలోనూ మునిగిపోయిన మానవులమీద ఆధారపడినట్లైతే నేను కూడా దుఃఖపడటం ఖాయం. ఓ కృష్ణా, నా మనస్సెప్పుడూ నీ పాదపద్మాలను పట్టుకొని ఉండేటట్టు చెయ్యి!"

ఈ కాలంలో, ఆర్థికమయిన ఇబ్బంది ఉన్నప్పటికీ కూడా సుధామణి తల్లిదండ్రులు, ఏదో విధంగా ఆమె పెళ్ళి జరపాలని నిశ్చయించారు. ఇక్కడ చెప్పవలసిన విషయం ఏమిటంటే, దమయంతి తన నలుగురు కూతుళ్ళ పెంపకం విషయంలో చాలా శ్రద్ధ కనబరిచేది. దీన్ని గురించి ఆమెకున్న గర్వం ఊళ్ళో వాళ్ళకు తెలియనిదేమీ కాదు. తన కూతుళ్ళను తన కులంలో నీతిమంతురాళ్ళలాగ, గుణవంతురాళ్ళలాగ చూడాలి. అది పోయినట్లైతే అన్నీ పోయినట్లేనని దమయంతి ఉద్దేశం. ఇందుకోసం దమయంతి తన కూతుళ్ళను ఎంతో క్రమశిక్షణలో పెంచింది. వాళ్ళు మగవాళ్ళెవరితోనూ మాట్లాడటానికి అనుమతించేది కాదు; ముఖ్యంగా పడుచు వాళ్ళతో. ఆ రోజుల్లో ఇడమన్నేల్‌కు చుట్టూ నాలుగు వైపులా నీళ్ళు ఉండేవి. మరింత జాగ్రత్తకోసం, చొరబాటుదార్లనుంచి కాపుదలకోసం, ఇంటి చుట్టూ దడి కట్టించింది దమయంతి. అయినా ఆమెకు తృప్తిగా లేదు. ఎవరైనా దరిదాపులకు వస్తూంటే హెచ్చరించడానికని ఇంట్లో ఒక కుక్కని కూడా పెంచింది. కుక్క అరిస్తే ఆమె సుభగన్‌ను పిలిచి ఎవరు వచ్చారో చూడమనేది. కొత్తవాడు కాని, పడుచువాడు కాని అయినట్లైతే తలుపు తెరిచే వారు కాదు. ఈడు వచ్చిన కూతుళ్ళను గురించే దమయంతి ఎప్పుడూ కలవరపడేది. ఆ విధంగా, తన భారంలో అధిక భాగమైన సుధామణిని తొందరగా వదుల్చుకోవాలన్న ఆత్రం గట్టిగా వేధిస్తోంది.

సుగుణానందన్, సుభగన్ సుధామణికి తగిన వరుణ్ణి చూశారు. పెళ్ళిచూపులకు

ఒక రోజు నిర్ణయించారు, భారతదేశంలో ఆనవాయితీగా వస్తున్నట్టే. ఈ విధంగా, ఒకరికొకరు నచ్చారో లేదో తల్లిదండ్రులు పెళ్ళికి ముందుగా తెలుసుకొంటారు. ఇదంతా సుధామణికి తెలియకుండాను, ఆమె ఒప్పుదల లేకుండాను ఏర్పాటయింది. అంతేకాదు ఈ కుట్ర, ఇడమన్నేల్‌కు దూరంగా మరొక ఇంట్లో జరపాలని పథకం వేశారు. నిర్ణయించిన రోజున, ఆ ఇంటినుంచి ఒకామె సుధామణి ఇంటికి వచ్చింది; సుధామణికి కుట్టుపని ఏదో అప్పగించే నెపం మీద వచ్చింది. తన కూతురి పరికిణీలకు, రవికలకు కొలతలు తీసుకోడానికి తనతో తన ఇంటికి రమ్మని సుధామణిని అడిగింది.

సుధామణి, వాళ్ళింటికి చేరిన తరవాత, వాళ్ళ ఉద్దేశం పూర్తిగా వేరు అని గ్రహించింది. సుధామణిని తీసుకువచ్చినామె, ఒక కప్పు టీ ఇచ్చి, "చూడు సుధామణి, పక్కగదిలో ఒకతను కూర్చుని ఉన్నాడు. ఇది తీసుకువెళ్ళి అతనికి ఇయ్యి," అంది. పెళ్ళికూతురిని పెళ్ళికొడుకుకి పరిచయం చేసే ఆనవాయితి ఇది. వాళ్ళ మనస్సుల్లోని ఉద్దేశం స్పష్టంగా తెలుసుకొని సుధామణి, గంభీరస్వరంతో ఇలా చెప్పింది, "నావల్ల కాదు. నేను వచ్చింది కొలతలు తీసుకోడానికి; టీ అందించడానికి కాదు." ఇలా చెప్పి, ఆ ఇంట్లోంచి వచ్చేసింది. తన ఇంటికి తిరిగి వచ్చి, ఆ సంఘటనను గురించి దమయంతికి చెప్పింది. ఈ ఏర్పాట్లన్నీ, నిజానికి, తన తల్లిదండ్రులూ, అన్నా కలిసి చేసినవేనని ఆమెకు అప్పుడే అర్థమయింది.

సుధామణికి మరో పెళ్ళి సంబంధం వచ్చింది. ఈసారి పెళ్ళికొడుకునూ వాళ్ళవాళ్ళనూ ఇడమన్నేల్‌కే రమ్మని చెప్పారు; వేరే చోటికంటే ఇది సురక్షితమయినదని. కాబోయే మగడు వచ్చిన తరవాత దమయంతి, అతనికోసం కాసిని అరటి పళ్ళు తీసుకు రమ్మని తియ్యతియ్యగా చెప్పింది. అతిథుల ఎదురుగానే సుధామణి, ఫెడీమని ఎదురు సమాధానం చెప్పింది, "నేను వెళ్ళను! కావాలంటే నువ్వే వెళ్ళి కొని ఇయ్యి!" అంతటితో ఆ సంబంధం ముగిసింది.

కాని, కన్నవాళ్ళు ఉద్దేశం మానుకోలేదు. మరో సంబంధం వచ్చింది సుధామణికి. ఈసారి కూడా పెళ్ళికొడుకు ఇడమన్నేల్‌కే వచ్చే ఏర్పాటు జరిగింది. ముందుగా, దమయంతి సుధామణి దగ్గరకి వచ్చి, కన్నీళ్ళు పెట్టుకొని కూడా, "అమ్మాయ్, మాకు చెడ్డపేరు తేకు. కాబోయే భర్తతో నువ్వు మర్యాదగా మెలగు," అంది. సుధామణిని కలుసుకోడానికి వచ్చిన వరుడు కచేరీ గదిలో **(drawing room)** ప్రశాంతంగా కూర్చున్నాడు. సుధామణి వంటింట్లో రోకలితో ఎండు మిరపకాయలు దంచుతోంది. ఈ పరిస్థితిని వెనకటికంటే మొరటు పద్ధతిలో ఎదుర్కోవాలని అంతకు ముందే నిశ్చయించుకొంది.

శత్రువును ఎదుర్కోడానికి సిద్ధంగా ఉన్న సైనికుడిలాగ, రెండు చేతులతో రోకలి పట్టుకొని ఉన్న సుధామణి, అతన్ని బెదిరిస్తూ, వంటింటి కిటికీలోంచి అరుస్తూ, రోకలి ఊపుతూ, వికారమయిన భంగిమలు చేస్తూ నిలబడింది. దమయంతికి అవమానంతో మూర్ఛ వచ్చినంత పని అయింది. కాని సుధామణి అంత త్వరగా లొంగడానికి సిద్ధంగా లేదు. ఆమె పిచ్చిదనుకొని పెళ్ళిచూపులకు వచ్చిన మగపెళ్ళివాళ్ళు పరుగు పెట్టేవరకు ఆమె నాటకమాడుతూనే ఉంది. తరవాత కాస్సేపటికి, సుధామణికి, రోజువారీ వంతు తన్నులూ గుద్దులూ ముట్టాయి; ఎటొచ్చీ, మరింత బండపద్ధతిలో.

ఈ సంఘటన జరిగిన తరవాత, పెళ్ళి ప్రతిపాదనలతో తల్లిదండ్రులు కనక తనను మళ్ళీ ఇబ్బంది పెట్టేటట్లయితే ఇల్లు విడిచి వెళ్ళిపోయి ఏ కొండగుహలోనో మరో ఏకాంత ప్రదేశంలోనో భక్తి సాధనలు కొనసాగించాలని ఆమె నిశ్చయించుకొంది. ఈ పెళ్ళి విషయం మాత్రం ఆమె ఎంతమాత్రం ఓర్వలేకపోయేది. అయినా, కొంతకాలం వరకు అమ్మా, నాన్నా మరో ప్రయత్నం చెయ్యరన్న గట్టి నమ్మకం ఆమెకు ఉంది.

ఇంట్లోవాళ్ళు చిట్టితల్లికి చేసే అనాదరణ ఎంత ఘోరంగా మారుతుందో ఊహించడం కష్టం; కాని ఘోరంగా మారింది. ఈ పరిస్థితి ఇక ఎంత మాత్రం ఓర్చుకోలేక, సుధామణి, ఇంటినుంచి పారిపోదామనుకొంది. అదే రోజున ఒక కాగితం ముక్క గాలికి ఎగురుతూ వచ్చి సరిగా ఆమె ముందు పడింది. ఆమె ఆశ్చర్యపోతూ ఆ కాగితంముక్క తీసింది. అది ఒక వార్తాపత్రికలో ముక్క. అందులో, ఇంట్లోంచి పారిపోయిన ఒక అమ్మాయికి కలిగిన కష్టాల భయంకర వృత్తాంతం అందులో ఉంది. దీన్ని భగవంతుడు పంపిన సందేశంలా తీసుకొని సుధామణి, ఇల్లు విడిచి వెళ్ళే ఆలోచన మానుకొంది.

మరో సందర్భంలో, ఇంట్లోవాళ్ళ అన్యాయమయిన వేధింపులవల్ల సుధామణి, సముద్రంలోకి దూకి ప్రాణాలు విడుద్దామనుకొంది. మరుక్షణంలో ఆలోచన వచ్చింది, 'చనిపోతున్నది ఎవరు? పుడుతున్నది ఎవరు? నిజమైన దైవ భక్తుణ్ణి వేధించగలవాళ్ళు ఎవరు?' ఈ దృఢభావం ఆమె మనస్సును పూర్తిగా మార్చేసింది.

కఠోర సాధన చేసే ఆ రోజుల్లో, సుధామణి మరే ఇంట్లోనూ నిద్ర పోలేకపోయేది; లౌకికమయిన ఆలోచనలున్న వ్యక్తి ఇంట్లో వండిన అన్నం తినలేకపోయేది. ఒకవేళ అలాటి అన్నం తినవలసి వచ్చినట్లైతే ఆమెకు చాలా అశాంతి కలిగేది; వాంతి అయేది. దీనివల్ల సుధామణి చాలా రోజులు ఉపవాసాలు ఉండేది. లౌకిక జీవనులయిన వ్యక్తులు నిద్రపోయిన మరో ఇంట్లో ఉండటానికి ప్రయత్నించినట్లైతే ఆమెకు ఒక్క క్షణం కూడా

విశ్రాంతి ఉండేది కాదు. అయినా, నిద్రను గురించి ఆమె ఎప్పుడూ ఇబ్బంది పడలేదు. మెళుకువగా ఉండి ధ్యానం చేసుకోవడం కాని, లేదా తన ప్రియతముణ్ణి ఆవాహన చెయ్యడం కాని మేలని అనుకొనేది. అయినప్పటికీ నిద్ర వస్తుందేమోనని ఆమెకు భయంగా ఉండేది. ఎందుకంటే ఆ సమయంలోనే కృష్ణుడు వస్తాడని ఎంత కాలంగానో ఎదురుచూస్తున్న, ఆయన దివ్యస్వరూపదర్శన భాగ్యం తప్పిపోతుందనీ ఆమెకు గట్టి నమ్మకం.

ఈ దశలో కూడా సుధామణి, ఏదో ఒక విధంగా తన ఇంటిపనులను తప్పకుండా నెరవేరుస్తూ ఉండేది. ఆమె ఎడతెరపిలేకుండా శ్రమపడి పని చేస్తున్న కారణంగా ఊళ్ళో వాళ్ళు ఆమెకు 'కావేరి' అని పేరు పెట్టారు. కావేరి, సర్వసద్గుణ సంపన్నురాలయిన ఆదర్శవంతమయిన పాత్ర పేరు. జబ్బుగా ఉన్నప్పటికీ ఆమె ఇంటింటికీ వెళ్ళి పాలు అమ్మేది. చిట్టితల్లికి వచ్చిన అంతులేని కష్టాలనూ ఉదార గుణాలనూ చూసి ఊరివాళ్ళు పవిత్రమూర్తి అయిన ఈ బెస్తకన్నెమీద అపారమైన గౌరవం, ప్రేమ చూపించేవారు.

జీవితంలో ఎదుర్కోవలసి వచ్చిన చేదు అనుభవాలనూ తాను పెరిగిన కఠోర పరిసరాలనూ బట్టి సుధామణి, ప్రాపంచిక జీవితపు అనిత్యత్వాన్నీ స్వార్థపరత్వాన్నీ రూఢిగా తెలుసుకొంది. జీవితాన్ని గురించిన గాఢమూ, గంభీరమూ అయిన చింతన, జీవిత లక్ష్యమూ ఎప్పుడూ ఆమె మనస్సులో ఉండేవి. జీవిత మర్మాన్ని గురించి సుధామణి ఇలా అనుకొంటూ ఉండేది, 'భగవంతుడా, ఈ దుఃఖాలూ, బాధలూ నువ్వు చూడటం లేదా? ఈ లోకంలో నేనొక్కతెనే ఉన్నానా? నా నిజమయిన చుట్టం ఎవరు? నా తండ్రి ఎవరు? నా తల్లి ఎవరు? వీటన్నిటిలో సత్యం ఏది? మానవ శరీరం ధరిస్తే బాధపడవలసిందేనా?' ఇలా అనుకొంటూ ఆ అమాయకురాలు కన్నీళ్ళు కార్చేది; మనసారా తన స్వామిని ప్రార్థించేది.

లౌకిక జీవితంలోని తాత్కాలిక సుఖాలకోసం వెంపర్లాడే సామాన్య జనుల మీద సుధామణికి ఎప్పుడూ సానుభూతి ఉండేది. వాళ్ళ మేలుకోసం ఆమె ప్రార్థిస్తూండేది, 'ప్రభూ, అశాశ్వతమయిన ఈ ప్రపంచాన్ని ఏదో గొప్పదని అజ్ఞానంవల్ల పొరబడి బాధపడేవాళ్ళను దయ ఉంచి కాపాడు. వాళ్ళకు సరైన జ్ఞానం ప్రసాదించు.'

దమయంతికి ఆవులు చాలా ప్రియమయినవి. ఇంట్లోవాళ్ళు బాధపడవలసి వచ్చినా ఆవులకు ఏ బాధా, ఏ కష్టమూ కలగనిచ్చేది కాదు. ఆమె దృష్టిలో ఆవులు దేవుడితో సమానం. నైరుతి ఋతుపవనాల కాలంలో కేరళ ఉప్పుటేర్లు ఏటిగట్లను ముంచేసి, సముద్రతీర ప్రాంతం అంతలోనూ వరదలు రావడానికి కారణమయి అరేబియా సముద్రంతో ఏకమయిపోతాయి. ఇడమన్నేల్‌లో ఇంటి పశువుల పాక

పొంగివచ్చే వరద నీటికి గురి అయేది. అలాటి సమయాల్లో దమయంతి, ఆవులను ఇంట్లోనే కట్టేసేది ! మనసాల (living room) ఆవు పేడతో, రొచ్చుతో నిండిపోయేది. ఇంట్లో వాళ్ళందరూ దీనికి ఆక్షేపణ తెలుపుతూ దమయంతి చేసిన పనికి శాపనార్థాలు పెట్టేవాళ్ళు. తల్లికంటే కూడా సుధామణి ఆవులను ఎక్కువగా ప్రేమించేది కాబట్టి ఆమె ఏమీ అనేదికాదు. దానికి కారణం, కృష్ణుడి జీవితంలో ఆవులు ఆప్యాయతతో కూడిన పాత్ర నిర్వహించడం.

చిట్టితల్లికి అన్ని ఋతువులూ ఉత్తేజం కలిగించేవే; ఆమె దృష్టిలో ప్రతిదీ దైవలీలే. మలమల మాడ్చే వేసవి వేడికి ఆమె ఎంతమాత్రం కలవరపడేది కాదు. వానాకాలంలో వచ్చే భారీవరం కాని చలికాలంలో చాలా చలి పుట్టించే సముద్రపు గాలులు కాని ఆమెను చిరాకు పెట్టేవి కావు. ప్రకృతిలో తన ప్రియతముడు తప్ప, ఆమెకు మరేదీ కనిపించేది కాదు. ఈ భిన్న ప్రపంచంనుంచి ఆమె పొందవలసింది ఏదీ లేదు; ఆమెకున్న ఒకే ఒక లక్ష్యం, శ్రీకృష్ణుడి పాదపద్మాల్లో లయమవడం. జారిపడే వానబొట్ల చప్పుడు సైతం సుధామణి హృదయాన్ని ప్రేమతోను, భక్తితోను నింపేది. ఆమె దృష్టిలో అన్ని ధ్వనులూ పవిత్రమయిన ఓంకార నాదాన్ని దగ్గరగా పోలి ఉంటాయి; ముఖ్యంగా, కురిసే వాన. ఆ ధ్వనికి సరిపడేటట్లుగా ఆమె తన స్వామిని కీర్తిస్తూ పాడేది. సంతోషంగా ఆమె వానను గమనిస్తూ ఉండేది; ప్రతి ఒక్క వాన చినుకులో కృష్ణుడు నిలబడి ఉన్నట్లు దర్శించేది.

ఒక్కొక్క రోజు గడుస్తున్నకొద్దీ సుధామణి ఆధ్యాత్మిక సాధనలు గాఢమవుతూ వచ్చాయి. ఆమె అస్పష్ట మనోభావాలు మరింత స్పష్టంగా గోచరమవుతూ వచ్చాయి. ఒక్కొక్కప్పుడు ఆమె, తలస్నానం చేద్దామని నీళ్ళ గదిలోకి వెళ్ళేది; మూడు గంటల తరవాత, పరిసరాల స్పృహ లేని స్థితిలో కంటబడేది. సుధామణిలో కనిపించే ఈ స్థితులు, ఇంట్లోవాళ్ళకు అర్థంకాకుండా ఉండేవి. ఆమె ఏదో ఒక రకం మనశ్చాంచల్యంతో బాధపడుతోందన్న నమ్మకం ఏర్పరచుకొన్నారు. చిట్టితల్లి, తన లోకంలో ఒక ఒంటరి బాటసారి. కృష్ణ భగవానుణ్ణి ప్రేమించే విషయంలో హద్దులు లేని హృదయమున్న ఈ అమాయకురాలి ఆధ్యాత్మిక అగాధత్వాన్ని మనమెలా ఊహించగలం? దేవుడు తనంతట తానుగా తప్ప, చిట్టితల్లిని ఆత్మ సాక్షాత్కారపు లోతుల్లోకి - ఇంకా ఇంకా లోతుకు - తీసుకొని వెళ్తున్న శక్తి వేరే ఏముంది?

సుధామణి తరచుగా, మేకలకోసం ఆకులు తేవడానికి వెళ్ళేటప్పుడు చిన్న చిన్న పిల్లలు కొందరు ఆమె వెంట వెళ్తూండేవాళ్ళు; ఆమె ఎక్కడికి వెళ్తే అక్కడికి

వెళ్ళేవాళ్ళు. ఆమెతో ఉండటం వాళ్ళకు ఇష్టం. సుధామణి, వాళ్ళకు నాయకురాలు. ఆకులు కోయడానికి ఏదయినా చెట్టుకొమ్మమీద కూర్చుని ఉన్నప్పుడు సుధామణికి, తాను కృష్ణుడన్న స్పష్టమైన అనుభూతి కలిగి పరవశించేది. తరవాత, "నాకు కిందగా నిలబడి ఉన్న అబ్బాయిలూ, అమ్మాయిలూ గోప బాలకుల్లాగ, గోపికల్లాగ అనిపించేవారు," అని చెప్పింది.

దీని తరవాత ఆమెకు దివ్యదర్శనాలు చాలా కలిగాయి. కృష్ణుడు, రాత్రి చాలా గడిచిన తరవాత చిట్టితల్లికి ఎదురుగా దర్శనమిచ్చేవాడు. ఆ దివ్య మురళీమోహనుడు ఆమె చేతులు పట్టుకొని ఆమెతో నృత్యం చేసే వాడు. ఇతర సమయాల్లో అతను ఆమెతో ఆడేవాడు, నవ్వించేవాడు. ఆ ఆనందక్షణాల్లో ఆమె దివ్య పారవశ్యంతో అంతకు ముందెన్నడూ చేయని విధంగా నృత్యం చేసేది; అది రాధా కృష్ణుల నృత్యం. అలాటి వేళల్లో ఆమె కృష్ణ మురళి మంజులనాదాన్ని వినేది. మొదట్లో, కృష్ణుడు ఎక్కడో దగ్గరలో నిలబడి తన దివ్య మురళిని వాయిస్తున్నాడేమోనని ఆమె అనుకొంది. కాని జాగ్రత్తగా గమనించిన తరవాత, అది తనలోంచే వస్తోందని కనిపెట్టింది. వెంటనే ఆమె కన్నీళ్ళు పెట్టుకొని శ్రీకృష్ణుడి పటంముందు స్పృహ తప్పి పడిపోయేది. ఎప్పుడయినా ఆమె నిద్రపోవడం జరిగితే, చటుక్కున కృష్ణుడు ఆమెముందు ప్రత్యక్షమయి నిద్ర లేపేవాడు. తరవాత సుధామణి ఇలా చెప్పింది, "అతని ఒంటి చాయ ముదురు నీలం, లేత ఎరుపు కలిసిన వన్నె". ఒక్కొక్కప్పుడు ఆమెకు సువాసనగల రకరకాల పూలు పరిచిన మంచం కనిపించేది. చిట్టితల్లి చేతులు పట్టుకొని కృష్ణుడు, దానిమీద ఆమెతో కలిసి నృత్యం చేసేవాడు. ఆమెను మేఘాలపైకి తీసుకొని వెళ్ళి వేరు వేరు లోకాలనూ అందమయిన దృశ్యాల్నీ చూపించేవాడు. కాని సుధామణి అనుకొనేది. 'అతను అక్కడలేనప్పుడు వాటికి ఏం ఆకర్షణ ఉంటుంది? [అన్నింటికీ] సారం ఆయన; ఈ లోకాల బాహ్యాకృతి మారిపోతూ ఉంటుంది!' ఈ విషయంలో ఆమెకున్న గాఢవిశ్వాసం దృఢమయినది. అంతరంగంలో తన ప్రియతముడి దగ్గరికి రెక్కలు కట్టుకొని పోవడం తరచుగా జరిగేది. చిట్టితల్లి ఆత్మార్పణ ఈ దశలో సంపూర్ణం అయింది.

ఒక్కొక్కప్పుడు కృష్ణుడు తన పక్కనే నడుస్తూండటం చూసేది సుధామణి. మిగిలిన సమయాల్లో, ఆంతరికంగా ఆమె కృష్ణుడితో ఏకీభావం పొందినప్పుడు, కృష్ణుడి పటంతో సహా, గోడమీదున్న దేవీ దేవతల పటాలన్నీ చింపెయ్యాలనిపించేది. 'ఈ బొమ్మలు కేవలం కాగితమూ రంగులూ; ఇవి కృష్ణుడు కావు . నేనే కృష్ణుణ్ణి!' మరుసటి క్షణంలో ఆమె వైఖరిలో మార్పు వచ్చేది, 'ఉహూ, ఈ బొమ్మలు నేను చింపకూడదు. నేను కృష్ణ సాక్షాత్కారం పొందడానికి సాయపడింది ఈ బొమ్మ. అంతా కృష్ణమయమే;

పరమ చైతన్యం. అందుచేత ఈ బొమ్మకూడా అదే!'

ప్రతి వస్తువునూ కృష్ణుడిగా చూడటంతో, సాక్షాత్కరింపజేసుకోడంతో సుదీర్ఘమయిన త్యాగ, లాలసల కాలం ముగిసింది. సుధామణి చెట్లనూ, మొక్కలనూ, చిన్నపిల్లల్ని సైతం కౌగిలించుకోవడం, ముద్దులు పెట్టుకోడం కనిపించేది. చిట్టితల్లి ఎటు తిరిగితే అటు, కృష్ణ భగవానుడి మోహన రూపాన్ని చూసేది. ఆయన లేనిచోటు ఆవగింజంత మేరకూడా ఉండేది కాదు. ఆ రోజులను గురించి, తరవాత ఇలా చెప్పిందామె:

"నేను ప్రకృతిని చూస్తూ ప్రతి ఒక్క వస్తువునూ కృష్ణుడిగానే చూశాను. ఒక్క పువ్వు కూడా కొయ్యలేకపోయేదాన్ని; అదికూడా కృష్ణుడేనని కనుక్కున్నందువల్ల. పిల్ల గాలి నా ఒంటిని తాకినప్పుడు కృష్ణుడే నన్ను లాలిస్తున్నట్లు అనిపించేది. నడవడానికి భయపడేదాన్ని; 'ఓ, నేను కృష్ణుడిమీద కాలు పెడుతున్నాను,' అని అనిపించడం వల్ల ప్రతి ఒక్క ఇసక రేణువూ కృష్ణుడే నాకు. అప్పుడప్పుడు నాకు నేను కృష్ణుణ్ణని గాఢంగా అనిపించేది. క్రమక్రమంగా ఇది సహజస్థితిగా అయింది. నాకూ బృందావనంలో ఉండే కృష్ణుడికీ తేడా ఏమీ కనిపించకుండా పోయింది."

ఈ విధంగా సుధామణి, శుద్ధచైతన్య, ఆనందసాగరంలో స్థిరపడి పరిపూర్ణ మనశ్శాంతి పొందింది. అయినప్పటికీ పరమాత్మతో ఆమె ఏకీభావం ఆమె కుటుంబానికీ గ్రామస్థులకూ అప్పటికీ అజ్ఞాతంగానే ఉండిపోయింది. పైకి సామాన్యమయిన పల్లెటూరి పిల్లలాగే ఉంటూ వచ్చినా లోపల మాత్రం ఆమె కృష్ణభగవానుడితో ఐక్యమయింది; అదే ఏకైక సత్యంగా నిలిచి ఉండే సహజ స్థితి.



# అయిదో అధ్యాయం

## లోక కళ్యాణం కోసం

ఒకే పరబ్రహ్మకున్న అనంతరూపాలను తెలిపే హైందవ
సర్వదేవతాగణంలోని దేవతలందరూ లోపల కూడా
ఉంటారు. లోక కళ్యాణంకోసం ఒక దివ్యావతారం,
సంకల్పమాత్రం చేత, వాటిలో దేన్నయినా ప్రత్యక్షీకరించవచ్చు.
కృష్ణుడి దివ్యభావం (కృష్ణభావం) పురుషుడి
లేదా పరబ్రహ్మ శుద్ధ చైతన్యానికి ప్రత్యక్షీకరణ.

- మాతా అమృతానందమయి.

వంశీ విభూషిత కరాత్ నవనీరదాభాత్
పీతాంబరాత్ అరుణబింబ ఫలాధరోష్ఠాత్
పూర్ణేందు సుందర ముఖాత్ అరవింద నేత్రాత్
కృష్ణాత్ పరం కిమపి తత్త్వమహం న జానే.

చేత్తో పిల్లనగోవి పట్టుకొని, కొత్త వానమబ్బు ఒంటిచాయ
కలిగి, పీతాంబరం కట్టుకొని, కిందిపెదవి ఎర్రటి దొండ
పండులాగ ఉండి, పున్నమి జాబిల్లివంటి అందమయిన ముఖంతోనూ
తామరపువ్వు రేకులవంటి కళ్ళతోనూ
అలరారే కృష్ణుడు తప్ప మరో తత్త్వం (వాస్తవం) ఏదీ
నాకు తెలియదు.

మధుసూదన సరస్వతి

## కృష్ణభావ ఆవిర్భావం

తన సంపూర్ణ అస్తిత్వానికి పరబ్రహ్మలో శాశ్వతాశ్రయం లభించిన యువతి సుధామణి, ఇప్పుడు వెనకటిలాగ ఇంటిపనులు చెయ్యడానికి గిజగిజలాడవలసి వస్తోంది. తన కర్తవ్యాలు తప్పకుండా నెరవేర్చడానికి గట్టిగా ప్రయత్నిస్తోంది. కాని, భగవంతుడు ఆమెచేత చేయించదలచుకొన్నది ఇది కాదని ముందు ముందు మనకు తెలుస్తుంది.

1975 సెప్టెంబరు నెలలో ఒక బుధవారం సాయంత్రం కొన్ని సంఘటనలు జరిగాయి. ఇవి, భారత దేశపు ఆధ్యాత్మిక చరిత్రలో ఒక కొత్త అధ్యాయాన్ని ఆవిష్కరించాయి. సుధామణి ఆవులకోసం గడ్డి పోగుచేయడం అప్పుడే పూర్తి అయింది. తమ్ముడు సతీశ్‌తోబాటు ఇంటికి తిరిగివస్తోంది. ఆమె నెత్తిమీద పెద్ద గడ్డిమోపు ఉంది. సాయంత్రంవేళ దాదాపు 5 గంటలు కావస్తోంది. ఆమె తన మామూలు ఉదాత్త మానసిక స్థితిలో ఉంది. ఆమె పెదవులనుంచి ఒక భక్తిగీత స్వరం శ్రావ్యంగా వినవస్తోంది. వాళ్ళిద్దరూ ఇడమన్నేల్‌కు ఉత్తరాన ఉన్న పొరుగింటి ప్రవేశద్వారాన్ని దాటగానే సుధామణి టక్కున ఆగిపోయింది. ఈ ఇంటి పెరట్లో చదువుతున్న శ్రీమద్భాగవతంలోని* చివరి శ్లోకాలు ఆమెకు వినిపించాయి. చదవడం అయిపోయింది. దైవ సంకీర్తనం అప్పుడే మొదలయింది.

ఆ క్షణానికి వివశురాలయి సుధామణి నిలబడిపోయింది. సంకీర్తనాన్ని ఏకాగ్రంగా ఆలకిస్తున్నట్టు ఉంది. హఠాత్తుగా ఆమె మనోభావం నాటకీయంగా మారిపోయింది. గడ్డిమోపు ఆమె తలమీంచి కింద పడిపోయింది; ఆమె భక్తులు చేరి ఉన్నచోటికి పరుగెత్తింది; వాళ్ళ నడుమ నిలబడింది. ఆమె దివ్యానందంలో మునిగిపోయింది. భగవంతుడితో పొందిన ఆంతరిక ఏకీభావం ఆమె బాహ్య అస్తిత్వాన్ని ముంచెత్తింది. ఆమె కవళికలను, కదలికలను శ్రీకృష్ణుడి వాటి మాదిరిగా మార్చేసింది!

భక్తులు చాలావరకు, శ్రీకృష్ణుడు తమను దీవించడానికి ఈ పల్లెటూరి పిల్ల రూపంలో తాత్కాలికంగా అక్కడికి వచ్చాడని అనుకున్నారు. ఆ భక్తుల్లో ఒకరిచేత, సుధామణి కొనిని నీళ్ళు తెప్పించి, పవిత్రజలంగా అందరిమీదా చల్లింది. సుధామణిలో దైవం ప్రత్యక్షీకరించిన వార్త త్వరగా వ్యాపించింది. గబగబా జనం పోగుపడ్డారు. ఆ గుంపులో సంశయాళువులు కూడా ఉన్నారు. సుధామణికి హఠాత్తుగా దైవభావం కలిగినందుకు వాళ్ళు ఆక్షేపణ తెలిపారు, "నువ్వు నిజంగా కృష్ణభగవానుడివే కనక అయితే ఒక అలౌకిక అద్భుత చర్య ద్వారా నువ్వు దాన్ని నిరూపించాలి. లేకపోతే మేము నమ్మడం ఎలాగ?"

*ఈ ఇంట్లో ప్రతి నెలా భాగవత పురాణం చెప్పిస్తారు. ఇందులో శ్రీకృష్ణుడి లీలలు ప్రముఖంగా ఉంటాయి. పక్క ఊరినుంచి శ్రీ నారాయణన్ వచ్చి పురాణం చెబుతారు

సుధామణి సూటిగా వచ్చింది:

"ఇంతకుముందు లేని వస్తువును ఇప్పుడు ఉండేటట్టుగా చెయ్యలేం. వస్తువులన్నీ కేవలం మనస్సులోంచి వెలువడ్డవే. మీకు నిజమైన రత్నం ఉండగా నకిలీ దానికోసం వెంపర్లాడటం ఎందుకు? శుద్ధతత్త్వం మీలోనే ఉంది; అజ్ఞానం దాన్ని కప్పివేసింది!"

ఆ శుద్ధతత్త్వంలో నెలకొన్న వ్యక్తి పలికిన పరమ సత్యాన్ని గ్రహించుకోలేక ఒక అలౌకిక చర్య చూపించమని వాళ్ళు మాటిమాటికీ ఒత్తిడిచేశారు. దానికి సుధామణి ఇలా చెప్పింది:

"అలౌకిక అద్భుతచర్య ఒకటి చేసి ఎవరికో నమ్మకం కలిగించాలన్న ఆసక్తి నాకు ఎంతమాత్రం లేదు. అద్భుతాలు చూపించడం నా ఉద్దేశం కాదు. శాశ్వతమయిన ఆత్మను సాక్షాత్కరింపజేసుకోడం ద్వారా ముక్తి పొందాలన్న కోరిక ప్రజల్లో రేకెత్తించడమే నా లక్ష్యం. అద్భుతచర్యలు భ్రమతో కూడినవి. ఆధ్యాత్మికతకు వెనక ఉన్న సారభూతమయిన తత్త్వం ఇది కాదు. అంతే కాకుండా ఒకసారి ఒక అద్భుతం చూపిస్తే దాన్ని మళ్ళీ మళ్ళీ చూడాలని మీరు కోరతారు; చూపించమని అడుగుతారు. నేనిక్కడ ఉన్నది కోరిక పుట్టించడానికి కాదు; దాన్ని తొలగించడానికి"

"లేదు; మేం మళ్ళీ అడగం. అద్భుతం ఒక్కసారి చూపించు; మళ్ళీ ఒత్తిడి చెయ్యం," అన్నారు సంశయాళువులు. వాళ్ళు మరీ మరీ అడుగుతున్నారని సుధామణి చివరికి ఒప్పుకుంది. వాళ్ళకు ఇలా చెప్పింది, "మీలో విశ్వాసం కలిగించడానికి ఒక్కసారి చేస్తాను. కాని, మరెన్నడూ మీరు అలాటి కోరికలతో నా దగ్గరకి రాకండి. శంకించే వాళ్ళను, వచ్చేసారి శ్రీమద్భాగవత పురాణ కాలక్షేపం జరిగే రోజుకు ఇదే చోటికి రమ్మనండి."

మరుసటి భాగవత పురాణ కాలక్షేపం జరిగినప్పుడు ఇంట్లోనూ బయటా చాలామంది జనం గుమిగూడారు. నమ్మనివాళ్ళు కూడా, మోసాన్ని బయటపెట్టాలన్న ఆశతో, చెట్ల మీదా ఇళ్ళ కప్పులమీదా కూర్చున్నారు. కృష్ణుడూ, తానూ ఒకటేనన్న విషయం వెల్లడిస్తూ సుధామణి, సంశయాళువుల్లో ఒకరిని ఒక కుండెడు నీళ్ళు తెమ్మంది. వెనకటి మాదిరిగానే దీన్ని పవిత్రజలంగా అందరిమీదా చల్లింది. ఆ సంశయాళువును దగ్గరకు పిలిచి మిగిలిన నీళ్ళలో చేతులు పెట్టమంది. నీళ్ళు స్వచ్ఛమయిన పాలలా మారిపోవడం చూసి అందరూ ఆశ్చర్యపోయారు! అప్పుడు దీన్ని భగవత్ప్రసాదంగా [తీర్థంగా] అందరికీ ఇచ్చారు. ఆ తరవాత సుధామణి మరో సంశయాళువును పిలిచి కుండలో వేళ్ళు పెట్టమంది. కుండలో ఉన్న పాలు పంచామృతంగా మారిపోయాయి. ఇందులో పాలతో బాటు అరటి పండు, ముడి పంచదార, ఎండు ద్రాక్ష, పటిక బెల్లం ఉన్నాయి. అక్కడున్న వాళ్ళందరూ,

"ఓ భగవంతుడా! ఓ భగవంతుడా!" అని అరిచారు; తాము నిజంగా కృష్ణభగవానుడి దివ్యసన్నిధిలోనే ఉన్నామని తమకు తాము నమ్మకం కలిగించుకొన్నారు. పంచామృతాన్ని వెయ్యి పైచిలుకు మందికి ఇచ్చారు; అయినా కుండనిండా మిగిలింది. దూరంగా సముద్రపు ఒడ్డున చిన్న మర్రిచెట్టుకింద కూర్చున్నవాళ్ళకు కూడా పంచామృతం దక్కింది; అప్పటికీ కుండలో ఉన్నది తరగలేదు.

కొందరు సంశయాళువులు తృప్తి పడలేదు; ఇదంతా కనుకట్టు విద్య అని చాటి కొద్ది క్షణాల్లో పంచామృతం మాయమయిపోతుందన్నారు. కాని, వాళ్ళకు నిరాశ కలిగించిన విషయం ఏమిటంటే, అది మాయమయిపోకపోగా దాని తీపివాసన కొన్నిరోజులదాకా వాళ్ళ చేతులకు ఉంది. ఈ సంఘటన గ్రామస్థుల విశ్వాసాన్ని పెంచింది. వాళ్ళందరూ సుధామణి దివ్యత్వాన్ని గాఢంగా విశ్వసించారు.

కృష్ణభావ ఆవిర్భావాన్ని గురించి సుధామణి ఇలా చెప్పింది:

"తొలినాళ్ళలో నేను కృష్ణభావంలో ఉండి ఆనందంగా నృత్యం చేసేదాన్ని; ఒంటరిగా తిరిగేదాన్ని. కాని అప్పుడు ఎవరికీ తెలియదు. ఒకనాడు ఆ పరబ్రహ్మలో శాశ్వతంగా లీనమయిపోవాలన్న ప్రేరణ బలంగా కలిగింది. అప్పుడు లోపలినుంచి ఒక స్వరం వినిపించింది, 'ప్రపంచంలో వేలకి వేలమంది దైన్యంలో కూరుకుపోయి ఉన్నారు. నాతో ఏకీభావం పొందిన నీచేత నేను చేయించవలసింది చాలా ఉంది.'"

ఈ అంతర్వాణిని విన్న తరవాత సుధామణి, కృష్ణుడితో తన ఏకీభావాన్ని గ్రామస్థుల ముందు ప్రత్యక్షీకరించింది. సుధామణి ఇంకా చెప్పింది:

"ప్రతి ఒక్కరిని గురించి ప్రతి ఒక్క విషయం తెలిసికోగలిగేదాన్ని. ప్రత్యేకంగా ప్రత్యక్షీకరణ సమయంలోనే కాక అన్ని సమయాల్లోనూ, నేనే కృష్ణుణ్ణి అన్న స్పృహ నాకు పూర్తిగా ఉండేది. 'నేను గొప్పదాన్ని' అని నాకు అనిపించలేదు. నేను జనాన్ని చూసినప్పుడూ వాళ్ళ బాధలను తెలిసికొన్నప్పుడూ వాళ్ళమీద ఎంతో జాలిపడేదాన్ని. భక్తులు నాకు నమస్కారాలు చేస్తూండటం, 'భగవాన్' అని పిలుస్తూ ఉండటం స్పృహలో ఉండేది. భక్తులు చెప్పకుండానే వాళ్ళ ఇబ్బందులు నాకు తెలిసేవి."

అప్పటినుంచి సుధామణి, సముద్రపు ఒడ్డుకు పోయే దారికి దగ్గర ఇడమన్నేలీదు పడమటివైపు పెరుగుతున్న చిన్న మర్రిచెట్టు దగ్గర కృష్ణ భావాన్ని నియత కాలికంగా కనబరుస్తూ ఉండేది. ఆ చెట్టు చుట్టూ కొన్ని పూలమొక్కలు కూడా ఉంటూండేవి. మొత్తంమీద అదొక పొదరింటిలా ఉండేది. కొన్నేళ్ల తరవాత, ఊళ్ళోవాళ్ళు అక్కడొక గుడి కట్టించాలని అనుకొన్నారు. ఆ గుడి స్థలానికి ప్రారంభోత్సవంగా ఆ వూళ్ళో కొంతమంది యువకులు కలిసి మరో మర్రి మొక్క కూడా పాతి దీపం పెట్టారు.

సుగుణానందన్ ఆ యువకులను ప్రోత్సహించి వాళ్ళ కృషిలో తానుకూడా చురుకుగా పాల్గొన్నాడు. అతని తల్లి మాధవి, సుధామణితో బాటు తరచుగా వచ్చి సంజదీపం వెలిగించి భక్తిపాటలు పాడేది. ఈ మర్రిచెట్టు ముందు కొబ్బరాకు చాపల కప్పుతో చిన్న గుడిసె ఒకటి వేసి అక్కడ కృష్ణభగవానుడి పటం ఒకటి పెట్టారు; లోపల కాళికామ్మవారిని ప్రతిష్ఠించారు.

చాలా సంవత్సరాల తరవాత ఇప్పుడు, ఇది సుధామణి కృష్ణభావాన్ని చూపించే చోటు అయింది. అది ఊరుమ్మడి స్థలం కాబట్టి, జనం చేరడానికీ శుభప్రదమయిన కృష్ణభావ దర్శనం పొందడానికీ అనువయిన చోటు. సుధామణి, సన్నటి మర్రిచెట్టు కొమ్మమీద పడుకొని అనంత శయనుడి భంగిమ చూపించేది. అనంతుడంటే వెయ్యితలల ఆదిశేషుడనే పాము. దానిమీద పవళించే విష్ణుభగవానుడు అనంత శయనుడు. ఈ సమయంలో సుధామణి శరీరం, స్వయంసం కల్పంవల్ల, గాలిలా తేలిక అయేది. దర్శించే భక్తులకు ఇదొక అద్భుతమయిన దృశ్యం.

ఈ పవిత్ర స్థలం నిజంగా, శ్రీకృష్ణ నివాస స్థానమయిన బృందావనం అయింది. అక్కడి వాతావరణం దైవసంకీర్తనపరమైన భక్తిగీతాలతో నిండిపోయేది. భక్తులు మంగళప్రదమయిన శ్రీకృష్ణ దర్శనానికే కాక, తమ తమ సమస్యల పరిష్కారానికి కూడా ఇక్కడ గుమిగూడే వారు. కృష్ణభావ సమయంలో సుధామణికి తమ కష్టాలు చెప్పుకుని తేలికపడ్డ తరవాత అవన్నీ ఆశ్చర్యకరంగా తొలగిపోయేవి.

ఆ రోజుల్లో ఎవరైనా తమ సమస్యలకు పరిష్కారం చెప్పమని సుధామణిని వేడుకున్నప్పుడు, కృష్ణభావంలో ఉన్న ఆమె, ఒక చిన్న కర్పూరం ముక్క వెలిగించి తను చూపే నాలికమీద పెట్టమనేది. దాన్ని మంటతో సహా ఆమె మింగేసేది! కృష్ణభావం ముగిసిన తరవాత చూస్తే, ఆమె నాలిక కాలిన జాడ ఏదీ కనిపించేదికాదు. ఈ పద్ధతి జనంలో విశ్వాసాన్ని పెంచింది.

కృష్ణభావ వార్త తొందరగా వ్యాపించింది. కేరళ ప్రజలూ భారతదేశంలోని వివిధ ప్రాంతాలవాళ్ళూ పరయకడవుకు విరివిగా రావడం మొదలయింది. ఇది పవిత్రస్థల సందర్శనానికి చేసే యాత్ర అయింది. ఇది ఏ మాత్రం తగ్గకుండా ఈనాటికీ కొనసాగుతోంది. జబ్బు నయంకావాలని వచ్చేవారు కొందరు; భౌతికమయిన కష్టాలు తొలగిపోవాలని వచ్చేవారు కొందరు; వింత చూద్దామని వచ్చేవారు కొందరు; భక్తితో వచ్చేవారు కొందరు. కాని వాళ్ళందరూ కూడా కనిపెట్టిన విషయం ఒకటి ఏమిటంటే సుధామణి దగ్గరికి వచ్చిన తరవాత వాళ్ళ సమస్యలకు పరిష్కారం దొరికేది.

ఊరివాళ్ళలో, నమ్మకం లేనివాళ్ళు కొందరు సుధామణి దైవభావాన్ని మోసంగా

తలచి దాన్ని బయటపెట్టాలన్న ఆశతో కేవలం కాలక్షేపంకోసం వచ్చేవాళ్ళు. కాని సుధామణి అన్ని పరిస్థితుల్లోనూ, సమభావంలోనే ఉండేది. దరిమిలా, ఆమె ఇలా వివరించింది:

"భావ సమయంలో నన్ను చూడడానికి రకరకాల మనుషులు వస్తూండేవారు. కొందరు భక్తితోను, కొందరు తమ ప్రాపంచిక సమస్యలకు పరిష్కారం పొందడానికి, జబ్బులు నయం కావడానికి వచ్చేవారు. నేను ఎవ్వరినీ పొమ్మనను. కాదనగలనా? వాళ్ళు నాకు వేరుగా ఉన్నారా? మనమందరం ఒకే బతుకు దారానికి గుచ్చిన పూసలం కామా? ఎవరి ఆలోచనాస్థాయి ప్రకారం వాళ్ళు నన్ను చూస్తారు. నన్ను అభిమానించేవాళ్ళూ నన్ను ఏవగించుకొనే వాళ్ళూ సమానమే నాకు."

మొదటి రెండు కృష్ణభావ దర్శన సమయాల్లో సుగుణానందన్ వ్యాపారం పనిమీద ఊరికి వెళ్ళాడు. తన కూతురిలో విచిత్రమయిన మార్పును గురించి విన్నప్పుడు అదేదో కనిపెట్టలేని జబ్బు అనుకొన్నాడు. తుది నిర్ణయం చేసుకొనేలోగా కృష్ణభావాన్ని తాను స్వయంగా చూడాలనుకొన్నాడు. అందుకని, ఇడమన్నేల్‌లో భాగవత పురాణ పఠనం ఏర్పాటు చేశాడు. ఆ రోజున సుధామణి, కృష్ణుడితో తనకు గల ఏకత్వాన్ని వెల్లడించింది. పుట్టినప్పటినుంచీ అనేక రీతుల ఆశ్చర్యాలు కలిగిస్తూ వచ్చిన తన కూతురి దైవభావాన్ని చూసి అప్రతిభుడయి ఒక్క మాట అనలేకపోయాడు. అప్పటినుంచి సుగుణానందన్, కృష్ణభక్తుడు కాబట్టి, అన్ని భావదర్శనాల్లోనూ పాల్గొంటూ వచ్చాడు. సముద్రతీరాన ఉన్న పవిత్రమయిన ఈ బెస్తపల్లెలో ఇది క్రమబద్ధంగా సాగుతూనే ఉంది.

ఈ దశలో, సుధామణి దైవభావాలు కేవలం కృష్ణుడు ఆవహించడాలేననీ ఈ భక్తిసాధనలు తాత్కాలిక భ్రమలేననీ ఎప్పుడో ఒకనాడు ఇవి నిలిచిపోతాయనీ తల్లిదండ్రులు నమ్మారు. ఆ రోజుకోసం వాళ్ళు ఎదురు చూశారు; పిల్లకు పెళ్ళి చెయ్యొచ్చునని. వాళ్ళ అపోహకు వాళ్ళను తప్పు పట్టక్కర్లేదు; మహాత్ములను గురించి, వారి ప్రవర్తనను గురించి తెలియని వాళ్ళు కనక. భగవంతుణ్ణి గురించి వాళ్ళది సరళమైన దృష్టి. ఆయన ఆవిర్భావాలు దేవుడి గదుల్లోనూ గుళ్ళల్లోనూ ఉండే దేవుళ్ళకూ దేవతలకూ మాత్రమే కచ్చితంగా పరిమితమయినవని వాళ్ళ ఉద్దేశం. మరోచోట ఎక్కడా దేవుడు కనిపించడు; వెర్రిపోకడలున్న తమ కూతురిలో అసలు కనిపించడు!

తమ వెనకటి అనుభవాలను మరిచిపోయి, కన్నవాళ్ళు, సుధామణి పెళ్ళికి మళ్ళీ మరోసారి ఏర్పాట్లు మొదలుపెట్టారు. కాని ప్రతిసారీ, దురదృష్టంవల్ల ఇడమన్నేల్‌లో అడుగుపెట్టిన ప్రతి పెళ్ళికొడుకునూ సుధామణి ఘోరంగా భయపెట్టేది. చివరికి సుధామణి, కన్నవాళ్ళను ఇలా హెచ్చరించింది, "మీరు నాకు పెళ్ళి చెయ్యడమే

జరిగితే అతన్ని చంపి ఇడమన్నేల్‌కు తిరిగి వస్తాను!"

సుధామణికోసం చేసిన పెళ్ళి ప్రయత్నాలు విఫలమయి నిరాశ కలిగించడంతో, ఆమె తల్లిదండ్రులు ఒక ప్రసిద్ధ జ్యోతిష్కుడి సలహా తీసుకోవాలని నిశ్చయించారు. ఆయన ఉండే ఊరు ఎక్కడో దూరం. ఆయన ఇడమన్నేల్ గురించి కాని, సుధామణిని గురించి కాని, ఆమె దైవభావాన్ని గురించి కాని విన్నవాడు కాడు. చివరికి ఈ పెద్ద అడ్డంకి తొలగించుకోగలమన్న ఆశతోనే ఉన్నారు కన్నవాళ్ళు. సుధామణి జాతకం చూసిన తరవాత ఆ జ్యోతిష్కుడు గంభీర స్వరంతో ఇలా పలికాడు, "ఈ అమ్మాయి మహాత్మురాలు. ఇంతవరకు పెళ్ళి నిశ్చయించనట్లైతే ఇక ఎటువంటి ప్రయత్నమూ చేయకండి. ఇప్పటికే పెళ్ళి అయినట్లైతే ఆమెను వెంటనే ఇంటికి పిలిపించండి. లేకపోతే మీకు ఘోరమయిన ఆపద వస్తుంది; మీకు మహాదుఃఖానికి కారణమవుతుంది." నిరాశపడ్డ తండ్రి, బరువెక్కిన గుండెతో ఇంటికి తిరిగి వచ్చాడు. అటు తరవాత సుధామణికి పెళ్ళిచేసే ప్రయత్నాలు మానుకున్నాడు.

సుధామణి కృష్ణభావం ప్రత్యక్షీకరణ సత్యమైనదేనని ప్రజలు తెలుసుకున్న తరవాత ఆమె దీవనలు అందుకోడానికి ఇంకా ఇంకా రావడం మొదలుపెట్టారు. అలాగే, తమ స్వార్థ ప్రయోజనాలను నెరవేర్చుకోడానికీ, డబ్బు చేసుకోడానికీ సుధామణి దివ్య ఔదార్యాన్ని వినియోగించుకొందామన్న ఆశతో కొందరు వచ్చారు. ఒకనాడు రాత్రి, సుధామణి దగ్గరకి కొందరు వచ్చారు. ఆమెను డబ్బుతో ఆశపెట్టగలమని అనుకొన్నారు. కొన్ని అద్భుతాలు చూపించినట్లయితే చాలా పెద్దమొత్తంలో డబ్బు ఇవ్వజూపారు. సుధామణి బిగ్గరగా నవ్వి ఆప్యాయంగా వాళ్లకు ఇలా చెప్పింది:

"అద్భుతాలు చూపించడంవల్ల నాకు ఒరిగేదేమీ లేదు. అద్భుతాలు ప్రదర్శించి పేరుప్రతిష్టలు పొందడం, భౌతిక సంపదలు సంపాదించడం నా లక్ష్యం కాదు. మనలో అపారమయిన, అనంతమయిన దివ్యసంపత్తి ఉంది. దాన్ని విడిచి పెట్టి నశించి పోయే, తుచ్ఛమయిన లౌకిక సంపత్తికోసం పరుగులెత్తడం ఎందుకు? నిస్వార్థమయిన భగవత్సేవ, రోగగ్రస్తులయిన మానవుల సేవ నా జీవిత లక్ష్యం. నేనిక్కడ ఉన్నది ఏదీ సంపాదించడానికి కాదు; ఇతరుల సుఖంకోసం అన్నీ విడిచిపెట్టడానికి."

సుధామణి కృష్ణభావ దర్శనం ఇచ్చినప్పుడు వచ్చిన వాళ్ళకు కలిగిన అద్భుతమయిన అనుభవాలు, ఇతరులుకూడా అక్కడ శరణుపొందడానికి స్ఫూర్తినిచ్చినందువల్ల నానాటికీ భక్తుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. మర్రిచెట్టు చుట్టూ ఉన్న సముద్రతీరం భక్తి సంకీర్తనంతో జీవం పోసుకుంది. ఊరివాళ్ళు తమ

భేదాలన్నిటినీ మరిచిపోయి పాటలు పాడటానికీ ఆమె దీవనలు అందుకోడానికి ఒక్కచోట కలిసేవారు.

అటువంటి ఒక సందర్భంలో, కృష్ణభావ దర్శన సమయంలో పవిత్ర వటవృక్షచ్ఛాయా ప్రదేశంలోని గుడిదగ్గర చాలా పెద్దసంఖ్యలో జనం చేరారు. పైన, హఠాత్తుగా భయంకరమయిన తుఫానును సూచించే కారుమబ్బులు కమ్ముకొన్నాయి. భారీగా వర్షం కురిసింది. దగ్గరలో ఎక్కడా నిలవడానికి కప్పు లేకపోవడంవల్ల భక్తులు, ఎలాగా తప్పదని, తడవడానికి సిద్ధమయి నిలబడి ఉన్నారు. కాని ఆశ్చర్యం ఏమిటంటే, చుట్టూ కుండపోతగా వాన కురిసినా భక్తులు నిలబడ్డ చోట మాత్రం వాన పడలేదు!

ఈ కాలంలో, ఒక విషసర్పం, నడిచి పోయేవాళ్ళకు భయం పుట్టిస్తోంది; ముఖ్యంగా రాత్రివేళల్లో. ఆ పాము స్వేచ్ఛగా సంచరిస్తూ ఉండటం తరచుగా చూస్తూండేవారు, ఊరివాళ్ళు; రాత్రిపూట సముద్రపు ఒడ్డున నడవాలంటే భయంగా ఉండేది. కృష్ణభావ సమయంలో ఊరివాళ్ళు కొందరు సుధామణి దగ్గరకి చేరి ఈ బెడద తీరే పరిష్కారం చెప్పమని వేడుకొన్నారు. ఆ తరవాత ఒకనాటి సాయంత్రం, దైవభావ సమయంలో, భయ కారణమయిన ఆ సర్పం అవుపించింది. జనం చెల్లాచెదరయి పోయారు; కొంత దూరంలో కుంచించుకు పోయి నిలబడ్డారు. సుధామణి నిర్భయంగా ఆ పామును పట్టుకుని ఆడుతున్న దాని నాలికను తన నాలికతో తాకింది! ఆ తరవాత దాన్ని వదిలేసింది. మళ్ళీ ఎన్నడూ ఆ ఊరివాళ్ళకు విషసర్ప భయం కలగలేదు; మళ్ళీ సముద్రపు ఒడ్డున స్వేచ్ఛగా సంచరించడం మొదలుపెట్టారు.

'కడలి తల్లి కన్నబిడ్డలు'గా పేరుపొందిన బెస్తవాళ్లు ఒక కాలంలో చాలా రోజులపాటు చేపలేవీ పట్టలేక పస్తులున్నారు. కృష్ణభావ సమయంలో సుధామణి దగ్గరికి వచ్చి తమ కష్టం చెప్పుకొన్నారు. ఆమె వాళ్ళకొక తులసి ఆకు ఇచ్చి, దాన్ని ఫలానా చోట ఒక కుర్రవాడి చేత సముద్రంలో వేయించమనీ ఆ తరవాత అక్కడ చేపలు పట్టమనీ చెప్పింది. ఆమెను పరీక్షించడంకోసం వాళ్ళు, ఆమె సలహాను పాటించకుండా మరుసటి భావదర్శనం నాడు వచ్చారు. వాళ్ళింకా నోరు విప్పకుండానే సుధామణి, వాళ్ళ టక్కరితనాన్ని తెలిపి మరో తులసి ఆకు మళ్ళీ ఇచ్చింది. ఆశ్చర్యంతోను, పశ్చాత్తాపంతోను వాళ్ళు ఆ ఆకు తీసుకొని సముద్రానికి వెళ్ళారు. కాని ఎందువల్లో ఆమె చెప్పిన చోట సముద్రంలో వెయ్యలేకపోయారు. ఆమె వాళ్ళమీద దయతలచి, మరుసటి భావదర్శనంనాడు, సముద్రపు ఒడ్డున ఆనందంగా నృత్యంచేసి, ఆ విధంగా వాళ్ళను దీవించింది. మర్నాడు పెద్ద చేపలతుట్ట సముద్రపు ఒడ్డుకు ఈదుకొంటూ వచ్చింది. బెస్తవాళ్ళు ఎంతో సంతోషించారు; తృప్తిపడ్డారు. ఆ ఊరి చరిత్రలో అంతటి

ముందెన్నడూ అంత పెద్ద ఎత్తున చేపలు దొరకలేదు. మరో రెండు సందర్భాల్లో కూడా సుధామణి, బెస్తవాళ్ళు మనసారా చేసిన ప్రార్థనను మన్నించి సహాయపడింది. స్వార్థంతోను, కోరికతోను కూడిన గ్రామస్థుల భక్తి, సుధామణి ఉపకారాన్నీ, ప్రోత్సాహాన్నీ అంతగా పొందలేకపోయింది.

కృష్ణభావం, సుధామణికున్న అనంతమయిన ఆధ్యాత్మిక శక్తికి బాహ్యప్రత్యక్షీకరణ. దీన్ని ఆమె కృష్ణరూపం ద్వారా వ్యక్తం చేసింది. అయినప్పటికీ ఆమె తల్లిదండ్రులూ ఊరివాళ్ళలో చాలామందీ, కృష్ణభగవానుడు భావసమయంలో ఆమెను తాత్కాలికంగా ఆవహిస్తున్నాడని నమ్మారు. ఆమె అన్నా తల్లిదండ్రులూ అనుకొనేది, ఆమె స్కిజోఫ్రేనియాతో (ఖండిత వ్యక్తిత్వ రోగం) కాని మరొక మానసిక భ్రాంతితో కాని బాధపడుతోందని. సుధామణి మాత్రం దాన్ని పట్టించుకోలేదు. ఈ దశలో, భావదర్శన ఫలితంగా జనానికి దైవభక్తి కలగడం, ప్రాపంచిక బాధలనుంచి ఉపశమనం కలగడం పైకి కనిపిస్తూ ఉంది. ఇది చాలు. ప్రజల అవసరాలను బట్టి, సరైన సమయంలో, దివ్యనాటకం వివిధ దశల్లో కళ్ళకు కనిపించాలి .

భావదర్శనం సముద్రతీరానికి దగ్గిరలో జరగడంలో కొన్ని ఇబ్బందులు ఉన్నాయి. అక్కడయితే భక్తులు స్వేచ్ఛగా వస్తారన్నది నిజమే. కొందరు భక్తితోను, గౌరవంతోను వచ్చేవాళ్లు ఉన్నప్పటికీ, సుధామణిని అదే పనిగా దూషించేవాళ్ళూ వేధించేవాళ్ళూ కూడా కొందరు ఉన్నారు. అంతే కాదు; భక్తుల సంఖ్య త్వరత్వరగా పెరుగుతున్నందువల్ల మర్రిచెట్టు చుట్టూ చిన్నగా కొన్ని అభివృద్ధి పనులు చెయ్యవలసి వచ్చింది. ఊరివాళ్ళలో స్వయంప్రేరిత బృందంవాళ్ళు కొందరు తమకు తామొక పరిపాలక మండలిగా ఏర్పరచుకొని, తమ కోసమని, ధన రూపంలో వచ్చే కానుకలు వేయడానికి తాళం బిగించిన పెట్టె ఒకటి అక్కడ పెట్టారు. ఇబ్బందిపెట్టే కూటమి ఒకటి ఏర్పాటు కావడానికి ఇది ముందు సూచనగా హెచ్చరిస్తోంది.

ఇలాటి సంఘటనలవల్ల సుగుణానందన్‌కు చాలా విచారం కలిగింది. ఒకనాడు రాత్రి కృష్ణభావ సమయంలో అతను సుధామణి దగ్గరికి వచ్చి తన ఆందోళనను వ్యక్తంచేశాడు. "నువ్వు ఈ రోడ్డుపక్కన కృష్ణభావ దర్శనం ఇస్తూ ఉండటం బాధాకరంగా ఉంది. అంతేకాక, నమ్మకం లేనివాళ్ళు నిన్ను ఎగతాళి చేస్తూండటం ఓర్చుకోడానికి శక్యంకాకుండా ఉంది. ఇదంతా అలా ఉంచి, ఈ చిట్టితల్లి నా కూతురు ఊరుమ్మడి స్థలంలో రకరకాల మనుషులు ఆమె చుట్టూ గుమిగూడటం గుండెలను బద్దలుచేస్తోంది," అని చెప్పి అతను కన్నీళ్ళు పెట్టుకొన్నాడు.

అప్పుడు సుధామణి ఇలా అన్నది, "అయితే, నా భక్తులు రావడానికి మరో

చోటు చూపించు. ఏదీ లేకపోతే ఆ ఆవుల కొట్టం సరిపోతుంది." సుగుణానందన్ వెంటనే ఒప్పుకొన్నాడు. ఆవుల కొట్టాన్ని మరమ్మతు చెయ్యడానికి ఏర్పాట్లు చేశాడు. నేలమీద సిమెంటుచేశారు. మధ్యలో ఒక పిట్టగోడ కట్టి దాన్ని రెండు వాటాలు చేశారు. ఒక పక్క ఆవుల కొట్టం ఉంటుంది; మరో పక్క భావదర్శనానికి తగ్గ విధంగా చేశారు. నాలుగు వైపులా కొబ్బరాకు చాపలు కట్టారు.

త్వరలోనే భావదర్శనం, సముద్రపు ఒడ్డునుంచి ఇడమన్నేలుకు మారింది. ఈనాటికీ కూడా అక్కడే జరుగుతోంది. కృష్ణభావ సమయంలో, సుధామణి కొత్తగా కట్టిన మందిరంలో నిలబడి ఉండేది. పిట్టగోడమీద వాలి, అప్పుడప్పుడు ఆమె, అవతలి పక్కనున్న ఆవుల్లో దేనిమీదయినా తన చెయ్యి పెడుతూండేది.

ఒకనాటి రాత్రి కృష్ణభావ సమయంలో సుధామణి తన తండ్రిని పిలిచి ఇలా చెప్పింది:

"నా భక్తులు దూరదూరాలనుంచి వస్తారు. చాలా మంది ఎప్పటికీ ఇక్కడ ఉండిపోవడానికి వస్తారు. నువ్వు ఎన్నో అడ్డంకులను ఎదుర్కోవలసి వస్తుంది; కాని భయపడకు. అన్నిటికీ ఓర్చుకో. ఎవరిమీదా కక్ష కట్టకు. అసూయపడకు. ఎవరినీ ఏమీ అడక్కు. నీకు అవసరమయినదల్లా నువ్వు అడక్కుండానే వస్తుంది. దాంట్లో కొంతభాగం దానధర్మాలకు వినియోగించు. క్రమక్రమంగా ఈ చోటు గొప్ప ఆధ్యాత్మిక కేంద్రం అవుతుంది. ఈ చిన్నది చాలా సార్లు ప్రపంచం చుట్టూ యాత్రలు చేస్తుంది ఇక కొద్దికాలంలో నువ్వు చాలా బాధపడవలసి వస్తుంది, కాని భగవంతుడెప్పుడూ నిన్ను చల్లగా చూస్తాడు; నీ అవసరాలు తీరుస్తాడు. నీ దగ్గరి చుట్టాలూ పక్కాలూ ఊళ్ళోవాళ్ళు కూడా నిన్ను ఏవగించుకొంటారు; తిడతారు. అయినా కొంతకాలానికి క్రమక్రమంగా వాళ్ళు నీకు స్నేహితులవుతారు. వేలాదిమంది నా భక్తులు నీ పిల్లలవుతారు. ఈనాటినుంచి ఈ చిన్నది నిత్యపరిశుద్ధురాలు*"

మరోసారి దిమ్మెరపోయాడు సుగుణానందన్! ముదురు నీలపు చాయ ఉన్నది ఎన్నోసార్లు తన చేతులతో తను కొట్టిన దెబ్బలు తిన్నది, తన కూతురు ప్రపంచం చుట్టూ యాత్రలుచేస్తుందా? కన్యాకుమారి అగ్రం** దాకా కూడా ఎన్నడూ వెళ్ళివచ్చినది కాదే! వేలాదిమంది వస్తారా ఇడమన్నేల్‌కు? ఎక్కడుంటారు వాళ్ళందరూ? అదొక చిన్న ఇల్లు మాత్రమే. 'ఈ నాటినుంచి ఈ చిన్నది నిత్య పరిశుద్ధురాలు' అంటే అర్థమేమిటి* ఈ

*కృష్ణ భావం మొదలయిన తరవాత సుధామణి ఎన్నడూ బహిష్టు కాలేదు.

**దక్షిణ భారత దేశానికి కొన అయిన ఈ ప్రదేశం పరయకడవుకు 200 కిలోమీటర్ల దూరంలో ఉంది

మాటలు సుగుణానందన్ మనస్సుమీద గాఢమయిన ముద్ర వేసినప్పటికీ అప్పటిమట్టుకు అతను, వాటిని వెర్రి మాటలకింద కొట్టేశాడు. ఆ తరవాత కొన్ని సంవత్సరాలకు, ఆనాడు తనతో ఆమె చెప్పినది సంపూర్ణ సత్యమని గ్రహించాడు.

కృష్ణభావ దర్శన స్థలాన్ని మార్చడంవల్ల, ఊరివాళ్ళలో కొందరు, తమ ప్రయోజనాలు దెబ్బలు తిన్నాయని తెలుసుకొని, గట్టిగా ఆక్షేపణ తెలిపారు, "తన తండ్రి కోరికల ప్రకారం చేసే దేవుడు మాకు అక్కరలేదు," అన్నారు. మర్రిచెట్టు దగ్గర సంకీర్తనం చేసే భక్తులు ఇప్పుడు రెండు ముఠాలుగా విడిపోయారు. ఒక ముఠా, సహాయ నిరాకరణ రూపంలో తమ వ్యతిరేకతను తెలిపింది. రెండో ముఠా వాళ్ళు, వెనకటి మాదిరిగానే, భావదర్శన సమయంలో భజనలు చెయ్యడానికి ఇడమన్నేల్ వచ్చారు. విధేయులైన భక్తుల [ఆస్థ] వల్ల ఉడుక్కున్న కొందరు గ్రామస్థులు, పోట్లాటా కొట్లాటా పెట్టుకోవాలన్న ఏకైక ఉద్దేశ్యంతో ఇడమన్నేల్‌కు వచ్చారు. భావదర్శన సమయంలో భజనకీర్తనలు పాడుతూండేవాళ్ళను బహిరంగంగా తిడదామని ముందుకు వచ్చారు. ఈ విరోధిముఠాలో ఆడవాళ్లూ ఉన్నారు, మగవాళ్ళూ ఉన్నారు. వీళ్ళిలా చొచ్చుకు వస్తూండటం చూసి చూసి, సుగుణానందన్, మరికొందరు భక్తులు ఒకనాడు విసుగెత్తిపోయి ఇడమన్నేల్‌నుంచి బయటకి తరిమేశారు. కాని ఇంతటితో అయిపోలేదు; రాబోయే చిక్కుకు ఇది ఆరంభం మాత్రమే.

## హేతువాద ఉద్యమం

దౌర్జన్యపరుల ముఠాలో కొందరు, ఊరి భూస్వాముల కొడుకులు. వాళ్ళు కలిసి ఒక సమితి ఏర్పరచారు. 'గుడ్డినమ్మకాల నిర్మూలన సమితి.'( Commitee to remove blind beliefs) అని పేరు పెట్టుకొన్నారు. దీన్నే 'హేతువాద ఉద్యమం' అంటూ వచ్చారు. సముద్రతీరాన ఉన్న పదమూడు పల్లెలనుంచి వెయ్యమంది కుర్రకారును కూడగట్టారు. వీళ్ళు సుధామణి భావదర్శనాన్ని అంతమొందించడానికి తమ ఉద్యమం ప్రారంభించారు.

చిన్నప్పుడు ప్రతిరోజూ వేకువ వేళ మోహనస్వరంతో కృష్ణసంకీర్తనం చేసే నాటినుంచి గుణవంతురాలు, ఉదారమనస్కురాలు అయిన తమ చిట్టితల్లిని ఊరివాళ్ళు ప్రేమిస్తూ ఉన్నారు. అంతేకాకుండా, ఆమె దైవభావంమీదా నిశ్చలభక్తి మీదా వాళ్ళకు నమ్మకముంది. కాని సుగుణానందన్ బింకపు స్వభావమే వాళ్ళలో ఏదయినా అసూయ కాని విరోధం కాని పొడచూపడానికి కారణమయింది. కృష్ణభావ ఆరంభంలోనే ఒకనాడు

దర్శన సమయంలో సుధామణి, తనను వ్యతిరేకించిన వాళ్ళతో ఎవరితోనూ వాదులాడటం కాని కక్ష కట్టడం కాని చెయ్యవద్దని వాళ్ళ నాన్నకు చెప్పింది. దివ్యమయిన ఈ సలహా వినకుండా సుగుణానందన్, ఆ సమితికి వ్యతిరేకంగా కొన్ని చర్యలు తీసుకొన్నాడు. దీనివల్ల ఆ హేతువాదులనే వాళ్ళ శత్రుత్వం రెండింతలయింది.

సుధామణికి వ్యతిరేకంగా నినాదాలు చెయ్యడం ప్రారంభించారు. చిట్టితల్లిమీద నిరాధారమయిన, నిర్హేతుకమయిన విమర్శతో నిండిన బహిరంగ ప్రకటనలు చెయ్యడం ప్రారంభించారు. కసిపట్టిన ఈ ఉద్యమం అంతటితో ఆగిపోలేదు; సుధామణిని అప్రతిష్ఠపాలు చెయ్యడానికీ కృష్ణభావాన్ని అంతంచేయడానికీ వాళ్ళు తలపెట్టిన ప్రయత్నం, నిజానికి అప్పుడే మొదలయింది. రెండో ఎత్తు ఏమిటంటే, భక్తి పేరుమీద సుధామణి జనాన్ని మోసం చేస్తోందని ఆమెమీద పోలీసులకు తప్పుడు ఫిర్యాదు చెయ్యడం! ఈ అర్జీవల్ల కొందరు పోలీసు అధికారులు, సుధామణిని ప్రశ్నించడానికి ఇడమన్నేల్‌కు వచ్చారు. అన్ని పరిస్థితుల్లోనూ, కూడా ధైర్యంగా ఉండే సుధామణి ఆ అధికారులతో ఇలా అంది. "ఇష్టమయితే మీరు నన్ను అరెస్టుచెయ్యండి; జైలుకు తీసుకు వెళ్ళండి. ఇక్కడ, మా ఇంట్లోవాళ్ళూ, ఊళ్ళోవాళ్ళూ నన్ను ధ్యానం చేసుకోనివ్వడం లేదు. కనీసం జైల్లోనయినా నాకు ఒంటరితనం ఉంటుంది. అన్నివేళలా దైవధ్యానం చేసుకోవచ్చు. అదే భగవంతుడి సంకల్పమయితే అలాగే కానియ్యండి." ఇలా చెప్పి ఆమె చేతులు చాపింది. పరిస్థితిని ఆమె ధైర్యంగానయినా అమాయకంగా, ఎదుర్కోడం, తమతో మాట్లాడటం చూసి, పోలీసు అధికారులు అర్థంచేసుకొన్నారు. ఆమె పిచ్చిదనుకొన్నారు కొందరు; మరికొందరు ఆమె మూర్తిమత్వాన్ని చూసి ముగ్ధులయారు; అటువంటి మహాత్మురాలిని నిష్కారణంగా, అంత మొరటుగా అపనిందల పాలు చెయ్యడం, హింసించడం ఆ అధికారులను బాధించింది. వాళ్ళు ఆమెకు వినయంగా నమస్కరించి ఇడమన్నేల్ నుంచి వెళ్ళిపోయారు. అబద్ధపు అర్జీ పెట్టడం, దానిమీద పోలీసు దర్యాప్తు జరిగిన రోజుల్లో సుధామణి రాసిన పాట [భావం] ఇది:

ఓ భగవాన్ - ఓ భగవాన్ - భక్తవత్సలా ఓ భగవాన్ !
పావన పురుషా, పాపవినాశన
పాపులు మాత్రమే ఉన్నారా ప్రపంచంలో ?
ఎవరున్నారు ధర్మమార్గాన్ని బోధించేవారు ?
అచ్చులోనే, పుస్తకాల పుటల్లోనే కనిపిస్తాయి
సారభూతమయిన తత్త్వాలు.

కపటవేషాలే కనిపించేవన్నీ
ఓ కన్నా, దయతలచి కాపాడు,
పునరుద్ధరించు ధర్మాన్ని.

ఒకనాడు మునిమాపువేళ భక్తిసంకీర్తనం జరుగుతున్న సమయంలో మరో పోలీసు అధికారి, మొదటి దర్యాప్తుతో తృప్తిపడక, మరో కొత్త ఫిర్యాదును ఆధారం చేసుకుని ఇడమన్నేల్‌కు వచ్చాడు. అతనికి ఆశ్చర్యం కలిగేటట్లుగా, అక్కడి వాతావరణం ఉపశమనం కలిగించేటట్లుగా ఉంది. అపరాధం కాని, తప్పు కాని ఏదీ కనిపించక ఒకమాట మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

సుధామణి దైవభావాన్ని నాశనం చేద్దామని దుష్టులు తమ ప్రయత్నాలను ఇంకా కొనసాగించారు. వాళ్ళిప్పుడు, అనుకొన్న లక్ష్యాన్ని సాధించడానికి ఇంకా దుండగమయిన ప్రత్యక్షవ్యూహాలు చేపట్టారు. వాళ్ల మరుసటి పథకం ఏమిటంటే, భావదర్శన సమయంలో చిన్నచిన్న జట్లుగా ఇడమన్నేల్‌కు వెళ్ళడం, దైవభావంలో ఉండగా సుధామణిని పట్టుకోడం; ఆ విధంగా ఆమెను అవమానపరచడం, దర్శన కార్యక్రమాన్ని చెడగొట్టడం. ఆమెను పట్టుకొని [మాటల్లోను, చేతల్లోను] దురుసుగా ప్రవర్తించాలనుకొన్నారు. ఈ దుండగులు తాము ధైర్యవంతులమనీ, బలవంతులమనీ విర్రవీగుతారు కాబట్టి తమ పథకం సూటిగానే పారుతుందని నమ్మకంగా ఉన్నారు. అయినప్పటికీ వాళ్ళు సిగ్గుతెచ్చుకొని, రాత్రి గడవకముందే ఇడమన్నేల్ నుంచి వెళ్లిపోయారు. చెప్పలేని ఏ కారణంవల్లనో, వాళ్ళలో ఒక్కరు కూడా, దైవభావ సమయంలో సుధామణి దగ్గరికి చేరలేకపోయారు.

అయినా, జంకూ కొంకూ లేకుండా, మారణ విద్యలో ఆరితేరిన ఒక మాయల మాంత్రికుణ్ణి ఏర్పాటుచేశారు. అతను స్వయంగా ఇడమన్నేల్ వచ్చి సుధామణికి కొంచం 'పవిత్ర భస్మం' [విబూది] ఇచ్చాడు. ఆ విబూదిలో అతను దుష్టశక్తుల్ని ఆవాహన చేశాడు. ఇది నల్లగా కాలిన తాచుపాము బూడిద. ఇది చాలా శక్తి ఉన్నదనీ దీన్ని ఎవరిమీద ప్రయోగిస్తే వాళ్ల చావుమూడుతుందనీ నమ్మకం. దాన్ని చేత్తో తీసుకోడమే అశుభం; దానివల్ల గొప్ప వినాశం కలుగుతుంది. దాని పర్యవసానాలన్నీ తెలిసిన సుధామణి, ఆ మంత్రగాడి ఎదురుగానే, ఆ బూడిదను తన ఒంటికి రాసుకొంది. "దీనివల్ల ఈ శరీరం నశిస్తే నశించనియ్యి. అదే దేవుడి సంకల్పమయితే ఎవరయినా తప్పించుకోగలరా?" ఇంతకు పూర్వం ఎంతో మందిమీద ప్రయోగించిన తన మాయా మంత్ర విద్య ఎలా పనిచేస్తుందో, ఎలా బాధపెడుతుందో చూడాలని చాలాసేపు కాచుకొని ఉన్నాడు. గంటలకు గంటలు

గడిచిపోయినప్పటికీ ఎలాటి దుర్ఘటనా జరగకపోవడంతో ఆ మంత్రగాడు హతాశుడయి, తన ఘోరమయిన అపజయాన్ని ఒప్పుకొంటూ అక్కడినుంచి వెళ్ళిపోవలసి వచ్చింది.

ఇప్పుడిక ఆ దుండగులు, సుధామణినీ ఆమె దైవభావాన్నీ ఎలాగయినా అంతం చెయ్యాలని వ్యగ్రులయి ఉన్నారు; అన్నింటికన్న దారుణమయిన పథకం ఒకటి పన్నారు. కృష్ణభావ సమయంలో వాళ్ళు గుళ్ళోకి వెళ్ళి ప్రాణాంతకమయిన, విషపూరితమయిన గ్లాసుడు పాలు సుధామణికి అందించారు. సుధామణి ఏ మాత్రం లోపం లేకుండా తన పాత్ర నిర్వహించింది. ప్రసన్నంగా చిరునవ్వు నవ్వుతూ, ఏ మాత్రం జంకకుండా గ్లాసులో ఉన్న పాలన్నీ తాగేసింది. సుధామణి ఇక గుళ్ళో నేలమీద కూలిపోయి గిలగిల తన్నుకొంటూ ప్రాణాలు విడవడమే తరవాయి అన్నట్లుగా, హంతక స్వభావులయిన ఆ శత్రువులు ఆత్రంగా ఎదురుచూస్తున్నారు. కాని, వాళ్ళను హతాశులను చేసేటట్లుగా ఆమె, కొద్ది నిమిషాల తరవాత వాళ్ళకు ఎదురుగా తిరిగి, విషం కలిసిన పాలను భళ్ళున కక్కేసి ఏమీ జరగనట్లుగానే భక్తులను ఆదరించడం మొదలుపెట్టింది. ఆ హేతువాదులు అక్కణ్ణించి పారిపోయారు. ఆమెకు వ్యతిరేకంగా తాము చేపట్టిన ఉద్యమాన్ని తాత్కాలికంగా మానుకొన్నారు.

సుధామణికి ఎప్పుడూ ఎదురవుతూ ఉన్న మరో అవరోధం ఏమిటంటే, వాళ్ళ ఇంట్లోవాళ్ళ ధోరణి. అడ్డూ ఆపూ లేకుండా అయినవాళ్ళు వేధిస్తూ వస్తున్నా సుధామణి మనస్సు తన సమస్థితినీ, ఒరిమినీ బాధపడుతున్న మానవులను - స్నేహితుడయినా, శత్రువయినా; ఇంటివాళ్ళయినా, బయటివ్యక్తి అయినా - ఉద్ధరించాలన్న కారుణ్యాపూర్వకమయిన నిర్ణయాన్నీ చెదరనియ్యలేదు.

విరోధి సంస్థ ఒకటి ఏర్పడటం, అమాయకురాలయిన చిట్టితల్లికి హానిచెయ్యాలని అది ఉద్దేశించడం సుగుణానందన్‌కు పెద్ద మానసిక వ్యథ కలిగించింది. ఈ రోజుల్లో సుధామణికి, నీలి ఆకాశంకింద ఆరుబయట కూర్చుని ధ్యానంచేస్తూ రాత్రులు గడపడం అలవాటు. చిన్నప్పటినుంచి కూడా ఆమె, ఒంటరితనాన్నీ రాత్రి నిశ్శబ్దాన్నీ పవిత్రమయినవిగా భావించేది. ఎవరి జోక్యం లేకుండా, భగవంతుడితో సంపర్కం పెట్టుకోడానికీ దైవోన్మత్త భావంతో ఆనందంగా నృత్యం చెయ్యడానికీ ఆమెకప్పుడు అనువుగా ఉండేది.

ఆమె ఒంటరిగా కూర్చుని ఉన్నప్పుడు ఆమె పగవాళ్ళు దొంగతనంగా వచ్చి దాడీ చేస్తారేమోనని సుగుణానందన్‌కు భయం పెరిగింది. అందువల్ల ఒకనాడు, "అమ్మాయ్, వచ్చి ఇంట్లో పడుకో!" అన్నాడు. సుధామణి వాళ్ళ నాన్నకు దృఢంగా ఇలా చెప్పింది, "చూడు, నా ఇల్లన్నది నాకు లేదు. బయట నిద్రపోవడమే నాకు ఇష్టం. భగవంతుడు సర్వవ్యాపి; ఆయన అంతటా ఉన్నాడు; బయటా లోపలా కూడా. కనక, నాకెందుకు

ఎంత? ఎవరయినా నాకు కీడుచెయ్యాలని వస్తే దేవుడే నన్ను కాపాడతాడు.”

ఇక దమయంతి విషయానికి వస్తే, కృష్ణభావం మొదలయినప్పుడు ఆమెకు కృష్ణుడిమీద విశ్వాసం ఉండేది. కాని, భావం ముగిసిన తరవాత సుధామణిని తిడుతూ ఉండే మామూలు ధోరణి వెనకటిలాగే కొనసాగేది. దానికి కారణం, భావదర్శన సమయంలో మాత్రమే సుధామణిని కృష్ణుడు ఆవహిస్తాడనీ ఉత్తప్పుడు ఆమె, ఎప్పటిలాగే తలవంచుకొని పనిచేసుకుపోయే తన వెర్రి కూతురనీ తప్పుడు అవగాహనతో ఉండటం. కృష్ణభావ ఆవిర్భావం తరవాత దమయంతి, సుధామణిని ఇంటిపనుల బాధ్యతలనుంచి తప్పించక తప్పలేదు. లేకపోతే ఏ క్షణంలోనయినా ఆమె మనస్సు, ఒక కాలమూ ఒక స్థానమూ అన్న నిసబు లేకుండా పైకి తేలిపోయి సమాధిలోకి వెళ్ళిపోతుంది. వంటచేస్తున్నప్పుడో, ఉప్పుటేట్లోకి దిగి నడుస్తున్నప్పుడో పారవశ్యం కలిగిందంటే నిజంగా పెద్ద ప్రమాదం జరుగుతుంది.

వెనక చెప్పినట్టు, దమయంతి, తన కూతుళ్ళ విషయం వచ్చేటప్పటికి, చాలా చాదస్తంగా ఉంటుంది. దర్శనం పూర్తిఅయిన తరవాత సుధామణి భక్తులెవరితోనూ - ముఖ్యంగా పడుచువాళ్ళతో-మాట్లాడగూడదని ఆంక్ష పెట్టింది. మాట్లాడినట్లయితే, దమయంతి ఏ మాత్రం జంకకుండా, సుధామణిని గట్టిగా తిట్టేది, కొట్టేది. సుధామణి అసాధారణ ప్రవర్తన చెడ్డపేరు తెస్తుందనీ ఇంటిప్రతిష్ఠకు భంగం కలుగుతుందనీ ఇప్పటికీ ఆమె భయపడేది! సుధామణి ఇష్టానిష్టాలన్నిటికీ అతీతురాలయినప్పటికీ కూడా తల్లిదండ్రులు ఆమెను, భావదర్శన సమయంలో తప్ప మిగిలిన సమయాల్లో మామూలు పిల్లలాగే భావించేవారు; ఆమెకు కూడా మానవ సహజమయిన అనుభూతులు, ఆకర్షణలు, బలహీనతలు ఉంటాయనుకొనేవారు. ఆమెకు అందరికంటె చాలా దగ్గరగా ఉండేవాళ్ళు, ఆమె సతత బ్రహ్మనిష్ఠురాలు అన్న విషయం కాస్తంత కూడా గుర్తుపట్టలేకపోయారంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఆ ఇంట్లో అందరికంటే కొరకరాని కొయ్య ఎవరంటే, సుభగన్ అని చెప్పాలి. తన చెల్లెలు భక్తులను చేరదీసే విధానాన్ని అంగీకరించలేకపోయాడు; ఆనందాతిరేకంతో భక్తిగీతాలు పాడటాన్నీ ఆడటాన్నీ ఓర్చుకోలేకపోయాడు. ద్వంద్వాలన్నిటికీ అతీతురాలయిన సుధామణి ఆడవాళ్ళనూ మగవాళ్ళనూ పిల్లలనూ ముసలివాళ్ళనూ సమాన విధంగా చేరదీసేది. ఇది సుభగన్‌కు కోపకారణమయింది. అతను నాస్తికుడవడమే కాకుండా ఆడవాళ్ళు, మగవాళ్ళకు సేవకురాళ్ళనీ వాళ్ళు నోరు విప్పకుండా, ఎవరికంటా పడకుండా ఉండాలనీ అతని నమ్మకం. అతను తన చెల్లెలిని స్కిజోఫ్రేనియా రోగిగా పరిగణించాడు; ఆమెకు ఆటంకాలు కలిగించడానికి తన శాయశక్తులా ప్రయత్నించాడు.

ఒకనాడు అతను, కృష్ణభావ సమయంలో భక్తులు గుళ్ళో పెట్టిన నూనె దీపాన్ని

కావాలని పగలకొట్టాడు. ఆ రోజు రాత్రి దర్శనంకోసం వచ్చిన భక్తులు పగిలిన దీపం చూసి చాలా బాధపడ్డారు. దాని బదులు మరొకటి పెడదామంటే లేదు. అసంతృప్తిగా ఉన్న వాళ్ల ముఖాలు చూసి సుధామణి, కొందరు భక్తులను ఆల్చిప్పలు తెమ్మనమంది. వాటిలో వత్తులు వేసి నూనె లేకుండానే వెలిగించమంది. నూనె లేదు మరి! అప్పుడు అసాధ్యం సాధ్యమయింది. వత్తులు వెలగడమే కాకుండా, కృష్ణభావం అయిపోయే వరకు రాత్రంతా వెలిగాయి; నూనె లేకుండానే! ఇది ఎలా జరిగింది అని అడిగితే సుధామణి, "భక్తుల సంకల్పం వల్ల దీపాలు అలా వెలిగాయి," అని మాత్రం చెప్పింది. మరుసటి భావదర్శనం రోజున, పగిలిన నూనె దీపాన్ని గురించీ ఆ తరవాతి సంఘటనను గురించీ ఎరగని ఒక భక్తుడు, గుడికి నూనె దీపాలు అర్పించాడు. భక్తులు అడిగిన మీదట అతడన్నది ఏమిటంటే, అతనికొక కల వచ్చిందట; అందులో తనను చమురు దీపాలు తెమ్మని ఆజ్ఞ వచ్చిందట.

పొగరుబోతుతనంతో సుధామణిని ఎగతాళి చేసిన గ్రామస్థులు కొందరికి జీవితంలో గొప్ప విపత్తులు కలిగాయి. ఈ కింది సంఘటన అలాటి వాటిలో ఒకటి.

ఒకనాడు సుధామణి, దగ్గరలో ఒకరింటికి వెళ్ళి తిరిగి వస్తోంది. దారిపక్కన కొందరు గ్రామస్థులు నిలబడి ఉన్నారు. ఆమె వాళ్ళను దాటి వెళ్తూ ఉంటే, తనను వేధిస్తూ ఒకడు మాట్లాడటం సుధామణి వింది. ధనవంతుడయిన ఒక గ్రామస్థుడు మరొకతనితో బిగ్గరగా ఇలా అన్నాడు, "ఈ పిల్లని చూడు. దీనికి పిచ్చి. ఇది ఎప్పుడూ పాడుతూ ఆడుతూ, కృష్ణుడిలా దొంగవేషం వేస్తూ ఉంటుంది. ఎంత అర్థంలేని మాట! ఇది మానసికోద్రేకానికి సంబంధించిన సొమ్మ. దీనికి వాళ్ళ నాన్న కనుక పెళ్ళిచేసినట్లయితే జబ్బు కుదురుతుంది". అతని విమర్శాత్మక వ్యాఖ్యలు విని అతని స్నేహితులు విరగబడి నవ్వారు. పొగరుగా, ఇలా ఇలా అన్నాడు,"వాళ్ల నాన్నకి కట్నం డబ్బు కావలివస్తే, ఈ పిల్లకు పెళ్ళిచేసి పంపెయ్యడానికి రెండు వేల రూపాయలు అప్పు ఇస్తాను. అతనికి నేను ఈ రోజునే చెప్పాలి!"

సుధామణి ఏమీ మాట్లాడలేదు. ఇంటికి చేరగానే ఆమె దేవుడి గదిలోకి పరుగెత్తి లోపల తలుపు బిగించింది. అక్కడ కూర్చుని కృష్ణుడికి తన బాధ వెళ్ళబోసుకొంది. "ఓ కృష్ణా, వాళ్ళేమంటున్నారో వినలేదా నువ్వు? నేను పిచ్చిదాన్నట! నీ అందాన్ని గురించి వాళ్లకేమీ తెలియదు. తెలియకపోగా, వాళ్ళ స్వార్థపూరితమయిన జీవన విధానానికి నన్ను కట్టిపడెయ్యాలని చూస్తున్నారు. ఓ కృష్ణా! శరణాగత రక్షకా! నువ్వూ వదిలేశావా నన్ను? అదే జరిగితే, నా దుస్థితి చూసిన తరవాత నిన్ను ఎవరయినా ఎందుకు కొలుస్తారు? కేవలం నిన్నే తలుచుకొంటూ నేను కార్చిన కన్నీటికి కానుక ఇదేనా? ఈ నా ప్రేమా భక్తీ కేవలం పిచ్చిపిల్ల పలవరింతలేనా? ఇన్నాళ్లూ నాకున్న ఒకే ఒక ఓదార్పు నువ్వు.

నీలాకాశంలో, చిరునవ్వు చిందే నీ ముఖాన్ని చూస్తాను. కెరటాల్లో, నర్తించే నీ రూపాన్ని చూస్తాను. పొద్దుటివేళ పావురాల పాట నీ దివ్యమురళీగానమే! ఓ కృష్ణా, కృష్ణా......" ఇలా ప్రార్థిస్తూ ఆమె ఏడ్చి ఏడ్చి నేలమీద వాలిపోయింది.

ఇంతలో, సుధామణిని వేధించిన ధనికుడు ఆ నాటి చేపల వేటకోసం తన వేట పడవలనూ, వలలనూ తయారుచేసుకోడంలో మునిగిపోయాడు. తన పనివాళ్ళను పోగుచేసి సముద్రంలోకి దిగాడు. ఆ నాడు వాళ్ళకు ఎప్పుడూ పడనంత వేట పడింది. తెడ్లు వేసుకొంటూ, ప్రతి ఒక్కరూ మంచి ఉల్లాసంగా, ఒడ్డుకు వస్తున్నారు.

తిరిగి వస్తూ ఉండగా, పనివాళ్ళలో, సుధామణిని అభిమానించి పూజించే ఒకతను పడవ యజమానితో ఇలా అన్నాడు, "ఏమయినా, ఈ రోజున మీరు, అమాయకురాలయిన చిట్టితల్లిని వేధించారు; అది మంచి పని కాదు." దానికి ఆ యజమాని, ఎగతాళిగా ఇలా ఎదురు సమాధానం చెప్పాడు. "వేధిస్తే ఏం? ఏమయిందో చూడు; దాన్ని వేధించాను కనకనే, చాలా రోజులకంటే ఈ రోజున పెద్ద వేట దొరికింది!"

భక్తులు నోళ్ళు విప్పలేదు; తలలు వేలాడేసుకొన్నారు. పడవ ఒడ్డుకు చేరుతూండగా, యజమాని అకస్మాత్తుగా ఇలా అన్నాడు, "ఇదిగో, మనం నీండకర* ఎందుకు వెళ్ళకూడదు? అక్కడయితే, మనం పట్టిన వేటకు మంచి ధర పలుకుతుంది. పరయకడవులో ధరలు చాలా నాసిగా ఉంటాయి" అలా నిర్ణయించి పడవను నీండకరకు మళ్ళించారు. వాళ్ళు దాదాపు అక్కడికి చేరిపోయారు. కాని ఇంతలోనే సముద్రం పొంగడం మొదలుపెట్టింది. మరుక్షణంలో పెద్ద పెద్ద కెరటాలు లేచి కొయ్య పడవను ఎడా పెడా బాదడం మొదలుపెట్టాయి. నిండుగా చేపలూ వలలూ బెస్తలూ ఉన్న ఆ పడవను రాకాసి కెరటాలు పైకి విసిరేశాయి; కిందికి కుదేశాయి. పడవను అదుపులో ఉంచుకోడానికి పడవలో వాళ్ళు చేసిన ప్రయత్నాలన్నీ వమ్మయాయి. కెరటాలు నీటిని పడవలోకి విసరడంతో పడవ మునగడం మొదలయింది. మరొక క్షణంలో కొండంత కెరటం ఒకటి ఆ పడవను దొరకబుచ్చుకొని బండరాళ్ళకు వేసి కొట్టింది. పడవ ముక్కలు చెక్కలు అయింది. ఆ నాటి వేట అంతా సముద్రంపాలు అయింది; ధనవంతుల్లో ఒకడికున్న మంచి పడవలు ముక్కలయాయి; అతని వలలు బండరాళ్ళకు తగిలి చిరిగిపోయాయి. వాళ్ళ ప్రాణాలు మాత్రమే మిగిలాయి. ఎలాగో అతికష్టంమీద, ఆ పనివాళ్ళూ పడవ యజమానీ ఈదుకొంటూ ఒడ్డుకు చేరుకొన్నారు.

పొగరుబోతు పడవ కామందుకు ఎన్నడూ అనుకోని పెద్ద విపత్తు వచ్చింది. ఈ సారి, తల వేలాడేసుకొని ఒడ్డును పట్టి నడిచిపోవడం అతని వంతు అయింది. జరిగిన

*చేపల అంగళ్ళకు పేరు పొందిన ఊరు; కేరళలో ఉంది.

మహానష్టానికి తట్టుకోలేక గుండె పగిలి అతను ఇసకలో కూలిపోయాడు. పనివాళ్ళలో సుధామణి అభిమానులు, ఒకరితో ఒకరు గుసగుసలాడారు, "దేవుడి కోపం ఎలా ఉంటుందో చూడు. చిట్టితల్లిని వేధించిన తరవాత తనకు కలిగిన అదృష్టాన్ని గురించి ఇంతకుముందే గొప్పలు చెప్పుకున్నాడు. ఇప్పుడేమయిందో చూడు!" భక్తుడయిన మరో పనివాడు, "చిట్టితలికి సొమ్మరోగం ఉందని, ఆమెకు పెళ్ళిచేసి పంపెయ్యడానికి తను రూ.2000/-లు ఇస్తానని గొప్పలు కూడా చెప్పి పరయకడవు ఒడ్డునుంచి వెళ్ళాడు. ఇప్పుడు ఆ డబ్బు ఎక్కడ అప్పు చేస్తాడో చూడాలి!" అన్నాడు. పడవ, వలలు, ఆ నాటి వేట కలిపి మొత్తం అతనికి వచ్చిన నష్టం రూ.75,000/- లు. పనివాళ్ళు ఒక బస్సు పట్టుకొని ఇళ్లకు చేరుకొన్నారు. ఈ వార్త అంతటా వ్యాపించింది.

ఆ రోజుల్లో, సుధామణి మూడేళ్ళ చిన్నపిల్ల మాదిరిగా హఠాత్తుగా, ఉల్లాసంగా అయేది. కృష్ణభావ దర్శనానికి వచ్చిన భక్తులను ఆటపట్టించేది. దర్శనం ముగిసిన తరవాత, దొంగలా చొరబడి, నిద్రపోతున్న భక్తుల దగ్గరకి చేరేది. ఒక్కొక్కప్పుడు, ఒకామె చీరకొంగు కొసను మరొకామె జుట్టుకు ముడివేసేది. ఇతర సమయాల్లో, నోళ్ళు తెరుచుకొని నిద్రపోతున్న భక్తపుంగవుల నోళ్లలో గుప్పెడేసి ఇసక పోసేది. సుధామణి చుట్టాలబ్బాయి ఒకడు, హర్షన్ అనేవాడు, కుంటివాడు. అతనికి ఆమె మీద చాలా గౌరవం, అభిమానం. దర్శనం అయిన తరవాత, అతను అక్కడెక్కడయినా నిద్రపోతూ ఉన్నట్లయితే సుధామణి అతనికోసం వెతికి కనుక్కునేది. అతని కాళ్లుపట్టుకొని ఈడుస్తూ గిరగిరా తిప్పేది. అది అతనికి కూడా పెద్ద వినోదం. చిన్న పిల్లవాడిలా సుధామణి చేసే కొంటెపనులు చూసి భక్తులు విరగబడి నవ్వేవారు. చెల్లెలు చేసే ఇటువంటి పనులు సుభగన్‌కు నచ్చేవి కావు; ఆమె విపరీత ప్రవర్తనకు చివాట్లు పెట్టేవాడు. ఆధ్యాత్మికతలో ఓనమాలు కూడా నేర్వనివాడు సుధామణి ఉదాత్తస్థితిని ఎలా అర్థం చేసుకోగలడు? సుధామణి తన విచిత్ర ప్రవర్తనను గురించి ఇలా చెప్పింది:

"నా మనస్సెప్పుడూ పరమతత్వంలో లీనం కావడానికి పైకి ఎగసిపోతూ ఉంటుంది. దాన్ని కిందకి దింపడానికి ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటాను; అప్పుడయితేనే నేను, బాధపడే మానవులకు సేవ చెయ్యగలుగుతాను; భక్తులతో కలిసిపోగలుగుతాను. అందువల్ల అటువంటి ఆటలు ఆడుతూ ఉంటాను............అనుబంధం ఏర్పరచుకోకుండానే భక్తుల ప్రపంచంలో నా మనస్సు మెసులుతూ ఉండటానికి."



# ఆరో అధ్యాయం

## దివ్యమాత పుత్రికగా

ఉన్నతమయిన కాంక్షలు నా మనస్సులో వాటంతట
అవి స్పష్టంగా రూపుగట్టినప్పుడు దివ్యమాత, వెలు
గులీనే తన మెత్తని చేతులతో నా తల నిమిరింది.
నేను తల వంచి నా జీవితం ఆమెకే అంకితమయిందని
చెప్పాను.

- మాతా అమృతానందమయి.

శివస్త్వం గురుత్వం చ శక్తిస్త్వమేవ,
త్వమేవసి మాతా పితా చ త్వమేవ.
త్వమేవసి విద్యా త్వమేవసి బంధుర్
గతి ర్మే మతిర్దేవీ సర్వం త్వమేవ.

ఓ దేవీ, నువ్వే శివుడివి; నువ్వే గురువువు; నువ్వే ఆ
పరాశక్తివి. తల్లివి నువ్వే, తండ్రివి నువ్వే.
విద్య, బంధువులు, ఆధారం, తెలివి నాకు అన్నీ నువ్వే.

- దేవీ భుజంగం

### భక్తి

భక్తినీ దాని విశిష్ట ఆకర్షణనూ వర్ణించలేం. నిజమయిన భక్తుడి మనః పూర్వకమయిన ఆకాంక్ష ఎప్పటికీ భక్తుడిగా ఉండాలనే. స్వర్గం కాని మోక్షం కాని కావాలని కోరుకోడు. అతనికి భక్తే జీవితం; భగవంతుడే సర్వస్వం. పరమేశ్వరుడి

మహిమను గానం చెయ్యడంలోనే అతనెప్పుడూ ఆనందం పొందుతాడు. అందువల్ల భక్తిశాస్త్రాలు* అంటాయి:

> భక్తికి ఫలం భక్తే స్వాభావికంగా,
> ఈ దివ్యప్రేమ అమరానందం.

శుకమహర్షి అంతటివాడు కూడా, పరమ చైతన్యంలో సుప్రతిష్ఠితుడయి ఉన్నప్పటికీ భగవంతుడి మహిమలను కీర్తించడంలో గొప్ప ఆనందం పొందేవాడు. శుద్ధభక్తి వల్ల పొందే ఆనందం అంతటిది.

కృష్ణచైతన్యంలో పూర్తిగా ప్రతిష్ఠితురాలయిన సుధామణికి, పరాభక్తివల్ల ఆనందం పొందాలన్న తీరని దాహం ఉండేది. కాని కృష్ణభగవానుడితో ఆమెకున్న సంపూర్ణ తాదాత్మ్యం, ఆయన రూపాన్ని ధ్యానించడానికి కాని, ఆయన్ని గురించిన చింతనలో మునిగిపోడానికి కాని ఆమెకు సాధ్యంకాకుండా చేసింది. కృష్ణుడికి ఆమె చేస్తున్న ప్రార్థనలు అక్కడికక్కడ ఆగిపోయాయి; ఆమె కృష్ణసాధన ముగిసిపోయింది.

ఒకనాడు సుధామణికి ఒక అంతర్దర్శనం కలిగింది. దానివల్ల ఆమె పరమేశ్వర ప్రత్యక్షీకరణలోను, లోకసేవలోను పెద్ద మార్పు వచ్చింది. ఈ అనూహ్యమయిన అంతర్దర్శనం, సుధామణి దేవీసాధనకూ పరమేశ్వరుణ్ణి జగన్మాతగా సాక్షాత్కరింపజేసుకోవాలన్న ప్రగాఢమయిన అన్వేషణకూ దారితీసింది. సుధామణి ఇంట్లో ఒక గదిలో ఒంటరిగా కూర్చుని ఉంది. ఆమె కళ్ళు తెరుచుకొనే ఉన్నాయి కాని మనస్సు అంతర్ముఖమయింది; ఆమె ఆత్మభావంలో మునిగిపోయింది. ఇంతలో హఠాత్తుగా, ఆమెకు సరిగ్గా ఎదురుగా, ఒక ఉజ్జ్వల జ్యోతిర్గోళం ప్రత్యక్షమయింది. అది కుంకుతున్న పొద్దు మాదిరిగా ఎరుపు వన్నెలో ఉండికూడా చంద్రుడి మాదిరిగా ఉపశమనం కలిగిస్తోంది. ఆ జ్యోతిర్గోళం నేలమీద నిలవనూ లేదు, ఆకాశంలో వేలాడటమూ లేదు. అది గుండ్రంగా తిరుగుతోంది. చల్లదనాన్నిచ్చే ఈ గుండ్రటి కాంతిబింబం నేపథ్యంగా అమరేటట్లు వెలువడింది అత్యంత మనోహరమయిన దేవీరూపం. అప్పుడు సుధామణి, "ఓ కృష్ణా, అమ్మ వచ్చింది! నన్నామె దగ్గరకి తీసుకువెళ్ళు. ఆమెను కౌగిలించుకోవాలని ఉంది," అని అరిచింది. వెంటనే కృష్ణుడు తనను లేవనెత్తడం చూసింది సుధామణి. ఆయన సుధామణితోబాటు పైపైకి, మేఘాలకంటె పైకి అధిరోహించాడు. అక్కడామెకు వింత వింత దృశ్యాలు గోచరించాయి - ఎత్తయిన కొండలు, దట్టమయిన పెద్ద అడవులు, నీలివన్నె సర్పాలు, భయంకరమయిన గుహలు. కాని చిట్టితల్లికి దేవి ఎక్కడా

*'నారద భక్తి సూత్రాలు' వంటి భక్తిప్రధానమయిన గ్రంథాలు.

కనిపించలేదు. పసిపిల్ల మాదిరిగా సుధామణి, "మా అమ్మను చూడాలని ఉంది. ఎక్కడుంది మా అమ్మ?" అని అరిచింది; ఏడవడం మొదలుపెట్టింది.

మహామోహిని దివ్యదర్శనం ఆమెకు కనుమరుగయింది. అయినా సుధామణి గుండెలో దృఢంగా నిలిచిపోయింది. చిట్టితల్లి ఆ పారవశ్య స్థితిలో చాలా సేపు ఉండిపోయింది. ఆ క్షణంనుంచి ఆమె, దివ్యమాత మృదువయిన చిరునవ్వును, కరుణానిలయమయిన ముఖాన్ని మళ్లీ చూడాలన్న కోరిక ఆమెలో నిలిచిపోయింది. లెక్కలేనన్ని సార్లు శ్రీకృష్ణుడి దివ్యరూపాన్ని దర్శించిన సుధామణి, అమ్మవారి దివ్యప్రభను చూసి అప్రతిభురాలయింది. ఆమె హృదయం అమ్మవారికోసం ఉరకలెత్తింది. ఇప్పుడు ఆమెకున్న ఒకే ఒక కోరిక అమ్మను కౌగిలించుకోడం, అమ్మ ఒళ్ళో కూర్చోడం, అమ్మ బుగ్గమీద ముద్దుపెట్టుకోడం.

ఈ విధంగా, శ్రీకృష్ణుణ్ణి తప్ప మరే రూపాన్నీ ధ్యానించని సుధామణి, శ్రీకృష్ణుణ్ణి మించిన దైవం ఎవ్వరూ లేరని నమ్మినది, ఇప్పుడు ఆదిపరాశక్తి అయిన జగజ్జననిగా పరమేశ్వరుణ్ణి సాక్షాత్కరింపజేసుకోడానికి సర్వాత్మనా అంకితమయింది. కృష్ణభావంలో గడిచిన కాలం తప్ప మిగిలిన అన్ని సమయాల్లోనూ ఆమె, దివ్యమాత జ్యోతి స్వరూపాన్ని గురించి గాఢమయిన చింతన చేస్తూనే కనిపించేది. ఆమె దర్శనం కావాలన్న తపనాగ్ని, సుధామణి హృదయంలో రాత్రింబవళ్ళు రగులుతూనే ఉంది. వెనకయితే, చిట్టితల్లి ఇంటిపనులు, ఆమె ఈ భౌతిక ప్రపంచంలో పనిచేస్తూ ఉండిపోవలసిన అవసరాన్ని కల్పించాయి. ఇప్పుడు ఈ సంకెల విడిపోయింది; ఈ స్థూలమయిన అస్థిత్వ తలానికి అతీతంగా ఉండిపోయింది. శరీర సంరక్షణకు అవసరమయిన చాలా కనీసపు జాగ్రత్తలు తీసుకోడానికి కూడా ఆమె పెనుగులాడవలసి వస్తోంది. కొన్ని నెలలపాటు ఆమె, తులసి దళాలతోను, తీర్థంతోను మాత్రమే బతికింది.

ఒక్కొక్కప్పుడు సుధామణి, గాఢమయిన ధ్యానంలోంచి బయటికి వచ్చినప్పుడు ఆమె గట్టిగా ఏడుస్తూండటం వినవచ్చేది:

"అమ్మా! అమ్మా! ఎక్కడికి వెళ్ళావు? ఆ నాడు నువ్వు వచ్చింది నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోవడానికేనా? ఈ నీ కూతురిమీద కనికరం ఉంచు. సాటిలేని నీ దివ్యమంగళ విగ్రహాన్ని మళ్ళీ మరోమాటు చూపించు! ఓ అమ్మా, నేను తగినదాన్నయితే, నన్ను నీలో కలుపుకో. ఈ ఎడబాటు బాధను నేనింక భరించలేను! ఓ జగజ్జననీ, గుండె పగిలేటట్లుగా ఈ బిడ్డ పిలుస్తున్న పిలుపును ఎందుకు పట్టించుకోవు? నన్ను అక్కున చేర్చుకో; నన్ను నీ ఒళ్ళోకి తీసుకో!"

నా కన్నీళ్లతో కడుగుతాను నీ పాదాలు
ఓ కాత్యాయనీ, విడిచిపెట్టకమ్మా నా చేతిని....
ఎన్ని దినాలు కావాలమ్మా నీకు,
నీ రూపదర్శనం ప్రసాదించడానికి నాకు?
నేను కోరేది ఇవ్వడానికి నువ్వు జాప్యం చేసినా
నా మనస్సు తృప్తితోనే ఉండిపోతుంది నీ మాయవల్ల.
అనుమతిస్తావా నువ్వు నన్ను,
ఒక ఎర్రటిపువ్వు నీ పాదాలమీద ఉంచడానికి ?

తిరుగాడుతున్నాను ఈ ఒంటరి దారిలో
నిన్ను కనుక్కోవాలన్న ఆశతో
జాలి ఏమయినా ఉందా నీ రాతి గుండెలో,
చెప్పవమ్మా, ఓ కామరాజప్రియా!

సుధామణి, కృష్ణసాధనకు చివరిలో, అంతటా ఉన్నది కృష్ణుడేనని ఎలా అనుకొందో, ఇప్పుడు అలాగే అంతటా దేవి వ్యాపించి ఉన్నట్లుగా అనుభూతి పొందింది. మొక్కలతోను, చెట్లతోను, పక్షులతోను, పశువులతోను మాట్లాడుతూ, ఆ అమాయకురాలు తిరుగుతూ ఉండేది. నేలే తనకు తల్లి అనిపించింది; ఇసకలో దొర్లుతూ "అమ్మా! అమ్మా! ఎక్కడున్నావు? ఎక్కడున్నావు?" అంటూ పిలుస్తూ ఉండేది.

ఒకనాడు ధ్యానం ముగించుకొన్న తరవాత, సుధామణి, దేవుడి గదిలోంచి బయటికి వచ్చింది. అప్పుడు హఠాత్తుగా ఆమెకు తానొక పసిపాపననీ ప్రకృతి దివ్యమాత అనీ అనుభూతి పెల్లుబికింది. ఆ భావంలో ఆమె పాపలా నేలమీద పాకుతూ ఒక కొబ్బరిచెట్టు దగ్గరికి వెళ్ళింది. అక్కడ కూర్చుని కన్నీళ్ళు కారుస్తూ వాదులాడింది, "అమ్మా...ఓ అమ్మా.... నా కంటికి కనిపించకుండా ఎందుకు దాక్కున్నావు? నువ్వు ఈ చెట్టులో దాక్కున్నావని నాకు తెలిసింది. నువ్వు ఈ మొక్కల్లో ఉన్నావు; ఈ జంతువుల్లో ఉన్నావు; ఈ పక్షుల్లో ఉన్నావు. ఈ భూమి నువ్వే కాని మరేదీ కాదు. ఓ అమ్మా, కడలి కెరటాల్లో, ఈ చల్లగాలిలో ఎలా దాక్కున్నావమ్మా! ఓ అమ్మా, తప్పించుకుంటున్న అమ్మా!..." మరుక్షణంలో ఆమె, కొబ్బరిచెట్టే జగన్మాత అన్న అనుభూతితో దాన్ని కౌగిలించుకొంది.

ఒక్కొక్కప్పుడు సుధామణి నేలమీద పడుకొనేది. కాని విశ్రాంతికోసం కాదు. భౌతిక ప్రపంచంమీద గాఢమయిన ఏవగింపు కలిగిందామెకు. చుట్టూ మనస్సును

ఉబుకొనే వస్తువులతోను, పూర్తిగా విషయ సుఖాల్లో మునిగిపోయిన మనుషులతోను ఉన్న ప్రపంచం ఆమెకు ఎన్నడూ నచ్చుబాటు కాలేదు. అందువల్ల నేలమీద పడుకొని అనంతాకాశాన్ని, వెండిమబ్బులను, మెరిసే నక్షత్రాలను, వెలిగే సూర్యుణ్ణి, మనస్సును ఫ్లలబరిచే చంద్రుణ్ణి - ఏ వేళ ఏవి కనిపిస్తే వాటిని పట్టి పట్టి చూస్తూ ఉండేది. ఆకాశంలో కారుమబ్బులు గుమిగూడినప్పుడు సుధామణి ఇప్పుడు అక్కడ శ్రీకృష్ణుణ్ణి చూడటం లేదు; పొడుగ్గా జాలువారుతున్న వంకులు వంకుల జుట్టును - జగన్మాత జుట్టును - చూస్తోంది. అనంతాకాశంలో వేలాడే ప్రతి ఒక్క వస్తువూ, సుధామణి దేవిని తలుచుకోడానికి ఒక సాధనం అయింది. అక్కడ పడుకొని ఉన్నప్పుడు ఆమె ఎన్నడూ నిద్రపోయేది కాదు. చూసేవాడికి నిద్రలా కనిపించినా కూడా నిజానికి అది నిద్ర కాదు; ఎడతెరిపి లేకుండా కన్నీళ్లతో జగజ్జననికి చేసుకొన్న వేడుకోళ్ళవల్ల కలిగిన అపస్మార స్థితి.

ఆ రోజులను గురించి, ఆ తరవాత సుధామణి ఇలా చెప్పింది:

"నేను నడుస్తున్నప్పుడు అడుగడుక్కూ దివ్యనామాన్ని జపించేదాన్ని. ఎప్పుడూ మంత్ర మననం అయిన తరవాతే మరో అడుగు వేసేదాన్ని. అడుగువేసేటప్పుడు ఒకవేళ మంత్ర మననం మరిచిపోయినట్లయితే వెంటనే అడుగు వెనక్కి వేసే దాన్ని. అడుగు తీశాక మంత్రం అనుకొనేదాన్ని. ఆ తరవాతే ముందుకు వెళ్ళేదాన్ని. ఎప్పుడయినా బయటి పనుల్లో మునిగి ఉండవలసివచ్చినట్లయితే పని ముగించేలోగా మంత్రాన్ని ఇన్నిసార్లు మననం చెయ్యాలని ముందుగా నిర్ణయించుకొనేదాన్ని. ఏట్లో స్నానం చేసేటప్పుడు, నీళ్ళలోకి దూకకముందే నిర్ణయించుకొనేదాన్ని; నీళ్లపైకి వచ్చేలోగా మంత్రాన్ని ఇన్నిసార్లు జపించాలని. నా కెన్నడూ గురువు లేరు; ఎవరూ దీక్ష ఇవ్వలేదు; ఫలానా మంత్రమంటూ ఏదీ ఉపదేశించలేదు. నేను జపించిన మంత్రం, 'అమ్మ, అమ్మ' అని."

"పరమ గాఢమయిన భక్తి ఏర్పడ్డ స్థితిలో, చేతలు సహజంగా అణిగిపోతాయి," అని శాస్త్రం చెబుతుంది. ఇది సుధామణి విషయంలో స్పష్టంగా కనిపిస్తుంది. పొద్దున ఆమె పండ్లు తోముకొనేది. మరుక్షణంలో ఆమె మనస్సు దివ్యమాతను గురించిన తలపులో లీనమయేది. ఈ స్థితి గాఢమయి, ఒక్కొక్కప్పుడు వరసగా కొన్ని గంటలదాకా ఉండేది. మొదట ఆమె స్నానాల గదికి వెళ్ళేది. తువ్వాలు తెచ్చుకోలేదన్న సంగతి ఆ తరవాత గుర్తుకు వచ్చేది. తువ్వాలు తెచ్చుకొని వచ్చిన తరవాత, సబ్బు లేకుండా వచ్చానని గమనించేది. అప్పుడనుకునేది, "అమ్మా, స్నానం చేద్దామన్న ప్రయత్నంలోనే ఎంత కాలం వృధా అయిపోయిందో! దీని బదులు, నా మనస్సు ఎల్లవేళలా నీమీద నిలిచి ఉండేటట్లు

చెయ్యి! నిన్ను తలవని ఒక్క క్షణమయినా నా గుండెను కోతపెడుతుంది......" అని స్నానం చేద్దామని మొదట అనుకొన్న పని మానేసి స్నానాల గదిలో కూర్చుని సమాధి స్థితిలోకి వెళ్ళిపోయేది. గంటలకు గంటలు అలా గడిచిపోయేవి. అంతవరకు ఆమెకోసం వెతుకుతున్న వాళ్ళకు స్నానాల గదిలో ధ్యానంలో మునిగి ఉండటం కనిపించేది. ఆమెకు స్పృహ తెప్పించడానికి ఒక బాల్చీ నీళ్ళు ఆమె నెత్తిన పోసేవాళ్ళు. సుధామణి స్నానం, చివరికి ఈవిధంగా జరిగేది! ఇది పని చెయ్యకపోతే ఆమెను గట్టిగా కుదిపేవాళ్ళు ఒక్కొక్కప్పుడు, ఆమెను ఇంట్లోకి మోసుకొని వెళ్ళక తప్పేది కాదు.

ఈ సముద్రతీర ప్రాంతంలో సరైన మరుగుదొడ్లు ఉండేవి కావు. ప్రతి కుటుంబం, ఉప్పుటేట్లో [కట్టెల కూర్పుతో] ఒక చిన్న పరంజా అమర్చుకొనేది. దాని చుట్టూ, అల్లిన కొబ్బరాకుల చట్రం అమర్చేది. మలమూత్ర విసర్జనకోసం ఒక చెక్కమీద కూర్చోవలసి వచ్చేది. అలాంటి మరుగు దొడ్లో కూర్చుని ఉన్న సందర్భాల్లో, బాహ్యస్పృహ పోవడంవల, ఉప్పుటేట్లో పడిపోవడం చాలాసార్లు జరిగింది.

సుధామణి జగన్మాత ధ్యానంలో మునిగిపోయి గంటలకు గంటలు అలా కూర్చుండిపోయేది. ధ్యానానికి కూర్చునేముందు ఆమె మనస్సులో ఇలా నిశ్చయించుకొనేది, "నేను ఇంతసేపు కూర్చోవాలి," అని. తరవాత తన దేహానికి ఆజ్ఞ జారీచేసేది, "దేహమా, ఇక్కడ కూర్చో," అని. దేవికి ఇలా చెప్పేది, "నీ టక్కులు నామీద ప్రయోగించకు. నీ దగ్గిరే ఉంచుకో. నన్ను, కూర్చుని ధ్యానం చేసుకోనియ్యకపోతే నిన్ను పోనియ్యను!" అనేది. ఏదయినా బయటినుంచి ఇబ్బంది కలిగినట్లయితే సుధామణి, దేవిని కొరికేది, ఆమె జుట్టు పీకేది, ఆ తరవాత తెలిసేది, తనను తానే కొరుక్కున్నట్టూ తన జుట్టు తానే పీక్కున్నట్టూ.

ఒకనాడు, సుధామణి మొదట్లో అనుకొన్నంతసేపు కూర్చోలేకపోయింది; ఎవరో తనను గట్టిగా కుదుపుతున్నట్టు అనిపించి ధ్యానానికి భంగం కలిగింది. అప్పుడు సుధామణి అనుకొంది, "ఇది ఆమె యుక్తి! ఆమె నన్నెందుకు కూర్చోనియ్యడంలేదు?" సుధామణి చటుక్కున కళ్ళు తెరిచి దేవుడి గదిలోంచి పరుగెత్తుకుపోయింది. దేవిని కొడతానని బెదిరిద్దామని, మరో నిమిషంలో ఒక కొయ్యగూటం తీసుకొని చక్కా వచ్చింది. గుంటాన్ని చేత్తో పైకెత్తి దేవివైపు అరిచింది, "ఈ వేళ నేను......" మరుక్షణంలో తన తెలివి తక్కువతనాన్ని తెలుసుకొంది. ఆలోచించింది. 'ఏమిటి? దేవిని కొట్టడమా? ఇది సరైనదేనా? సాధ్యమా?' గుంటాన్ని జారవిడిచి ధ్యానం కొనసాగించింది.

సుధామణి దివ్యమాతను తలుచుకోకుండా ఒక క్షణంకూడా వృధా చెయ్యదు. ఎవరయినా ఆమెతో మాట్లాడినట్లయితే దేవే మాట్లాడుతున్నట్లు ఊహించుకొనేది.

అవతలి వ్యక్తి ఇంకా అలా మాట్లాడుతూ ఉన్నాక, చిట్టితల్లి మరో లోకంలోకి చిత్రంగా జారిపోయిందని తెలుసుకొనేవాడు. దేవిని తలుచుకోనిదే ఏ క్షణమయినా గడిచినట్లయితే, సుధామణి ఎంతో బాధపడిపోయేది. "అమ్మా, ఇంత సమయం వృధా అయిపోయింది," అని ఆమెకు చెప్పుకొనేది. నష్టపోయిన కాలాన్ని పూడ్చడానికి ఆమె, ఆ రోజున తన ధ్యాన సమయాన్ని పొడిగించుకొనేది. ఒక ధ్యానాన్ని కనక ఎప్పుడయినా మానుకోవలసి వస్తే ఆనాటి రాత్రి అంతా నేలమీద పచార్లు చేస్తూ మంత్రాన్ని మననం చేస్తూ మనస్ఫూర్తిగా ప్రార్థన చేసేది, "అమ్మా, నిన్ను ధ్యానించలేకపోయినట్లైతే ఈ జన్మ ఎత్తి ఉపయోగం ఏమిటి? లేకపోతే, నన్ను మింగెయ్యడానికి మాయ ఒక్కటే కాచుకొని ఉంది. ఓ అమ్మా, నాకు బలాన్ని ఇయ్యి! నీ దర్శనమియ్యి! నిత్యమంగళమయిన నీలో నన్ను కలుపుకో!"

సుధామణికి అన్నింటికంటె ఇష్టమయినది, నీరవ నిశీథివేళల్లో సముద్రపు ఒడ్డున ధ్యానం చెయ్యడం. ఆమె దృష్టిలో, ఒడ్డున విరిగి పడే అలలు పవిత్రమయిన ఓంకారనాదాన్ని ప్రతిధ్వనింపజేస్తూ ఉంటాయి. మిలమిల మెరిసే లెక్కలేనన్ని చుక్కలతో సువిశాలమయిన ముదురు నీలపు ఆకాశంలో జగన్మాత అపరిమిత దివ్యత్వాన్ని ప్రతిఫలింపజేస్తోంది. ఒక్క క్షణంలో సుధామణి మనస్సు అంతర్ముఖమయేది; దానంతట అది ఆత్మనిషితమయేది.

అలాటి రాత్రుల్లో, కూతురుకోసం సుగుణానందన్ వెతకవలసి వచ్చినట్లయితే, ఆమె ఇంట్లోకాని, దొడ్లోకాని కనిపించకపోతే ఆందోళన పడిపోయేవాడు. చివరికి, వెతుక్కొంటూ సముద్రం దగ్గరకి వెళ్ళేవాడు. అక్కడ చిట్టితల్లి కనిపించేది; కదల్చలేని బండమాదిరిగా కూర్చుని ధ్యానంలో లీనమయి ఉండేది. సుధామణి నడిరాత్రి వేళల్లో సముద్రపు ఒడ్డుకు వెళ్ళేది ఎందుకో తెలియని గ్రామస్థులు కొందరు ఆమెను గురించి పుకార్లు ప్రచారం చెయ్యడం మొదలుపెట్టారు. చివరికి ఇది సుగుణానందన్ చెవుల్లో పడింది. అప్పటినుంచి అతను, తన కూతురు రాత్రివేళ సముద్రపు ఒడ్డుకు వెళ్ళకుండా గట్టిగా కట్టడిచేశాడు.

పైన తెలిపిన సంఘటనలు, సుధామణి దేవీసాధనలో ఆరంభదశను తెలియజేస్తాయి. అయితే వీటినిబట్టి ఆమె కుటుంబంవాళ్లు మాత్రం, ఆమెకు పిచ్చి పట్టిందని ఇంకా పూర్తిగా నమ్మారు. శుద్ధభక్తిలో కలిగే ఈ ఉన్నతస్థితులు సాధారణ వ్యక్తి ఊహకు అందనివి. ఒక్కొక్కప్పుడు సుధామణి చిన్నపిల్లలాగ ఏడ్చేది; ఒకానొక అగోచర వ్యక్తిని పిలుస్తూ ఉండేది; ఇతర సమయాల్లో చప్పట్లు చరిచి బిగ్గరగా నవ్వేది. ఆ తరవాత నేలమీద దొర్లేది. లేకపోతే, "అమ్మా, అమ్మా" అని అరుస్తూ

నీటి కెరటాలను ముద్దుపెట్టుకొనేది. ఆ ఒక్కతె కోసం ఈ ఒక్కతె చేసే పలాయనాన్ని పిచ్చితనమని పొరపాటు పడటంలో ఆశ్చర్యంలేదు. కృష్ణభావ దర్శనానికి వచ్చే భక్తులుకూడా, జగన్మాతతో ఐక్యం కావడానికి సుధామణి గాఢ లాలసతో చేసే అన్వేషణను అవగాహన చేసుకోడంలో ఘోరంగా విఫలమయారు.

వింత ఏమిటంటే, ఆమెను పిచ్చెక్కినదాన్నిగా ఇంట్లోవాళ్లు పరిగణించినప్పటికీ దానికి కారణాన్ని కాని నివారణను కాని కనుక్కోడానికి ఎన్నడూ ప్రయత్నించలేదు. ప్రయత్నించకపోగా, ఆమెను ఎత్తిపొడవడం, హింసించడం కొనసాగిస్తూనే ఉన్నారు; ముఖ్యంగా ఆమె అన్న సుభగన్. వాళ్ల అమానుష చర్యలు కారణంగా, సుధామణి, సముద్రంలోకి దూకి చనిపోవాలని చివరికి నిశ్చయించుకొంది. ఆమె ఏడుస్తూ దివ్యమాతను పిలిచింది. "నేనంత క్రూరురాలినా? ఇంట్లోవాళ్ళు నామీద క్రూరత్వం చూపిస్తూనే ఉన్నారెందుకు? ఆకర్షించే వాళ్ళనే ప్రేమిస్తారు జనం. ఈ లోకంలో శుద్ధమయిన ప్రేమను నేనెక్కడా చూడలేను. ఓ అమ్మా, అంతా నాకు మాయలా కనిపిస్తోంది. అమ్మా, నీ భక్తులను కాపాడేదానివి కావా నువ్వు? నేను నీ బిడ్డను కానా? నన్ను విడిచి పెట్టేశావా? అలాగయితే నేనీ శరీరాన్ని ఎందుకు మొయ్యాలి? నాకూ ఇతరులకూ కూడా భారమే ఇది. నీ బిడ్డను అందుకో, ఓ కడలి తల్లీ!" నిశ్చితమయిన మనస్సుతో సుధామణి సముద్రంవైపు పరుగెత్తింది. సముద్రం దగ్గరకి చేరి దూకబోతూ ఉండగా, సువిశాలమయిన సముద్రం అమ్మవారిలాగే కనిపించి, తన మనస్సును భౌతిక తలంలో నిలుపుకోలేక ఆమె, సమాధిస్థితిలోకి వెళ్ళిపోయింది; ఒడ్డుమీద ఇసకలో, స్పృహ తప్పి పడిపోయింది.

సుధామణి బంధువు హర్షన్, ఆమె శ్రేయోభిలాషి, భక్తుడు. ఇడమన్నేల్ నుంచి పరుగెత్తుకుపోతూ ఆమె చేసిన వీడ్కోలు ప్రార్థన అతని చెవుల్లో పడింది. ఆమె ఉద్దేశాన్ని ఎలాగో అర్థంచేసుకొని తొందర తొందరగా ఆమెను వెంబడించాడు. ఆమె సముద్రపు ఒడ్డున స్పృహ లేకుండా పడి ఉండటం చూసి, ఆమె ఇంకా ప్రాణంతో ఉండగానే కనుక్కోగలిగినందుకు భగవంతుడికి కృతజ్ఞతలు తెలిపి, ఇడమన్నేల్‌కు మోసుకొని వచ్చాడు.

ఊళ్ళోవాళ్ళలో చాలామంది, ఆమెను పిచ్చిదానిగానే లెక్కవేసినా ఆమె పరిస్థితిని చూసి జాలిపడ్డారు. "చూడు, ఎంత జాలిగొలిపే స్థితిలో ఉందో! వెర్రిపిల్ల! ఆమెను చూసేవాళ్ళు ఎవ్వరూ లేరు; కన్నవాళ్ళుకూడా విడిచిపెట్టేశారు. ఆరోగ్యంగా, మామూలుగా ఉన్నప్పుడు ఆమె వాళ్లకోసం రాత్రనక, పగలనక చాకిరీ చేసింది. ఇప్పుడు ఆమెను గురించి జాగ్రత్త తీసుకోటానికే ఆసక్తి లేదు వాళ్లకి. ఈ పిల్ల వాళ్లపిల్ల కాదా మరి?"

చుట్టుపక్కల ఇళ్ళలో ఉండే ఆడవాళ్ళు కొందరు చిట్టితల్లికి ఆప్యాయంగా సేవచెయ్యడం మొదలుపెట్టారు. అసాధారణురాలయిన ఈ బెస్తపిల్లమీద ఆ స్త్రీలకు చిన్నప్పటినుంచీ గాఢమయిన అభిమానం ఉంది. ఇప్పుడు వాళ్ళు కృష్ణభావ భక్తులు; ఆ సమయాల్లో సుధామణి ఆధ్యాత్మిక శోభనూ సర్వజన ప్రేమనూ ఆరాధించినవాళ్ళు. ఆమె ఉదాత్త ఆధ్యాత్మిక స్థితులను గురించి వాళ్లకు ఎలాగో కొంత అస్పష్టమయిన అవగాహన ఏర్పడింది. అవకాశం దొరికినప్పుడల్లా వాళ్ళు చిట్టితల్లికి సాయంచేసి ప్రమాదంనుంచి కాపాడుతున్నారు.

ఇడమన్నేల్‌కు సరిగ్గా ఎదురుగా ఉన్న నివేశన స్థలంలో చెల్లమ్మా ఆమె కూతురు వత్సలా ఉండేవారు. వత్సల, సుధామణిని తన దగ్గరి స్నేహితురాలిగా చూసుకొనేది; ఆమెమీద అంతులేని ప్రేమ ఉండేది. వాళ్ళు ఇడమన్నేల్‌కు చేరువలో ఉండటంవల్ల, సుధామణి స్పృహలేకుండా ఉప్పుటేట్లో పడిపోవడాలు వాళ్ళే చాలాసార్లు గమనించేవారు. వెంటనే ఆమెను నీళ్లలోంచి ఒడ్డుకు తెచ్చేవారు. ఆమె ఒళ్ళు తుడిచి, వేరే బట్టలు వేసేవారు. పుష్పవతి భాస్కరన్ భార్య. ఇద్దరూ నిష్ఠగల భక్తులు. ఆమె సుధామణిని తన కూతురిలా చూసుకొనేది; ఆమెను ఇంట్లోవాళ్ళు ఎలా హింసిస్తున్నారో చూసి జాలిపడేది. రమ, రతి అనే అక్కచెల్లెళ్ళు ఇడమన్నేల్‌కు పక్కనే ఉంటూండే వారు; వాళ్ళిద్దరికీ సుధామణి అంటే ప్రాణం. ఐశా సుధామణికి చుట్టమే. దయగా, ఆప్యాయంగా ఉండే సుధామణిని ఆమె ప్రేమతో తలుచుకొంటూ ఉంటుంది. సుధామణి తీవ్రమయిన తపస్సు చేసే రోజుల్లో సేవ చేసినవాళ్ళు ఈ స్త్రీలే. సుధామణిని వాళ్ల ఇంటివాళ్లు పూర్తిగా ఉపేక్షించడంవల్ల, ఈ స్త్రీలు తమకు చేతనయినప్పుడల్లా సాయంచేయడానికి పూనుకొనేవారు. తరచుగా చిట్టితల్లి పరిసరాల స్పృహ కోల్పోయినప్పుడు, వాళ్ళలో ఎవరో ఒకరు, ఆమె బురద నీళ్ళలోనో మురికి ప్రదేశం లోనో పడి ఉండటం చూసేవారు. మళ్ళీ ఆమెకు తాము స్పృహ తెప్పించలేక పోయినట్లయితే ఆమెను చేతులమీద వేసుకొని వాళ్ల ఇంటికి తీసుకొని వెళ్ళేవారు. ఆమె పసిపిల్ల అన్నట్లుగా, ఆమె పండ్లు తోమేవారు; వేణ్ణీళ్ళ స్నానం చేయించేవారు; మంచి బట్టలు కట్టేవారు; తమ చేతులతో అన్నం తినిపించేవారు.

వెనకటి తీరుగానే సుభగన్, సుధామణినీ ఆమె దైవభావాన్నీ వ్యతిరేకిస్తూనే ఉన్నాడు. కృష్ణభావాన్ని ఆపెయ్యమని ఆమెను చాలాసార్లు ఒత్తిడి చేశాడు. అది అవమానకరమయిన విషయమనీ దానివల్ల కుటుంబ గౌరవానికి మచ్చ ఏర్పడుతుందనీ అనుకొన్నాడు. తను అనుకొన్న ప్రకారం జరగడం లేదని గమనించి అతడు, ఇంకా తీవ్రమయిన చర్యలు తీసుకోవాలని నిశ్చయించుకొన్నాడు.

ఒకనాడు భావదర్శనం అయిన తరవాత సుధామణి ఇంట్లోకి రాబోతూ ఉంది. సుభగన్ కొరకొరా చూస్తూ గుమ్మానికి అడ్డంగా నిలబడ్డాడు. "ఈ ఇంట్లో అడుగుపెట్టకు! ఈ సిగ్గుచేటు పాటలూ, ఆటలూ నువ్వు కట్టిపెట్టేశాకే ఇంట్లోకి రానిస్తాం!" అని అరిచాడు. దీన్నే దైవాజ్ఞగా భావించి సుధామణి, ఉలక్కుండా, పలక్కుండా, బయటికి వచ్చి ముంగిట్లో కూర్చుంది. అక్కడకూడా కూర్చోడానికి వీల్లేదన్నాడు సుభగన్. ఈ మాటవిని సుధామణి, ఒక గుప్పెడు ఇసక తీసుకొని సుభగన్‌కి ఇచ్చి, "ఇది నీదే అయితే ఈ ఇసక [రేణువుల]ను లెక్కపెట్టు!" అంది.

అప్పటినుంచి ఆమె ఇంటి బయటే ఉంటూ వచ్చింది. ఇది ఆమెకు ఎంతో నచ్చింది. నెత్తిమీద ఆకాశమే కప్పు, నేలే పడక, చంద్రుడే దీపం, సముద్రపు గాలే ఆమెకు విసనగర్ర. ఈ కఠోర స్థితులే, సుధామణి దివ్యమాతను సాక్షాత్కరింపజేసుకోడానికి వైరాగ్యాన్నీ నిశ్చయాన్నీ తీవ్రతరం చేయడానికి ఉపకరించాయి. చేతులు పైకి ఎత్తి, కన్నీళ్ళు చెక్కిళ్ళమీంచి దిగజారుతూ ఉండగా, ఒక చిన్నపిల్ల తన తల్లిని వేడుకొంటున్నట్లుగా సుధామణి బిగ్గరగా అరిచేది, "అమ్మా, అమ్మా......నీ దర్శనంకోసం తపిస్తూ నేను చచ్చిపోవాలనా నువ్విక్కడ నన్ను విడిచిపోయింది? రోజులు ఒక్కొక్కటే గడిచిపోతున్నాయి. నా ఆశలన్నీ నీమీదే పెట్టుకున్నాను. నువ్వు కూడా విడిచిపెట్టేస్తావా నన్ను? నా నిస్సహాయస్థితిని చూడ్డం లేదా నువ్వు?"

ఈ కాలంలో సుధామణి ఈ కింది పాటలు రాసింది. [వాటి భావం ఇది]:

భక్తవత్సలే ! దేవీ ! అంబికే ! మనోహరీ
భక్తజనార్తిని తీర్చే శక్తిమంతురాలివి ఓ దేవీ !
తల్లివయినా నీవే, తండ్రివయినా నీవే,
మాతల భ్రాతలు నీవే గురునాథులూ నీవే.

నువ్వే కదా అన్నీ, దీనతను తొలగించగల
శక్తిశాలినివి ; తల్లివేరువే అన్నిటికీ.......
సార్వభౌమురాలివిగా నిలిచావు సర్వప్రాణులకూ
నువ్వే అన్నీ, రక్షకురాలివీ నువ్వే...........
ఈ మాట నమ్మి స్తుతిస్తున్నాను నిన్ను భక్తితో,
ఓ విశ్వదేవీ, చూడాలని కోరుతున్నాను నిన్ను.....
ఎన్నాళ్ళనుంచమ్మా, కోరుతున్నాను చూడాలని

నిన్ను!...... స్తుతిస్తున్నాను నిన్ను
క్షణమయినా విడవకుండా..........
తప్పేమయినా జరిగిందా నావల్ల ? లేక
నా దుఃఖాన్ని తొలగించే ఉద్దేశమే లేదా నీకు ?

బహూశా, నా అంతరాత్మ కాలి,
నుసి అయిపోవాలని ఉందేమో నీకు.
గజిబిజిగా ఉందంతా నాకు;
ఏమీ తెలియనిదాన్ని తల్లీ........
పిల్లలందరూ సమానమేనని తల్లికి,
నా గుండెలో ఉన్న నిజం అబద్ధమవుతుందా ?

నా బాధలు తొలగించడానికి, ఒకే ఒక విన్నపం,
కాసింత నీ కరుణామృతాన్ని
నీ కటాక్ష వీక్షణంతో చిలికించు.........
నీ పాదాలమీద పడతాను, నీ
సుందర ముఖారవిందం కళ్ళారా చూడాలని,
బతుకు పండాలన్న వరం కోరుతున్నాను.

ఓ అమ్మా, నా జీవితంలో తృప్తికోసం
ఒక్క చుక్క నీ ప్రేమను ఒలికించు
మండే నా ఎండుగుండెమీద.
ఎందుకు, ఎందుకు పోశావు కాలే నిప్పుకణికలను
ఎండిపోయిన తీగపాదుకు ఎరువుగా ?

ఎన్ని వేడి వేడి కన్నీటి చుక్కలు రాల్చలేదు
నీ ఎదుట, గోడు గోడున ఏడుస్తూ?
వినడం లేదా నువ్వు, నా గుండె చప్పుళ్ళను,
అణగారిన నిట్టూర్పుల ఆవేదనను ?
చందనపు చెట్ల అడవిలోకి, నిప్పును
చొరబడనిచ్చి ఆడుకోనియ్యకు,

తన బలం చూపనియ్యకు ఈ దుఃఖాన్ని,
పెళపెళా విరిగిన పెంకుల్లా చెదిరిపోనియ్యకు.

ఓ దేవీ, 'దుర్గా, దుర్గా' అని జపిస్తూ నామాన్ని
దారులన్నిటినీ మరిచిపోయింది, నా మనస్సు.
నాకు స్వర్గమూ వద్దు, అపవర్గమూ వద్దు,
అమ్మా, దుర్గా! నీమీద నిర్మల భక్తి ఒక్కటే కోరేది నేను......

తీవ్రమయిన తపస్సువల్ల సుధామణి శరీరం చాలా వేడిగా ఉండేది; ఆమె మండుతున్న నిప్పుల మధ్య నిలబడ్డట్లుగా ఉండేది. ఆ వేడికి తట్టుకోలేక, ఆమె బట్టలు కట్టుకోడానికి బాధపడేది. ఆ ఉడుకు తగ్గించుకోడానికని ఆమె ఉప్పుటేటి ఇసక బురదలో దొర్లేది. ఒక్కొక్కప్పుడు ఉప్పుటేట్లో మునక లోతున నిలబడి గంటల తరబడిగా గాఢధ్యానం చేస్తూ కనబడేది.

సుధామణి భక్తుల్లో చిత్తశుద్ధి గలవాళ్ళు కొందరు, ప్రత్యేక పూజలు జరిగే రోజుల్లో ఆమెను తమ ఇళ్ళకు ఆహ్వానిస్తూ ఉండేవారు. ఆమె సాన్నిధ్యం, ఆ సందర్భానికి ఆధ్యాత్మిక శోభను, శక్తిని చేకూరుస్తుందని వాళ్ళు నమ్మారు. ఈ కుటుంబాలవాళ్ళు సుధామణిని తమ ఇళ్ళకు బస్సులో తీసుకువెళ్ళేవాళ్ళు. ఒక్కొక్కప్పుడు, బస్సు నిలకడ చోట కాచుకుని ఉన్నప్పుడు సుధామణి దైవోన్మత్తురాలు కావడం జరుగుతూ ఉండేది. బయటి ప్రపంచాన్ని మరిచిపోయి ఆమె నేలమీద పడి దొర్లేది; ఆనందంతో విరగబడి నవ్వేది. అక్కడివాళ్ళు, ఈ స్థితికి అర్థం ఏమిటో తెలిసికోలేకపోయేవాళ్ళు. చిట్టితల్లి చుట్టూ మూగి ఆశ్చర్యంగా ఆమెను చూస్తూ ఉండిపోయేవారు. తక్కినవాళ్ళు ఆమెను ఎగతాళి చేసి, తిట్టి, పిచ్చిపిల్ల అని అంటూండేవారు. పిల్లలు ఆమె చుట్టూమూగి వెక్కిరిస్తూ ఉండేవారు. కాని అలాటి ప్రవర్తన ఏదీ సుధామణికి పట్టేది కాదు. ఆమె విహరించే లోకాన్ని ఏ ఎత్తిపొడుపు మాటలు చేరగలవు? ఈ అమాయకురాలి దివ్యానందమత్త భావాన్ని ఏ వేధింపు చెరపగలదు?

దివ్యమాతనుంచి ఎడబాటువల్ల కలిగిన గాఢవ్యథలో సుధామణి ఏడ్చేది; బిగ్గరగా అరిచేది. అలాంటి సమయాల్లో చిన్నపిల్లలు ఆమె చుట్టూ చేరి," అక్కా, ఏడవకు! తలనొప్పిగా ఉందా?" అని అడిగేవారు. ఆ తరవాత, ఆమె దేవిని చూడటానికి ఏడుస్తోందని కూడా వాళ్ళు తెలుసుకొన్నారు. ఏడుపు ఆపుకోలేని ఈ సందర్భాలో, సుధామణి చెల్లెళ్ళలో ఒకతె, చీర కట్టుకొని, జుట్టు విరబోసుకొని అమ్మవారిలా భంగిమ పెట్టి ఆమెకు ఎదురుగా నిలబడేది. సుధామణి గొప్ప ఆనందంతో ఆమె

దగ్గరకి పరుగెత్తి కౌగిలించుకొనేది. తాను ఇలాటి భావంలో ఉండగా అందమయిన అమ్మాయిలను ఎవరినయినా చూసినట్లయితే సుధామణి వాళ్ళ దగ్గరకి పరుగెత్తేది; వాళ్ళను కౌగిలించుకొని ముద్దులు కురిపించేది. వాళ్ళలో ఆమె దేవినే దర్శించేది.

సుగుణానందన్, తన కూతురు శరీరాన్ని ఉపేక్షిస్తూండటం చూసి, ఆమెమీద జాలిపడి ఎండవానలనుంచి ఆమెకు కాపుదలకోసం ఆకులతో పైన కప్పు వెయ్యాలని అనుకొన్నాడు. చిట్టితల్లి ఎక్కడో పడుకొని కాని కూర్చుని కాని ధ్యానంలో లీనమయి ఉండేది. అలాటి సమయంలో ఆమెకు నీడకోసం తల్లిదండ్రులు మరుగు ఏర్పరిచేవారు. మామూలు స్పృహ వచ్చిన తరవాత ఆమె, తల్లిదండ్రులు చేసినది చూసి మరోచోటికి వెళ్ళిపోయేది. "ఇదికూడా దుఃఖానికి కారణం అవుతుంది. ఎన్నాళ్ళు దాన్ని అలా ఉంచగలుగుతావు? నువ్వు వెళ్ళిపోతే దాన్ని ఎవరు చూస్తారు? దేనివల్లా చెక్కుచెదరకుండా వేడినీ చల్లదనాన్నీ వాననూ ఓర్చుకొంటూ వాటికి అతీతమవుతాను",అనుకొనేది.

జగజ్జననికోసం గాఢంగా తపించే ఆ రోజుల్లో సుధామణి, జగజ్జనని బిడ్డగా, రెండేళ్ళ పిల్లకుండే స్వభావం పొందింది. తల్లిమీద బిడ్డకుండే వైఖరితో ఆమె సంపూర్ణ తాదాత్మ్యం చెందింది. ఆమె చేష్టలన్నిటినీ ఈ యదార్థాన్ని దృష్టిలో పెట్టుకొనే చూడాలి. ఒకనాడు, ధ్యానంలోంచి బయటకి వస్తూండగానే సుధామణికి చాలా ఆకలి వేసింది; దాహం వేసింది. సరిగ్గా అప్పుడే పొరుగింటి పుష్పవతి తన పసిబిడ్డకు పాలు కుడుపుతోంది. సుధామణి తిన్నగా అక్కడికి వెళ్ళి పాలు కుడుస్తున్న పిల్లను పక్కకు తీసి, పాలకోసం తానే ఆ తల్లి ఒళ్ళో పడుకొంది. సుధామణి అకస్మాత్తుగా చేసిన ఈ పని పుష్పవతికి ఏమీ ఎబ్బెట్టుగా అనిపించలేదు సరికదా, ఆమెమీద మాతృప్రేమ వెల్లుబికింది. ఈ సంఘటన చాలాసార్లు జరిగింది. చివరికి పుష్పవతి, తన బిడ్డకు, అమాయికురాలయిన సుధామణి కంటబడకుండా పాలు ఇయ్యాలని తెలుసుకొంది.

ఒకనాడు సుధామణి, ఉప్పుటేరు దగ్గర, బురదా ఇసకా ఉన్నచోట స్పృహతప్పి పడి ఉంది. కొందరు భక్తులు చూశారు. ముక్కులు, కళ్ళు, చెవులు బురదతోనూ ఇసకతోనూ పూడుకుపోయి పడి ఉన్నస్థితిలో ఆమెను చూసేసరికి వాళ్ళ గుండెలు పగిలిపోయాయి. ముదురు నీలివన్నె చెక్కిళ్ళమీద ఎడతెగని కన్నీటి చారికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. భక్తులు వెళ్ళి, జాలిగొలిపే ఆమె స్థితిని గురించి సుగుణానందన్‌కు చెప్పారు. కాని వాటినతను పెడచెవిని పెట్టాడు. ఈ పరిస్థితికి వాళ్ళు ఎంతో బాధపడి తాము స్పృహ తెప్పించలేకపోతున్నందువల్ల చిట్టితల్లిని ఇంటికి మోసుకొనిపోవాలని నిశ్చయించారు. ఆమె ఒంటిమీద బురద అంతా కడిగేసి, అనుకోకుండానే, వాళ్ళన్నయ్య మంచంమీద పడుకోబెట్టారు. ఇక ఆమె సుఖంగా విశ్రాంతి తీసుకొంటుందని చెప్పి

వాళ్ళు వెళ్ళిపోయారు.

సుభగన్ తిరిగి వచ్చి, సుధామణి తన మంచంమీద పడుకొని ఉండటం చూశాడు. పట్టుపగ్గాలు లేకుండా అతనికి కోపం వచ్చింది. మంచాన్ని విరిచేస్తాడేమో అన్నంత దుందుడుకుగా ఊపటం మొదలుపెట్టాడు. "ఈ దిక్కుమాలిన దాన్ని తెచ్చి నా పక్కమీద ఎవరు పడుకోబెట్టారు?" అంటూ తనే పిచ్చివాడయిపోయాడు. మంచం విరిగి ముక్కలయింది. ఆ ముక్క చెక్కలమధ్య, ప్రపంచ స్పృహ లేకుండా పడి ఉంది సుధామణి. ఆ తరవాత ఈ సంఘటనను గురించి, తప్పిపోయిన ప్రమాదాన్ని గురించి తెలిసినప్పుడు ఆమె అన్నది ఒక్కటే, "దైవ సంకల్పం ఎలా ఉంటే అలా జరుగుతుంది; ఏది జరిగినా మన మేలుకే" మరుసటి దర్శనం నాడు, సుధామణి భక్తుల్లో ఒక వడ్రంగి, ఆమెకొక మంచం, మేజాబల్ల, కుర్చీలు కానుకగా ఇచ్చాడు. వెనుకటి రోజున జరిగిన సంఘటనను గురించి అతనికి ఏ మాత్రం తెలియదు. ఇది చూసి ప్రతి ఒక్కరూ ఆశ్చర్యపోయారు. దీన్ని గురించి అడిగినప్పుడు అతను, తనకొక కల వచ్చిందనీ అందులో కృష్ణుడు కనిపించి చిట్టితల్లికోసం ఇవన్నీ తెమ్మని చెప్పాడనీ అన్నాడు.



# ఏడో అధ్యాయం

## మనుషులకన్నా ఎంతో నయం

"మాట్లాడగలిగే శక్తి ఉన్నది మనుషులకే కాదు. జంతువులకూ పక్షులకూ మొక్కలకూ కూడా ఉంది. వాటిని అర్థం చేసుకొనే శక్తి మనకు లేదు. ఆత్మదర్శనం పొందినవారికి ఇవన్నీ తెలుస్తాయి".

- మాతా అమృతానందమయి.

అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ
వైరత్యాగః

అహింసలో నిలదొక్కుకొన్నవాడి దగ్గర అన్ని జీవులూ శత్రుత్వాన్ని విడిచిపెడతాయి.

- పతంజలి యోగసూత్రాలు.
సాధన పాదం, శ్లోకం 35.

సుధామణి ఆరుబయట ఉంటూండే రోజుల్లో కుక్కలూ, పిల్లులూ, ఆవులు, మేకలు, పాములు, ఉడతలు, పావురాలు, చిలకలు, గద్దలు ఆమె తోడు కోరి వచ్చి ఆమెకు దగ్గరి స్నేహితులు అయాయి. ఆమె సాధనలో ఈ దశ, సహజ శత్రువులయిన జీవుల్లో సామరస్యం కుదర్చడానికి, ఆకర్షణ వికర్షణల మచ్చ సోకని ప్రేమకున్న శక్తిని నిరూపిస్తుంది. ఆమెను రక్తసంబంధికులు విడిచిపెట్టేసిన కాలంలో, ఆమె ఆధ్యాత్మిక జీవనాన్ని తీవ్రంగా వ్యతిరేకించిన కాలంలో, ఎండ కాసినా వాన కురిసినా ఆమెతోనే ఉండి సేవ చేసినవి ఈ జంతువులే. ఈ జంతువుల ప్రవర్తనను కనక ఎవరయినా

జాగ్రత్తగా పరిశీలించినట్లయితే, సుధామణిని మనుషులకన్న అవే బాగా అర్థం చేసుకొన్నట్లు స్పష్టంగా కనిపిస్తుంది.

ఆ రోజుల్లో, సుధామణి తనవాళ్ళ ఇంటినుంచి వచ్చినదేదీ తినేది కాదు. దానికి కారణం, లౌకిక జీవన వ్యగ్రులయిన వాళ్ళు వండిన పదార్థాలు ఆమెకు పడకపోవడమే. మంత్రాలు జపిస్తూ వండిన ఆహారపదార్థాలను మాత్రమే ఆమె తినగలిగేది. ఒకనాడు ఆమె ధ్యానం ముగిసిన తరవాత గుళ్ళోంచి బయటికి వచ్చింది. ఆమెకప్పుడు చాలా ఆకలివేసింది, దప్పికగా ఉంది. తనవాళ్ళ ఇంటి ఆవు ఒకటి సరిగా గుడికి ఎదురుగా పడుకొని ఉంది. పొదుగునుంచి పాలు కుడవడానికి వీలుగా వెనక కాళ్ళను పెట్టింది, ఆ ఆవు. ఇది భగవంతుడు చేసిన ఏర్పాటేనని అనుకొంది సుధామణి; సరిగా ఆ పనే ఆమె చేసింది! ఆవుదూడలాగ పొదుగునుంచి నేరుగా పాలు కుడిచి ఆకలి దప్పికలను తీర్చుకొంది.

ఇదేదో అనుకోని సంఘటన అని మనమనుకోవడానికి వీలులేదు. ఆ నాటినుంచి ప్రతిరోజూ ఆ ఆవు, సుధామణి ధ్యానం ముగించుకొని గుళ్ళోంచి బయటికి వచ్చేవరకు గుడిముందు పడుకొని ఉండటం ఒక అలవాటుగా జరుగుతూ వచ్చింది. ముందు చిట్టితల్లికి పాలు కుడపకుండా, ఈ ఆవు, మేతకు వెళ్ళేదీ కాదు, తన దూడకు పాలు ఇచ్చేదీ కాదు! దీనికి చిరాకుపడి, సుగుణానందనూ అతని ఇంట్లోవాళ్ళూ, సుధామణి రాకకోసం కాచుకొని పడుకొనే చోటినుంచి ఆ ఆవుని లేవగొట్టి తోలడానికి చాలాసార్లు ప్రయత్నంచేశారు. ఆవుతోక పట్టుకొని లాగేవారు; దానిమీద బాల్చీలకొద్దీ నీళ్ళు పోసేవారు. ఎంత చేసినా అది గుడి ఎదుటినుంచి ఒక్క అంగుళంకూడా జరగలేదు.

కొన్ని రోజులు, చుట్టుపక్కలవాళ్ళు, చిట్టితల్లి తాగడానికని పాలు తెచ్చేవారు. అయితే, అవి స్వచ్ఛమయిన పాలు కావు; నీళ్లు కలిపినవి. సుధామణి ఎప్పుడయినా ఈ పాలు తాగితే వాంతి చేసుకొనేది. ఇలాటి సందర్భాల్లో, సుధామణికోసం నీళ్ల పాలు పంపినవాళ్ళు కూడా బాధలు పడవలసి వచ్చేది. ఈ కారణంగా, ఇకనుంచి తను, భగవంతుడు సమకూర్చినదే తాగడమో, తినడమో చెయ్యాలని నిశ్చయించుకొంది సుధామణి.

సరిగా ఆ మర్నాడే అసాధారణమయిన సంఘటన ఒకటి జరిగింది. దైవప్రణాళిక ఎంత గుప్తంగా పనిచేస్తుందో తెలియజేస్తుందది. పరయకడవుకు దక్షిణాన ఆరు కిలోమీటర్ల దూరంలో సుధామణి అమ్మమ్మగారి ఊరు భండారతురత్తు చదువరులకు జ్ఞాపకం ఉండే ఉంటుంది. ఆ ఊళ్ళో సుధామణి మేనమామ రత్నదాసన్, అలవాటు

ప్రాకారం కొట్టంలో ఉన్న ఆవులను విప్పాడు. వాటిని ముంగిట్లోకి తీసుకు వచ్చి శుభ్రపెట్టి కడుగుదామని అతని ఉద్దేశం. ఉన్నట్టుండి, ఆ ఆవుల్లో ఒకటి చెదిరిపోయి సముద్రంవైపుకు పరుగెత్తడం మొదలుపెట్టింది; అక్కణ్ణించి ఉత్తరం వైపుకు చటుక్కున మళ్ళింది. అది ఎంత వడిగా పరుగెత్తిందంటే, దాన్ని అందుకోడానికి రత్నదాసన్ చాలా కష్టపడవలసి వచ్చింది. చివరికది సుధామణి ఊళ్ళోకి మళ్ళింది. అంతకు ముందెన్నడూ అది అక్కడికి రానే లేదు. తిన్నగా ఇడమన్నేల్‌కు పరుగెత్తింది.

తరవాత జరిగిన సంఘటనలు చూస్తూ రత్నదాసన్ ఆశ్చర్యంలో మునిగిపోయాడు. ఆ ఆవు తిన్నగా, సుధామణి ధ్యానం చేసుకొంటున్న చోటికి వెళ్ళి సున్నితంగా ఆమెను ముట్టెతో తాకుతూ నాలికతో నాకుతూ, పాత స్నేహితురాలిమీద తన ప్రేమ కనబరచడం మొదలుపెట్టింది. అప్పటికీ సుధామణి గాఢధ్యానంలో నిమగ్నమయి ఉండటంవల్ల ఆ ఆవు, దగ్గరలోనే పడుకొంది; ఆమె ధ్యానంలోంచి బయటికి రావడానికి తాను కాచుకొని ఉన్నట్టు. కాస్సేపటికి సుధామణి కళ్ళు తెరిచింది. లీలగా గుర్తున్న ఆ ఆవుని గమనించింది. దాని దగ్గరకి నడిచింది. ఆ సమయంలో ఆవు, పాలు తాగడానికి ఆమెను ఆహ్వానిస్తున్నట్టుగా, వెనక కాళ్ళలో ఒకటి పైకి ఎత్తింది. సుధామణి తన పని తాను కానిచ్చింది; పూర్తిగా తృప్తి కలిగేలా పొదుగునుంచి పాలు కుడిచింది. కాస్త దూరంలో నిలబడి ఉన్న, చిట్టితల్లి మేనమామ, నమ్మలేనట్టుగా తల తిప్పాడు.

సుధామణి ఉన్న అపరిచిత స్థలానికి ఆ ఆవు రావడానికి ప్రేరేపించిన అదృశ్య శక్తి ఏది? సముద్రపు ఒడ్డు వెంబడి తీసిన పరుగుల్లో ఆవుకు ఒక ప్రత్యేక ప్రయోజనముందన్నది స్పష్టం. చాలా ఏళ్ల కిందట, సుధామణి తన అమ్మమ్మ ఇంట్లో ఉన్న కొద్దికాలంలో ఈ ఆవుకు సంరక్షణ చేసి ఉన్నప్పటికీ ఎన్నడూ లేని విధంగా ఈ జంతువు ప్రవర్తించడానికి గల హేతువు దానివల్ల తెలుస్తుందా? ఇక్కడ, హృదయ విజ్ఞత ముందు బుద్ధి తలవంచవలసిందే.

అనేక సందర్భాల్లో సుధామణి, ఆరుబయట ధ్యానంలో కూర్చుని ఉన్నప్పుడు, ఆమెకు బాహ్యప్రపంచ స్పృహ కలిగించడానికి అన్నట్లుగా, పాములు ఆమె ఒంటికి చుట్టుకొని ఉండటం కనిపించేది. ఇది కేవలం అలవోకగా జరిగిందని కొందరు పాఠకులకు అనిపించవచ్చు. కాని ఈ కింది ఉదంతాన్ని, అలవోకగా జరిగిందని కొట్టిపారేయడం చాలా కష్టం.

ఒకనాడు, ఇంట్లో వాళ్ళ వేధింపువల్ల, సుధామణి ఇడమన్నేల్ భూమిని విడిచి వచ్చేసింది. పొరుగున ఉండే ఒకావిడ ఆమెకు ఎదురుపడి ఓదార్చింది; ప్రశాంతతకోసం చిట్టితల్లిని తన ఇంటికి తీసుకువెళ్ళింది. అక్కడి దేవుడి గదిలోకి వెళ్లి సుధామణి

జగన్మాతకు తన ఆవేదనను వెలిబుచ్చుకొంది. ఆమె అప్పుడు కూర్చినదే ఈ కింది పాట [భావం]:

మనసా వాచా కర్మణా
నిరంతరం నిన్నే స్మరిస్తున్నాను
మరి ఎందుకు జాప్యం చేస్తావ తల్లీ
నామీద దయ చూపించడానికి?

ఎన్నో గడిచిపోయాయి ఏళ్లు
అయినా లేదు స్వస్థత నా మనస్సుకు
పొన్నమ్మా, కలిగించు కాస్త ఉపశమనం నాకు........

అల్లాడిపోతోంది నా మానసం, గాలిలో నావలా,
అమ్మా, ప్రసాదించు కాస్తంత మనశ్శాంతి
లేకపోతే పిచ్చిదాన్నయిపోతాను........

అలసిపోయానమ్మా; ఇక సహించలేను
వద్దు నాకు ఇలాటి జీవితం; నిలవలేను
ఓ తల్లీ, నువ్వు పెట్టే పరీక్షలకు !

నేనో దిక్కులేని అనాథను
అమ్మా, నువ్వు తప్ప మరెవ్వరూ లేరు నాకు
దయ ఉంచి ఆపు, నీ పరీక్షణం
నీ చెయ్యూత ఇచ్చి పైకి లేపు నన్ను..........

అకస్మాత్తుగా ఆమె మానసిక స్థితి మారిపోయింది; దైవోన్మత్తతలో పడిపోయింది. ఏడుస్తూ, నేలమీద పడి పొర్లుతూ తన బట్టలు చింపుకోడం మొదలుపెట్టింది. అదుపు చెయ్యడానికి అలవి కానంతగా అలా పొర్లుతూనే, మరుక్షణంలో విరగబడి నవ్వేది. ఆ ఇంటివాళ్లు ఆందోళన పడుతూ నివ్వెరపోయి చూస్తున్నారు. చిట్టితల్లిని ఎలా సముదాయించాలో వాళ్లకు పాలుపోవడంలేదు. ఒకపెద్ద పాము గుమ్మం దగ్గర కనిపించింది. అది పాక్కుంటూ సుధామణి ఒంటిమీదికి వెళ్లింది. స్పృహ లేకుండా ఉన్న ఆ పిల్ల మొహాన్ని, ఆ పాము తన నాలికతో నాకడం మొదలుపెట్టినప్పుడు, ఇంటివాళ్ళు బెదురు చూపులు చూస్తున్నారు. కొన్ని నిమిషాలసేపు ఇలా జరిగింది.

సుధామణికి వెంటనే తశ్శాంతి కలిగింది. మరికొన్ని నిమిషాలకు సుధామణి మనస్సు మామూలు స్పృహలోకి వచ్చింది. పాము ఆమె ఒంటిమీంచి కిందకి పాకి అదృశ్యమయింది. సుధామణికి బాహ్యస్పృహ తెప్పించే ఉపాయం పాముకు తెలిసినట్టు అవసరాన్ని బట్టి దాన్ని నేర్పుగా ప్రయోగించినట్టు చూపరులకు తెలుస్తుంది.

అన్ని రకాల పక్షులూ ఎప్పుడూ ఉంటూ ప్రకృతి సహజమయిన పరిసర లక్షణాన్ని చేకూరుస్తున్నాయన్న సంగతి ఇడమన్నేల్‌ను చూసిన వాళ్ళెవరయినా గమనించగలరు. అమ్మవారికి చిలకలు ఇష్టం కనక, సుధామణి ప్రత్యేకంగా చిలకలను ఎంతో ప్రేమతో చూసుకొంటుంది. ఒక్కొక్కప్పుడు ఆమె ఇలా విన్నవించుకొనేది, "ఓ అమ్మా, నా దగ్గరికి రావా". అనేసరికి ఒక చిలకల గుంపు ఆమె దగ్గరకి ఎగిరి వచ్చి నేలమీద వాలేది. ఒకనాడు ఒక భక్తుడు ఆమెకు ఒక చిలకను కానుకగా ఇచ్చాడు. అది ఎప్పుడూ సుధామణి చుట్టూ ఆడుతూ ఉండేది. చిట్టితల్లి దాన్ని ఎన్నడూ పంజరంలో పెట్టలేదు. ఒకనాడు సుధామణి, 'ఓ,ఎంత భయంకరమయినదీ క్రూరమయినదీ ఈ ప్రపంచం! సత్యం కాని, ధర్మం కాని రవ్వంతయినా ఎక్కడా కనిపించడంలేదు. అందరూ దగాకోర్లు; ప్రపంచం పాపులతో నిండిపోయింది. మానవజాతికి సరైన దారి చూపించేవారు ఒక్కరూ లేనట్టుంది,' అంటూ ఆలోచిస్తూ ఉంటే ఆమె చెక్కిళ్ల వెంబడి కన్నీరు కారుతోంది. ఆమె చాలాసేపు అలా అంతర్ముఖస్థితిలో ఉండిపోయింది. ఒక దశలో సుధామణి, తనకు ఎదురుగా నిలబడి ఉన్న చిలకను గమనించింది. అదికూడా దేనివల్లో బాధపడుతున్నట్లుగా కన్నీరు కారుస్తోంది. ఆమె గాఢ ఆవేదన ఆ పక్షి మనస్సును కూడా కరిగించింది.

ఈ చిలకతోబాటు మరో రెండు పావురాలుకూడా చిట్టితల్లి దగ్గర కాలం గడుపుతూ ఉండేవి. దివ్యమాతను ఉద్దేశించి ఆమె ఎప్పుడు పాట పాడుతున్నా ఈ మూడు పక్షులూ ఆమెకు ఎదురుగా నిల్చుని, రాగానికి అనుగుణంగా రెక్కలు విప్పుతూ గంతులు వేస్తూ నాట్యం చేస్తూండేవి.

ఇడమన్నేల్ భూమిలో ఒక పెద్దచెట్టుమీద గద్దగూడు ఒకటి ఉండేది. ఎందువల్లో ఆ గూడు చెదిరి కింద పడిపోయింది. గూడు నాశనమయింది; అందులో ఉన్న, కొత్తగా రెక్కలు వచ్చిన రెండు గద్దపిల్లలు [గరుడ పక్షులు] నేలమీద పడి ఉన్నాయి. అవి స్పృహ కోల్పోయి, ఏ అపాయానికయినా గురి కాగల స్థితిలో ఉన్నాయి. కొంతమంది అల్లరి పిల్లలు వాటిమీదికి రాళ్లు విసిరి వాటిని చంపడానికి ప్రయత్నించారు. కాని ఇంతలోనే సుధామణి అక్కడికి వచ్చి వాటిని కాపాడింది. వాటికి ఆశ్రయమిచ్చి బాగా పోషించింది. కొద్దివారాల్లోనే అవి, ఎగరగలిగినంత బలంగా తయారయాయి. అప్పుడు

సుధామణి వాటిని వదిలేసింది. ఈ గరుడ పక్షులు రెండూ, ఎప్పుడూ కృష్ణభావం మొదలయే సమయంలో వచ్చి గుడిమీద వాలి చాలాసేపు ఉండిపోయేవి. గరుడ పక్షి శ్రీ మహావిష్ణువు వాహనం కాబట్టి భక్తులకు ఆకర్షణగా ఉంటూండేది. ఈ రెండు పక్షులూ సుధామణితో ఏర్పరచు కున్న నిగూఢ సంబంధం, దర్శనానికి శోభ చేకూర్చడమే కాకుండా చిట్టితల్లి దివ్యత్వంమీద భక్తుల విశ్వాసాన్ని పెంపొందించింది కూడా.

దేవీసాధన కాలంలో సుధామణి, దివ్యమాత దర్శనంకోసం ధారాపాతంగా కన్నీళ్లు కార్చి శోష వచ్చి పడిపోయినప్పుడల్లా ఈ రెండు పక్షులూ ఆకాశంనుంచి ఎగిరివచ్చి ఆమె దగ్గర కూర్చునేవి; ఆమెను కావలి కాయడానికి అన్నట్టు. ఈరెండు పక్షులూ నోళ్ళు వెంబగా తెరచి, సుధామణి మొహంకేసి రెప్పలార్పకుండా చూస్తూ, ఆమె ఆవేదన చూసి అవికూడా కన్నీళ్ళు కారుస్తూండేవి.

ఒకనాడు మధ్యాహ్నం ధ్యానం ముగిసిన తరవాత సుధామణికి కరకరా ఆకలివేసింది. ఆ రెండు గరుడ పక్షుల్లో ఒకటి వెంటనే సముద్రంవైపు ఎగిరిపోయి మరికొద్ది నిమిషాల్లో, ముక్కుతో ఒక చేపను పట్టుకొని వచ్చింది. గద్ద ఆ చేపను సుధామణి ఒళ్ళో వేసింది. సుధామణి ఆ పచ్చిచేపను తినేసింది. ఈ సంగతి దమయంతికి ఎలాగో తెలిసింది. గరుడ పక్షి ప్రతిరోజూ వచ్చి చేపను అర్పించే సమయంకోసం ఆమె కాచుకొని ఉండేది. పక్షి చేపను జారవిడవగానే దమయంతి చటుక్కున వంగి చేపను దొరకబుచ్చుకొనేది; తన కూతురికి వండి పెట్టడానికని. సాధన కాలంలో, సుధామణి కృష్ణ సాక్షాత్కారం పొందాలన్న పట్టుమీద ఉన్నప్పుడు చేపలు తినడం మానేసింది; వాటి వాసనకే ఆమెకు డోకు వచ్చేది. కాని ఇప్పుడు, గరుడ పక్షితెచ్చే చేప భగవంతుడు పంపినది; అందువల్ల తినేది. గరుడ పక్షి ఇలా చేపను తేవడం కొంతకాలం జరిగింది.

చిట్టితల్లితో చాలా సన్నిహితంగా మసిలే మరొక జంతువు ఏదంటే పిల్లి . భావదర్శన సమయంలో ఈ పిల్లి, గుళ్ళోకి ప్రవేశించేది; ప్రదక్షిణ చేస్తున్నట్లుగా సుధామణి చుట్టూ తిరిగేది. ఆ తరవాత సుధామణి దగ్గర కళ్ళు మూసుకొని కూర్చునేది చాలాసేపటివరకు, అది ధ్యానం చేస్తోందేమో అనిపించేది భక్తులకు. ఒకసారి, ఈ పిల్లిని వదిలించు కోడానికి ఒకరు, ఏటి అవతలికి తీసుకొని వెళ్ళారు. ఆ మర్నాడే పిల్లి తిరిగి వచ్చి సుధామణి పక్కన కూర్చుంది.

విశ్వాసమన్నది కుక్కల సామాన్య లక్షణం. కాని, నలుపూ తెలుపూ పొడల కుక్క కొకదానికి ఉన్న అచంచలమయిన విశ్వాసం ఈ కింద ఉదంతాల ద్వారా తెలుస్తుంది. దేవికోసం సుధామణి ప్రార్థనలు చేస్తూ ఏడ్చి ఏడ్చి స్పృహతప్పి పడిపోయినట్లయితే ఆమెకు స్పృహ తెప్పించడానికి, కుక్క ఆమెను రాసుకొనేది; ఆమె ముఖాన్నీ ఒంటిని

నాకేది. ఇడమన్నేల్ నుంచి సుధామణి వెళ్లిపోతున్నట్లయితే కుక్క ఆమె పరికిణీ పట్టుకొని లాగేది; ఆమె వెళ్లకుండా ఆపడానికని, ఆక్షేపణ తెలుపుతున్నట్లుగా మొరిగేది. ఇతర సమయాల్లో అది, తన నోటితో ఒక అన్నంపొట్లం తెచ్చి, ఆమె తినడానికని ఎదురుగా పెట్టేది. ఆమెకు అర్పించడానికి తెచ్చిన అన్నంలో ఒక మెతుకుకూడా కుక్క ముట్టుకునేదికాదు. రాత్రిళ్లు, కుక్క సుధామణి దగ్గరే పడుకొనేది. ఆమె ఆకాశంవైపు తదేకంగా చూస్తూ పడుకోదలుచుకొన్నట్లయితే కుక్కనే తన తలగడలా ఉపయోగించుకొనేది.

ఒకనాటి రాత్రి సుధామణి ఉప్పుటేరు ఒడ్డున కూర్చుని ధ్యానం చేసుకొంటూ ఉంది. గాఢ సమాధిలో మునిగి ఉంది. దోమలు, దట్టమయిన దుప్పటి కప్పినట్లుగా ఆమె శరీరమంతటా ముసురుకొన్నాయి. సుగుణానందన్, అలాటి సమయంలో అక్కడికి వచ్చి ఆమెను పిలవడం మొదలుపెట్టాడు. జవాబు రాలేదు. అప్పుడు, ఇంట్లో అలవాటు ప్రకారం, ఆమె శరీరాన్ని మొరటుగా కుదపడం మొదలుపెట్టాడు. ఆమె శరీరమంతా ఒక పుల్లముక్కంత తేలికగా అయిపోయినట్లు గమనించాడు. "పీనుగులాగ అయిపోయింది ఒళ్లు. కాని, ఆమెను అలా చూడటం మాకు అదేమీ మొదటిసారి కాదు. అందువల్ల నేను గాభరా పడలేదు" అన్నాడు సుగుణానందన్, తరవాత ఆనాటి సంఘటనను వర్ణిస్తూ. అతను కూతురి పక్కన కూర్చున్నాడు. మరుక్షణంలో తెల్లకుక్క వచ్చి భయంకరంగా అరవడం మొదలుపెట్టింది. మరికొన్ని నిమిషాల్లో సుధామణి కళ్లు తెరిచింది; మామూలు స్పృహ వచ్చింది. ఆమె ఏ లోకంలో విహరిస్తూ ఉన్నప్పటికీ, సుధామణి మనస్సును ఆకర్షించే శక్తి [మానవులకంటె] జంతువులకు ఎక్కువగా ఉన్నట్లు అనిపిస్తుంది.

ఒక్కొక్కప్పుడు సుధామణి, ఆ కుక్కకున్న గాఢమయిన ప్రేమవల్ల, అదే దివ్యమాత అని అనుకొనేది. మరుసటి క్షణంలో, అంతా మరిచిపోయి, కుక్కను అక్కున చేర్చుకొని "నా తల్లీ, నా తల్లీ!......" అని బిగ్గరగా అరుస్తూ దానిమీద ముద్దులు కురిపించేది.

ఒకనాడు ధ్యానం చేస్తూండగా, సుధామణికి చాలా ఆందోళన కలిగింది. వెంటనే ఆమె లేచి హడావిడిగా ఊరివైపు నడిచింది. ఈలోగా, ఆ తెలుపూ నలుపూ పొడల కుక్క, కుక్కలను పట్టుకొనేవాళ్ళ చేతులకు చిక్కింది. అది బిగ్గరగా అరుస్తోంది; జాలిగొలిపేటట్టుగా ఏడుస్తోంది. కాని క్రూరత్వం మాత్రం చూపించడం లేదు. కుక్కలను పట్టేవాడి ఉచ్చు విడిపించుకోలేక అది, పట్టుకొన్నవాడు దాన్ని లాక్కుపోవడానికి అవస్థపడుతూంటే, అది కాళ్ళను నేలకు అదిమి పెట్టి ఈడుస్తోంది. సుధామణి స్నేహితురాళ్లూ అభిమానులూ అయిన ఆ ఊరి ఆడపిల్లలు కొందరు, విశ్వాసంతో ఎప్పుడూ సుధామణి వెంట ఉండే కుక్కే అది అని గుర్తుపట్టి, అది సుధామణి పెంపుడు

కుక్క అని చెప్పి, దాన్ని వదిలెయ్యమని కోరారు. దాన్ని వదలడానికి అతను సిద్ధం కాకపోవడంతో, లంచం ఎరపెట్టారు. ఈ సమయంలో సుధామణి చక్కా వచ్చింది. కుక్క, సుధామణివైపు, జాలి కలిగేలా చూస్తూ కన్నీళ్ళు కార్చడం మొదలుపెట్టింది! కుక్కను పట్టేవాడికి కూడా ఆశ్చర్యం కలిగింది. సుధామణినీ, ఆమెమీద కుక్కకున్న విస్పష్టమయిన ప్రేమనూ గమనించిన తరవాత అతను కుక్కను విడిచిపెట్టక తప్పింది కాదు. ఈ విధంగా, పట్టేవాళ్ల చేతుల్లోంచి ఆ కుక్కను ఎన్నో సార్లు విడిపించడం జరిగింది.

ఆ చుట్టుపక్కల ఉండే మరో కుక్కకు కూడా సుధామణిమీద గాఢమయిన ప్రేమ ఉండేది. ఒకనాడు, కుక్క కడుపుతో ఉన్నప్పుడు, గుడిపక్కన నిలబడి నిరీక్షిస్తూ ఉంది. ధ్యానం తరవాత సుధామణి బయటకి వచ్చినప్పుడు, గుడి వసారాలో కుక్క నిలబడి ఉండటం గమనించింది. అది లోపలికి రాలేదు. కాని దాని ముందర కాళ్ళను గుడినేల అంచుమీద పెట్టింది. ఏడుస్తున్నట్లుగా, ఒక వింత రీతిలో అరవడం మొదలుపెట్టింది. సుధామణి దాన్ని అక్కున చేర్చుకొని ముద్దుపెట్టుకొని "ఏమైంది బిడ్డా, ఏమైంది?" అంది. సుధామణి ఇలా చేసిన తరవాత కుక్క, గుడివసారాలోంచి దిగి వచ్చి, సుధామణి నిలబడ్డ చోటికి మరీ దూరం కాకుండా ఇసకలో పడుకొంది. మరికొద్ది నిమిషాల్లో అది ప్రాణం విడిచింది.

ఎవరయినా సుధామణి ముందు సాగిలబడి మొక్కినప్పుడు, నలుపూ తెలుపూ పొడల కుక్క తన ముందరి కాళ్ళు రెండూ సాచి, చిట్టితల్లి ముందు తల వంచేది. భక్తి పారవశ్యంతో చిట్టితల్లి నర్తిస్తున్నప్పుడు ఆ కుక్క, తానుకూడా ఆనంద నర్తనంలో పాల్గొంటున్నట్లు, ఆమె చుట్టూ గంతులు వేసేది. ప్రతి సాయంత్రం మునుమాపువేళ శంఖం ఊదినప్పుడు, శంఖనాదాన్ని చాలా సన్నిహితంగా అనుకరిస్తున్నట్టుగా ఒక చిత్రమయిన తీరులో అరిచేది.

తనతో స్నేహంగా ఉండే నలుపు తెలుపుల కుక్క పిచ్చిపట్టి **(Rabies)** త్వరలో చచ్చిపోతుందని మనసుకు గట్టిగా అనిపించింది. రెండు రోజులకు అదే జరిగింది. కాని అట్టే బాధపడకుండానే ప్రాణం విడిచింది. మంచి తోడు పోయినందుకు బాధపడుతున్నావా అని సుధామణిని అడిగినప్పుడు, ఆమె, "అది చచ్చిపోయినందుకు నాకు ఏ మాత్రం విచారంలేదు. చచ్చిపోయినా నా దగ్గరికి వస్తుంది. ఇక నాకెందుకు విచారం?" అంది. తరవాత, ఇడమన్నేల్‌కు దగ్గరలోనే అది మళ్ళీ పుట్టిందని సుధామణి చెప్పింది. కాని అంతకన్న వివరాలు తెలపలేదు.

తనమీద గొప్పప్రేమ ఉన్న మేకను గురించి సుధామణి ఇలా చెప్పింది.

పోదుగుకు పట్టిన జబ్బువల్ల మేకకు ప్రాణంమీదికి వచ్చింది. నేను ఎక్కడికో వెళ్ళి తిరిగి వచ్చిన సమయానికి అది చావబోతూ ఉంది. దాని బాధ చూసి నేను దానికి కాస్త ఎడంగా కూర్చుని, ప్రార్థనలోనూ ధ్యానంలోనూ మునిగిపోయాను. నేను కళ్ళు తెరిచేసరికి, ఆ వెర్రి మేక మోకాళ్ళమీద పాకుతూ నా దగ్గరికి వస్తూ ఉండటం గమనించాను. నా దగ్గరికి వచ్చి నా ఒళ్ళో తలపెట్టి, రెప్పలార్పకుండా నా మొహంలోకే చూస్తూ ప్రాణం విడిచింది. అదీ శుద్ధమయిన ప్రేమ!" కొన్నేళ్ళ తరవాత, ఈ సంఘటనలనన్నిటినీ నెమరువేసుకొంటూ ఆమె ఇలా అంది:

"నిజంగా ఎంత ఆనందంగా ఉండేవి ఆ రోజులు! చిత్రంగా, ఆ జంతువులు నా మనస్సును అర్థంచేసుకొని ఆ ప్రకారంగా నడుచుకొనేవి. నేను ఏడిస్తే అవికూడా నాతోబాటు ఏడ్చేవి. నేను పాడితే నా ఎదుట అవి నాట్యం చేసేవి. నాకు బయటి స్పృహ పోయినప్పుడు అవి నా ఒంటిమీదికి పాకేవి. అన్ని రకాల జంతువుల లక్షణాలూ మనుషుల్లో కనిపిస్తాయి. ఎవరయినా రాగద్వేషాలను విడిచిపెట్టి సమదృష్టి అలవరచుకొన్నప్పుడు, శత్రుత్వంగల జంతువులుకూడా అతని సన్నిధిలో స్నేహంగా ఉంటాయి."



## ఎనిమిదో అధ్యాయం

# కోటిసూర్యసమప్రభ

*చిరునవ్వు చిందిస్తూ ఆమె (దేవి) దివ్యప్రకాశంగా మారి నాలో కలిసిపోయింది. వన్నెవన్నెల దివ్యకాంతిలో స్నానమాడి నా మనస్సు పువ్వులా వికసించింది; నాలో, గతించిన అనేక లక్షల సంవత్సరాల వృత్తాంతాలు వెల్లువికాయి. అప్పటినుంచి, ఏదీ నాకంటె వేరుగా లేనట్లుగా, ఉన్నది ఒకే ఒక్కటిగా చూస్తూ, జగజ్జననిలో లీనమవుతూ విషయ సుఖాలన్నిటినీ విడిచివెళ్లేకాను.*

*- మాతా అమృతానందమయి*

దృశాద్రాఘీయస్యా దరదళిత నీలోత్పలరుచా
దవీయాంసం దీనం స్నపయ కృపయా మామపి శివే,
అనేనాయం ధన్యో భవతి న చ తే హానిరియతా
వనే వా హర్మ్యే వా సమకరనిపాతో హిమకరః.

ఓ శివానీ! అరవిచ్చిన కలువపువ్వు కాంతిని దూరానికి కూడా
సారించే నీ చూపుతో, దీనంగా ఇంత
దూరాన ఉన్న నన్ను కూడా పరిశుద్ధుణ్ణి చెయ్యి.
దానివల్ల, మానవమాత్రుణ్ణి అయిన నేను కూడా నా
ఉనికికి ప్రయోజనాన్ని పొందుతాను. హిమకరుడయిన
చంద్రుడు అడవిమీదా భువనంమీదా అదే కాంతిని
వెదజల్లుతాడు కదా !

సౌందర్య లహరి,
శ్లోకం 57.

దివ్యమాతమీద పరిపూర్ణ విశ్వాసం ఉంచి, బెస్తకన్నె అయిన సుధామణి అమర ప్రేమ మహాసాగరంలో ఈదులాడింది. ఆమె దృష్టిలో, వాతావరణ మంతా పైనా, కిందా, కుడిపక్కా, ఎడమపక్కా, ఆ తల్లి దివ్యసాన్నిధ్యంతో నిండి ఉంది. గాలి, ప్రేమతో కూడిన ఆ తల్లి లాలన. చెట్లూ, తీగలూ, పువ్వులూ అన్నీ ఆ దేవే; కాబట్టి వివక్షారహితమయిన సుధామణి ఆరాధనకు అర్హత ఉన్నవి. ఆకాశం వంక తదేకంగా చూస్తూ - ఏం చూస్తూనో, మనకు, తెలియదు కాని - సుధామణి ఆపుకోలేని కన్నీటి ధారలతో తనను తాను మరిచిపోతుంది; ఆమె సొమ్మసిల్లి ఇసకలో పడిపోయేవరకు అవి అణగవు. గుండె పగిలేటట్లుగా ఈ అనాదృత బాలిక అదృశ్యమాతకు చేసే ప్రార్థనలు, ఇడమన్నేల్‌లో రాత్రింబగళ్ళు ప్రతిధ్వనిస్తూ ఉండేవి. ప్రకృతి అంతా తన జగన్మాతేనన్న సాక్షాత్కార సిద్ధి స్థాయిలో ఉండి ఆమె రాసిన ఒక పాట [భావం] ఇలా ఉంది:

సృష్టివీ నీవే స్రష్టవీ నీవే
శక్తివీ నీవే సత్యమూ నీవే
అండకటాహ విధాతవీ నీవే
ఆదివీ అంతమూ నీవే ||సృష్టివీ ||
దేవీ.... దేవీ.... దేవీ.....
పరమాణు చైతన్యమూ నీవే
పంచభూతాలుగా నీవే ||సృష్టివీ ||
దేవీ... దేవీ... దేవీ.......

ఇప్పటి పరిచిత జంతువులే ఎక్కువగా కొలువుచేస్తూ ఉండగా, సుధామణి, నిద్రపోతూండటం కాని, తింటూ ఉండటం కాని కనిపించేది కాదు. తమంతట తాము ఎవరయినా మొదట తన దగ్గరకు వస్తే తప్ప ఎవరితోనూ ఆమె సంపర్కం పెట్టుకోలేదు. పళ్లు తోముకోడమన్న పనికికూడా ఉన్నతోన్నతంగా విహరించే ఆమె మనస్సుకు త్రాణ లేకుండా ఉండేది. ఆమె ఏమయినా తింటున్నట్టుగా కనిపిస్తే, ఆ తింటున్నది, పారేసిన తేయాకు ముక్కలూ, ఆవుపేడా, గాజుముక్కలూ, మానవ మలమూ! రుచికరమయిన ఆహారానికీ వీటికీ తేడా ఆమెకు తెలిసేది కాదు. మన మనస్సుకు కాని బుద్ధికి కాని అందని ఈ స్థితిని వర్ణించగల మాటలు ఏవీ?

ఆమె తన ఆవేదనను ఇక ఎంత మాత్రం భరించలేకపోయేది. జగన్మాతకు ఆమె ప్రార్థనలు ఎడతెరిపి లేకుండా వెలువడుతూ ఉండటం వినిపించేది.

“ఓ అమ్మా, ఈ ఎడబాటు బాధతో నాగుండె పగిలిపోతోంది! ఎడతెగని ఈ కన్నీళ్లను చూస్తున్నా నీ గుండె ఎందుకు కరగదు? ఓ తల్లీ, ఎందరో మహాత్ములు నిన్ను కొలిచారు; నీ దర్శనం పొందారు; ఎప్పటికీ నీలోనే కలిసిపోయారు. ఓ ప్రియజననీ! కరుణామయమయిన నీ హృదయాన్ని దీనురాలయిన నీ దాసికోసం తెరు, తల్లీ! మునిగిపోతున్నదాన్ని; ఊపిరాడనిదాన్ని. నా దరికి రావడానికి నువ్వు ఒప్పుకపోతే నా బతుకును తుదముట్టించు. క్రూరుల, దుర్మార్గుల తలలను ఉత్తరించే నీ కత్తి నా మెడ్తిన కూడా పడనియ్యి. కనీసం, నీ కత్తి తాకుడుతోనయినా నన్ను ధన్యురాల్ని చెయ్యి! నాకెంతో భారమయిన ఈ పనికిమాలిన శరీరాన్ని నిలుపుకోవడంలో అర్థమేముంది?”

సుధామణి హృదయావేదన పరాకాష్ఠకు చేరింది. ఆమె ప్రార్థనలు విన్నవించుకొంది. ఆమె మాటల్లోనే చెప్పాలంటే:

“తపనతో, నా ఒంటిమీది ప్రతి ఒక్క రంధ్రం విచ్చుకొనేది; పవిత్ర మంత్రంతో నా శరీరంలోని ప్రతి అణువూ స్పందించేది. నా అస్తిత్వం సర్వాత్మనా, ఒక ప్రచండ ప్రవాహంలాగ జగజ్జనని వైపు ఉరకలు వేసింది......”

చెప్పరాని ఆవేదనతో ఆమె ఇలా ఆక్రోశించింది:

“ఓ అమ్మా......ఇదిగో బిడ్డ బాధల అగాధంలో కూరుకుపోయి చావబోతోంది......ఈ గుండె పగిలిపోతోంది......ఈ అవయవాలు పట్టు తప్పిపోతున్నాయి........ఒడ్డుకు విసిరేసిన చేపలా గిలగిలా కొట్టుకొంటున్నాను........ఓ అమ్మా........నామీద జాలిలేదు నీకు......నా బతుకు కడ ఊపిరి తప్ప నీకు అర్పించగలిగినది నాకు ఏదీ మిగలలేదు............”

ఆమె గొంతు పూడుకుపోయింది. ఆమె ఊపిరి పూర్తిగా ఆగిపోయింది. సుధామణి స్పృహలేకుండా పడిపోయింది. తల్లి సంకల్పం ఆ క్షణాన్ని నిర్ణయించింది. దివ్యజగన్మోహిని, సర్వజ్ఞ, సర్వవ్యాపిని, సర్వశక్తిమయి, సనాతని, ఆదిశక్తి, జగజ్జనని, కోటిసూర్యసమప్రభ - మహోజ్జ్వలమయిన జీవద్రూపంలో సుధామణి ఎదుట స్సాక్షాత్కరించింది. సుధామణి హృదయం, వాచామగోచరమయిన ప్రేమానందాల సముద్ర తరంగంలా పెల్లుబికింది. దివ్యమాత, కరుణామయ మందహాసం చేసి, శుద్ధజ్యోతి స్వరూపిణిగా మారి సుధామణిలో లీనమయింది.

ఆ తరవాత జరిగిన దేమిటో సుధామణి సొంత రచన అయిన ‘ఆనంద వీథి’ లేదా ‘ఆనందమార్గం’ [అనే పాట] లో చాలా బాగా వర్ణించడం జరిగింది. మాటలకు అందని గుహ్యమయిన సంయోగాన్ని తెలిసేటట్లు చెప్పడానికి ఆమె అందులో ప్రయత్నించింది.

అనగనగా ఒక కాలంలో
నా ఆత్మ నర్తించేది
ఆనందవీథిలో, ఉల్లాసంగా......
ఆ సమయంలో, రాగాది
అంతశ్శత్రువులన్నీ పలాయనం చేసి
దాక్కున్నాయి లోలోపల నా చిత్త గహ్వరాల్లో.
నన్ను నేను మరిచిపోయి
నాలో కలిగిన బంగారు కలలో కలిసిపోయాను.

గొప్ప ఆకాంక్షలు నా మనస్సులో
వాటంతట అవి అంకురించినప్పుడు
తేజోమయ మృదుహస్తాలతో ఆ అమ్మ
నిమిరింది నా తలను.
నమ్ర శిరస్సుతో అమ్మకు చెప్పాను,
'ఈ జీవితం అమ్మకే అంకితమయింది'అని.

మందస్మితంతో, మారిపోయిందామె
దివ్యజ్యోతిగా కలిసిపోయింది నాలో ;
పువ్వులా విచ్చుకొంది నా మనస్సు
వన్నెవన్నెల దివ్యకాంతిలో స్నానమాడాను.
గడిచిన అనేక లక్షల సంవత్సరాల వృత్తాంతాలు
నాలో పైకెగశాయి; అప్పటినుంచి
దేన్నీ నాకు వేరయినదిగా చూడకుండా,
ఒకే ఒక్కటిగా దర్శించాను,
సచ్చిన్మయి సర్వసత్యస్వరూపిణిలో లీనమయాను.

విషయ సుఖాలన్నీ విడిచిపెట్టేశాను.
అమ్మ చెప్పింది నాకు, మానవ జన్మను
కృతార్థం చేసుకోమని పదిమందికీ చెప్పమని.
అందుచేత, ప్రపంచమంతకూ చాటుతున్నాను,
ఆమె పలికిన పరమ సత్యాన్ని- 'మనుజా,

నీలో నువ్వు లీనమవు !' అని.

వేనవేలుగా జ్ఞానులు జన్మనెత్తారు భారతభూమిలో.
అనేక మన్వంతరాలకు ముందు,
మర్త్యలోకంలోని దుఃఖాలు పోగొట్టాలని
మహామునులు దర్శించిన తత్త్వాలను
ఆచరణలో పెట్టి బతికారు.
ఎన్ని నగ్నసత్యాలున్నాయో వాటిలో !

ఈనాడు ఆనందంతో వణుకుతున్నాను నేను.
'ఓ, నా బంగారుకొండా, నా దగ్గరికి రా,
తక్కిన పనులన్నీ వదిలేసి
ఎప్పుడూ నాతోనే ఉన్నావు నువ్వు'

ఓ శుద్ధ చైతన్యమా,
ఓ రూపుగట్టిన సత్యమా,
నీ మాటలు వింటాను
ఓ తల్లీ ! ఎందుకు జాప్యం చేశావు రావడంలో ?
ఎందుకిచ్చావు ఈ జన్మ నాకు ?
నాకేమీ తెలియదు, ఓ తల్లీ,
నా తప్పులు మన్నించు.

ఈ స్థితిలో సుధామణికి ప్రతిదానిమీదా గాఢమయిన ఏవగింపు కలిగింది. నానావిధాలయిన ప్రపంచంనుంచి, విషయ వాసనాపరులయిన మనుషులనుంచి తప్పించుకోడానికి ఆమె, తనను తాను మరుగుపరుచుకోడానికి, పెద్ద పెద్ద గోతులు తవ్వేది. రాత్రింబగళ్ళు వాటిలో గడిపేది; దైవ సాక్షాత్కార సంజనితమయిన సంతత ఆనందాన్ని అనుభవిస్తూ ఉండేది; మనిషి పొడ సోకకుండా తప్పించుకొనేది. ఆమె పిచ్చిదని అంతకుముందు ఎవరికయినా అనిపించినట్లయితే, ఇప్పుడు ఆమె కచ్చితంగా పిచ్చిదేనని రూఢిచేసుకొన్నారు. ఆమె కుదురుకొన్న చైతన్యస్థాయిని ఊహించగలవారు ఈ జాలర్లలో ఎవరుంటారు? ఆంతరికంగా సుధామణి పరమాత్మ సన్నిధి గడప దాటి లోపలికి ప్రవేశించినప్పటికీ బాహ్యంగా మాత్రం, ఆమె కుటుంబంవాళ్ళూ గ్రామస్థులూ

భావించే విధంగా, వారానికి మూడు రాత్రులు కృష్ణుడు ఆవహించే ఆ పిచ్చి సుధామణి ఏదయినా మార్పు వాళ్ళు గమనించడమంటూ వస్తే అది, ఇటీవల ఇసకలో పొర్లకుండా గోతులు తవ్వుతూ ఉండటం మాత్రమే.

## దేవీభావ ఆరంభం

ఒకనాడు సుధామణికి, తన లోపలినుంచి ఒక స్వరం ఇలా అనడం వినిపించింది:

“పాపా, నేను అన్ని జీవుల హృదయాల్లోనూ ఉంటాను; స్థిరమయిన నివాసమన్నది లేదు. నువ్వు పుట్టింది కేవలం విశుద్ధ ఆత్మానందాన్ని అనుభవిస్తూ ఉండటానికి కాదు; బాధపడే మానవులకు ఉపశమనం కలిగించడానికి. ఇకనుంచి నువ్వు నన్ను అన్ని జీవుల హృదయాల్లోనూ ఆరాధించు; లోకంలో వాళ్ళ బతుకు బాధలు తొలగించు.....”

లోపలినుంచి వచ్చిన ఈ పిలుపు విన్న తరవాతే సుధామణి, కృష్ణభావానికి అదనంగా దేవీభావాన్ని కనబరచడం మొదలుపెట్టింది. ఈ రోజుల్లో ఆమె, దివ్యజననీ తానూ ఒక్కరేనని వెల్లడించింది. కాని, భక్తులు మాత్రం, కృష్ణుడితోబాటు అమ్మవారు కూడా ఆమెను ఆవహించిందని అనుకొంటూ ఉండేవారు. ఈ కింది సంఘటన ద్వారా దేవీభావం ఆరంభం తెలుస్తుంది.

కృష్ణభావ దర్శనం మొదలయి అప్పటికి ఆరు నెలలే అయింది. అది 1975 చివరిలో. ఒకనాటి రాత్రి కృష్ణభావం కొనసాగుతూ ఉండగా, భక్తులు ఒక్కరొక్కరే గుళ్ళోకి వస్తూ ఉండగా, అనుకోని సంఘటన ఒకటి మొత్తం వాతావరణాన్ని మార్చేసింది.

మామూలుగానే కొందరు భక్తులు, గుడిగది బయట వసారాలో భక్తిగీతాలు పాడుతూ ఉన్నారు. సుధామణి, శ్రీకృష్ణుడిగా పరబ్రహ్మతత్వంతో తనకు గల ఆంతరిక తాదాత్మ్యాన్ని ప్రత్యక్షం చేస్తూ భక్తులకు ఉల్లాసంగా దర్శనమిస్తోంది. మనోహరమయిన చిరునవ్వు చిద్విలాసంగా ఆమె ముఖబింబంలో లాస్యం చేస్తోంది. భక్తులు పరమానందభరితులయి దైవసాన్నిధ్యాన్ని అనుభవిస్తున్నారు. ఆ సమయంలో, ఒక భక్తుడు పుట్టెడు దిగులుతోను ఆందోళనతోను గుళ్ళోకి ప్రవేశించాడు. ఊరివాళ్ళలో విరోధి ఎవడో ఇతన్ని తీవ్రంగా వేధిస్తూ ఉన్నట్లు తెలుస్తోంది*. వాళ్ళు చేసిన కరుకయిన

*దుర్మార్గులు ఇప్పటికీ ఉంటూనే ఉన్నారు; భక్తులు వచ్చే పోయే దారి పక్కన నిలబడి దుర్వ్యాఖ్యలు చేస్తూనే ఉంటారు. ఊళ్ళోవాళ్ళు మాత్రమే కాకుండా సుధామణి తండ్రీ సోదరుడూ కూడా వాళ్ళతో చేరుతూ ఉంటారు. దర్శనం పూర్తి అయేవరకు ఉండిపోనివ్వకుండా భక్తులను నిరుత్సాహపరుస్తూ ఉంటారు.

జ్వాలలను భరించలేక అతను గుడ్డలో నీళ్లు కుక్కుకొని ఈ పరిస్థితిని చక్కదిద్దడానికి న్యాయం చూడమని కృష్ణుడికి విన్నవించుకొన్నాడు.

ఉన్నట్టుండి, ఆమె ముఖంలో ఉన్న మధుర మందహాసం మాయమయింది. సుధామణి ముఖకవళికలన్నీ పూర్తిగా మారిపోయాయి. ప్రళయకాలం ఆసన్నమయిందనిపించేటంత భయంకరంగా మారిపోయింది. ఆమె కళ్ళు, లోలోపల కాలుతున్న రెండు ఇనపగుండ్ల మాదిరిగా కనిపించాయి. కోపంతో రగిలిపోతూ చుట్టూ అగ్నిబాణాలు కురిపిస్తున్నట్లు అయింది. ఆమె వేళ్ళు దేవీముద్ర పట్టాయి. గుడికి లోపల బయటా ఉన్నవాళ్ళు, ఆమె చేసే భయంకర అట్టహాసానికి కొయ్యబారిపోయారు. పెద్దపెట్టున వెలువడే అటువంటి నవ్వును తమ జీవితాల్లో ఎన్నడూ వాళ్ళు వినలేదు. సుధామణిలో హఠాత్తుగా వచ్చిన మార్పు చూసి, ఏం చెయ్యాలో తెలియక, గుళ్ళో ఉన్నవాళ్లు వణకడం మొదలుపెట్టారు. అక్కడున్న వాళ్లలో కొందరు పండితులు బిగ్గరగా శాంతిమంత్రాలు పఠిస్తున్నారు; దివ్యజనని స్తోత్రగీతాలు ఆలాపిస్తున్నారు; కొందరు హారతి ఇస్తున్నారు. చాలాసేపు ప్రార్థనలూ మంత్రపురశ్చరణా అయిన తరవాత ఆమె [ఉగ్రత తగ్గి] శాంతించింది. కాని, కృష్ణభావం దేవీభావంగా మారిపోయింది.

ఉత్తరోత్తరా సుధామణి ఇలా చెప్పింది "ఆ భక్తుడి దురవస్థ చూడగానే, భక్తులను వెక్కిరిస్తూ వస్తున్న దుర్మార్గులందరినీ మట్టుబెట్టాలనిపించింది. తెలియకుండానే, బాధితుడికి శరణు ఇవ్వడానికి ఉగ్ర ప్రకృతిగల దేవి* ఆవిర్భవించింది." అప్పటినుంచి కృష్ణభావానికి తోడుగా, అమ్మ (శ్రీమాత) దేవీరూపంలో దర్శనమిస్తూ వచ్చింది. ఇకనుంచి ఆమెను అమ్మగానే ప్రస్తావిద్దాం.

అమ్మ, మూర్తీభవించిన విశ్వప్రేమ. ప్రజలను ప్రేమించాలనీ వాళ్లకు సహాయం చెయ్యాలనీ, సేవ చెయ్యాలనీ చాలా చిన్నప్పటినుంచి ఆమెకు ఉంటూ వచ్చిన గాఢమయిన కోరికవంటి సద్గుణాలు పూర్తిగా బహిర్గతమయాయి. చాలా లౌకికులను, చాలా ఆధ్యాత్మికపరులను, చదువుకోని వాళ్లను, బాగా చదువుకొన్న వాళ్లను, చాలా డబ్బుగల వాళ్ళను, చాలా నిరుపేదలను, రోగులను, ఆరోగ్యవంతులను అందరినీ సమాన దయాదాక్షిణ్యాలతో ఆదరించింది అమ్మ. తమ బరువు దించుకోడానికి వాళ్ళు చెప్పుకొనే సమస్యలన్నిటినీ ఓర్పుగా వింటూ వారివారి స్వభావాన్నిబట్టి, పరిపక్వతనుబట్టి ఆమె స్పందించేది. ప్రతి ఒక్కరికీ వారి అవసరాన్నిబట్టి, వారి కష్టాలన్నిటిలోనూ దారి చూపించేది; ఉపశమనం కలిగించేది.

దేవీభావదర్శనం మొదలయిన వెంటనే అమ్మలో కొన్ని మార్పులు వచ్చాయి.

* కాళీమాత

దేవీసాధన కాలంలో, ఆమె సాధారణంగా ఏకాంతంగా మౌనంగా ఉంటూండేది. ప్రార్థనకూ దివ్యజనని రూపాన్ని ధ్యానించడానికీ ఆమె కాలమంతా వినియోగిస్తూ ఉండేది. తల్లిదండ్రులు కాని, అన్న కాని శారీరకంగానో, మాటలతోనో బాధపెట్టినా నోరు విప్పేదికాదు. ఇప్పుడామె ఎక్కువ ధైర్యస్థురాలు అయింది; ముఖభంగిమ సైతం మారింది. భావదర్శన విషయంలో కాని, ప్రత్యేకించి భక్తులతో ఆమె సాంగత్యం విషయంలో కాని తల్లిదండ్రులతోనూ అన్నతోనూ వ్యవహరించే సందర్భంలో ఆమెకు నిర్భయత్వం, దృఢత్వం అలవడ్డాయి. ఇప్పుడు భక్తులతో ఎక్కువగా కలవడం, ఆధ్యాత్మికంగా వాళ్లకు బోధించడం జరిగేది. అమ్మ ఆధ్యాత్మిక సేవాకార్యం (మిషన్) ఈ విధంగా మొదలయింది.

## నా నిరాకార ఆత్మ

"ఆ నాటినుంచి* దేన్నీ నా నిరాకార ఆత్మకంటె వేరుగా ఉన్నట్లుగా చూడలేకపోయాను; ఈ విశ్వమంతా దాంట్లో ఒక చిన్న బిందువు........"

నిగ్గుతేల్చిన ఈ పలుకులో అమ్మ, జ్ఞానసంపత్తినంతా ఇమిడ్చింది. పరమమయిన బ్రహ్మజ్ఞాన స్థితిలో సునిష్ఠితురాలయినప్పటికీ అమ్మ, దేవుళ్ల, దేవతల వేరు వేరు రూపాలన్నీ ఒకే అద్వైత బ్రహ్మ తాలూకు పార్శ్వాలని నిరూపించడానికి అదనంగా సాధనచేస్తూ ఉండేది. తన మనస్సుమీద పరిపూర్ణ నిగ్రహం సాధించి ఆమె, తన సంకల్ప మాత్రంచేత, తాను ఎంపిక చేసుకొన్న ఏ దైవస్వరూపంతోనయినా తాదాత్మ్యం చెందగలనని గమనించింది. ఈ సాధనలు చేస్తూ ఉండగా తనకు కలిగిన వేరు వేరు అనుభవాలను ఆమె ఇలా వివరించింది:

"ఒకనాడు (ఒక) సాధన చివరిలో ఒక పెద్ద కోరపన్ను నా నోట్లోంచి బయటికి వస్తున్నట్లు అనిపించింది. అదే సమయంలో భయంకరమయిన ఒక ఝుంకార ధ్వని వినిపించింది. కోరపళ్ళతో, పొడుగ్గా వేలాడుతున్న నాలికతో, ఒత్తుగా నల్లగా ఉన్న ఉంగరాల జుట్టుతో, పైకి ఉబ్బిన ఎర్రటి కళ్లతో, ముదురు నీలివన్నె ఛాయ ఉన్న దేవీరూపాన్ని దర్శించాను.** "త్వరగా! పారిపో! దేవి నన్ను చంపడానికి వస్తోంది!" అనుకొన్నాను. పరిగెత్తి పారిపోబోయాను. నేనే దేవి నన్న సంగతి చటుక్కున గ్రహించాను. ఝుంకార ధ్వనికూడా నేనే చేస్తున్నాను. మరుక్షణంలో, నా చేతుల్లో ఒక వీణ ఉన్నట్లు గమనించాను. నా తలకు ఆమె కిరీటం ఉంది; అమ్మవారి

*దివ్యజననిని గురించిన అనుభవానికి సంబంధించి.

** కాళీమాత వర్ణన.

ముక్కుపోగు నా ముక్కుకు ఉంది. రెండు నిమిషాలు గడిచాక అనుకొన్నాను, 'ఇదేమిటి? నేను దేవినెప్పుడు అయాను? బహుశా ఇది, నా సాధనకు అడ్డంకి కల్గించడానికి దివ్యజనని వేసిన ఎత్తేమో. [అందువల్ల] 'శివుణ్ణి గురించి ధ్యానం చేస్తాను; ఏమవుతుందో చూస్తాను', అనుకొన్నాను. కాని శివరూపాన్ని ధ్యానించడం మొదలుకాగానే నేనే ఆయన అయిపోయాను. తలమీద జటాజూటం, మెడనూ భుజాలనూ చుట్టుకొని పాములు. 'బహుశా శివుడు కూడా పరీక్ష పెడుతున్నాడేమో,' అనుకొని ఆయన రూపాన్ని ధ్యానించడం మానేశాను".

ఇప్పుడు నా హృదయాన్నీ ఆత్మనూ విఘ్నాలను తొలగించే గణేశుడిమీద నిలిపాను. వెంటనే నా ఉనికి, గణేశుడిగా మారిపోయింది. ఏనుగు మొహం, పొడుగుపాటి తొండం, రెండు దంతాలు - వాటిలో ఒకటి సగానికి విరిగినది- ఇలా. అప్పుడు లోపలినుంచి నా కొక స్వరం వినిపించింది, 'నువ్వు వాళ్లకు వేరుగా లేవు. వాళ్ళందరూ చాలాకాలం కిందటే నీలో కలిసిపోయారు. మరి, ఈ దేవుళ్ళనూ, దేవతలనూ నువ్వింక పిలవడమెందుకు?'

అప్పటినుంచి అమ్మ, సాకారుడయిన దేవుణ్ణి ధ్యానించడం సహజంగానే తగ్గిపోయింది. అంతటా వ్యాపించి ఉన్న పవిత్ర 'ఓం' కారం అమ్మలోనుంచి చయ్యాన లేచింది; ఆ మె సర్వస్వం అందులో శాశ్వతంగా కలిసిపోయింది. అయినప్పటికీ కూడా, ఒక ఆదర్శం చూపించడానికని, ఆమె కూర్చుని ధ్యానం చేసేది. దీన్ని గురించి అడిగినప్పుడు అమ్మ ఇలా చెప్పింది, "ధ్యానం చేసేటప్పుడు అమ్మ, తన పిల్లలందరి దగ్గరికీ వెళ్తుంది; ముఖ్యంగా, ఆమెను గట్టిగా తలుచుకొనేవాళ్ల దగ్గరికీ బాధపడుతున్నవాళ్ళ దగ్గరికీ."

శ్రీమద్భాగవత పురాణంలో ఇలాటి సంఘటనే ఒకటి జరుగుతుంది. ఒకనాడు, సుప్రసిద్ధుడయిన నారద మహర్షి, శ్రీ కృష్ణుడి నివాసస్థానమయిన ద్వారకను సందర్శించాడు. నారదుడు భగవంతుడికి నమస్కరించి ఇలా అడిగాడు, "ఓ ప్రభూ, మీరు ఎవర్ని ధ్యానిస్తున్నారు?" అని. దానికి ఆయన చిరునవ్వు చిందిస్తూ, "నా భక్తుల్ని ధ్యానిస్తున్నాను," అన్నాడు.

చాలామంది దృష్టిలో, చిట్టితల్లి 'అమ్మ' అయినప్పటికీ, ఆమె ఇంట్లోవాళ్ళ దృష్టిలో మాత్రం ఆమె సుధామణిగానే ఉండిపోయిందన్న విషయం గుర్తుంచుకోవాలి. ఆమె పరమాత్మలో సహజంగా సునిష్ఠితురాలయి ఉండటమన్నది, ఆమె తల్లి దండ్రులూ అన్నా ప్రయత్నం చేసినప్పటికీ అర్థం చేసుకోలేనంత సుసూక్ష్మమయిన

విషయం. అప్పటికి ఆమెను శంకిస్తూనే ఉన్నారు; ఆమె ప్రవర్తనను [illegible] అని తప్పుడు వ్యాఖ్యానం చేస్తూనే ఉన్నారు. భక్తులతో ఆమె సంపర్కం, ఆమెను నీతిమార్గంనుంచి తప్పింపేస్తుందనీ దానివల్ల కుటుంబానికి చెడ్డపేరు వస్తుందనీ భయపడ్డారు. అమ్మమీద ఔద్ధత్యం చూపడంలో ఆమె అన్న సుభగన్, ప్రత్యేకంగా పిచ్చివాడయేవాడు; ఆమెపట్ల అతని ప్రవర్తన నానాటికీ తీసికట్టుగా ఉండేది. ఆ విషయం ఈ కింది సంఘటన వల్ల తెలుస్తుంది.

ఒకరోజున సుభగన్, అతని చుట్టాలు కొందరూ కలిసి అమ్మను, ఏదో సాకుతో ఒక బంధువు ఇంటికి రమ్మని పిలిచారు. రాగానే ఆమెను ఒక గదిలో ఉంచి తాళంవేశారు. చుట్టాల్లో ఒకతను ఆమెను బెదిరించడం మొదలుపెట్టాడు; తన కట్టుబట్టల్లోంచి చటుక్కున ఒక చాకు బయటికి దూశాడు. సుభగన్ ఇలా అన్నాడు, "నీ ప్రవర్తన ఇప్పటికే చాలా దూరం వెళ్లింది. ఇంటి పరువు తీస్తావు. నానారకాల వాళ్లతోనూ కలవడం నువ్వు మానుకోలేవు కనక, నీ పాటలూ, ఆటలూ సాగిస్తూ ఉన్నావు కనక, నువ్వు చావడం మేలు". అమ్మ నవ్వి, ఇలా బదులు చెప్పేసరికి అతనికి ఒళ్ళు మండిపోయింది, "చావంటే నాకు ఎంతమాత్రం భయంలేదు. ఇప్పుడో, ఆ తరవాతో శరీరానికి చావు తప్పదు. కాని ఆత్మను చంపడం నీకు అసాధ్యం. ఇప్పుడు నువ్వు నా భౌతికమయిన ఉనికిని మట్టుబెట్టాలని నిశ్చయించుకున్నావు కనక, నా చివరి కోరిక ఒకటి చెబుతున్నాను. నన్ను కాస్సేపు ధ్యానం చేసుకోనియ్యి, నేను ధ్యానంలో ఉండగా నువ్వు చంపవచ్చు."

ధైర్యంగా ఆమె సమాధానం చెప్పేసరికి ఇంకా మంటెత్తింది వాళ్లకి. వాళ్లలో ఒకడన్నాడు, "నువ్వెవరివి, మమ్మల్ని ఆజ్ఞాపించడానికి? మేమిక్కడ ఉన్నది నువ్వు కోరిన విధంగా చంపడానికో, మానడానికోనా?" అమ్మ చిరునవ్వు నవ్వి, నిర్భయంగా ఇలా చెప్పింది, "దేవుడు తప్ప మరెవ్వరూ నా జీవితాన్ని అంతం చెయ్యలేరని అనిపిస్తోంది". వాళ్లలో మరొకడు అరిచాడు, "దేవుడు! ఎవడా దేవుడు?" వాళ్ళు మాటలతో బెదిరించినప్పటికీ, ఆమె నిర్భయంగా చెప్పిన సమాధానాన్నీ, నిబ్బరాన్నీ చూసి ఆమెను ఏమయినా చెయ్యడానికి ఒక్కడికీ ధైర్యం చాలింది కాదు.

చాకు దూసిన చుట్టం హఠాత్తుగా ముందుకురికి, ఆమెను పొడవడానికన్నట్టుగా, చాకును ఆమె రొమ్ముమీద ఒత్తాడు. కాని, అమ్మ రొమ్ముమీద ఏ చోట చాకుతో ఒత్తాడో, అతని రొమ్ముమీద సరిగా అదే చోట, ప్రాణం జిల్లార్చుకుపోయేటంత నొప్పి హఠాత్తుగా పుట్టడంతో ఇంకేమీ చెయ్యలేకపోయాడు. విలవిల్లాడుతూ నేలమీద పడిపోయాడు. ఇది చూసి గదిలో ఉన్న మిగతావాళ్ళకు గాభరా పుట్టింది. ఈ సమయంలో

దమయంతి రంగంలోకి ప్రవేశించింది; సుభగన్‌తోను, చుట్టాలతోను సుధామణి ఒక్కతే వెళ్ళుండటం చూసి భయపడింది. ఇంట్లోకి వెళ్ళి, లోపల జరుగుతున్న గలభా విని ఏదో ఘోరం జరుగుతోందని ఊహించింది. తలుపు దబదబా బాదుతూ, తెరవమని అరవడం ప్రారంభించింది. తలుపు తాళం తీసి తెరిచారు. దమయంతి అమ్మ చెయ్యిపట్టుకొని ఆ ఇంట్లోంచి గబగబా తీసుకువెళ్ళిపోయింది.

ఇడమన్నేల్‌కు తిరిగి వెళ్ళేటప్పుడు వాళ్ళు సముద్రపు ఒడ్డు వెంబడే నడిచారు. అమ్మ దమయంతితో ఈ విధంగా అంది, "నీ వాళ్ళు నన్ను అవమానపరిచారు. ఈ సముద్రం నాకు తల్లికూడా. చేతులు చాపి నన్ను సంతోషంగా తనలోకి తీసుకుంటుంది. నేను ఆమె ఒళ్ళోకి వెళ్ళిపోతున్నాను." ఆమె మాటలు వినేసరికి దమయంతికి మతిపోయింది. "ఆ మాట అనకు, బిడ్డా! అలా అనకు, బిడ్డా! నువ్వు నీ ప్రాణం తీసుకుంటే నా పిల్లలందరూ పిచ్చి వాళ్ళయిపోతారని కృష్ణభావ సమయంలో భగవంతుడు చెప్పాడు...."ఎలాగో [తంటాలుపడి] అమ్మను నిరుత్సాహపరిచి, తిరిగి ఇడమన్నేల్‌కు తీసుకువచ్చింది.

ఈ వృత్తాంతం ఇక్కడితో ముగిసిపోలేదు. అమ్మను పొడవడానికి కత్తి దూసిన చుట్టాన్ని తరవాత ఆస్పత్రిలో చేర్చవలసి వచ్చింది. అతనికి అద్భుతమయిన వైద్యసదుపాయం కలిగినప్పటికీ ఎడతెగకుండా నెత్తురు కక్కుకొని చివరికి చనిపోయాడు. అతని జబ్బు తీవ్రస్థాయిలో ఉండగా అతన్ని చూడటానికి అమ్మ ఆస్పత్రికి వెళ్ళింది. అతన్ని వాత్సల్యంతో ఓదార్చి తన చేతులతో అన్నం తినిపించింది. అమ్మ పట్ల తను చేసిన ఘోరమయిన అపరాధానికి గాఢంగా పశ్చాత్తాపం చెందాడు; తనమీద అమ్మ చూపించిన దాక్షిణ్యానికీ, క్షమాగుణానికీ చలించిపోయి అతను గుడ్లలో నీళ్ళు కుక్కుకొన్నాడు. అమ్మకు, తనను చంపడానికి వచ్చిన చుట్టంమీద ద్వేషంలేదు; అతనికి చావు మూడాలని మనస్సులో ఆమె తీర్మానించనూ లేదు. అతను తన కర్మకు, [పనికి] ఫలం అనుభవించాడు. అమ్మ ఇలా వివరించింది:

"అమ్మమీద మనుషులకు గాఢమయిన ప్రేమ ఉన్నట్లుగానే సుసూక్ష్మమయిన అనేక జీవులు కూడా అమ్మను ప్రేమిస్తాయి. ఎవరయినా అమ్మకు కీడు చెయ్యడానికి పూనుకున్నట్లయితే, అమ్మ ప్రతిక్రియ చెయ్యదు. ఎలాంటి ఉద్రేకమూ లేకుండా దాన్ని ఎదుర్కొంటుంది; అజ్ఞానంతో చేసేవాడికి విరుద్ధంగా ఏమీ తలవదు కూడా. కాని ఈ సూక్ష్మశరీరులకు కోపం వస్తుంది; కక్ష తీర్చుకొంటారు. ఇది ఎలాగో తెలుసా మీకు? ఒకరి తల్లిమీద మరొకడు దాడి చేశాడనుకోండి. ఆ తల్లి పిల్లలు ఊరికే

కూర్చుని ఏమీ పట్టించు కోకుండా ఉంటారా? తల్లి వాళ్లను ఆ పిన్నపటికీ కూడా ఆ మనిషిని వెతికి పట్టి కక్ష తీర్చుకుంటారు."

లౌకికమయిన ఉనికి తాలూకు పరిమితులనన్నిటినీ అధిగమించి, అమ్మ కులం, మతం, వర్గం, స్త్రీ పురుష భేదం అనే తేడాలు చూపించకుండా భక్తులందరినీ ఆదరిస్తుంది. అజ్ఞానులయిన విశ్వాసహీనుల దృష్టిలో, అమ్మకున్న సమాన దృష్టి విశాల దృక్పథం ఒకానొక మానసిక విచలనానికి కనిపించే లక్షణం మాత్రమే. భావదర్శన సమయంలో దుర్మార్గులు గుళ్ళోకి చొరబడి వస్తూనే ఉన్నారు; అమ్మను అనవసర ప్రశ్నలు వేస్తూనే ఉన్నారు. అమ్మ వాటినేమీ పట్టించుకోకుండా ప్రశాంతంగానే ఉన్నప్పటికీ వాళ్ల పొగరుబోతు వ్యాఖ్యలు విని సుగుణానందన్ కలత చెందేవాడు. పైపెచ్చు, తన కూతురికి పెళ్ళిచెయ్యడానికి చేసిన ప్రయత్నాలన్నీ చెడిపోయినప్పటికీ ఆ ఉద్దేశాన్ని మనస్సులోంచి పూర్తిగా పోనివ్వలేదు. తన కోరిక నెరవేరడానికి ఈ భావదర్శనం పెద్ద అడ్డంకిగా ఉందని అనుకోవడం ప్రారంభించాడు. దర్శనం సిగ్గుచేటు పని అని గట్టిగా నమ్మే సుభగన్‌కు ఇతను తోడయాడు. మరొకటికూడా అతన్ని కలతపెడుతోంది. భావదర్శనం తరవాత తన కూతురి ఒళ్ళు రాయిలా గట్టిగా అయిపోతోంది; కొన్ని గంటలసేపు గట్టిగా మర్దన చేసిన తరవాతే మామూలుగా అవుతోంది.

అలాటి మానసిక స్థితిలో సుగుణానందన్, భావదర్శనాన్ని ఎలాగయినా అంతంచెయ్యాలని సుభగన్‌తో కలిసి గట్టిగా తీర్మానించాడు. మనస్సులో ఈ ఆలోచన పెట్టుకొని, మరుసటి భావదర్శనంనాడు గుళ్ళోకి ప్రవేశించాడు. అమ్మతో ఇలా అన్నాడు "చిట్టితల్లి ఒంటిమీంచి దేవి వెళ్ళిపోవాలి. ఇకనుంచి ఇక్కడ ఈ భావదర్శనం మాకు అవసరం లేదు. దీనికి మేము పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాం. నా కూతురు నాకు తిరిగి కావాలి!"*

అమ్మ అతన్ని సవతి తండ్రి**గా సంబోధించి ఇలా అడిగింది, "ఇది నీ కూతురా?" అప్పటికే కలవరపడుతూ ఉన్నవాడు, తనను ఆ విధంగా పిలవడం స్వయంగా విని, కోపంతో రెచ్చిపోయి ఇలా బదులు చెప్పాడు, "ఔను! ఇది నా కూతురే. దేవుళ్ళకూ దేవతలకూ సవతి తండ్రులుంటారా? నా కూతురు నాకు తిరిగి

* ఆమె కుటుంబానికి సంబంధించినంత వరకు ఇక్కడ గుర్తుంచుకోవలసింది ఏమిటంటే, అమ్మను వారానికి మూడు రోజులు కృష్ణుడూ, దేవీ పూనతారనీ, తక్కిన రోజుల్లో ఆమె పిచ్చిపిల్ల అనీ వాళ్ళ అభిప్రాయం.

** చిన్నప్పటినుంచీ ఆమె, దేవుణ్ణే తన నిజమయిన తల్లిగానూ తండ్రిగానూ ఎంచుకొంది. కనక, ప్రతి ఒక్కరూ ఆమెకు సవతితల్లీ సవతితండ్రీ.

కావాలి!"

అమ్మ ప్రశాంతంగా ఇలా సమాధానమిచ్చింది, "నేను నీ కూతుర్ని నీకు తిరిగి ఇచ్చేటట్లయితే ఆమె పీనుగుతప్ప మరేదీ కాదు; త్వరగానే కుళ్ళిపోతుంది. నువ్వామెకు పెళ్ళిచెయ్యడం కాదు; నేలలో పూడ్చిపెట్టవలసి ఉంటుంది." ఇది వినే స్థితిలో లేకుండా సుగుణానందన్, "దేవి తన చోటికి తను వెళ్ళిపోవాలి! నా కూతురు నాకు కావాలి!" అని జబర్దస్తీగా చెప్పాడు.

"అయితే, ఇదుగో నీ కూతురు. తీసుకువెళ్ళు!" అంది అమ్మ. అదే క్షణంలో అక్కడ కింద పడిపోయింది. కొద్ది క్షణాల్లో ఆమె శరీరం బిర్రబిగిసిపోయింది; గుండె కొట్టుకోడం ఆగిపోయింది. ఆమె కళ్ళు పెద్దగా తెరుచుకొని ఉన్నప్పటికీ ప్రాణమున్న సూచన ఏదీ లేదు. ఆమె చనిపోయింది.

పెద్ద గందరగోళం పుట్టింది. దర్శనానికి వచ్చిన వాళ్లంతా దుఃఖంతో మూగవాళ్ళయిపోయారు. దమయంతీ ఆమె కూతుళ్ళూ సొమ్మసిల్లి నేలమీద పడిపోయారు. సుగుణానందన్ చేసిన ఏదో తప్పువల్ల అమ్మవారు సుధామణి ప్రాణాలను తీసేసుకొందన్న వార్త క్షణాల్లో వ్యాపించింది. అమ్మ అకాల మరణానికి కారకుడయినందుకు ప్రతి ఒక్కరూ అతన్ని నిందించారు.

ఆమె దేహం చుట్టూ నూనెదీపాలు వెలిగించి పెట్టారు. ఆ సమయంలో ప్రకృతిసైతం మౌనం వహించింది. కొందరు భక్తులు వలవలా ఏడ్చారు. ఇతరులు, అకస్మాత్తుగా, అణచుకోలేనంత భావోద్రేకంతో తలకిందులు కావడంవల్ల మూర్ఖుల్లా వదరడం ప్రారంభించారు. కొందరు అమ్మదగ్గర గంభీరంగా కూర్చున్నారు; ఊపిరి ఏమయినా ఆడుతోందేమో చూడటానికి ఆమె ముక్కు రంధ్రాల దగ్గర చెయ్యిపెట్టి పరీక్షిస్తున్నారు. ఏమీలేదు. భయానకమయిన క్షణమది.

తను చేసిన తెలివితక్కువ పనివల్ల పరిస్థితి ఎంత భయంకరంగా ఉందో తెలుసుకొంటూ గుండెలోని దుర్భరమయిన వేదనను ఓర్చుకోలేక, సుగుణానందన్ కూడా స్పృహతప్పి పడిపోయాడు. విషాదభరితమయిన నిశ్శబ్దం చుట్టూ ఆవరించింది. అసాధ్యమయినది నిజంగా జరిగిందని భావించి, ఆమెకు మళ్ళీ స్పృహ వస్తుందన్న ఆశ వదులుకొన్నారు. ఎనిమిది గంటలు భారంగా గడిచాయి. సుగుణానందన్‌కు మళ్ళీ స్పృహరావడం భయానక దృశ్యాన్ని చూడటానికే అయింది. అతను జగన్మాతను వేడుకొంటూ బిగ్గరగా ప్రార్థన చేశాడు, "ఓ దేవీ! అలాటి మాటలు అన్నందుకు నన్ను మన్నించు! ఎంతో అజ్ఞానంతో ఆ మాటలు పలికాను. నా కూతురిని మళ్ళీ బతికించు! నా తప్పు మన్నించు! ఇకముందు ఎన్నడూ నేను అలాటి అసహ్యమయిన

పని చెయ్యను! ఆ విధంగా విన్నపాలు చేసుకొంటూ అతను గుడిముందు నేలమీద సాగిలబడిపోయాడు; ఏడుపు ఆపుకోలేకపోతున్నాడు.

నిమిషాలు గంటల్లా సాగుతున్నాయి. హఠాత్తుగా, భక్తుల్లో ఒకరికి, అమ్మ శరీరంలో కొద్దిపాటి కదలిక లీలగా కనిపించింది. చిగురిస్తున్న ఆశలతో భక్తులు నిలబడి ఉన్నారు. వాళ్ళ దుఃఖబాష్పాలు, ఆనందబాష్పాలుగా మారాయి. అమ్మకు మళ్ళీ ప్రాణం వచ్చింది; కాని, కృష్ణభావంలో! కృష్ణుడి గాఢభక్తుడయిన సుగుణానందన్‌తో అమ్మ ఇలా అంది, "శక్తి* లేనిదే కృష్ణుడు ఉండడు!"

ఈ సంఘటనతో, ఆ తండ్రికి దేవుడి విషయంలోను, కూతురి విషయంలోను ఉన్న దృక్పథంలో పెద్ద మార్పు వచ్చింది. అప్పటినుంచి అతను, ఆమె ఇష్టం వచ్చినట్లు చేసుకోడానికి దాదాపు పూర్తి స్వేచ్ఛ ఇచ్చేశాడు. ఇక ఎన్నడూ ఆమె పెళ్ళి ప్రయత్నానికి అతను పూనుకోలేదు. దరిమిలా, ప్రత్యేకించి ఈ సంఘటనను గురించి అమ్మ ఇలా చెప్పింది:

"తన కూతురిని దేవి దగ్గరినుంచి రప్పించేసుకోవాలన్న మొండిపట్టుమీద ఉన్నాడతను. ఈమె నిజంగా వాళ్ళ కూతురే అయినట్లయితే ఆమెకు మళ్ళీ ప్రాణం రప్పించే శక్తి వాళ్లకు ఉండాలి. అది చెయ్యలేకపోయారు. మహా అయితే, ఈ శరీరం వాళ్లది. తన కూతురు తనకు మళ్లీ కావాలని అన్నప్పుడు ఈ దేహమే ముట్టింది."



* *దేవిగా మూర్తీభవించిన, విశ్వశక్తి స్త్రీరూపం.*

# తొమ్మిదో అధ్యాయం

## సత్యఖడ్గం

*బిడ్డలారా, మనిషి చెట్టును కింది వేళ్ళదగ్గరినుంచి నరుకుతున్నప్పటికీ కూడా అది అతనికి నీడను ఇస్తుంది. ఆధ్యాత్మిక అభిలాషికూడా అలాగే ఉండాలి. తనను హింసిస్తున్న వాళ్ళ మేలుకోసంకూడా ప్రార్థన చేసేవాడే ఆధ్యాత్మికపరుడు. ఆధ్యాత్మిక అభిలాషికి అన్నింటికంటె గొప్ప ఆయుధం సత్యఖడ్గం.*

- మాతా అమృతానందమయి.

దుర్వృత్త వృత్తశమనం తవ దేవి శీలం,
రూపం తథైత దవిచింత్య మతుల్యమన్యైః
వీర్యం చ హంతృ హృతదేవ పరాక్రమాణాం,
వైరిష్వపి ప్రకటితతైవ దయా త్వయేత్థం.

ఓ దేవీ, చెడ్డనడత గలవాళ్ల నడతను అణచివేయడం నీ స్వభావం. సాటిలేని నీ అందం ఎవరి ఊహకూ అందనిది. నీ శక్తి, దేవతల పరాక్రమాన్ని హరించిన వాళ్ళను నాశనం చేస్తుంది. ఈ ప్రకారంగా నువ్వు నీ శత్రువులమీద కూడా కరుణ చూపించావు.

దేవీమాహాత్మ్యం
అధ్యాయం 4 శ్లోకం 21.

## అభాగ్యుడు సుభగన్

మహాత్ములందరూ సామాన్య మనస్కుల అత్యాచారాలను తప్పనిసరిగా సహించవలసి ఉన్నట్లు కనిపిస్తుంది. అయినప్పటికీ మహానుభావులకు దీనివల్ల మేలే కలుగుతున్నట్లు కనిపిస్తుంది; వారి దారికి ఏర్పడ్డ ప్రతి ఒక్క అడ్డంకికీ వారి మహిమకు అదనపు శోభ చేకూరుస్తుంది. ఈ యథార్థానికి తగినంత నిదర్శనం కావాలంటే మనం శ్రీ కృష్ణ, శ్రీరామ, ఏసు క్రీస్తు, బుద్ధభగవానుల జీవితాలను చూస్తే చాలు. అమ్మ జీవితం కూడా ఒక ఉజ్జ్వలమయిన ఆదర్శం. ఇప్పటికి మూడేళ్ళు గడిచాయి. అది 1978 వ సంవత్సరం మధ్య కాలం. భక్తుల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతూ ఉంది. అమ్మ పవిత్ర దర్శనంకోసం భారతదేశంలో అన్ని ప్రాంతాలనుండి జనం వస్తున్నారు. అభిమానుల, శ్రేయోభిలాషుల సంఖ్య పెరుగుతూ వస్తున్నకొద్దీ దుర్మార్గులు కూడా, తమ దుష్టచారాన్ని పెంచారు. కాని పూర్వనిర్ధారితమయిన అమ్మ ఆధ్యాత్మిక సేవాకార్యాన్ని (మిషన్‌ను) ఏ లౌకిక శక్తీ అడ్డుకోలేకపోయింది.

ఈ కాలంలో, ఇడమన్నేల్‌కు రాబోయే మహావిపత్తును సూచించే చెడ్డ శకునాలు కొన్ని కనిపించాయి. చెల్లెల్ని దారుణంగా హతమార్చడానికి సుభగన్ చేసిన ప్రయత్నాల దుష్ట పర్యవసానాలు అతన్ని ఏ మాత్రం విడిచిపెట్టలేదు. ఇప్పుడతను ఇంకా బహిరంగంగా, పొగరుతో, అమ్మమీద పగబట్టాడు. తన స్వార్థపూరిత భావాలను ఇంట్లో మొత్తం అందరిమీదా రుద్దాడు. చపలమూ ఉగ్రమూ అయిన అతని స్వభావంవల్ల అతన్ని ఎదిరించడానికి వాళ్ళుకూడా భయపడ్డారు. ఒక పక్క భక్తుల సంఖ్య పెరుగుతూ ఉండటం, మరొక పక్క హేతువాదులు అపనిందలు వేస్తూ ఉండటం, సుభగన్ మనస్సును కలచివేసి ఉగ్రంగా మార్చేశాయి. భావదర్శనానికి వచ్చేవాళ్ళను పసిగట్టి, వాళ్ళు దర్శనంలో పాల్గొనకుండా నిరుత్సాహపరచాలని, ఘాటుగా తిట్టడం ప్రారంభించాడు.

ఈ పరిస్థితిలో, సుభగన్ దౌర్భాగ్యంవల్లనో అతని పాపాలు పండటం వల్లనో భయంకరమయిన బోదకాలు జబ్బు వచ్చింది. దీని లక్షణాలు అతని రెండు కాళ్ళమీదా, చేతులమీదా కూడా కనిపించాయి. అతను రకరకాల వైద్యాలు చేయించుకొన్నప్పటికీ దేనివల్లా నయంకాలేదు. ఈ జబ్బుతో తనకు చావు తప్పదన్న ఆలోచనే అతన్ని అదేపనిగా వేధిస్తూ ఉంది. అతను చాలా కుంగిపోయాడు; ఆత్మహత్య చేసుకోవాలనిపించే లక్షణాలు కనిపించాయి. చాలాసార్లు అతను మనోవ్యథను దగ్గరి మిత్రులకు చెప్పుకొన్నాడు. దాని ఫలితంగా, నిద్రపట్టకపోవడం జబ్బు వచ్చింది; నిద్రమాత్రలు వేసుకోడం ప్రారంభించాడు. శారీరక, మానసిక బాధల కూడికవల్ల క్రమక్రమంగా సుభగన్‌కు మతిస్థిమితం తప్పింది.

ఒకనాడు అమ్మ, దమయంతిని పిలిచి ఇలా చెప్పింది, "అన్న సుభగన్ ఆయుర్దాయం ముగిసే రోజు దగ్గర పడుతున్నట్టుంది. దానికి పరిష్కారంగా నువ్వు మౌనవ్రతం పాటించవచ్చు. కాని నీ నియమాన్ని చెడగొట్టడానికి ప్రయత్నించే అడ్డంకులు ఎన్నో కనిపిస్తాయి. కనుక, మౌనవ్రతం పూనినప్పుడు జాగ్రత్తగా ఉండు." అమ్మ మాటలకు కట్టుబడి దమయంతి ఒకరోజున మౌనవ్రతం పాటించింది. అయితే, అది సగం ముగిసేసరికి ఒక ఆవు తాడు తెంపుకొని కొట్టంలోంచి పారిపోవడం మొదలుపెట్టింది. దమయంతి తన మౌనవ్రతం సంగతి పూర్తిగా మరిచిపోయి అరిచింది, "అదుగో, ఆవు పారిపోతోంది! పట్టుకోండి!" దీన్నొక దుశ్శకునంగా భావించారు ఇంట్లో వాళ్ళు; ముఖ్యంగా, మౌనవ్రతాన్ని జాగ్రత్తగా పాటించమని అమ్మ, దమయంతిని ముందే హెచ్చరించబట్టి. ఈ అశుభ సంఘటన ఇంట్లో అందరికీ భయాందోళనలు కలిగించింది.

ఒకనాడు సుభగన్, భావదర్శనానికి ఇడమన్నేల్‌కు వచ్చిన ఒక ముస్లిం స్త్రీని క్రోధావేశంతో దారుణంగా వేధించాడు. సుభగన్ దారుణ వ్యాఖ్యలను భరించలేక, ఆమె గుళ్ళోకి వెళ్ళి కన్నీళ్ళు కారుస్తూ గుడి గడపమీద తల బాదుకొంటూ బిగ్గరగా విలపించింది, "ఓ అమ్మా......ఓ అమ్మా.....నీ దర్శనానికి వచ్చినవాళ్ళ గతి ఇంతేనా?"

ఆ ముస్లిం వనిత దీనాలాపాలు వినేసరికి, చిరునవ్వులు ఒలికిస్తున్న, తేజోవంతమయిన అమ్మ ముఖం వెంటనే మారిపోయింది. భయానక రూపంతో ఆమె, ఒక చేత త్రిశూలంతో, మరో చేత ఖడ్గంతో తన పవిత్రాసనం మీంచి లేచి నిలబడింది. గంభీర గాఢస్వరంతో అమ్మ ఇలా పలికింది, "ఈ భక్తురాలికి అనుచితంగా దుఃఖం కలిగించినవాడు ఎవడయినా ఏడు రోజుల తరవాత చస్తాడు." అమ్మ పలికిన జోస్యం సుగుణానందన్ చెవిని పడింది. అతను గుడికి పరుగెత్తి తన కొడుకు ఘోర ప్రవర్తనకు క్షమించమని వేడుకొన్నాడు. సుభగన్ ప్రాణాన్ని కాపాడి, అతని బదులు తనను తీసుకుపొమ్మన్నాడు. అమ్మ ప్రశాంతంగా ఇలా చెప్పింది, "నేను ఎన్నడూ ఎవరినీ శిక్షించను. నన్ను తిట్టిపోసినా, వేధించినా నేను లెక్కపెట్టను. కాని ఒక భక్తురాలు అటువంటి తిట్లకు బాధపడుతున్నప్పుడు దేవుడుకూడా క్షమించడు. ఎవరు చేసిన కర్మలకు వారు ఫలాలు అనుభవించి తీరవలసిందే. మరో దారి లేదు."

ఏడు రోజులు గడిచాయి. 1978 జూన్ 2 వ తేదీన అర్ధరాత్రి కావస్తోంది. సుభగన్ ఉరిపోసుకొని ఆత్మహత్య చేసుకొన్నాడు. అమ్మ పలికిన జోస్యం అప్పటికే అతనికి తెలుసు. చనిపోయేముందు రాసిపెట్టిన ఉత్తరంలో అతను, నయంకాని తన జబ్బువల్ల క్షోభ భరించలేక ఆత్మహత్య చేసుకొంటున్నట్లు రాశాడు. ఇడమన్నేల్ ఇంట్లో, సుభగన్ ఆత్మహత్య సంక్షోభాన్నీ, దుఃఖాన్నీ కలిగించింది. అమ్మమీద తాము చేసే వ్యతిరేక

ప్రచారానికి బలం కలిగించడానికి దుర్మార్గులు ఈ అవకాశాన్ని వెంటనే తీసుకొన్నారు. సుభగన్ చావును గురించి అబద్ధాల కథలు ప్రచారం చెయ్యడం ప్రారంభించారు. పెద్దకొడుకును ప్రాణంతో సమానంగా చూసుకొనే సుగుణానందన్‌ను, సుభగన్ చావుకు కారకుడయిన హంతకుడిగా ఆరోపించారు.

ఆ చావు ఆత్మహత్యేననడానికి కావలసినంత సాక్ష్యాధారం ఉన్నప్పటికీ దుష్ట ఆరోపణకు పూనుకొన్న దుర్మార్గులు ఎంత ప్రయత్నించినప్పటికీ నిలవలేకపోయారు. తన ఆత్మహత్యా ప్రయత్నాన్ని గురించి ఇంట్లో ఉత్తరం రాసిపెట్టడంతోబాటు సుభగన్, తన ఉద్దేశాన్ని తెలుపుతూ కొందరు స్నేహితులకూ చుట్టాలకూ కూడా ఉత్తరాలు రాశాడు. శవపరీక్ష నివేదికకూడా, అతని చావును ఆత్మహత్యేనని ధ్రువపరిచింది. ఈ విధంగా చట్టపరమయిన చర్య తీసుకొనే ప్రశ్న ఉదయించలేదు.

సుభగన్ ఆత్మహత్య చుట్టాల్లో సంచలనం కలిగించింది. ఆ కుటుంబం ఉనికే ఎన్నడూ లేనట్లుగా, మొత్తం కుటుంబాన్ని ఉపేక్షచేసి వాళ్ళు తమ ద్వేషాన్నీ సహాయ నిరాకరణనూ బహిరంగంగా ప్రకటించారు. ఉత్సవాలకు కాని, పండగలకు కాని, పెళ్ళిళ్ళకూ మతపరమయిన కర్మకాండలకూ రమ్మని కాని పాల్గొనమని కాని, ఆ కుటుంబాన్ని పిలవడం మానేశారు. చుట్టాలు పక్కింటికి వచ్చి వెళ్ళేవాళ్ళు కాని ఇడమన్నేల్‌వైపు తొంగిచూసేవాళ్ళు కూడా కాదు. వాళ్ళెప్పుడయినా, పితృకార్యాలు జరపడానికి, ఇడమన్నేల్ దగ్గర సముద్రపు ఒడ్డుకు వచ్చినప్పటికీ కూడా, వచ్చిన పని అయిపోగానే అక్కణ్ణించి వెళ్ళిపోయేవారు. చుట్టాలు తమను ఈ విధంగా చూడటం ఆ కుటుంబానికి దుర్భరంగా ఉంది; అప్పటికే, బాధతో గుండెలు బరువెక్కిన వాళ్లకు ఇది అదనపు భారం అయింది.

సుభగన్ చచ్చిపోయాక పదహారు రోజులకు భావదర్శనం మళ్లీ మొదలయినప్పుడు, సుగుణానందన్, బరువెక్కిన గుండెతో అమ్మ దగ్గరికి వచ్చాడు. ప్రియమయిన తన కొడుకు ఘోర మరణం పొందకుండా అమ్మ కాపాడలేదని ఫిర్యాదు చేసి కన్నీళ్ళు పెట్టుకొన్నాడు. అతన్ని ఓదారుస్తూ అమ్మ ఇలా చెప్పింది, "దిగులుపడకు. పోయిన నీ కొడుకు, మరో మూడేళ్ళ తరవాత ఈ ఇంట్లోనే, భక్తుడిగా మళ్ళీ పుడతాడు." కొన్నేళ్ల కు పెద్దకూతురు కస్తూరికి పెళ్ళి అయింది. ఆమె తొలిచూలు కడుపుతో ఉన్నప్పుడు అమ్మ, పుట్టబోయే బిడ్డకు 'శివ' అని పేరు పెట్టింది. అమ్మ పెట్టింది మగపేరు కాబట్టి మగపిల్లవాడే పుడతాడని ఇంట్లోవాళ్ళకు నమ్మకం కలిగింది. అలాగే మగపిల్లవాడు పుట్టాడు. వాడు పుట్టిన తరవాత అమ్మ ఇలా అంది, "సుభగన్ చనిపోయిన మూడేళ్ల నుంచి అతని ఆత్మ ఈ ఆశ్రమ వాతావరణ పరిసరాల్లోనే ఉంది. అతను భక్తిగీతాలూ,

వేదమంత్రాలూ వింటూ వచ్చాడు కాబట్టి, ఈ ఇంట్లో అతనికి 'శివుడి'గా జన్మ వచ్చింది. పసితనంనుంచి ఇతను 'ఓం' కార జపం చేస్తూ ఉంటాడు; ఎవరూ చెప్పకుండానే కూర్చుని ధ్యానంచేస్తూ ఉంటాడు."

## హేతువాదుల తిరిగి రాక

దేవీభావం మొదలయిన తరవాత హేతువాదులు మరీ పొగరుగా, పగవాళ్ళలా తయారయారు. అమ్మ పిచ్చిదనీ భావదర్శనం దగా అనీ నమ్మేటట్లుగా జనాన్ని తప్పుదారి పట్టించడానికి, వాళ్లు ఇప్పుడు వార్తా ప్రచార, ప్రసార సాధనాలను వాడుకోడం ప్రారంభించారు. అమ్మను అప్రతిష్ఠపాలు చెయ్యడానికి వాళ్ళు ఎంత ఎక్కువగా ప్రయత్నిస్తే అంత ఎక్కువగా వాళ్ళు విఫలులయారు. వాళ్ళ పట్టుదల నిజంగా అద్భుతం!

ఒకనాటి రాత్రి, దుర్మార్గులు తమ పాత యుక్తినే మళ్ళీ ప్రయోగించే ప్రయత్నం చెయ్యాలని నిశ్చయించారు. వెనక, అమ్మను అవమానపరచడానికీ తద్వారా దైవశక్తిని హేళన చెయ్యడానికీ వీలుగా దర్శన సమయంలో ఆమెను పట్టుకుందామని యుక్తి పన్నారు కాని అది సాగలేదు. ఈసారి మళ్ళీ ప్రయత్నిద్దామను కొన్నారు. వాళ్ళ జట్టులో ఎక్కువ రౌడీతనమున్న వాళ్ళు ఇద్దరు చిత్తుగా తాగి, గుళ్ళో గలభా చెయ్యడానికి రంగంలోకి ప్రవేశించారు. ప్రవేశంకోసం, తక్కిన భక్తులతోబాటు వరసలో నిలబడ్డారు.

ఆ సమయంలో, దేవీభావ దర్శనం ఇవ్వడానికి అమ్మ అప్పటికే తన ఆసనం మీద కూర్చుని ఉంది. గుళ్ళో ఆమెకు దగ్గరగా కూర్చున్న కొందరు భక్తులకు ఇలా చెప్పింది, "జాగ్రత్తగా గమనిస్తూ ఉండండి. అమ్మ మీకో మంచి చమత్కారం చూపిస్తుంది." ఈ మాటలు పలికి ఆమె, తాగుబోతులవైపు సమ్మోహం కలిగించే చిరునవ్వు కనబరిచింది. అప్పటికి వాళ్ళు గుడి గుమ్మందాకా వచ్చారు. కాని వాళ్ళలో ముందున్నవాడు, పక్షవాతం వచ్చిన వాడిలాగ, అడుగు ముందుకు వెయ్యలేక పోయాడు; గడ్డ కట్టుకుపోయిన వాడిలాగ రెండు నిమిషాలు అలాగే ఉండిపోయాడు. సరిగా వాడికి వెనక ఉన్న తోడు దుండగుడు, దీనికి కోపంతో రెచ్చిపోయి, గుళ్ళోకి ఎందుకు వెళ్ళవని కరుకు గొంతుతో అడిగాడు. "నాకు ముందు ఇప్పటికే గుళ్ళో ఎంతమంది నిలబడి ఉన్నారో కనబడటం లేదూ?" అంటూ బదులు చెప్పాడు [మొదటివాడు] "ఎంతోసేపటి నుంచి నువ్వు కొయ్యబొమ్మలాగ నిలబడి ఉన్నావు! నీక్కూడా ఆ పిల్ల కనుకట్టు చేసిందా?" అన్నాడు వెనక వాడు. కరుకుగా ఇలా మాటా మాటా పెరిగింది. ఆ ఇద్దరు రౌడీలూ ఇడమన్నేల్ నుంచి వెళ్ళిపోతూ భయంకరంగా కలబడి కొట్టుకొన్నారు. ఈ పరిస్థితి ముందే తెలుసుకొని చెప్పింది అమ్మ.

వెనక చెప్పినట్టుగా, ఆ రోజుల్లో, గృహస్థులయిన భక్తులు కొందరు అమ్మను తమ ఇళ్ళకు రమ్మని పిలుస్తూండేవారు; పూజ చెయ్యడానికి కాని, భక్తి సంకీర్తనానికి కాని. ఆమె ఫలానా ఇంటికి వస్తుందని తెలిసి, దుండగులుకూడా అక్కడికి చేరేవాళ్ళు. ఒకనాడు చక్కని సాయంత్రపువేళ అమ్మ, పరయకడవుకు సుమారు 20 కిలోమీటర్ల దూరంలో ఉన్న పన్మనా గ్రామంలో ఒకరి ఇంటికి వచ్చింది. చాలాకాలంనుంచి ఈ ఇంట్లోవాళ్ళు రకరకాల శారీరక, మానసిక వ్యాధులతో బాధపడుతూ ఉన్నారు; వాళ్ళకు పరిష్కారమేదీ దొరకలేదు. వేరువేరు దేవుళ్ళనూ దేవతలనూ, ఆవాహనచేసి రకరకాల పూజలు జరిపారు. కాని ఫలితం కనిపించలేదు. అమ్మను గురించి విని భావదర్శనానికి వచ్చి, సహాయం చెయ్యమని ఆమెకు విన్నవించుకొన్నారు. కరుణామయి అయిన అమ్మ, వాళ్ళ ఇంటికి వచ్చి వ్యాధి నివారణకోసం ప్రత్యేకమయిన పూజ చెయ్యడానికి ఒప్పుకొంది.

ఉన్న విషయమేమిటంటే, ఆ ఇంట్లో వాళ్ళలోనే కొందరికి ఈ పూజ ఇష్టంలేదు. పూజను చెడగొట్టడానికి ఏర్పాట్లు చేసుకొంటున్న దుండగులకు వాళ్ళు తోడయ్యారు. అమ్మ వచ్చిన రోజు సాయంత్రం, ఆ ఇంట్లో వాళ్ళలో ఒకడు, ఒళ్ళంతా పొగరెక్కి అమ్మతో ఇలా అన్నాడు, "చూడు, ఈ పూజను గమనించనియ్యి నన్ను. నేను ప్రతిదీ పట్టిపట్టి చూస్తాను. అప్పుడు కొన్ని ప్రశ్నలు అడుగుతాను నేను". అప్పుడు అమ్మ అతన్ని ఇలా అడిగింది, "ఈ 'నేను' అనేది మీ శరీరానికి మాత్రం పరిమితమయి ఉన్నది ఏదయినానా? అది మీ స్వాధీనంలో ఉందా?"

తెల్లవారగట్ల 2 గంటలు అయింది. పూజకు కావలసినవి అన్నీ సిద్ధంచేస్తోంది అమ్మ. అహంకార పూరితంగా చాటుకొన్న మనిషి, గాఢమయిన నిద్రలో ఉన్న వాడిలాగ, ఒంటిమీద స్పృహలేకుండా వెనకాల పడి ఉన్నాడు. ఇంట్లో ఉన్నవాళ్ళలో భక్తులకు, దీనివల్ల తెరిపిగా ఉంది. పూజలో చివరి ఘట్టం ముగిసేసరికి అహంకారికి చటుక్కున మెలకువ వచ్చింది. గబుక్కున లేచి కూర్చుని, "అయ్యో, పూజ అయిపోయిందా? అయ్యో, అయిపోయిందా...?"

అమ్మ ఇలా అంది "ఔను, అయిపోయింది. మీరు పట్టిపట్టి చూస్తానని అన్నారు, చూశారా? మనం 'నేను' అనేది మన ఆధీనంలో లేదన్న సంగతి ఇప్పుడు అర్థమయిందా? మీరు నిద్రపోతున్నప్పుడు ఎక్కడికి వెళ్ళింది ఆ 'నేను'?" ఆ మనిషి తెల్లబోయాడు, మారు మాట్లాడకుండా తల వాల్చేసుకొన్నాడు.

అక్కడికి చేరిన దుండగుల నోళ్ళు మూయించడం అంత తేలిక కాదు. అమ్మను చాలా మొరటుగా హేతురహితంగా ప్రశ్నించడం మొదలుపెట్టారు. అమ్మ ఎప్పటిలాగే ఉల్లాసంగా, నిమ్మకు నీరెత్తినట్టుగా నిబ్బరంగా ఉంది. కాని పూజలో సాయంచెయ్యడానికి

వచ్చిన బ్రహ్మచారికి మాత్రం విసుగెత్తింది. "వాళ్ళ నోళ్ళు మూయించడానికి ఏదయినా చూపించు. లేకపోతే వీళ్ళ గొడవ తగ్గదు," అన్నాడు అమ్మతో.

కొద్ది నిమిషాలు గడిచాయి. దగ్గరిలో ఉన్న గోరీల దొడ్డినుంచి ఒక నిప్పుబంతి అద్భుతంగా వెలుగుతూ హఠాత్తుగా పైకి లేచింది. దానినుంచి వెలుగురేకలు, నాట్యమాడు తున్నట్లుగా వెలువడ్డాయి. నోళ్ళు వెళ్లబెట్టిన ఇబ్బందిగాళ్ళను ప్రశ్నించే వంతు ఇప్పుడు అమ్మకు వచ్చింది. "మీలో ధైర్యవంతులెవరయినా ఇప్పుడు ఆ గోరీల దొడ్డిలోకి వెళ్ళి రాగూడదూ?" అని అడిగింది. ఆ సవాలు అందుకోడానికి వాళ్ళలో ఒక్కడుకూడా ముందుకు రాలేదు. ఒక్క క్షణం తరవాత, భయంతో పిల్లవాళ్ళయిపోయిన ఆ పెద్దవాళ్ళు వెనకడుగువేసి అక్కణ్ణించి పారిపోయారు.

అలాటి సంఘటనే మరొకటి 1980లో కరునాగపల్లిలో శ్రీమతి ఇందిర ఇంట్లో జరిగింది. ఈ ఊరు వళ్ళిక్కావు* కు పది కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇందిర గాఢమయిన భక్తురాలు; తమ ఇంటిని పావనం చెయ్యడానికి రమ్మని అమ్మను ఆహ్వానించింది. మామూలుగా, ఆనాటి సాయంత్రానికి, హేతువాదులుకూడా అక్కడికి వచ్చారు. వాళ్ళ అపఖ్యాతి అందరికీ తెలిసే ఉండటంవల్ల, వాళ్ళను చూడగానే ఆ ఇంటివాళ్లు గాభరాపడ్డారు. నమ్మకం లేనివాళ్ళ మూకను చెదరగొట్టమని వాళ్ళు అమ్మను ప్రార్థించారు.

అమ్మ ధ్యానంలో మునిగి ఉంది. రెండు సెకండ్లలో, ఉజ్జ్వలంగా వెలుగుతున్న కాంతిగోళం ప్రత్యక్షమయింది. దాని చుట్టూ, చిన్నచిన్న దీపాల్లాటి వెలుగులు గోచరించాయి. ఈ కాంతిగోళం ఇంటికి ఉత్తరంవైపున కనిపించి సింహద్వారంగుండా దక్షిణంవైపుకు ప్రయాణించింది. భక్తులు సంభ్రమాశ్చర్యాలతో, భక్తిప్రపత్తులతో జగజ్జనని నామస్మరణ చేశారు. ఆ గోళం మెల్లమెల్లగా పైపైకి లేచి చివరికి దూరాన అదృశ్యమయింది; అది కూడా దక్షిణంవైపు దొడ్లో పెరుగుతున్న పవిత్రమయిన మారేడు చెట్టుకు ప్రదక్షిణం చేసిన తరవాత. కొయ్యబారి, గుండె జారి విశ్వాసహీనులు ఇల్లు విడిచి వెళ్ళిపోయారు. అమ్మ చేసే భక్తి సంకీర్తనాన్ని చెడగొట్టడానికి వాళ్ళు మళ్ళీ రాలేదు. నిజానికి ఈ సంఘటన జరిగిన తరవాత వాళ్ళలో చాలామంది భక్తులయారు.

## చేతబడికి చేటు

వెనక చెప్పిన ఇంటికి దగరిలో దురహంకారి అయిన మాయల మంత్రగాడు ఒకడు ఉండేవాడు. పరయకడవులో ఒకమ్మాయిని వారానికి మూడు రాత్రులు కృష్ణుడు,

* వళ్ళిక్కావు ఇడమన్నేల్‌కు సరిగా ఎదురుగా ప్రధాన భూభాగంలో ఉన్న పల్లె. అమ్మను అప్పుడప్పుడు 'వళ్ళిక్కావు అమ్మ' అంటూండటం కద్దు.

అమ్మవారు పూనతారని అతనికి ఎవరో చెప్పారు. ఈ పూనకాన్ని తను త్వరగా అంతం చేస్తానని ఆ మాయల మంత్రగాడు దంభాలు పలికాడు. తను ప్రయోగించబోయే మంత్రాన్ని వివరించాడు కూడా. "నేను శక్తిమంతమయిన కొన్ని మంత్రాలు చదువుతూ కొబ్బరాకు రెండుపాయలుగా చీరతాను. దేవుడో, దేవతో, ఆమెను పూనకం పట్టడం వెంటనే ఆగిపోతుంది" అని చాటాడు. అందుకోసం ఒకనాడు ఇడమన్నేల్ వచ్చాడు. ప్రయత్నం ఎంత చెయ్యనీ; అతని జిత్తులు ఒక్కటీ పారలేదు; గొప్పగా చాటుకొన్న ఫలితం రాలేదు. తన అహంకారాన్ని తాను కాస్త దిగమింగుకొని వెళ్ళిపోవలసి వచ్చింది. అప్పటికీ అమ్మమీద చేతబడి చేసే ప్రయత్నం కొనసాగిస్తూనే ఉన్నాడు. చాలా సార్లు దుష్టశక్తులతో మంత్రించిన విబూది ఆమెకు పంపుతూ వచ్చాడు. కాని అతని ప్రయత్నాలన్నీ విఫలమయాయి. ఆ తరవాత కొద్దికాలానికి అతనే పిచ్చివాడయి వీధుల్లో ముష్టెత్తుకొన్నాడు. "పది పైసలియ్యండి, పది పైసలియ్యండి," అంటూ జనాన్ని అడుక్కోడం ఎప్పుడూ కనిపిస్తూనే ఉంటుంది.

అమ్మ ఉండే లంకలోనే ఆరిక్కల్ అనే పల్లెలో ఒక పూజారి ఉన్నాడు. అతను గుడిపూజారి మాత్రమేకాక, పేరుపడ్డ మంత్రగాడు; ముఖ్యంగా దుష్టశక్తులను, అమాయికులను పూనే భూతప్రేతాదులను తరిమివేయడంలో అతను సమర్థుడు. అమ్మంటే గాఢమయిన ద్వేషం ఉన్న ఒక ముసలావిడ గుట్టుగా ఈ పూజారిని ఆశ్రయించింది. అమ్మనూ దైవభావాలనూ పతనమయేటట్లు చెయ్యడానికి తన శక్తులను వినియోగించమని ప్రేరేపించడం ఆమె ఉద్దేశం. ఉచ్చాటన ప్రారంభించడానికని అమ్మ పేరు, ఆమె జన్మ నక్షత్రం ఒక కాగితంమీద రాసి పూజారికి ఇచ్చింది.

అదే రోజున, భక్తురాలికి ఒకామెకు అమ్మ కలలో కనిపించి మర్నాడు ఫలానా గుడికి వెళ్ళి అక్కడ ప్రార్థనలు చెయ్యమని చెప్పింది. ఆ భక్తురాలు మర్నాడు అమ్మ దగ్గరికి వచ్చి తనకు వచ్చిన కల సంగతి చెప్పింది. "నువ్వు అక్కడికి వెళ్ళిరా. కల ప్రాముఖ్యం అప్పుడు తెలుస్తుంది నీకు," అంది అమ్మ.

ఈ విధంగా అమ్మ అనుమతి తీసుకొని ఆ భక్తురాలు, కలలో తెలిపిన గుడికి వెళ్ళింది. అమ్మమీద మంత్ర ప్రయోగం చెయ్యమని పురమాయింపు అయిన మంత్రగాడే ప్రతిరోజూ పూజ చేసే గుడి అది. ఆ సంగతి భక్తురాలికి తెలియదు. గుళ్ళో ప్రార్థనలు అయిన తరవాత, కొన్ని విషయాలేవో మాట్లాడ దామని ఆమె పూజారి దగ్గరకి వెళ్ళింది. భక్తురాలిని చూసి ఆ పూజారి మర్యాదచేస్తూ, తను కూర్చున్న మంచంమీంచి లేచాడు. పరుపుచుట్టేస్తూ "రండి, కూర్చోండి...కూర్చోండి" అన్నాడు. అతను పరుపు చుడుతూఉంటే ఒక చిన్న కాగితంముక్క, భక్తురాలిముందు నేలమీద పడింది. దాన్ని

చీటీ తీసుకొని చదివింది. దాంట్లో అమ్మ పేరూ జన్మనక్షత్రమూ ఉన్నాయి. వెంటనే ఆమెకు అన్నీ అర్థమయిపోయాయి - కాగితంలో ఉన్నది, పూజారి / మంత్రగాడు, కల. ఆమె రొమ్ము బాదుకొంటూ ఇలా అడిగింది, "ఏం చేశారు? అమ్మ మీద ఏమయినా ప్రయోగించారా? చేస్తే మనమింక బతకం!" అంటూ ఆమె కళ్ళనీళ్ళు పెట్టుకొంది. పూజారి ఇలా అన్నాడు, "లేదు, లేదు. నేను ఏమీ చెయ్యలేదు. నిన్న ఒక ముసలావిడ ఇక్కడికి వచ్చింది. నేను ఆ స్థానాన్ని నాశనం చెయ్యాలని అదే పనిగా చెబుతూ వచ్చింది. ఆవిడ నన్ను చిరాకు పెట్టకుండా వెళ్ళిపోవాలని ఈ చీటీ తీసుకొని ఇక్కడ పెట్టాను."

ఆ పూజారి నిజాయితీని గమనించి శాంతపడి ఆ మె ఇలా విన్నవించింది, "అక్కడ ఏం జరుగుతుందో మీ అంతట మీరు వచ్చి చూడండి. దీంట్లో నిజమేమిటో మీకు అర్థమవుతుంది." పూజారి ఒప్పుకొన్నాడు. త్వరలోనే తాను అక్కడికి వస్తాననీ, పరిస్థితి ప్రత్యక్షంగానే గమనిస్తాననీ అన్నాడు.

మాట ఇచ్చిన ప్రకారం ఆ పూజారి ఒక భావదర్శనం రోజున ఇడమన్నేల్ వచ్చాడు. అపఖ్యాతి ఉన్న పూజారి రాక సంగతి విని చాలామంది, నమ్మకమున్నవాళ్ళూ నమ్మకం లేనివాళ్ళూ పెద్ద గుంపుగా పోగయి, మంత్రగాడు అమ్మను కలుసుకొనే ఘట్టాన్ని చూడాలని ఆత్రంగా ఎదురుచూస్తున్నారు. కొందరన్నారు, "ఈ పూజారి గొప్ప మంత్రగాడు. ఇక్కడ జరిగేదంతా అంతం చేస్తాడు," గాఢమయిన విశ్వాసమున్న భక్తులు, "అతను ఏమీ చెయ్యడు" అన్నారు.

ఆ పూజారి ఒక ముసలావిడతో కలిసి వచ్చాడు. అతను గుళ్ళోకి ప్రవేశిస్తూ, ఆ ముసలావిడ చేతికి అటుకుల పొట్లం ఒకటి ఇచ్చి పట్టుకోమన్నాడు. అమ్మ నిజంగా దేవతేనని తనకు నిరూపించినట్లయితే తాను ఆమె భక్తుడు కావాలని ముందే నిశ్చయించుకొన్నాడు. అమ్మ కృష్ణభావంలో ఉంది. ఆమె అతనికి ఒక గుప్పెడు విబూది ఇచ్చి ఇలా అడిగింది, "నువ్వు ఈ మంత్రం జపించడానికి వచ్చావు కదూ?" అంటూ ఆ పూజారికి మాత్రమే తెలిసిన, గోప్యమయిన ఒక మంత్రాన్ని ఆమె చెప్పింది. ఆ పూజారి దిమ్మెరపోయాడు. అమ్మ ఇంకా ఇలా అంది, "నువ్వు హనుమంతుణ్ణి పూజిస్తావు కదూ? ఆయన నామజపం చేసే నోటితో దుష్టమంత్రాలు జపించకు." ఆ పూజారికి నోట మాట రాలేదు. అతని ఉపాసన మూర్తి హనుమంతుడన్న సంగతి ప్రపంచం మొత్తంమీద ఎవ్వరికీ తెలియదు. అతని జీవితంలోని చాలా గొప్ప రహస్యాన్ని అమ్మ అప్పుడే వెల్లడించింది. అమ్మ అతనికి చెప్పేది ఇంకా పూర్తి కాలేదు, "అటుకుల పొట్లం ఒకటి పట్టుకోమని నువ్వు ముసలావిడ చేతికి ఇవ్వలేదూ? కుచేలుడు* శ్రీకృష్ణుడి దగ్గరికి అటుకులు తీసుకొని వెళ్ళాడు.

* కృష్ణభగవానుడి దృఢభక్తుడు; ఇతని కథ శ్రీమద్భాగవతంలో వస్తుంది.

నువ్వుకూడా అవే ఇద్దామని వచ్చావు కదూ? కాని ఒక్క సంగతి; కుచేలుడు కృష్ణుడికి వైరాగ్యం [పరిత్యాగం], భక్తి అనే అటుకులు అర్పించాడు. వాటినిండా రాళ్ళూ ఇసకా ఉన్నప్పటికీ భగవంతుడు వాటిని చూడలేకపోయాడు. ఆయన చూసినదీ చూడగలిగినదీ కుచేలుడి విశుద్ధభక్తీ నిష్కల్మష హృదయమూ. అక్కడ రాళ్ళూ లేవు, ఇసకా లేదు. ప్రతిదీ అమృతమే. అందుచేతే భగవంతుడు వాటిని తిన్నాడు. నువ్వు అటుకులు పక్కింటివాళ్ల దగ్గరినుంచి ఎందుకు తీసుకున్నావు? వడ్లు దంపిన తరవాత వాటిలో రాళ్ళూ ఇసకా కలిపి ఎందుకు తెచ్చావు?"

పూజారి తన చెవులను తను నమ్మలేకపోయాడు. తను చేసినవన్నీ తూచా తప్పకుండా వివరంగా అమ్మ నోటినుంచి రావడం చూసి కన్నీళ్లు పెట్టుకొన్నాడు. గాఢంగా పశ్చాత్తాపం చెంది, తన పాడు పనులకు క్షమించమని వేడుకొన్నాడు. ఆనాటినుంచి అతను అమ్మకు నిజమయిన భక్తుడయాడు.

## గుడ్డినమ్మకాల నిర్మూలన సమితివాళ్ళ మరికొన్ని సాహసకార్యాలు

గుడ్డినమ్మకాల నిర్మూలన సమితి వాళ్ళు ఇప్పుడు అమ్మకు వ్యతిరేకంగా ఇంకా కుత్సితమయిన పథకాలు ప్రారంభించారు. భావదర్శనాన్ని నిరోధించడానికి పెద్ద పోలీసు అధికారులను, ప్రభుత్వాధికారులను ప్రభావితులను చెయ్యడానికి ప్రయత్నించారు. ఈ సమితి కార్యాకలాపాలు, బహిరంగం చెయ్యడానికి ప్రయత్నించారు. ఈ సమితి కార్యకలాపాలు, బహిరంగంగాను గోప్యంగానుకూడా అనేక విచారణలు జరగడానికి దారితీశాయి. దానికి ఫలితం ఏమిటయ్యా అంటే, విచారణ చేసినవాళ్లలో చాలామంది భక్తులయిపోయారు!

ఒకనాడు సాయంత్రం దేవీభావదర్శనం జరుగుతూ ఉండగా, భక్తిగీతాలు పాడుతున్న అమ్మాయి వాటిని వెంటనే ఆపెయ్యాలని ఇబ్బందిగాళ్ళు పట్టుబట్టారు. ఆ అమ్మాయి చురుగ్గా బదులు చెప్పింది, "నేను పాడతాను. అమ్మమీద నాకు నమ్మకముంది." ఈ సంఘటనవల్ల వాదులాట జరిగింది; చివరికి భక్తులకూ రౌడీలకూ మధ్య పోట్లాట జరిగింది. ఆఖరికి, సుగుణానందన్ రంగంలోకి ప్రవేశించి వాళ్ళను తరిమేశాడు.

వాళ్ళు వెళ్ళిపోయిన వెంటనే అమ్మ, తన తండ్రిని పిలిచి హెచ్చరిక చేసింది, "మనమీద అర్జీ దాఖలు చెయ్యడానికి వెళ్ళారు వాళ్ళు. మొదటి ముద్దాయి (defendent) ని నేను, రెండో ముద్దాయివి నువ్వు. నువ్వు ముందే వెళ్ళి వాస్తవ పరిస్థితి అధికారులకు తెలియబరచాలి." అమ్మ మాటలను పట్టించుకోకుండా అతను, "వాళ్ళు మనమీద

అర్జీ దాఖలు చెయ్యరు. పోలీసులు ఇక్కడికి రారు," అన్నాడు. అమ్మ చాలా స్పష్టంగా నొక్కి చెప్పింది; చివరికి సుగుణానందన్ పోలీసు ఠాణాకు వెళ్ళాడు. అమ్మ ఊహించినది అక్షరాలా నిజమని తేలింది. అతను తన కేసును స్పష్టంగా, నిజాయితీగా దాఖలుచేశాడు.

"మేము ఎవరినీ దగా చెయ్యడంలేదు. నా కూతురిలో దైవభావాలు వెల్లడి అవుతున్నాయన్నది నిజం. మీరు కనక ఒకసారి అక్కడికి వస్తే ఇందులో నిజాన్ని మీరు నిజంగా అర్థంచేసుకొంటారు. భక్తులు వచ్చి భక్తిగీతాలు పాడతారు. ఇందులో నకిలీ ఏమీ లేదు. ప్రసాదంగా ఇచ్చేవి ఊరుమ్మడి కుళాయి నీళ్ళు, ఓచిరాలో కొని తెచ్చిన విబూది. పువ్వులేవీ మేము ఆకాశంలోంచి సృష్టించం. చెట్లనుంచి, పొదలనుంచి కోసుకువచ్చిన పువ్వులే అర్పిస్తాం. దైవభావాలను గురించి వ్యాపార ప్రకటనలు కాని, ప్రచారం కాని చెయ్యడం లేదు. ప్రజలు, అంతకుముందు భావదర్శనం పొందినవాళ్ల అనుభవాలను గురించి విన్న తరవాత వస్తారు. పైపెచ్చు, ఇదంతా జరుగుతున్నది నా ఇంట్లో. అది మరెవరి ఆస్తీ కాదు. దుండగీళ్ళు నాతో కొట్లాడటానికీ వాదులాడటానికీ నా ఇంటిమీదికి వచ్చారు. ఇది న్యాయమా? కాబట్టి వాళ్ళబారినుంచి మమ్మల్ని కాపాడమని కోరుతున్నాను!"

సుగుణానందన్ చెప్పినది విన్న తరవాత, అతని దృఢమయిన నిజాయితీ చూసిన తరవాత అధికారులు ఒక్కమాట మాట్లాడలేకపోయారు. దొంగ అర్జీ రద్దయింది. దుండగీళ్ళు అగ్గిమీద గుగ్గిలం అయారు. ఎదురుదెబ్బ తీయడం, అమ్మకు కీడుచెయ్యడం వాళ్ళ తరవాతి పథకం. ఆ రోజుల్లో భావదర్శన సమయంలో అమ్మ, దేవితో తన ఏకత్వాన్ని వెల్లడించిన తరవాత, గుళ్ళోంచి బయటికి వచ్చి ఆనందంగా నర్తించేది. ఒకనాడు సాయంత్రం దుండగీళ్ళు, నిండా విషపు ముళ్ళున్న బాల్చీతో ఇడమన్నేల్‌కు వచ్చారు. ఈ ముళ్ళు ఎంత వాడిగా, ఎంత విషంతో ఉన్నాయంటే, ఎవరి కాలిలోనయినా ఒక్క ముల్లు గుచ్చుకొంటే చాలు, స్పృహతప్పి కింద పడిపోయేవారు.

అమ్మ ఎప్పుడూ నాట్యంచేసే చోట నేలమీద వెదజల్లమని ఊరివాళ్ళ పిల్లల్లో కొందరికి ఆ ముళ్ళు అప్పగించారు. ఇది దీపారాధన సమయంలో జరగాలని చెప్పారు. ఎందుకంటే, ఆ సమయంలో అందరి దృష్టీ అమ్మమీద ఉంటుంది. పిల్లలు అలాగే చేశారు. అమ్మ, గుళ్ళోంచి బయటికి వచ్చినప్పుడు, జరిగిందేమిటో భక్తులకు చెప్పి, నించున్న చోటినుంచి కదల వద్దని వాళ్ళను హెచ్చరించింది. అలా చెప్పి అమ్మ, పైకెత్తిన చేతులతో ఖడ్గమూ త్రిశూలమూ పట్టుకొని ఆనందపారవశ్యంతో నాట్యం ప్రారంభించింది. భయసంభ్రమాలను రేకెత్తించే విధంగా సాగింది నాట్యం. దుష్టత్వాన్ని

పట్టుపెట్టి కాళీమాతే తమ ముందు నాట్యం చేస్తున్నట్టుగా అనిపించింది. భక్తులకు గుడిముందు వసారా వెంబడి అడుగులు వేస్తూ ఆమె ఆడుతూండగా హఠాత్తుగా ఆమె కత్తి గోడకున్న పటాల తాళ్ళను కోసేసింది. పటాలు భళ్ళున కిందపడి గాజుముక్కలు వసారాలో చెల్లాచెదురుగా పడ్డాయి. ఈ ప్రమాదాన్ని పట్టించుకోకుండానే అమ్మ నాట్యం కొనసాగించింది; గాజుముక్కలు పట్టి పూలరేకులన్నట్టుగా అంతసేపూ వాటిని తొక్కుతూనే ఉంది. అమ్మకు కీడు చేద్దామని వచ్చినవాళ్ళు ఈ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోయారు. అయినా కూడా, ఆమె పాదాలనిండా ముళ్ళు గుచ్చుకొని నెత్తురు కారడం, యమబాధ భరించలేక ఆమె నేలమీద కూలిపోవడం చూడాలన్న పెంత ఆశతో కాచుకుని ఉన్నారు.

ఇప్పుడు అమ్మ గుడి వసారాలోంచి కిందకి దిగి తిన్నగా, ముళ్ళున్న చోటికి వచ్చింది. తన కత్తితో నేలమీద ఒక గీత గీసి, దాన్ని దాటి ఎవరూ రావద్దని చెప్పింది. తాను ఆ గీత దాటి, విషపుముళ్ళను తొక్కుతూ చాలా సేపు నాట్యంచేసింది. దుండగీళ్ళు తమ కళ్ళను తాము నమ్మలేకపోయారు. ఈ భయానక దృశ్యాన్ని చూసి చాలా బెదిరిపోయి వెంటనే వెళ్ళిపోయారు.

జరుగుతున్నదేమిటో తెలుసుకొన్న తరవాత సుగుణానందన్, గాయపడ్డ తన కూతురి పాదాలను తలుచుకొని భయవిహ్వాలుడయి ఇక్కడికీ, అక్కడికీ పరుగెత్తడం మొదలుపెట్టాడు. గాయాలు మాన్పడానికి మందు తీసుకొని వచ్చాడు. కాని, ఆశ్చర్యం కలిగించినదేమిటంటే గీరుకుపోయిన జాడ కాని, గుచ్చుకున్న జాడ కాని ఎక్కడా కనిపించలేదు.

ఈ హేతువాదులనిపించుకొనే వాళ్ళు అలాటి అలౌకిక అద్భుతాలు చాలావాటిని కళ్ళారా చూసినప్పటికీ అమ్మ మీద వాళ్ళకున్న అసూయనూ శత్రుత్వాన్నీ వదులుకోడానికి సిద్ధంగా లేరు. ఊరివాళ్ళ దృష్టిలోను, భక్తుల దృష్టిలోను, అమ్మ దగ్గర జరిగే అసాధారణ సంఘటనలన్నీ అద్భుతావహమయినవి. కాని, ఎప్పుడూ పరబ్రహ్మలో సుస్థితురాలయి ఉండే అమ్మకు, ఇలాటి సంఘటనలు పిల్లలాటలవంటివి. అధర్మపరులయిన దుండగులు అంతూ పంతూ లేకుండా అమ్మను పెట్టె వేధింపులకు బాగా కుంగిపోయిన భక్తులు కొందరు వచ్చినప్పుడు ఆమె ఇలా అనేది, "రెండు [ద్వంద్వం] లేనిదే ప్రపంచం లేదు. వీటన్నిటికీ మనం బాధపడగూడదు. అమ్మ భక్తులు ప్రపంచమంతటా ఉన్నారు. ఇలాటి పనులవల్ల వాళ్ళు మోసపోరు." భక్తులను, వారి కుటుంబాలను ప్రశాంతంగా, ఓర్పుగా ఉండమని అమ్మ సలహా ఇచ్చింది. వాళ్ళు అమ్మ సలహాను నిష్ఠగా పాటించారు; హేతువాదుల భయానక ప్రవర్తనను సహించారు.

మరో సందర్భంలో, హేతువాద ఉద్యమంలో పనిచేసే కుర్రకారు కొందరు, వింటరి బుద్ధితో ఇడమన్నేల్‌కు వచ్చారు. భావదర్శన సమయంలో అమ్మ ఆడే ఆటను అనుకరిస్తూ తాముకూడా అలా ఆడి, భక్తులను మోసగించి, అమ్మను వెక్కిరిద్దామని అనుకొన్నారు. వాళ్ళు వచ్చేసరికే దర్శనం మొదలయింది. అమ్మ, భక్తులకు ఒక్కొక్కరికే దర్శనమిస్తోంది. ఆ సమయంలో ఆమె, కొందరు భక్తులను పిలిచి. తనను అనుకరించి ఆడాలని కుర్రకారుకున్న ఉద్దేశాన్ని తెలిపింది. వాళ్ళకేమీ హానిచెయ్యవద్దని చెప్పి, అవసరమయిన ఆదేశాలు ఇచ్చి భక్తులను బయటికి పంపింది. ఈ భక్తులు ఏమరిపాటు లేకుండా కాచుకుని ఉన్నారు. కొద్దిసేపటికి, కుర్రకారులో ఒకడు ప్రదర్శన మొదలుపెట్టాడు. భావదర్శన సమయంలో అమ్మ చూపించే భంగిమలను కొన్నిటిని అనుకరించడానికి ప్రయత్నించాడు. సావధానంగా ఉన్న భక్తులు మోసగాణ్ణి చుట్టుముట్టి ప్రశ్నలువేయడం మొదలుపెట్టారు. వాళ్ళ ప్రశ్నలకు జవాబులు చెప్పలేక వాడు బెదురుకొన్నాడు; తను చేసింది ఎంత తీవ్రమయిన అపరాధమో అర్థంచేసుకొన్నాడు. ఈ కుర్రవాడి స్నేహితులు, వీణ్ణక్కడ వదిలేసి వెంటనే కాలికి బుద్ధిచెప్పారు. వాడు గాభరాపడి ఉప్పుటేట్లోకి ఉరికాడు! భక్తులు వాణ్ణి నీళ్ళలోంచి బయటికి ఈడ్చారు. మళ్ళీ ఇటువంటి మూర్ఖపు పనులు చేయవద్దని తీవ్రంగా హెచ్చరించి వాడి దారిన వాణ్ణి పోనిచ్చారు.

ఈ కాలంలో, దుండగీళ్ళు ఎంతో ధైర్యంగా, అన్నిటికంటె దారుణమయిన పథకం ప్రారంభించారు. భావదర్శన సమయంలో గుళ్ళోకి వెళ్ళి అమ్మను కత్తితో పొడిచి చంపడానికి ఒక హంతకుణ్ణి కిరాయకు కుదుర్చుకొన్నారు. కట్టుబట్టల్లో ఒక చాకు దాచిపెట్టుకొని అతను గుళ్ళోకి అడుగుపెట్టాడు. వాణ్ణి చూసి అమ్మ చిరునవ్వు నవ్వింది; భక్తులను చేరదీస్తూనే ఉంది. ఆమె చిరునవ్వు అతనిమీద ఉపశమన కారకమయిన ప్రభావం చూపింది. వాడు తెలివి తెచ్చుకొని, తన ఘోర అపరాధాన్ని గ్రహించుకొని అమ్మ కాళ్ళమీద పడి క్షమాపణ కోరాడు. గుళ్ళోంచి బయటికి వచ్చిన తరవాత, [వాడు వెనకటిలా లేడు;] మారిపోయాడు. వాడిలో వచ్చిన ఆశ్చర్యకరమయిన మార్పు చూసి వాడి క్రూరమిత్రులు, అమ్మ నిన్నుకూడా కనుకట్టు చేసిందా, అని అడిగారు. వాడు చిరునవ్వు నవ్వి ఊరుకొన్నాడు. అప్పటినుంచి అమ్మకు గాఢభక్తుడు అయాడు.

ఈ దశలో, మొరటు ఇబ్బందిగాళ్ళ తిట్లు చెవిని పడకుండా రోడ్డుమీద కాని, ఊళ్ళో దారివెంట కాని నడిచివెళ్ళడం అమ్మకు అసాధ్యమవుతూ వచ్చింది. ఊళ్ళో ఉన్న కుర్రపిల్లలను కూడా తమలాగే చెయ్యమని రేపెట్టేవారు. తెల్లవారగట్ల అయినట్ల యితే, వాళ్ళు చెట్ల వెనకా పొదల వెనకా దాక్కొనేవారు; ఆమె మీదికి రాళ్ళు విసిరేవారు కూడా. ఆ మోటు మనుషులు అమ్మను పెట్టే హింసలకు హద్దులేకుండా పోయింది.

ఈ దారుణ క్రీడకు మొత్తం కుటుంబం ఎర అయింది. ఆ కుటుంబంలో మని ఎవరయినా కనిపిస్తే దుండగీళ్ళు ఇలా అరిచేవారు. "ఇడుగో వస్తున్నాడు కృష్ణుడు! ఇడుగో వస్తున్నాడు కృష్ణుడు!"

ఆ సాయంత్రానికి మరో పథకం ఏదీ లేకపోయినట్లయితే, హేతువాదులు గుళ్ళో అడుగుపెట్టి అమ్మ చేసేది దగా అని వెల్లడిద్దామన్న ఆశతో తప్పుడు కూతలు కూసేవారు. ఒకడు అమ్మ దగ్గరకి వచ్చి తను గుడ్డివాణ్ణి అని చెప్పుకొన్నాడు. వెంటనే అమ్మ, వాడి కన్నుపొడిచి తీస్తున్నట్లుగా వేలు దూసింది. వాడు వెనక్కి గెంతి, 'ఓ' అని అరిచాడు. ఈ విధంగా అమ్మ, తనను దగా చెయ్యడానికి వచ్చినవాడి దగాను బట్టబయలు చేసింది.

మరో సందర్భంలో, ఒక పడుచువాడు అమ్మ దగ్గరికి వచ్చి, చెయ్యి తీవ్రంగా నొప్పిపెడుతోందని చెప్పాడు. తన మాటలు నమ్మి అమ్మ, తన చేతికి మర్దన చేస్తుందని ఆశించాడు. అమ్మ, తను ఆ పని చెయ్యకుండా, దగ్గరలో నిలబడి ఉన్న బ్రహ్మచారి చేత మర్దన చేయించింది. బ్రహ్మచారి వాడి చెయ్యి ముట్టుకోగానే, నొప్పిగా ఉందని చెప్పి అమ్మకు తను చూపించినచోట తీవ్రంగా నొప్పి పుట్టింది. నొప్పి భరించలేక, వాడు తన కుర్రతనపు చేష్టకు అమ్మను క్షమించమని వేడుకొన్నాడు. అమ్మను దగా చేద్దామని వచ్చినవాళ్ళు తామే దగాకోరులుగా తప్పకుండా బయటపడేవారు.

## "నేటి శత్రువు రేపటి మిత్రుడు"

హేతువాదులు నిరంతరంగా కలిగించే ఉపద్రవాలను, దుశ్చర్యలను చూసి సుగుణానందన్ విసుగెత్తిపోయాడు. ఉక్రోషంతో ఒకనాటి రాత్రి దేవీభావ సమయంలో అమ్మ దగ్గరికి వచ్చి, "దేవుడు నాకిచ్చే ఫలం ఇదేనా? జనం నన్ను సొంత కొడుకును చంపిన ఖూనీకోరు అంటున్నారు! తిట్లు లేకుండా ఊళ్ళో నడవడం కష్టమయిపోతోంది. ఇది దీనమయిన పరిస్థితి. దుష్టులను దేవి శిక్షించాలి."

"వేచి చూడు. నేటి శత్రువు రేపటి మిత్రుడు. నేను ఎవరిని శిక్షించాలి? ఈనాడు నిన్ను వ్యతిరేకించిన వాళ్ళే రేపు వచ్చి నీ కూతుళ్ళను పెళ్ళి చేసుకొంటారు. అన్నీ దేవుడి ఇచ్ఛప్రకారం జరుగుతాయని తలిచి ఊరట చెందు. నీ ఒక్క కొడుకు పోతే, రేపు వేలమంది కొడుకులు వస్తారు." కొడుకు చావువల్ల దమయంతి దుఃఖంలో మునిగిపోయింది. "దుఃఖపడకు. ముందు ముందు, ఎంతో మంది బిడ్డలు ప్రపంచమంతటి నుంచీ ఇక్కడకి వస్తారు. వాళ్ళను నీ సొంత బిడ్డల్లాగే చూసుకో."

అమ్మ రాత్రింబగళ్ళు, తన భక్తులను ఓదార్చడానికీ వాళ్ళకు సాయంచెయ్యడానికీ

...పోయినప్పటికీ జీవితంలో సంకటస్థితిని ఎదుర్కొంటున్న తన కుటుంబ సభ్యులకు సేవ చెయ్యడానికి సాయం చెయ్యడానికి వెసులుబాటు చేసుకొనేది. లౌకిక ...ఆమె కష్ట; అయినప్పటికీ సత్యధర్మాల మార్గంనుంచి కొస్త కూడా పక్కకు ...అంతా ఆమె వేలాదిమంది భక్తులకూ తన తల్లిదండ్రులకూ కూడా పరిపూర్ణంగా ...చేసేది. తన కుటుంబం పట్ల ఆమెకున్న వైఖరి, వాళ్ళను ఆమె సంరక్షించే ...గృహస్థ భక్తులకు స్ఫూర్తినిచ్చేవి. ఎవరయినా ఆధ్యాత్మిక మార్గంలో సాగుతూనే ...గంగానూ పరిశుద్ధంగానూ ఉంటూ, కుటుంబంపట్ల తనకున్న కర్తవ్యాన్ని నిర్వహించగలరని తెలపడానికి మచ్చులేని ఉదాహరణ అమ్మ.

సుగుణానందన్ చేపల వ్యాపారంలో ఉన్నప్పటికీ అది ఏమంత లాభసాటిగా సాగడంలేదు. భావదర్శనం దేశమంతటినుంచీ లెక్కలేనంత మందిని తన ఇంటికి రప్పించడం మొదలయాక, ఆ వ్యాపారం పూర్తిగా మానేశాడు. అంతే కాకుండా, ఊళ్ళోవాళ్ళ వ్యతిరేకతవల్లా భావదర్శనానికి సంబంధించి పుట్టుకు వచ్చిన ఇతర సమస్యలవల్లా అతను వ్యాపారంమీద దృష్టి నిలపలేకపోయాడు. తనకున్న సమయమంతా తప్పనిసరిగా ఇడమన్నేల్‌లోనే గడపవలసి వచ్చింది. ఇది ఇలా ఉండగా, అతను ఎంతగా పట్టించుకోనట్టు కనిపిస్తున్నప్పటికీ, పెళ్ళి కావలసిన కూతుళ్ళు ఇంకా ముగ్గురున్నారు. కొడుకులందరూ బడిచదువుల్లో ఉన్నారు. అప్పుడప్పుడు ఇంట్లో ఎవరో ఒకరికి నలతచెయ్యడం, వైద్యం చేయించడం జరుగుతున్నాయి.

ఈ పరిస్థితిలో, ఈ ఒత్తిడివల్లా, ప్రయాసవల్లా సుగుణానందన్, 1979 ఆరంభంలో ఆస్పత్రిలో చేరవలసి వచ్చింది. తరవాత ఆపరేషన్ జరిగింది. ఆస్పత్రి, వళ్ళిక్కావుకు దక్షిణాన 35 కిలోమీటర్ల దూరంలో కొల్లం అనే పట్టణంలో ఉంది. ఇంటిపనుల్లో సాయపడ్డానికి కాని, ఆస్పత్రిలో సుగుణానందన్‌కు ఉపచారాలు చెయ్యడానికి ఎవ్వరూ లేరు. చుట్టాలంతా ఈ కుటుంబానికి తీవ్ర వ్యతిరేకులు. కస్తూరి దూరపు ఊళ్ళో ఉద్యోగం చేస్తోంది. కీళ్ళవాతం నొప్పితో దమయంతి మంచం పట్టింది. మగపిల్లలు కొందరు మరీ చిన్నవాళ్ళూ కొందరు బళ్ళో చదువుతున్నవాళ్ళూ. మొత్తం భారమంతా అమ్మమీద పడింది.

దర్శనం రోజుల్లో భక్తులు ఒంటిగంటనుంచే రావడం ప్రారంభించారు. సాయంత్రం నాలుగు గంటలకు అమ్మ భక్తి సంకీర్తనానికి కూర్చునేది. ఆ తరవాత భావదర్శనం. ఒక్కొక్కప్పుడు ఇది, మర్నాడు పొద్దున 8, 9 గంటలవరకు సాగుతూండేది. ప్రతి ఒక్కరినీ ఆదరించేవరకు అమ్మ, గుళ్ళో ఆసనంమీంచి లేచేది కాదు. వీటి మధ్యలో, ఆమె మార్గదర్శకత్వంకోసం వచ్చిన ఆధ్యాత్మికాభిలాషులకు బోధ చేస్తూండేది.

దర్శనం పూర్తి అయిన తరవాత అమ్మ, వెనక చాలా ఏళ్ళు చేసినట్టుగానే, ఇంటిపనులు చేసేది. చిన్నవాళ్ళకు కావలసినవి చూసి బడికి పంపేది. పని అంతా అయిన తరవాత అమ్మ, ఆస్పత్రిలో ఉన్న సుగుణానందన్‌కు అన్నం, కావలసిన వస్తువులు తీసుకొని కొళ్ళం వెళ్ళేది. అతను అనారోగ్యంగా ఉన్నంతకాలం ఎంతో జాగ్రత్తతో, చిత్తశుద్ధితో అతనికి సేవలు చేసింది.

ఈ అవకాశాన్ని పోగొట్టుకొనేవాళ్ళు కాదు దుండగీళ్ళు. కొళ్ళం వెళ్తూ అమ్మ వీథిలో నడిచి వెళ్తూంటే ఆమెను వెక్కిరించి రాళ్ళు విసిరేవాళ్ళు. "కృష్ణా, కృష్ణా...." అని అరిచేవాళ్ళు. ఈ తప్పుడు నడతనంతనూ ఆమె ఓర్చుకొనేది. 'కనీసం ఈ విధంగానయినా వాళ్ళు దైవనామాన్ని జపిస్తున్నారు' అనుకొనేది అమ్మ. ఒకసారి, ఒక రౌడీ అమ్మను దొరకబుచ్చుకోడానికి ప్రయత్నంచేశాడు. ఆమెను పట్టుకుందామని ముందుకు ఉరకగానే, దారి పక్కనున్న మురికిగుంటలో పడ్డాడు.

క్రమక్రమంగా సుగుణానందన్ ఆరోగ్యం మెరుగయింది. అయితే తరవాత కొన్నాళ్ళకే దమయంతినీ ఆ తరవాత సురేశ్‌నూ ఆస్పత్రిలో చేర్చవలసి వచ్చింది. ఈ కాలంలో, ఇంటిపనులన్నీ చేసిందీ ఆస్పత్రిలో ఉన్నవాళ్ళకు ఉపచారాలు చేసిందీ అమ్మే.

కుటుంబ వాతావరణంలో సంక్షోభం, గందరగోళం ఏర్పడ్డాయి. అయినప్పటికీ పరిసితి ఏదయినప్పటికీ, అమ్మ ప్రశాంతంగాను, దయతోను దృఢమయిన ఆధారంగా, సంరక్షకురాలిగా నిలిచింది. పరిస్థితిని ఊహించుకోండి. సుభగన్ ఆత్మహత్యవల్ల కలిగిన అలజడి, చుట్టాల సహాయనిరాకరణ, హేతువాదుల శత్రుత్వం, వేలకొద్దీ భక్తులు భావదర్శనానికి గుమిగూడటం, ఇంట్లో పెళ్ళికాని ముగ్గురు ఆడపిల్లలు. ఎవరూ ఈ కుటుంబంతో పెళ్ళి సంబంధం ఏర్పరచు కోడానికి సుముఖంగా లేరు! దూర ప్రదేశంనుంచి ఎవరయినా పెళ్ళి ప్రతిపాదనతో వచ్చినప్పటికీ వాళ్ళు ఇడమన్నేల్ చేరేలోగానే ఊళ్ళోవాళ్ళు కొందరు, పెళ్ళి ప్రతిపాదననుంచి నిరుత్సాహపరచడానికి వాళ్ళను కలుసుకొనేవారు. చాలామంది పెళ్ళి కొడుకులు వెంటనే తిరుగుదారి పట్టేవారు.

అందువల్ల సుగుణానందన్ మళ్ళీ అమ్మ దగ్గరికి వచ్చాడు, "భావదర్శనంవల్ల నా పరువు పోయింది. ఇడమన్నేల్‌కు బయట ఎక్కడా నా మొహం చూపించలేక పోతున్నాను కూడా. ఊరివాళ్ళూ చుట్టాలూ నన్ను ఏవగించు కొంటున్నారు. నా కూతుళ్ళు పెళ్ళి కాకుండా ఉండిపోయారు. నన్నేం చెయ్యమంటావు?" అని అడిగాడు.

అప్పుడు అమ్మ ఇలా జవాబు చెప్పింది, "నీ దురదృష్టానికి కారణం భావదర్శనం కాదు. ప్రతిదీ దైవసంకల్పం ప్రకారం జరుగుతుంది. అన్నీ తగిన సమయంలో జరుగుతాయి. నువ్వేమీ దిగులుపడకు." ఈసారి సుగుణానందన్ ఈ ఓదార్పు మాటలకు

పెట్టుకోదలచలేదు. "నేను విషం తాగి చస్తాను!" అని కోపంగా అరిచాడు. ఈ మాట ని అమ్మ, కన్నీళ్ళు పెట్టుకొని దేవి పటం వైపుతిరిగి, "కరుణామయివయిన ఓ అమ్మా, ళ్ళకు నేను దుఃఖమే తెచ్చిపెడుతున్నానా?" అని అడిగింది.

అమ్మ ఇడమన్నేల్ విడిచి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకొన్న సందర్భాలు అరుదు; అందుకు ఏర్పాట్లు చేసుకోడం కూడా ప్రారంభించింది. కాని ప్రతిసారీ ఈ ప్రయత్నానికి అనుకోని ఆటంకం ఏదో వస్తూండేది. మళ్ళీ సుగుణానందన్ ఆందోళనతో అమ్మ దగ్గరకి వచ్చాడు. మళ్ళీ ఆమె చెప్పింది, "దిగులుపడకు. నీ కూతుళ్ళ పెళ్ళిళ్ళు ఎక్కువ ఆలస్యం కాకుండానే జరుగుతాయి."

నెల్లాళ్ళలో అమ్మ మాటలు నిజమయాయి. సుగుణమ్మను చేసుకోడానికి, అనుకోడానికి ఏమాత్రం అవకాశంలేని కుటుంబం నుంచి ప్రతిపాదన వచ్చింది. ఈ కుటుంబం అమ్మకు పూర్తి వ్యతిరేకం; పెళ్ళికొడుకు హేతువాద ఉద్యమం ముఠా నాయకుల్లో ఒకడు. చమత్కారం ఏమిటంటే, పెళ్లి ఖాయమయాక సుగుణానందన్ రంగంలోంచి తప్పుకొన్నాడు. పెళ్ళి ఏర్పాటుకు పూర్తి బాధ్యత అమ్మ మీదే పడింది! సంపూర్ణ సమచిత్తస్థితిలో నెలకొని ఉండటంవల్ల, అమ్మ చొరవనూ సామర్థ్యాన్నీ చలింపజేసేది ఏదీ లేనట్లు కనిపించింది. సుగుణానందన్ ఒక పెడగా నిలబడి మొత్తం తతంగాన్నంతనూ తనకేమీ పట్టనట్టుగా చూస్తూ ఉండి పోయినప్పటికీ పెళ్ళి, ఏ కొరవా లేకుండా పూర్తి అయింది. "నేటి శత్రువు రేపటి మిత్రుడు," అన్న అమ్మ మాటలు నిజమయాయి. తక్కిన కూతుళ్ళ పెళ్ళిళ్ళు కూడా అలాగే జరిగాయి.

[పెరటిచెట్టు మందుకు పనికిరాదు అన్నట్టు] 'ముంగిట్లో మల్లెకు వాసన ఉండదు' అని మలయాళంలో ఒక సామెత ఉంది. దీనికి అర్థం ఏమిటంటే, ఒక వ్యక్తి గొప్పవాడూ ప్రసిద్ధుడూ అయినప్పుడు అతనివాళ్ళే అతన్ని గుర్తించరు అని. ఈ సామెతలో ఉన్న సత్యంవల్ల అనేకమంది ధర్మాత్ములు బాధలు అనుభవించారు. అమ్మ ఇలా అనేది, "ఎవరయినా రేడియోల్లో మంచి పాట వింటున్నారనుకోండి; ఆ పాటలో మాధుర్యాన్ని నిజంగా అనుభవిస్తూ ఉన్నారు. ఆ సమయంలో, అతని దగ్గిర స్నేహితుడు గదిలోకి వచ్చి 'ఆ పాట పాడుతున్నవాడు ఎవరో తెలుసా? మా ఇంటి పక్కన ఉండే శంకర్,' అన్నాడనుకోండి; వెంటనే, అంతవరకు ఆ పాట విని ఆనందిస్తూ ఉన్నవాడు రేడియో కట్టేసి ' ఓహ్, ఏం పాటగాడురా బాబూ! ఘోరం!' అంటాడు. ఇదీ మనుషుల వైఖరి. తమకు ఎప్పుడూ తెలిసిన, దగ్గరగా మసిలిన వ్యక్తిని ఒప్పుకోడం వాళ్ళకు కష్టంగా ఉంటుంది." అమ్మ విషయంలోనూ అంతే.

అమ్మ చుట్టూ ఉన్న పరిస్థితులు అనుకూలమయినవి ఏమీ కావు. ఈ బెస్త

యువతిని ఆదుకొన్నవాళ్ళు ఎవరూ లేరు. భక్తులు, దేశంలో వివిధ ప్రాంతాలవాళ్ళు కావడంవల్ల, అమ్మను హింసించే అజ్ఞానులూ సంస్కారహీనులూ అయిన గ్రామస్థులను ఏమీ చెయ్యలేకపోయేవారు. దీనికితోడు, భావదర్శన సమయంలో కృష్ణుడూ దేవీ అమ్మను పూనుతూ ఉంటారని భక్తులు చాలావరకు నమ్మేవారు. అమ్మ దైవ సాక్షాత్కారం లోతునూ సంపూర్ణతనూ వాళ్ళు అర్థం చేసుకోలేకపోయారు. అంతేకాదు; ఆ తొలినాళ్ళలో చాలామంది భక్తులు ప్రధానంగా లౌకిక మయిన లాభాలకోసమే కాని ఆధ్యాత్మిక అభ్యున్నతికోసం వచ్చేవాళ్ళు కారు. వాళ్ళ కోరిక నెరవేరితే, మళ్ళీ మరో కోరిక పుట్టినప్పుడు తప్ప తిరిగి వచ్చేవాళ్ళు కారు. కోరిక కనక నెరవేరకపోతే మళ్ళీ ఎన్నడూ వచ్చే వాళ్ళు కారు; అమ్మమీద భక్తి అంతటితో ముగిసిపోయేది. అమ్మకు తనదంటూ ఒక్క అంగుళం నేల లేదు; చేతిలో ఒక్క పైస లేదు. ఆమె రక్తసంబంధికులు సహకరించేవాళ్ళు కారు; తీవ్రంగా వ్యతిరేకించేవాళ్ళు. తన ఇంట్లోవాళ్ళే ఆమె ఆకాంక్షనూ సంకల్పాన్నీ వ్యతిరేకిస్తూ వచ్చారు. వాళ్ళు ఆమెకు ఏ విధంగానూ సహాయమూ చెయ్యలేదు, ప్రోత్సాహమూ ఇయ్యలేదు.

ఒకసారి ఒక భక్తుడు అమ్మను అడిగాడు; ఆమె సాధన దినాల్లోనూ ఆ తరవాత కూడా ఆమె ఎదుర్కోవలసి వచ్చిన పరీక్షలను, కష్టాలను గురించి. తమకే కనక అంత బాధ అనుభవించే పరిస్థితి వస్తే దైవ సాక్షాత్కారం పొందడమన్నది జరిగేదేనా అని శంకించాడు; దాన్ని తాము భరించలేమనే అనుకొన్నాడు. అమ్మ వెంటనే సమాధానం చెప్పింది. అన్నిటికంటే నికృష్టమయిన పరిస్థితుల్లో కూడా దైవ సాక్షాత్కారం పొందడం సాధ్యమని తన జీవితమే నిరూపించిందని అంది.

చెలరేగుతున్న ఈ తుపానుమధ్య అమ్మ ఆశ్రమాన్ని ఎలా స్థాపించిందో తెలుసుకోడం చదువరులకు ఆసక్తి కలిగించే విషయం. దీన్ని వచ్చే అధ్యాయంలో తెలుసుకోవచ్చు.

# పదో అధ్యాయం

## మాత అమృతానందమయి

అమ్మ సర్వ వ్యాపకురాలని ఎప్పుడూ తెలుసుకోండి. అమ్మ ఆత్మా మీ ఆత్మా ఒక్క టేనన్న విశ్వాసం ఉంచుకోండి. పిల్లల్లారా, మీకు జన్మనిచ్చిన తల్లి ఈ జన్మకు సంబంధించిన విషయాలు చూడవచ్చు; ఈ రోజుల్లో ఇది కూడా చాలా అరుదు. కాని, అమ్మ లక్ష్యం, మీరు మీ ముందు జన్మలన్నిటిలో కూడా ఆనందాన్ని అనుభవించగలిగే దారిలో మిమ్మల్ని నడిపించడం.

- మాతా అమృతానందమయి.

త్రైలోక్య స్ఫుట వక్తారో దేవాద్యసుర పన్నగాః
గురువక్త్రస్థితా విద్యా గురుభక్త్యా తు లభ్యతే.

ముల్లోకాల్లో ఉండే దేవతలు, అసురులు, నాగులు వంటి
వారి దగ్గర గురువుగారికి ఉన్న విద్య లభించదు.
గురుభక్తి వల్లనే అది లభిస్తుంది.

గురుగీత
శ్లోకం 22

### యువబృందం

"నాయనలారా, గాలి చల్లదనంలోను, చంద్రుడి కిరణాల్లోను, విశాలాకాశంలోను, ప్రపంచంలో సమస్త వస్తువుల్లోను దివ్యచైతన్యం ఉంది. ఈ సత్యాన్ని తెలుసుకోవడం, అనుభవం పొందడమే మానవ జన్మకు లక్ష్యం. ఈ అంధయుగంలో యువబృందం అన్నిటినీ విడిచిపెట్టేసి ఆధ్యాత్మిక కాంతిని ప్రపంచమంతటా వెదజల్లడానికి బయలుదేరుతుంది."

-మాతా అమృతానందమయి

1976లో ఉన్నికృష్ణన్ అనే ఇరవై ఏళ్ళ కుర్రవాడొకడు అమ్మను కలుసుకొందామని ఆలప్పాడ్‌నుంచి* వచ్చాడు. అతను ఒకరకంగా పరివ్రాజకుడి లాంటివాడు. అతనికి ఇలూ, కుటుంబమూ ఉన్నప్పటికీ కూడా అరుదుగా మాత్రమే అక్కడికి వెళ్తూ ఉండేవాడు. అమ్మను కలుసుకొన్న తరవాత అతనికి ఆధ్యాత్మిక జీవనం గడపాలన్న గాఢమయిన తృష్ణ కలిగింది. అమ్మ ఇది అర్థంచేసుకొని, ఒక ఏడాది తరవాత, గుళ్ళో నిత్యపూజ అతనికి అప్పగించింది; తన సాన్నిధ్యంలో ఉండటానికి అతన్ని అనుమతించింది. అతను పగటివేళల్లో నిత్యపూజ చేస్తూ అమ్మ నేర్పిన శ్రీ లలితా సహస్రనామం పారాయణ చేస్తూ ఆ చిన్నగుళ్ళో గడిపేవాడు. దీని తరవాత వివిధ ఆధ్యాత్మిక సాధనలు చేస్తూండేవాడు. మిగిలిన సమయంలో ఆధ్యాత్మిక గ్రంథాలయినా చదివేవాడు, భక్తి కవిత అయినా రాసేవాడు. రాత్రిపూట గుడి వసారాలో నిద్రపోయేవాడు; పలచని తువ్వాలొకటి నేలమీద పరుచుకొనేవాడు. అతను చాలా ప్రశాంతంగా ఉలుకూ పలుకూ లేకుండా ఉండేవాడు. అతను అక్కడ ఉండే వ్యక్తి అని సందర్శకుల్లో ఎవరికీ తెలిసేది కాదు. ఈ విధంగా అతను, భవిష్యత్తులో ఏర్పడబోయే ఆశ్రమానికి మొట్టమొదటి నివాసి అయాడు.

1978 ముగిసేనాటికి, దైవసాక్షాత్కారం పొందాలన్న ప్రయోజనంతోను, మానవసేవే ఏకైక లక్ష్యంగాను మంచి విద్యావంతులయిన కొందరు యువకులు ఇల్లూ వాకిలి విడిచి అమ్మ పాదాలను ఆశ్రయించడంలో ఆశ్రమ నిర్మాణ బీజం మొలకెత్తి పెరుగుతూ వచ్చింది. ఆకర్షకమయిన అమ్మ మూర్తిమత్వం చేతా సర్వవ్యాపకమయిన ఆమె ప్రేమచేతా ప్రభావితులయి ఈ యువకులు, అన్ని అడ్డంకులనూ ఎదుర్కొంటూ ఆధ్యాత్మిక జీవనం గడపాలన్న స్ఫూర్తి పొందారు. వాళ్ళలో చాలామంది హరిపాడ్* అనే ఊరివాళ్ళు; ఉన్నతవర్గ కుటుంబాల వాళ్లు. అమ్మను కలుసుకొన్న తరవాత వాళ్ళకు, అమ్మ చూపించిన దారిలో నడవడమే తమ జీవితాల్లో అభిలషించదగిన చరమ లక్ష్యమనే ప్రగాఢమయిన విశ్వాసం ఏర్పడింది.

ఒక్క నెల్లాళ్ళలో శ్రీకుమార్, రమేశ్‌రావు, వేణుగోపాల్, రామకృష్ణన్, బాలగోపాలన్ (బాలు)**, అమ్మను కలుసుకోడానికి వచ్చి తమను నిర్ణీత గమ్యానికి చేర్చమని సవినయంగా అర్థించారు. కాని సుగుణానందన్, వాళ్ళను అమ్మదగ్గర శాశ్వతంగా ఉండ వద్దని నిరుత్సాహపరిచాడు. దీనికి ప్రధాన కారణం, తక్కిన తన కూతుళ్ళకు ఇంకా

---

* *వళ్ళిక్కావుకు ఉత్తరంగా 20 కిలోమీటర్ల దూరంలో ఉంది.*

** *అమ్మ దగ్గర సాంప్రదాయిక బ్రహ్మచర్య దీక్ష తీసుకున్న తరవాత అతని పేరు అమృతాత్మ చైతన్య [ఇప్పటి పేరు స్వామి అమృతస్వరూపానంద; ఈ గ్రంథం ఆంగ్లమూల రచయిత].*

...ళ్ళు కాకపోవడం. ఈ కుర్రసాధకులు అప్పటికింకా కళాశాలలో చదువుకుంటున్నవాళ్ళో, ...గాల్లో ఉన్నవాళ్ళో. ఒక్క బాలుమాత్రం అప్పుడే కాలేజి చదువు పూర్తిచేసుకొన్నాడు. ...ళ్ళు తమ లౌకిక బాధ్యతలు నెరవేరుస్తూనే, అమ్మను చూడటానికి దాదాపు ప్రతిరోజూ, ...రోజు విడిచి రోజు, వచ్చేవారు.

లౌకిక జీవనులయిన యువకులు అకస్మాత్తుగా దైవాన్వేషకులుగా మారిపోవడం ...ళ్ళ కుటుంబాల్లోను, స్నేహితుల్లోను గొప్ప అలజడి పుట్టించింది. వాళ్ళ మనస్సులకు ...చినది ఏమిటంటే, అమ్మ ఒక మంత్రగత్తె; ఆమె గొప్ప మంత్రశక్తితో తమ పిల్ల...ల్ని వ్యామోహంలో పడేసింది అని. అమ్మలో ఎప్పుడు ఏ తప్పు దొరుకుతుందా ...అని కాచుకొని ఉన్న హేతువాదులు ఈ సమస్యను బుజాన వేసుకొన్నారు. అమ్మకు ...వ్యతిరేకంగా జనంలో అలజడి పుట్టించాలని రెచ్చగొట్టే కథలను రాసి పత్రికలు ...ంపే పనికి పూనుకొన్నారు.

పత్రికలో వచ్చిన కట్టుకథలను గురించి భక్తులూ యువకులూ ఆందోళన ...చెందారు. ఈ ఆందోళనను గురించి తెలిసినప్పుడు అమ్మ విరగబడి నవ్వింది, "ఒక కాయితమ్ముక్క మీద అచ్చయిన అక్షరాలూ మాటలూ కాము మనం. అలాటివాటి మీద దృష్టిపెట్టి మీ కాలాన్ని వృథాచేసుకోకుండా మీ ఆధ్యాత్మిక సాధనలను కొనసాగించండి. ఈనాడు వ్యతిరేకించినవాళ్ళే రేపు భక్తులవుతారు." రోజులు గడిచినకొద్దీ అమ్మ చేసిన ప్రకటన పూర్తిగా నిజమయింది.

ఆ సంవత్సరం నవంబరులో ఒక యువసాధకుడు అమ్మను కలుసుకోడానికి అలెప్పీ** నుంచి ఇడమన్నేల్ వచ్చాడు. మొదటిసారిగా వచ్చినప్పుడే అతనిలో గొప్ప మార్పు వచ్చింది. వీలయినప్పుడల్లా, అప్పుడప్పుడు వచ్చి అమ్మను దర్శిస్తూ ఉండేవాడు. లౌకిక జీవనాన్ని విడిచిపెట్టాలన్న గాఢమయిన కోరిక అతనిలో కలుగుతూ వచ్చింది; తన ఆధ్యాత్మిక సాధనలు చేసుకోడానికి ఎక్కడ ఉండాలో చెప్పమని అమ్మను అతను సలహా అడిగాడు. ఆ రోజుల్లో, అమ్మ సన్నిధిలో ఉండాలన్న కోరికతో ఏ పడుచు సాధకుడు వచ్చినా అక్కణ్ణించి తరిమెయ్యడం సుగుణానందన్ అలవాటు. ఆ సాధకుడు కూడా, ఒకనాడు సాయంత్రం సుగుణానందన్ చేత తిట్లుతిన్నాడు. వెంటనే ఇడమన్నేల్ విడిచిపొమ్మని కూడా సుగుణానందన్ ఆజ్ఞాపించాడు. మనస్సులో బాధపడి, అతను, తన సాధన కొనసాగించడానికి అనువయినచోటు చెప్పమని అమ్మను అడిగాడు. ఆమె అతన్ని తిరువణ్ణామలై ** వెళ్లమని చెప్పింది. తిరువణ్ణామలై భగవాన్ రమణ మహర్షి

* వళ్ళిక్కావు కు ఉత్తరంగా 65 కిలోమీటర్ల దూరంలో ఉన్న పట్నం.
** తమిళనాడులోని పవిత్రక్షేత్రం; చెన్నపట్నంనుంచి ఇక్కడికి 5 గంటల ప్రయాణం.

నివసించిన ఊరు. అక్కడికి వెళ్ళి నలభై రోజుల పాటు మౌనవ్రతం పాటించమని కూడా అమ్మ చెప్పింది.

వెళ్లబోయే ముందు అతను, "అమ్మచ్చీ*, భక్తుల విషయంలో సుగుణానందన్ ఇలాగే చేస్తూ ఉన్నట్లయితే ఈ స్థలం ఎప్పటికయినా ఆశ్రమం ఎలా అవుతుంది? మీ విషయంలోను, మీకు దగ్గరలో ఉండదలచినవాళ్ల విషయంలోను ఆయన నిర్దయగా ఉన్నారు. అమ్మా, ప్రస్తుతం ఎన్ని కష్టాలు ఎదురవుతున్నాయి మీకు. మీ బాధలు చూసి నేను భరించలేను. మీ సంరక్షణా మీ అవసరాలూ చూసేవాళ్ళు ఎవరూ లేరా? అన్నాడు. అమ్మ అతన్ని ఓదారుస్తూ ఇలా చెప్పింది, "దిగులు పడకు. నువ్వు అరుణాచలం** నుంచి తిరిగి వచ్చిన తరవాత అంతా చక్కబడుతుంది. అమ్మను ముందు ముందు ఏర్పడబోయే ఆశ్రమాన్నీ చూసుకొనేవాళ్ళు అక్కడ ఉన్నారు. ఇతర దేశాలనుంచి వచ్చిన నా పిల్లలు నన్ను చూడాలన్న తహతహతో అక్కడ కాచుకొని ఉన్నారు. సుగుణానందన్ నీకు సంపూర్ణ ప్రేమాభిమానాలతో స్వాగతం చెప్పే రోజు వస్తుంది."

అప్పుడు ఆ సాధకుడు ఎప్పటి పనులు అప్పుడు చేసుకోడానికి వీలుగా ఒక వాచీ, మంత్రజపానికి ఒక రుద్రాక్షమాలా ఇమ్మని అమ్మను అడిగాడు. అప్పుడామె, "అమ్మను ఇలాటివి అడక్కు; వాటిని గురించే తలచకు. మంచి సాధకుడు ఎప్పుడూ ఆసనంమీంచి కదలడు. అతనికి అవసరమయినవి వచ్చి తీరవలసిందే. సాలీడునూ కొండచిలువనూ చూడు. ఆహారంకోసం అవి బయటికి వెళ్ళవు. సాలీడు నిబ్బరంగా తన గూట్లో కూర్చుంటుంది; చిన్న చిన్న పురుగులు వచ్చి అందులో చిక్కుకొంటాయి. తన భక్తుల సంగతి చూసుకోడం దేవుడి కర్తవ్యం. అన్నీ ఆయన పాదాలకు అర్పించు; అరుణాచలం వెళ్లు. నీకు కావలసినవన్నీ సమకూరుతాయి." అంది.

అమ్మ రూపాన్ని హృదయంలో నిలుపుకొని, అవధులు లేని ఆమె ప్రేమను తలుచుకొంటూ ఆ సాధకుడు తిరువణ్ణామలైకి బయలుదేరాడు. దానికి కావలసిన డబ్బు అతనికొక స్నేహితుడు ఇచ్చాడు. శివుడి పుణ్యస్థలాన్ని చేరి, అరుణాచలమనే పవిత్రమయిన కొండకున్న ఒక గుహలో కొన్నాళ్ళు గడిపాడు. మొదటి రెండు రోజులూ ఆకులు తిని నీళ్ళు తాగి ఉన్నాడు. మూడోనాడు సాయంత్రం, అన్నం లేకపోవడంవల, 'అమ్మా' అని అరుస్తూ సొమ్మసిల్లి పడిపోయాడు. అమ్మకు ఉత్తరంలో ఇలా

* అమ్మగారు.

** తిరువణ్ణామలైలో ఉన్న పవిత్రమయిన కొండ పేరు. భూలోకంలో శివుడు మొట్టమొదట ఈ కండగా అవతరించాడని ప్రతీతి. అందువల్ల ఈ కొండనే శివుడిగా కొలుస్తార[కొండ దిగువన అరుణాచలేశ్వర ఆలయం కూడా ఉంది.]

...ను. "సాయంత్రం సుమారు 5 గంటల ప్రాంతంలో ఆకలివల్ల నేను సొమ్మసిల్లి
...యాను. కొండమీద నాకు స్పృహ ఉండీ లేనట్టుగా ఉంది. అప్పుడే నాకు అమ్మ
...లుపు వినిపించింది, 'నాయనా' అంటూ. నా నుదుటిమీద ఎవరో చేత్తో రాస్తున్నట్టు
...పించింది. కళ్ళు తెరిచి చూసినప్పుడు, ఎదురుగా అమ్మ తెల్లటి దుస్తుల్లో నిలబడి
...ంది. ఆ దృశ్యం చూడగానే నా గుండె జల్లుమంది, పులకించిపోయాను!

ఆ ఉత్తరం అమ్మకు చేరిన తరవాత, సరిగ్గా అదే సమయంలో అమ్మ, 'ఓహ్, నాయనా!' అంటూ బిగ్గరగా ఎందుకు అరిచిందో, వళ్ళిక్కావులో ఉన్న భక్తులకు అర్థమయింది. అలా అరిచిన తరవాత అమ్మ, పక్కనున్న భక్తుడితో చెప్పింది, "నా బిడ్డ తిరువణ్ణామలైలో మూడు రోజులనుంచి పస్తు ఉన్నాడు. ఇప్పుడు నన్ను చూడాలని అరుస్తున్నాడు!" ఈ సంఘటన జరిగిన తరవాత, వేళకు భోజనం సమకూరడంలో అతనికి ఎన్నడూ ఇబ్బంది కలగలేదు.

తన ఆధ్యాత్మిక సాధనలకు అనువయిన స్థలం లేకపోవడంవల్ల ఆ సాధకుడు, పగటి పూట కొండ మీద గడిపి రాత్రులు కొండదిగువకు వచ్చి నిద్ర పోయేవాడు. కొండ దిగి వచ్చిన తరవాత అతను కలుసుకొన్న మొట్టమొదటి వ్యక్తి ఒక ఆస్ట్రేలియా దేశీయురాలు. ఆమె పేరు గాయత్రి. మరో రెండు రోజులకు. రీయూనియన్ ఐలెండ్ వాస్తవ్యుడయిన మధుసూధన* అనే వ్యక్తిని కలిశాడు; ఇతని పూర్వీకులు భారతదేశం నుంచి వెళ్ళిన వాళ్ళు. ఈ ముగ్గురికీ ప్రేమానుబంధ ప్రవంతి అనుభవంలోకి వచ్చింది. అమ్మ చెప్పినది గుర్తుచేసుకొన్నప్పుడు, వాళ్ళిద్దరూ కూడా ఆమె సంతానమేనన్న గాఢమయిన అనుభూతి కలిగింది. అతను అమ్మను గురించి వాళ్లకు చెప్పడం ప్రారంభించాడు; ఆమెది చిన్న ఫోటోకూడా చూపించాడు. ఫోటోలో అమ్మ ముఖంలో దీపించే ఆనందాన్ని కళ్ళలోని వెలుగునూ చూసి గాయత్రి సమ్మోహితురాలయింది.

గాయత్రి నియతకాలికంగా ధ్యానంచేస్తూ ఉన్నప్పటికీ తన ఆధ్యాత్మిక ప్రగతి విషయంలో ఆమెకు తృప్తి కలగలేదు. అమ్మ ఫోటోను చూసిన తరవాత ఆమె నిస్వార్థప్రేమను, కరుణను గురించి విన్న తరవాతా ఆమెకు మొట్టమొదటి ఆధ్యాత్మిక అనుభవం కలిగింది. ఆమె మాటల్లోనే చెప్పాలంటే, నాలో ఒక మెరుపు మెరవడం చూశాను; ఆ వెలుగులో అమ్మ సజీవ రూపాన్ని దర్శించాను. హఠాత్తుగా నాలోంచి, 'అమ్మా ! అమ్మా! అమ్మా!' అన్న పిలుపు బయటికి వచ్చింది. ఆ తరవాత ఆలోచనలన్నీ అణిగిపోయాయి; నా మనస్సు నిలకడ అయింది. నేను కళ్ళు విప్పి గడియారంకేసి చూసేసరికి ఇరవై నిమిషాలు గడిచాయి. నాకు మరేదీ స్పృహలో లేదు."

* ఇప్పుడతని పేరు ప్రేమాత్మ చైతన్య.

మధు, అమ్మను గురించి వింటున్నప్పుడు తనకు కలిగిన సంతోషాన్ని [ఇంకొకరితో] పంచుకోవాలన్న ఉత్సుకతతో ఆ సాధకుడిని నీలు (Nealu) అనే అమెరికన్ భక్తుడికి పరిచయం చేశాడు. నీలుది చింతన చేసే స్వభావం. భగవాన్ రమణ మహర్షి ప్రత్యక్ష శిష్యులొకరు ఇతని గురువు. ఈ గురువు నాలుగేళ్ళ కిందట కాలంచేశారు. గురువును సేవిస్తూ నీలు, గడిచిన 11 సంవత్సరాలుగా తిరువణ్ణామలైలోనే ఉంటున్నాడు. ఈ సమయంలో అతను దాదాపు మంచం పట్టి ఉన్నట్టు లెక్క. కడుపులోను, వెన్నులోను తీవ్రమయిన నొప్పితో బాధపడుతున్నాడు. కొద్ది క్షణాలసేపు కూర్చోడమయినా, నడవడమయినా అతనికి కష్టంగా ఉండేది. దీనికి కారణమేమిటో వైద్యమేమిటో వైద్యులు తెలుసుకోలేకపోయారు.

ధ్యానానికి తగిన చోటు దొరక్క, అతను పడుతున్న ఇబ్బంది చూసి నీలు, తన గురువుగారి కుటీరాన్ని వాడుకోమని చెప్పాడు. అప్పుడతను అమ్మను గురించి నీలుకు చెప్పాడు. కాని, మొదట్లో నీలుకి ఏమంత ఆసక్తి కలగలేదు. అతను గొప్ప సాధువులను అప్పటికే చాలా మందిని చూశాడు; తన సాధన కొనసాగించడానికి వీలుగా జబ్బు నయంకావడం ఒక్కటే అతనికి ఇప్పుడు కావలసింది. అది మనస్సులో ఉంచుకొని, సాధకుని మౌనవ్రతం ముగిసిన తరవాత, తనను అమ్మ దర్శనానికి తీసుకు వెళ్ళమని అడిగాడు. ఈ యువసాధకుడి ఆధ్యాత్మిక సాధనకు ఉపయోగపడతాయన్న ఉద్దేశంతో నీలు, ఒక గడియారం, ఒక రుద్రాక్షమాల ఇచ్చాడు. అడక్కుండానే అన్నీ సమకూరతాయని అమ్మ చెప్పిన మాటలను గుర్తుకు తెచ్చుకొని, భావావేశం పట్టలేకపోయాడు ఆ సాధకుడు; చిత్తశుద్ధితో వ్రతదీక్ష ప్రారంభించాడు.

ఒకనాడు అరుణాచలానికి ప్రదక్షిణం చేస్తూ ఉండగా, పొడుగాటి తెల్లవాడొకడు కొందరితో కలిసి ప్రదక్షిణం చేస్తూ తమిళ పద్యాలు చదవడం గమనించాడు. శ్రీరమణుల జన్మదినమది. సాధకుడు అతనివైపు చూసినప్పుడు అతనుకూడా చూశాడు; కాస్త గర్వంతో. "గర్వంగా ఉన్నా, ఇతనుకూడా అమ్మ కొడుకులాగే కనిపిస్తున్నాడు," అనుకొన్నాడు. నిజానికి ఇతను, ఫ్రాన్సునుంచి వచ్చిన గంగ* అనే భక్తుడు. తరవాత అమ్మ దగ్గర ఉండిపోవడానికి వచ్చాడు.

నలభయ్యొక్క రోజు మౌనవ్రతం నెరవేరిన తరవాత ఆ సాధకుడు, నీలు వళ్ళిక్కావుకు ప్రయాణమయారు. అమ్మతో నీలు మొదటి సమాగమం ఎంతో అర్థవంతమయినది** అతనే ఇలా వర్ణించాడు, "నేనక్కడ గడిపిన నాలుగు

*ఇప్పుడతని పేరు సర్వాత్మ చైతన్య.

** నీలు (Neal Rosner) రాసిన "On The Road To Freedom" [ ముక్తి పథంలో] సవివరమయిన వర్ణన చూడవచ్చు.

లూ స్వర్గంలోనే ఉన్నానన్నట్టు అనిపించింది. అమ్మ సన్నిధిలో కలిగే ఆనందం వంటిది! ఒకనాడు సాయంత్రం దేవీభావం చివరిలో, అమ్మ గుడిగుమ్మం దగ్గర నిలబడి ఉంది. నేను బయట నిలబడి చేతులు జోడించి ఆమెకేసే తదేకంగా చూస్తూ ఉన్నాను. నాలో ఆనందం పెల్లుబుకుతోంది. ఆ సమయంలో ఆమె భౌతికరూపం అదృశ్యమయి, విస్తరిస్తున్న వెలుగుగా మారి చుట్టుపక్కలంతా నిండి, కనిపించే ప్రతిదాన్నీ ఆవరించేసింది. విస్తారమయిన వెలుగు హఠాత్తుగా, భరించలేనంతగా మిరుమిట్లు గొలిపే కాంతి తాలూకు ఉజ్జ్వలమయిన సూదిబెజ్జమంత బిందువుగా కుదించుకుపోయింది. ఆ వెలుగు నాలో ప్రవేశించినట్లు అనుభూతి కలిగింది. ఆ అనుభవం కలిగించిన ఆధ్యాత్మికమయిన మత్తువల్ల మూడు రోజులు నాకు నిద్రే పట్టలేదు. దీని తరవాత నేను రాత్రీ పగలూ అమ్మనే తలుచుకొంటూ ఉన్నాను. ఆమె మార్గదర్శకత్వం పొందడానికీ ఆమెను సేవించడానికీ నా జీవితాంతంవరకు అమ్మకు దగ్గరగానే ఉండాలని నిశ్చయించుకొన్నాను."

నీలు ఆ సాధకునితో బాటు తిరువణ్ణామలైకి తిరిగి వచ్చాడు; అక్కడి పనులు చక్కబెట్టుకొని మళ్ళీ వళ్ళిక్కావు వచ్చేద్దామని. అతనితో కలిసి గాయత్రికూడా వచ్చింది. అమ్మకు సేవచేద్దామన్నది ఆమె గాఢమయిన కోరిక. చిత్రం ఏమిటంటే, వాళ్ళు తన బిడ్డలేనన్నట్లుగా సుగుణానందన్ వాళ్ళకు స్వాగతం పలికాడు. మూడేళ్ళలో మొట్టమొదటిసారిగా నీలుకు జబ్బు కొంత నయ మయినట్లు అనిపించింది; చిన్న చిన్న పనులు చేస్తూ తిరగగలిగాడు.

తిరువణ్ణామలైనుంచి తిరిగి వచ్చిన తరవాత నీలు, అమ్మకు తన కోరిక వెల్లడించాడు, "ఇక్కడినుంచి నేను వెళ్ళదలుచుకోలేదు. నీ దాసుడిగా ఎప్పటికీ ఇక్కడే ఉండిపోదలుచుకున్నాను" అమ్మ ఇలా అంది, "నాయనా, నాదంటూ ఒక్క అంగుళంమేర కూడా నాకు లేదు. నాన్నను అడుగు. ఏమయినా మనం ఉండటానికి ఒక స్థలం కావాలి."

సుగుణానందన్ ఒక చిన్న స్థలం దానంగా ఇవ్వడానికి ఒప్పుకొన్నప్పుడు అందరికీ చాలా ఆశ్చర్యం కలిగింది. ఆ స్థలంలో, కొబ్బరాకులు అల్లి ఒక చిన్న గుడిసె వేశారు. దాని వెడల్పు 9 అడుగులు, పొడుగు 18 అడుగులు. అమ్మకు పానీయాలు తయారు చెయ్యడానికి ఒక మూలను వంటిల్లుగా వాడుకొన్నారు. రోజూ భోజనాలు మాత్రం పెద్ద ఇంట్లోనే తయారయేవి. ఈ గుడిసె నీలు, బాలు, గాయత్రులతోబాటు అమ్మకు ఆశ్రయంగా ఉపకరించింది. ఈ విధంగా ఆశ్రమం చిన్నగా మొదలయింది.

అమ్మను కలుసుకొన్న తరవాత బాలు, ఇల్లు విడిచిపెట్టి ఎక్కువకాలం

అమ్మ దగ్గరే గడిపేవాడు. ఇడమన్నేల్‌లో శాశ్వతంగా నివసించడానికి సుగుణానందన్ అనుమతి పొందగలగడం అతని అదృష్టం. ఆ విధంగా, శాశ్వతంగా ఉండిపోవడానికి తిరువణ్ణామలైనుంచి నీలు వచ్చేసరికి బాలు అక్కడ స్థిరపడ్డాడు.

నీలు, గాయత్రి వచ్చిన తరవాత, అమ్మ పాదసన్నిధిలో స్థిరపడటానికి గంగ, మధు కూడా వచ్చారు. సంపూర్ణ భక్తితో తమ సంపదనంతనూ అమ్మకు అర్పించడానికి వాళ్లు పూనుకొన్నప్పటికీ ఆమె తీసుకోకుండా ఇలా అన్నది, "మీరు పరిశుద్ధమయిన శీలాన్నీ పరిపూర్ణమయిన ఆధ్యాత్మికతనూ సాధించినట్లయితే అదే నా సంపద అవుతుంది. ఎవరయినా తనలో ఉన్న నిగ్గును తాను తెలుసుకొన్నట్లయితే దాన్ని అందరిలోనూ చూస్తాడు. ప్రపంచమంతా అతనికి సొంతమవుతుంది."

ఒకనాడు రాత్రి పొరుగింట్లో ఉండే ఒక వ్యక్తి గంగను నిద్రలేపాడు, అతని టార్చిలైటు అడిగి తీసుకు వెళ్దామని. అతని కూతురికి ఉబ్బసంతో తీవ్రంగా ఆయాసం వచ్చింది; ఆమెను చీకట్లో ఆస్పత్రికి తీసుకు వెళ్ళాలి. కొన్ని గంటల తరవాత అతను తిరిగి వచ్చి టార్చిలైటు ఇచ్చేశాడు. మర్నాడు పొద్దున గంగ, ఈ సంఘటనను అమ్మకు చెప్పి, తన నిద్ర పాడుచేసినందుకు అతని బుర్ర బద్దలుగొడదామనిపించిందని కూడా జోడించాడు. అమ్మ అతన్ని చివాట్లు పెడుతూ ఇలా చెప్పింది:

"నువ్వేం ఆధ్యాత్మిక అభిలాషివి [సాధకుడువి]? ఇక్కడికి రాకముందు అన్నేళ్ళు ఆధ్యాత్మిక జీవనం గడిపి నువ్వు సంపాదించిందేమిటి? ఇదేనా దానికి ఫలం? నువ్వు జ్ఞానమార్గాన్ని అనుసరించే వాణ్ణని అనుకొంటున్నావు; అన్నిటినీ [అందరినీ] నీ ఆత్మలాగే చూడాలి. అటువంటప్పుడు, అతనిమీద నువ్వు కోపం ఎలా తెచ్చుకుంటావు? నీ కాల్లో వాడిగా ఉన్న ముల్లు గుచ్చుకొంటే నీకు నొప్పి పుట్టదూ? దాన్ని తీసి పారేసేదాకా గాభరాగా ఉండదూ? కూతురి బాధ తగ్గించాలని అతనికున్న ఆందోళనను ఊహించు. అన్ని జీవుల నొప్పినీ బాధనూ నీవిగానే అనుభవించాలి. అప్పుడే నీ మనస్సు విశాలమవుతుంది; అన్నింటికీ సమానంగా చోటునిచ్చే ఆకాశమవుతుంది. దానికి, నీ మనస్సు పసివాడి మనస్సంత అమాయకం కావాలి; భగవంతుడి మీద పరిశుద్ధమయిన భక్తిద్వారానే ఇది సాధ్యమవుతుంది."

ఎగతాళి గొంతుతో గంగ ఇలా అన్నాడు, "భక్తి, బుద్ధికి ఎంత మాత్రం తృప్తి కలిగించదు. భక్తిమార్గాన్ని అనుసరించడంలో కొన్ని బలహీనతలు కనిపిస్తాయి. ఏడవటం, పాడటం వంటి ఈ భావోద్రేకపరమయిన అభివ్యక్తులు ఎందుకు? నేను అవి చెయ్యలేను. శ్రీరమణులు భక్తిమార్గాన్ని ఎన్నడూ అనుసరించమని చెప్పలేదు. తన భక్తులను ఆయన, జ్ఞానమార్గాన్నే అనుసరించమని చెప్పారు. జ్ఞానమార్గం బుద్ధిని

...పరుస్తుంది కనక, నాకు అది ఇష్టం. అది ఎక్కువగా ఒప్పుదల కలిగిస్తుంది
...అలా ఉంది. భక్తిని గురించి గంగకున్న దురభిప్రాయం. అతను అమ్మ
...వచ్చేటప్పటికీ .

అమ్మ చిరునవ్వుతో ఇలా ఎదురుచెప్పింది: 'నీ జ్ఞానమార్గ సాధనకు కలిగిన ...ఇప్పుడే చూశాను. దానికి ఇదే ఫలితమయినట్లయితే నువ్వు పరిత్యాగ, సన్యాస ...గడుపనక్కర్లేదు. ఇంద్రియ సుఖాలనన్నిటినీ [హాయిగా] అనుభవించవచ్చు! రమణ ...మహర్షులు రాసినవీ ఆయన్ని గురించి రాసినవీ అన్నీ చదివావా? చదవకపోతే చదువు; ...చదువుకుంటే, భక్తితో నిండిన రచనలు ఆయనవి చాలా ఉన్నాయి. నిజానికి ఆయనే, అరుణాచలేశ్వరుడి మీద భక్తి మూర్తీభవించినవారు. ఆ పేరు పలికితేనే ఆయన కళ్ళు ప్రేమ బాష్పాలతో నిండుతాయి. నువ్వు అనుకుంటున్నట్లు, భక్తి బలహీనతకు చిహ్నం కాదు. మానవుడు సాధించగలిగిన వాటిలో మహత్తరమయిన విజయమది. అది అన్నిటిలోనూ భగవంతుణ్ణి సమానంగా దర్శించడం; అది, స్వార్థరహితమయిన ...ఉత్తేజింపట్ల విశుద్ధమయిన ప్రేమ. నాయనా, నీలో నువ్వే ప్రేమను పెంచుకోవాలి.”

అమ్మ మాటలతో ఒప్పుదల కాక, గంగ తిరువణ్ణామలై వెళ్ళాడు. అనుకోకుండా, రమణ మహర్షులు రచించిన భక్తిపరమయిన రచన ఒకటి కళ్ళబడటం జరిగింది. అతను ఆశ్చర్యపోయాడు. అమ్మ మాటలను గుర్తుతెచ్చుకొని అతను ప్రేమానుభూతిలో తలమునకలయి ఏడవటం ప్రారంభించాడు. తనను మళ్ళీ అమ్మ తన పవిత్ర సన్నిధికి పిలవాలని ప్రార్థించాడు. ఈ సమయంలోనే అమ్మ, అతని మానసిక స్థితిని తెలుసుకొని గంగను తిరిగి రమ్మని ఉత్తరం రాసింది. ఆమె గొప్పతనాన్ని గ్రహించుకొని పూర్తి వినయంతో ఆమె పాదాల శరణు పొందాడు.

మధు, అమ్మ దగ్గరకి రాకపూర్వం చాలామంది సాధువులను దర్శించాడు. కాని, అమ్మను మొట్టమొదటిసారి చూసినప్పుడు అక్కడితో తన ప్రయాణం ముగిసినట్లు అనిపించింది. సర్వాత్మనా అమ్మకు అంకితుడయి, శ్రీమద్భగవద్గీతమీద అంతవరకు లభ్యమయిన వ్యాఖ్యానాలను [భాష్యాలను] అన్నిటినీ సేకరించి ఫ్రెంచి భక్తుల ఆధ్యాత్మిక లాభంకోసం వాటిని ఫ్రెంచిలోకి అనువాదం చెయ్యడం ప్రారంభించాడు. అమ్మవల్ల ఉత్తేజితుడయి అతను, తన మాతృదేశమయిన రీయూనియన్ (Reunion)లో అమ్మ ఆధ్యాత్మిక సేవాకార్యాన్ని వ్యాప్తిచేసి అక్కడ అందమయిన ఆశ్రమం ఒకటి స్థాపించి దాన్ని అమ్మకు అంకితం చేశాడు. అమ్మ ఆశీస్సులతో అతడు, చాలామందిని ఆధ్యాత్మిక మార్గంలోకి తీసుకు రావడానికి ఉపకరణమయాడు.

ఆ రోజుల్లో అమ్మ, చాలా రాత్రులు బయటే గడిపేది. అందువల్ల ప్రతి ఒక్కరూ

ఇసకలో కొబ్బరిచెట్లకిందే నిద్రపోవడానికి ఇష్టపడేవారు. అమ్మ కుటీరంలో విశ్రాంతి తీసుకొంటూ ఉన్నప్పుడు కూడా అర్ధరాత్రివేళ ఆమెలేచి [కటిక నేలమీద] ఆరుబయట పడుకోడానికని బయటికి వెళ్ళేది. అమ్మ చాలా తక్కువసేపు నిద్రపోయేది; చాలా తక్కువ తినేది; సంపూర్ణంగా తన శక్తిని ధారపోసేది. వారానికి మూడుసార్లు శిష్యులను చేరదీస్తూ రాత్రి అంతా గుళ్ళోనే ఆసనంమీద ఉండిపోయినప్పటికీ పగటిపూట భక్తులను ఆదరించడానికీ ఆమె మార్గదర్శకత్వాన్ని కోరే సాధకులకు బోధచెయ్యడానికి ఎప్పుడూ సమయం చిక్కించుకొంటూ ఉండేది.

మొదట్లో నీలుకూ గాయత్రికీ భాషాసమస్య చాలా పెద్ద అడ్డంకిగా ఉంటూండేది. అమ్మతో వాళ్ళు మాట్లాడాలంటే ఎప్పుడూ బాలు సహాయం తీసుకొంటూ ఉండవలసి వచ్చేది. కాని త్వరలోనే, అమ్మభాష అయిన మలయాళం కొద్దికొద్దిగా నేర్చుకొన్నారు. ఈ రోజుల్లో అమ్మ అవసరాలు చూడటానికి మరెవరూ లేకపోవడంవల్ల ఆమెకు సేవచేసే భాగ్యం బాలుకే దక్కింది; ఆ విధంగా అతను చాలా అదృష్టవంతుడు.

ఒకనాడు సుగుణానందన్, 'సాయిప్పులకు' [ సాయేబులు = విదేశీయులు] తిండిపెట్టడం తనకు ఇష్టంలేదని మొరటుగా అన్నాడు. అప్పటినుంచి గాయత్రి, అమ్మకు, నీలుకు, బాలుకు, తనకు కుటీరంలోనే వంటచెయ్యడం ప్రారంభించింది. అమ్మ, దాదాపు ఏమీ తిననట్లే లెక్క. ఒక్కొక్కప్పుడు నీలు కాని, బాలు కాని ఒత్తిడిచేస్తే, తిన్నానన్న పేరుకు మాత్రం, ఏదో కాస్త తినేది.

ఒకనాడు నీలు, అమ్మ ఏమయినా ఆహారం తినాలని గట్టిగా పట్టుపడుతూ కూర్చున్నాడు. చివరికి ఆమె అన్నది, "సరే, తింటాను. ఏదయినా తీసుకురా." ఏ మాత్రం ఆలస్యం కాకుండా, నీలు ఒక కంచంలో అమ్మకు అన్నం తెచ్చిపెట్టాడు. కన్నుమూసి తెరిచేటంతలో, అమ్మ మొత్తమంతా తినేసెయ్యడం ఆశ్చర్యం కలిగించింది. నీలు మారువడ్డన చేశాడు. అదికూడా చటుక్కున తినేసింది. ఇంకా వడ్డించాడు. అదీ తింది. వడ్డించిందంతా తింటూ ఉన్నప్పటికీ అమ్మకు ఆకలి తీరలేదు! నీలు, తక్కినవాళ్ళు ఒకరి మొహాలు ఒకరు చూసుకొన్నారు. దగ్గరిలో ఉన్న టీ కొట్టునుంచి ఇంకా తెచ్చిపెట్టారు. ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా అది కూడా తినేసింది అమ్మ. నీలు ఇక అలసిపోయాడు! తెల్లబోయాడు. అమ్మ తినాలని మరెప్పుడూ అతను పట్టుపట్టలేదు.

ఈ కాలంలో కుటుంబ కలహాలు మళ్ళీ మొదలయాయి. సుగుణమ్మ పెళ్ళి అయి రెండు నెలలు గడవగానే సుగుణానందన్, తక్కిన ఇద్దరు కూతుళ్ల పెళ్ళిళ్ళూ హడావిడిగా కుదిర్చేశాడు. ఎవరి ఒప్పుదలా లేకుండానే పెద్దకూతురు కస్తూరి పెళ్ళి

...పోడు. సుగుణానందన్ ఒప్పేసుకొని ఆ సంగతి మగపెళ్ళి వారికి తెలియబరిచిన ...వాత అమ్మకు తెలియబరిచాడు. డబ్బు లేకుండా పెళ్ళి ఎలా చెయ్యాలన్నది సమస్య. ...గుణానందన్‌కు రాబడి లేదు; గుళ్ళో డబ్బు లేదు. ఈ పరిస్థితిలో సుగుణానందన్, ...లవాటు ప్రకారం, రంగంలోంచి తప్పుకొన్నాడు. అమ్మ నిబ్బరంగా ఉంది. ఇది చూసి ...లు చాలా దిగులుపడ్డాడు. అమ్మను ఇలా అడిగాడు, "అమ్మా, ఏమిటి ఉపాయం? పెళ్ళి చెయ్యడం ఎలాగ?" అన్నాడు. నీలు ఇలా చెప్పాడు, "అమ్మా, నాకు ఉన్నదేదో ...స్తాను. గురువుగారి బాధ్యతలను తీర్చడం శిష్యుడి కర్తవ్యం. నాదని చెప్పు కొనేది ఏదీ నాకు లేదు. నాకున్నదంతా అమ్మదే. కనక, నా దగ్గరున్న డబ్బుతో కస్తూరి పెళ్ళి చెయ్యండి."

అమ్మ ఇలా సమాధానమిచ్చింది, "పెళ్ళి అయిన తరవాత ఆడపిల్లలు లౌకిక జీవనం గడుపుతారు. నీకున్నది ఆధ్యాత్మికత కోసం. దీన్ని సత్కార్యాలకే వినియోగించాలి. దీన్ని లౌకిక జీవనులకు ఇచ్చినట్లయితే వాళ్ళకు పాపం చుట్టుకుంటుంది. దాని ప్రభావం మనమీదా మన మార్గంమీదా పడుతుంది. పెళ్ళి కుదర్చడానికి నాన్నను ప్రేరేపించినవాడు భగవంతుడయినట్లయితే భగవంతుణ్ణే జరిపించనియ్యి. దానిమీద మనం దృష్టిపెట్టనక్కరలేదు. సుగుణానందన్ దాన్ని అంతగా పట్టించుకోవడం లేదు; మనకెందుకు దిగులు? నాయనలారా, దాన్ని గురించి మనం అలజడి చెందక్కర్లేదు."

పెళ్ళి కుదర్చడానికి హడావిడి పడ్డా, సుగుణానందన్, డబ్బులాంటి ముఖ్యమయిన విషయాల దగ్గరికి వచ్చేటప్పటికి పక్కకు తప్పుకోడం కనిపిస్తూనే ఉంటుంది. ఒక్కమాట పలకకుండా అమ్మ, అవసరమయినవి ఏర్పాటు చెయ్యడం ప్రారంభించింది. ఇది చూసి బాలు బాధపడ్డాడు. అమ్మతో ఇలా అన్నాడు, "ఇంటి దగ్గరనుంచి ఆస్థిలో నా వాటా తీసుకు వస్తాను." దానికి అమ్మ సుతరామూ ఒప్పుకోలేదు. అప్పుడు బాలు, కొందరు స్నేహితులకు, ఆర్థిక సహాయంకోసం ఉత్తరాలు రాశాడు. అమ్మకు తరవాత తెలిసినప్పుడు ఈ పని చేసినందుకు బాలును చివాట్లు పెట్టింది, "నాయనా, నిబ్బరంగా ఎదుర్కొందాం. దాన్ని గురించి ఆందోళన చెందవలసిన పని లేదు."

చివరికి అన్ని ఏర్పాట్లూ జరిగాయి; ఒక్కటి తప్ప - ఐదువేల రూపాయలు. పెళ్ళి ఖర్చులకు ఈ సొమ్ము తప్పనిసరిగా కావాలి. కొద్దిరోజులు గడిచేసరికి, అమ్మను గురించి ఇటీవలే విన్న అజ్ఞాత దాత ఒకరు, మద్రాసునుంచి రూ.5000/- లకు పంపిన చెక్కు అందింది. ఈ విధంగా 1980 సెప్టెంబరు నెల మధ్యలో కస్తూరి పెళ్ళి జరిగింది.

మరో మూడు నెలలు గడిచాయో లేదో, సుగుణానందన్ సజని పెళ్ళి కుదుర్చుకొని కూర్చున్నాడు. అది కాగానే, కార్యభారమంతా అమ్మమీద వదిలేసి ఎప్పటి

మాదిరిగానే తప్పుకొని తిరగడం ప్రారంభించాడు. కట్నం ఇవ్వడానికి అవసరమయిన సొమ్ము సమకూర్చుకోడం, పెళ్ళిఖర్చు భరించడం, పెళ్ళికూతురికి బంగారపు నగలు చేయించడం - ఇవన్నీ అమ్మ భుజాల మీద పడ్డాయి.

బాలు ఈ సారి దిగులు పడలేదు; అతనికి కోపం వచ్చింది! సుగుణానందన్‌కు వివేకం కొరవడినందుకు, అమ్మకుకూడా అసంతుష్టి కలిగింది. చిరాకువేసినా, అమ్మ నిశ్చింతగా ఉండిపోయింది. సమర్థతతో కార్యభారం వహించింది. మగపెళ్లివాళ్ల బంగారం ఇంకా కావాలన్నారు. యథాప్రకారంగానే, డబ్బు ప్రశ్నార్థకమయి కూర్చుంది. సత్కార్యాలకు వినియోగించడానికి కూడబెట్టిన దాంట్లోనుంచి ఒక్క పైసాకూడా ఖర్చుపెట్టడానికి వీలులేదన్న పట్టుమీద ఉంది అమ్మ. డబ్బు అప్పుచెయ్యడానికి కూడా ఆమె ఒప్పుకోదు. మరేం చెయ్యాలి?

పరిస్థితి ఇలా ఉండగా, కస్తూరి ఏదో అభిప్రాయ భేదంవల్ల భర్త ఉండే ఊరినుంచి ఇడమన్నేల్‌కు తిరిగివచ్చింది. ఇంకా బంగారం కావాలన్న సంగతి విన్నప్పుడు ఆమె, "ఇదిగో, సజని పెళ్ళి జరపడానికి ప్రస్తుతం నా నగలు తీసుకోండి. మీరు తరవాత ఇస్తే చాలు," అంది. ఇప్పుడిక, ఒక నెక్లేసూ, ఒక ఉంగరమూ తప్ప తక్కినవన్నీ సిద్ధంగా ఉన్నాయి. పెళ్ళికి రెండురోజుల ముందు వరకు కూడా ఇవి సమకూరలేదు; అయినా అమ్మ ఎప్పటిలాగే ప్రశాంతంగా, అంటీ ముట్టనట్టుగా ఉంది. మర్నాడు పొద్దున భావదర్శనం అయిపోయిన తరవాత గుడి శుభ్రంచేస్తున్న గాయత్రి, కానుకలుగా వచ్చినవాటిలో ఒక చిన్న పొట్లం ఉండటం గమనించింది. దాన్ని విప్పి చూసి ఆమె ఆశ్చర్యపోయింది. సరిగా, పెళ్ళికి కావలసిన మాదిరి నెక్లేసూ, ఉంగరం అందులో ఉన్నాయి; నగల పనితనం కూడా నెల్లాళ్ళ కిందట ఎంపిక చేసినవాటి మాదిరిగా ఉంది! దైవసంకల్పం అన్నీ సమకూరుస్తుందన్న దానికి ఇంతకంటె రుజువు ఏం కావాలి?

అయినప్పటికీ, చివరి పెళ్ళికి కలిగిన కష్టాలు ఇంతటితో తీరలేదు. స్థానిక భక్తులు కొందరు సుగుణానందన్‌కు తమ ఆక్షేపణ తెలిపారు. అంతకుముందు శత్రువులయిన వాళ్ళతో పెళ్ళి సంబంధం ఎందుకు కుదుర్చుకోవాలి? శ్రేయోభిలాషుల కొడుకులూ, భక్తుల కొడుకులూ తగరా అతనికి? సుభగన్‌కు సన్నిహితులయిన యువకులు కొందరు సుగుణానందన్ కూతుళ్ళను పెళ్ళి చేసుకోవాలని అనుకొన్నారు. ఇప్పుడు వాళ్ళంతా అతనికి వ్యతిరేకులయారు. ఈ విధంగా, శత్రువులు బంధువులయినప్పుడు స్నేహితులు శత్రువులయారు. వాళ్ళు సుగుణానందన్‌తో పోట్లాడాలని వచ్చారు; సజని పెళ్ళికి అడ్డంకులు కలిగించాలని కుట్రచేశారు. పెళ్ళి రద్దుచెయ్యాలన్న ఆశతో వాళ్ళు, పుకార్ల కథలు పుట్టించి పెళ్లికొడుకు చెవిని పడేదాకా ప్రచారం చేశారు. పెళ్ళికి ముందు నాటి

అది జరుగుతుందో లేదోనని ప్రతి ఒక్కరికీ అనుమానంగానే ఉంది.

పెళ్ళి రోజున అమ్మ, బ్రహ్మచారులను పొరుగింటికి తీసుకు వెళ్ళింది. ...టి రెండు పెళ్ళిళ్ళకూ కూడా ఆమె అలాగే చేసింది. అటువంటి వేడుకలకు బ్రహ్మచారులు వెళ్ళకపోవడం వాళ్ళ మంచికే. అమ్మ ఇలా వివరించింది: "సాధకుడు వివాహమహోత్సవాలకు కాని, అంత్యక్రియలకు కాని వెళ్ళగూడదు. మొదటిదాని విషయంలో, ప్రతి ఒక్కరూ పెళ్ళిని గురించే తలుస్తూ ఉంటారు; అది బంధం. రెండోదాని విషయంలో, మర్త్యుడి మరణానికి దుఃఖిస్తూ ఉంటారు. ఈ రెంటి విషయంలోనూ, పాల్గొనే వాళ్లు, అశాశ్వతమయిన వాటిమీదే మనస్సు నిలుపుతారు. ఈ భావతరంగాలు అన్వేషకుడికి [సాధకుడికి] కీడుచేస్తాయి. ప్రాపంచిక స్పందనలు అతని అవచేతన మనస్సులోకి చొరబడతాయి. అవాస్తవమయిన వాటికోసం సాధకుడు ఆందోళన చెందుతాడు."

ఈ విధంగా, బ్రహ్మచారులు అమ్మ సాన్నిధ్యంలో శాశ్వత నివాసం ఏర్పరుచు కోడానికి ప్రధానమయిన అడ్డంకి తొలగిపోయింది. సుగుణానందన్ ముగ్గురు కూతుళ్ళకూ ఇప్పుడు పెళ్ళిళ్ళు అయిపోయాయి. అంతేకాదు; దుండగులూ, హేతువాదులూ, పూర్తి ఓటమిని ఒప్పుకొని ఒక్కరొక్కరే తిరుగు మొహంపట్టారు. వాళ్ళలో కొందరు, హేతురహితమయిన తమ చర్యలు అర్థంలేనివని తెలుసుకొని, సమితిని శాశ్వతంగా విడిచిపెట్టేశారు. ఇక మిగిలిన సభ్యులు వాళ్లలో వాళ్ళు కొట్లాడుకోడం ప్రారంభించారు. ఈ ప్రకారంగా 'గుడ్డి నమ్మకాల నిర్మూలన సమితి' మొత్తం రద్దయింది. సత్యధర్మాలతో పోట్లాడటానికి వచ్చినవాళ్ళు తమ వినాశానికి తామే కారకులయారు. ఈ పరిణామాలు, రోగపీడితమయిన మానవజాతికి ఉపశమనం కలిగించడానికీ వాళ్ళను ఉద్ధరించడానికీ అమ్మ చేసే ఆధ్యాత్మిక సేవలో కొత్త దశకు నాంది పలికాయి.

సంవత్సరాల తరబడిగా చుట్టాలవల్లా, దుండగులవల్లా అమ్మకు ఎదురయిన పరీక్షలపట్లా అనుభవించిన కష్టాలపట్లా ఆమెకున్న దృక్పథం ఎంతో విలక్షణమయినది. ఒకనాడు ఆమె ఇలా చెప్పింది:

"వాళ్ళచేత అలా మాట్లాడించినవీ వాళ్ళు అలా ప్రవర్తించేటట్లు చేసినవీ వాళ్ళ తప్పుడు భావనలు. అంతేకాకుండా, వాళ్ళు ఆధ్యాత్మిక జీవనానికి ఉన్న విశిష్టతనూ దాని ముఖ్యార్థాన్నీ అవగాహన చేసుకోకపోవడం కూడా దానికి కారణం. అటువంటప్పుడు వాళ్ళమీద కోపం తెచ్చుకోడం, వాళ్ళను ఏవగించుకోడం ఎందుకు? ఈ అలా చెయ్యడం మన అజ్ఞానం. దానివల్ల మన మనస్సులు మలినమవుతాయి.

తాజా గులాబి పూలను చూడండి. ఎంత అందంగా ఉన్నాయి ఇవి! ఎంత చక్కటి సువాసనను వెదజల్లుతున్నాయి! కాని, అవి పూయడానికి మనం వేసినవి ఏమిటి? వాడేసిన తేయాకు ముక్కలూ ఆవుపేడా! ఈ అందమయిన పూలకూ వాటికోసం మనం వేసిన ఎరువుకూ ఎంత తేడా ఉంది! వాటి అందంతోను, సువాసనతోను పోలిస్తే ఈ ఎరువు వాటికి తగినదేనా? అలాగే, అడ్డంకులనేవి, ఆధ్యాత్మికంగా మననింకా బలంగా తయారుచేసేవి. ఈ అడ్డంకులన్నీ మన హృదయాలు పూర్తిగా వికసించడానికి సాయపడతాయి. రాత్రిపూట అరవడం కీచురాళ్ల స్వభావం. కాని ఆ చప్పుడు ఎవరి నిద్రనూ పాడుచెయ్యదు. అలాగే, ఇబ్బంది పెట్టడం అజ్ఞానుల స్వభావం. అందువల్ల వాళ్ళను క్షమించమనీ వాళ్ళను సరైన దారిలో నడిపించమనీ మనం దేవుణ్ణి ప్రార్థించాలి. అన్నింటినీ దేవుడికి అర్పించండి; మీ సంరక్షణ ఆయన చేస్తాడు".

## మాత అమృతానందమయి

కూతుళ్ళ పెళ్ళిళ్ళు అయిన తరవాతనుంచి సుగుణానందన్‌కు - వెనకటి రోజులతో పోలిస్తే- మనశ్శాంతి ఉండటంవల్ల మొదటి జట్టు బ్రహ్మచారులు ఇప్పుడు అమ్మ పాదాల దగ్గర కుదురుకోడానికి వీలుపడింది. అమ్మ సాంగత్యంలో ఉండాలన్నది బ్రహ్మచారుల గాఢమయిన ఆసక్తి. అందువల్ల, వసతులు లేకపోయినప్పటికీ కూడూ గుడ్డా గూడూ కనీసమయిన అవసరాలన్న యథార్థాన్ని వాళ్ళు గమనించలేదు. చాలా సమయం వాళ్ళు బయటే ఉండవలసి వచ్చేది; చాపయినా లేకుండా కటిక నేలమీద నిద్రపోయేవారు. ఏది వచ్చినా అడక్కుండా వచ్చినదే; దాన్ని వాళ్ళలో వాళ్లు పంచుకొనేవారు. డబ్బు లేకపోవడంవల్ల, వాళ్ళలో ఎవరయినా ఎక్కడికయినా వెళ్ళవలసి వస్తే కాలినడకన వెళ్ళేవాళ్ళు. ఒక్కొక్కళ్ళకి ఒకే ఒక జత బట్టలు ఉన్నప్పటికీ, ఎలాగో అవసరం గడుపుకోడం నేర్చుకొన్నారు.

ఒకనాడు, బ్రహ్మచారుల్లో ఒకడు, తనకున్న ఒకే ఒక జత బట్టలు మురికి పట్టినందుకూ పాతబడిపోయినందుకూ కాస్త కుంగిపోయి సౌకర్యాలు లేకపోయినందుకు అమ్మకు ఫిర్యాదు చేశాడు. దానికి అమ్మ ఇలా చెప్పింది. "నాయనా, అలాంటి చిన్నచిన్న వస్తువులు దేవుణ్ణి అడగ్గూడదు. ఆయన పాదాలముందు నిన్ను నువ్వు అర్పించుకో. నీకు నిజంగా అవసరమయినవేవో ఆయన ఇస్తాడు". అమ్మ జీవించినది ఆ విధంగానే; అందువల్ల తన సొంత అనుభవంతోనే చెప్పింది. ఆ మర్నాడే ఒక భక్తుడు, ఆ సమయంలో ఉన్న పరిస్థితి అతనికి తెలియకపోయినప్పటికీ, బ్రహ్మచారులందరికీ

...బట్టల జతలు తీసుకువచ్చాడు. ఆశ్రమం ఏర్పడ్డ తొలినాళ్ళలో కఠిన పరిస్థితులు ...ందువల్ల ఈ కుర్రవాళ్ళు పరిత్యాగంలో సర్వసంపూర్ణమయిన శిక్షణ పొందారు. ...ళ్ళకు ధైర్యమివ్వడానికి అమ్మ ఇలా చెప్పింది, "మీరిక్కడ [అన్నింటికీ తట్టుకుని] ...లబడగలిగితే మరెక్కడయినా హాయిగా ఉండగలరు. ఇప్పుడు ఏ ప్రతికూల ...స్థితినయినా దాటగలిగితే [ఇకముందు] ఏ సంకటస్థితినయినా, జీవితంలో ఏ ...వాలునయినా సులువుగా ఎదుర్కోగలుగుతారు."

భక్తుల సంఖ్య, నివాసులయిన బ్రహ్మచారుల సంఖ్య పెరుగుతూ ఉండటంవల్లా సహాయాలు లేకపోవడంవల్లా ఆశ్రమాన్ని అధికారికంగా నమోదు చేయించే ఉద్దేశం ఏర్పడింది. అయినా, పరిస్థితి అంత ఆశాజనకంగా కనిపించలేదు. అమ్మకు భూమీ లేదు, సంపదా లేదు. నీలు కుటీరం నిర్మించిన స్థలం కూడా సుగుణానందన్‌ది. నీలు, బాలు, గాయత్రి ఇడమన్నేల్‌లో శాశ్వతంగా ఉండటానికి అతను అనుమతి ఇచ్చినప్పటికీ తన ఇల్లు ముందు ముందు ఆశ్రమమవుతుందన్న ఆలోచన ఎన్నడూ రానివ్వలేదు. ఇంకా ఇంకా ఎక్కువ మందికి వసతి సమకూర్చే ఆలోచనకూడా అతని ఊహలోకి రాలేదు. ఒకసారి అమ్మ, ఆశ్రమ విషయాన్ని చర్చిస్తూ ఉన్నప్పుడు అతను, కోపంగా తన అభిప్రాయం స్పష్టంచేశాడు "ఏమిటిది? ఇక్కడ మనకేమయినా ఆస్తులూ సంపదలూ ఉన్నాయా? ఆశ్రమం నడపటమెలాగ? ఇది ఆశ్రమమయిపోతే మేము (కుటుంబం) ఎక్కడికి పోవాలి? వీల్లేదు! ఇక్కడ ఆశ్రమాన్ని రిజిష్టరు చెయ్యడానికి నేను ఒప్పుకోను!" యథావిధిగా ఆశ్రమం ఏర్పరిచే ఉద్దేశం అమ్మకు కూడా ఇష్టంలేదు. భక్తుల్లో కొందరు ఈ ప్రతిపాదనతో అమ్మ దగ్గరికి వచ్చినప్పుడు ఆమె ఇలా సమాధానం చెప్పింది,"ఆశ్రమాన్ని గురించి అమ్మ చాలా వింది. అమ్మకు ఆశ్రమం అక్కర్లేదు. అదొక బంధం కాదా? చిలక జోస్యం చెప్పేవాడు, పంజరంలో చిలకను పెట్టుకొని తిరుగుతూండటం మీరు చూడలేదా? [ఆ చిలకలాగ] ఒక వ్యక్తి మరో వ్యక్తి ప్రయోజనంకోసం బంధితుడయినట్లే కదా! చివరికి అమ్మ పరిస్థితికూడా అలాగే అవుతుంది. నేనది చెయ్యలేను. అమ్మ స్వేచ్ఛ అమ్మకు ఉంది. దానికి అడ్డంకి ఏదీ ఉండగూడదు."

అయినా కాని, భక్తజన ప్రవాహం, శిష్యులు నానాటికీ పెరుగుతూ ఉండటంవల్ల వ్యవస్థీకృతమయిన ఆశ్రమం ఒకటి తప్పనిసరిగా అవసరమయింది. ఇంకా ఏమిటంటే, అమ్మ విదేశీ శిష్యులు, దేశపు చట్టం ప్రకారం, ఒక ప్రయివేటు గృహంలో చెప్పుకోదగినంత కాలం ఉండగూడదు. ఈ పరిస్థితిలో అమ్మకు, ప్రభుత్వం ఆమోదించిన ఆధ్యాత్మిక కేంద్రం ఒకటి ఉండాలని నమ్మకం కలిగింది. పని ఎలా మొదలుపెట్టాలని అమ్మను అడిగినప్పుడు ఆమె కొంటెగా ఇలా సమాధానమిచ్చింది, "ఏమయినా, ఇంట్లోవాళ్ళు ఆశ్రమం స్థాపించరు. వాళ్ళ సంస్కారం వేరు. వాళ్ళ అనుమతికోసం మనం కాచుకొని ఉండొద్దు;

వాళ్ళు ఎన్నడూ తోడుపడరు. కాని, వాళ్ళ తిట్లు కొన్ని వినవలసి రావచ్చు!"

ఈ విధంగా 1981 మే, 6 వ తేదీన, అమ్మ ఆదర్శాలనూ, బోధలనూ నిలపడానికీ ప్రచారం చెయ్యడానికీ 1955 సం॥పు తిరువాన్కూరు - కొచ్చిన్ స్టేట్ లిటరరీ అండ్ ఛారిటబుల్ ఆక్ట్ ప్రకారం, దక్షిణ భారతదేశంలోని కేరళ రాష్ట్రంలో కొళ్ళం [జిల్లా]లో 'మాతా అమృతానందమయి మిషన్' స్థాపితమయి రిజిస్టరయింది. అమ్మకు అధికారపూర్వకంగా, 'మాతా అమృతానందమయి' అన్న పేరును, ఆమె బ్రహ్మచారి కుమారుల్లో ఒకరు సూచించగా, ఆమె దాన్ని స్వీకరించింది. అప్పటికే ఆమె, అమృతానందమయి అయిన అమ్మ కాబట్టి ఆ పేరు నిజంగా నప్పింది.

ఈ కాలంలో, పవిత్ర గ్రంథాల అవసరం ఉన్న ఒక బ్రహ్మచారి, లాటరీలో కొన్ని పుస్తకాలు తనకోసం ఎంపిక చెయ్యమని అమ్మను అడిగాడు . ఆ లాటరీలో గెలిచినవాడికి కొన్ని పుస్తకాలు బహూకరిస్తారు. అమ్మ అతనికి ఇలా చెప్పింది, "అలాటి వాటికోసం వెంపర్లాట ఎందుకు? త్వరలోనే మీకు సమృద్ధిగా పుస్తకాలు వస్తాయి." ఈ సంఘటన జరిగిన కొన్నాళ్ళకు, అమ్మ దగ్గర శాశ్వతంగా ఉండిపోవడానికి తిరువణ్ణామలైనుంచి వచ్చిన నీలు, ఇంగ్లీషులోనూ ఇతర భారతీయ భాషల్లోనూ ఉన్నవి కలిపి 2000 పుస్తకాలకు పైగా ఉన్న తన గ్రంథ సంచయాన్ని వళ్ళిక్కావులో ఆశ్రమానికి తరలించాలని నిశ్చయించుకొన్నాడు. ఈ విధంగా ఆశ్రమ గ్రంథాలయం ఏర్పడింది.

ఆశ్రమవాసులకు సాంప్రదాయికమయిన వేదాంతాన్నీ సంస్కృత భాషనూ బోధించేటందుకు 1982 ఆగస్టు 27న వేదాంత విద్యాలయాన్ని స్థాపించడం జరిగింది. అయినా కూడా, కేవల పుస్తక పఠనానికి బదులు ధ్యానసాధనకు ఉన్న ప్రాముఖ్యాన్ని బ్రహ్మచారులకు ఎప్పుడూ గుర్తుచేస్తూ ఉంటుంది అమ్మ. ఆశ్రమ దైనందిన కార్యక్రమంలో, ఆశ్రమంలో ఉండేవాళ్ళందరూ రోజుకు ఆరు గంటలనుంచి ఎనిమిది గంటలపాటు ధ్యానం చెయ్యవలసి ఉంటుంది. తమకున్న సమయమంతా ధ్యానంలోనే గడపడానికి ఎవరికయినా ఇష్టమున్నట్లయితే వాళ్ళకు అన్నివిధాలా ప్రోత్సాహం లభిస్తుంది. కాని అటువంటి వాళ్ళు ఆశ్రమంలో చాలా తక్కువ. అమ్మ ఇలా అంటుంది:

పవిత్ర గ్రంథాలన్నవి కేవలం సైన్ బోర్డులు. అవి సాధనాలు మాత్రమే, అవే గమ్యం కావు. గమ్యం వాటికి అతీతంగా ఉండేది. వ్యవసాయ శాస్త్ర విద్యార్థికి విత్తనాలు ఎలా నాటాలో, ఎరువు ఎప్పుడు ఎలా వెయ్యాలో తెగుళ్ళు పోగొట్టడం ఎలాగో, అవి మళ్ళీ రాకుండా నివారించడం ఎలాగో - ఇలాటివన్నీ తెలుసు. అలాగే, పవిత్ర గ్రంథాల పఠనం, మన ఆధ్యాత్మిక సాధనలు ఎలా చెయ్యాలో తెలుపుతుంది.

అమ్మ ఇంట్లోవాళ్ళలోను, ఊళ్ళోవాళ్ళలోను వచ్చిన పెద్ద మార్పును గురించి

దివ్యమాతకు పాటు చెప్పాలి. ఆమెలో ఉన్న దివ్యత్వాన్ని తెలుసుకొని, ఆమెతో తమకు ఎంతకాలంగా సంబంధం ఉందనో, తాము కూడా ఆమె ఊళ్ళోనే ఉంటున్నామనో వాళ్ళు ఇప్పుడు ఆనందిస్తున్నారు. దివ్యమాతకు తల్లిదండ్రులు కావడానికి తాము పూర్వజన్మల్లో ఏం పుణ్యాలు చేసుకొన్నారోనని ఆశ్చర్యపోతున్నారు సుగుణానందన్, దమయంతి! ఇప్పుడు వాళ్ళు ఆదర్శప్రాయులయిన గృహస్థులు. ఆశ్రమంలో ఉండే బ్రహ్మచారులందరికీ వాళ్ళు తల్లిగాను, తండ్రిగాను ఉంటూ, వాళ్ళను సొంతబిడ్డల్లా చూసుకొంటున్నారు.

ఈనాడు మాతా అమృతానందమయి మిషన్, వృద్ధి చెందుతున్న ఆధ్యాత్మిక సంస్థ. దీనికి ఆధిపత్యం దివ్యమాతదే. దీన్ని, ఈ పవిత్ర భారతభూమిలోని సనాతన సంప్రదాయాల ప్రకారం నిర్వహించాలన్నది ఆమె ముఖ్యాశయం. ఆశ్రమం పనినంతనూ ఆశ్రమవాసులే చేస్తారు. ఆశ్రమ సంరక్షణ వంటపని, శుభ్రంచేయడం, ఆవుల సంరక్షణ వంటి పనులను ఆశ్రమవాసుల్లో ప్రతి ఒక్కరూ రోజుకు కనీసం ఒక గంట చొప్పున అయినా చెయ్యాలి. అనేకమంది అమ్మ భక్తులు ఈ ఆశ్రమాన్ని తమ ఆధ్యాత్మిక క్షేత్రంగా చూస్తారు. సారవంతమయిన భూమిలో మాదిరిగా ఇక్కడ ఆధ్యాత్మిక గుణాలు సమృద్ధిగా పెరుగుతాయి; దైవ సాక్షాత్కారమనే పంట ఇక్కడ కోతకు వస్తుంది.

విదేశాల్లో ఉండే తన పిల్లలు పదే పదే రమ్మని పిలుస్తూ ఉండటం వల్ల అమ్మ, 1987 మే - ఆగస్టు మధ్యకాలంలో మొట్టమొదటి ప్రపంచ పర్యటన చేసింది. యు.ఎస్.ఎ. [అమెరికా] లోను, యూరప్‌లోను విస్తారంగా ప్రయాణించింది. దీని ప్రభావం అద్భుతంగా కనిపించింది. ఎందరెందరినో అమ్మ ఉత్తేజపరిచింది; వాళ్ళలో మార్పు తీసుకువచ్చింది. వాళ్ళు ఆమె విలక్షణ ఆధ్యాత్మిక ఆకర్షణను, విస్తృత ప్రమాణంలోని విశ్వజనీన ప్రేమను అనుభూతం చేసుకొన్నారు. 1987 డిసెంబరులో అమ్మ, మాతా అమృతానందమయి మిషన్ కేంద్రంవారి కోరిక ప్రకారం రీయూనియన్ ఐలాండ్‌ను, మారిషస్‌ను సందర్శించింది. ఈ కేంద్రం, ఆమె శిష్యుల్లో ఒకరి నాయకత్వంకింద 1985 నుంచి చక్కగా పనిచేస్తోంది. తరవాత అమ్మ 1988 లోను, 1989 లోను మరో రెండు ప్రపంచ పర్యటనలు చేసింది.

అమ్మ పవిత్ర సాన్నిధ్యానికి దారి తెలుసుకొనే పుణ్యాత్ములకు అమ్మ, దయతో ఇలా సలహా ఇస్తుంది:

“ఒక నల్లరాతిని చూసినప్పుడు, మహాశిల్పి, బండగా ఉన్న దాని బయటి రూపాన్ని ఉపేక్షించి దాంట్లో ఇమిడి ఉన్న అందమయిన రూపాన్ని మాత్రమే చూస్తాడు. అలాగే, దైవ సాక్షాత్కారం పొందిన ఆత్మ అందరిలోనూ [అన్నిటిలోనూ కూడా], బయటి తేడాలను పట్టించుకోకుండా, భేదభావం లేకుండా ఎప్పుడూ వెలుగుతూ ఉండే ఆత్మను

మాత్రమే చూస్తుంది. తాగుబోతువాడు మద్యనిషేధాన్ని గురించి ప్రచారం చెయ్యలేడు. మొదట తను తాగడం మానెయ్యాలి; అప్పుడే, ఇతరులను కూడా అలాగే చెయ్యమని చెప్పగలుగుతాడు. అలాగే, నాయనలారా, మీకు మీరు నైతికంగాను, ఆధ్యాత్మికంగాను పరిపూర్ణులయిన తరవాత, అందరిలోనూ [అన్నింటిలోనూ] దైవత్వాన్ని దర్శించిన తరవాత, ఇతరులను అలాగే కమ్మని చెప్పగలుగుతారు."

ఈ, అమ్మ జీవిత చరిత్రను సర్వమానవ జాతికీ ప్రేమతో ఆమె చేసిన ఉద్బోధతో ముగిద్దాం:

త్వరగా రండి, నా బంగారు నాయనలారా! మీరే
దివ్యసారమయిన 'ఓం' కారం.
దుఃఖాలన్నిటినీ తొలగించుకొని పవిత్రులు కండి;
పవిత్రమయిన ఓంకారంలో కలిసిపొండి.



భాగం

2

# దైవభావాల అర్థం

కృష్ణుడిగాను, దేవిగాను అమ్మ దైవభావాలను గురించినది, నిజానికి మానవ బుద్ధికి అందనిదయినప్పటికీ లోతుగాను విశ్లేషణాత్మకంగాను అధ్యయనం చేయవలసిన విషయం. అమ్మకున్న అపార ఆధ్యాత్మిక శక్తిని క్షణమాత్రంగా దర్శించడానికి పాఠకులకు ఇది ఉపయోగపడుతుంది. చిత్తశుద్ధితో భక్తుడు పిలిచిన పిలుపుకు స్పందించి, దేవుడు లేదా పరిపూర్ణుడయిన గురువు తన అనంత లక్షణాలను, తన భక్తుడి హృదయ కమలంలో మెల్లగా ప్రకటిస్తాడు ఆత్మశుద్ధీకరణ ప్రక్రియ తీవ్రతరమవుతున్నకొద్దీ గురువు గొప్పతనం, ఆయన అనుగ్రహంవల్ల క్రమక్రమంగా వెల్లడి అవుతూ ఉంటుంది. గురువు గొప్పతనమన్నది [నిజానికి] శిష్యుడి లేదా భక్తుడి నిజమైన స్వభావమే కాని మరేదీ కాదు. అయితే, అమ్మ దైవభావాల ప్రాముఖ్యాన్ని అర్థంచేసుకోడానికి మొట్టమొదట కావలసినది అనుగ్రహం.

దైవావతార భావనను భారతీయ మహాగురువులు మూడు రకాలుగా వర్గీకరించారు: 1)పూర్ణావతారం(నిండయినది); 2)అంశావతారం (కొద్దిగా వెల్లడి అయేది); 3) ఆవేశావతారం (దైవశక్తి తాత్కాలికంగా ఆవహించినది). 'అవతారం' అనే మాటకు అర్థం, కిందికి దిగడం అని. పూర్ణావతారమనేది పేరులేని, రూపంలేని, మార్పులేని పరమ శక్తి, మానవరూపాన్ని ధరించి ఎలాటి పరిమితులూ లేకుండా అనంత శక్తిని ప్రత్యక్షం చేయడం. ధర్మాన్ని తిరిగి నెలకొలపడం, పరమాత్మను గురించి స్పృహ కలిగించి మానవులను ఉద్ధరించడం ఆ అవతారం ఉద్దేశం. అంశావతారం, ఒక నిర్దిష్ట ప్రయోజనాన్ని లేదా లక్ష్యాన్ని నెరవేర్చడానికి పరమేశ్వరుడి శక్తిలో పాక్షికంగా [అంశగా] కొంత ప్రత్యక్షీకరిస్తూ అవతరిస్తుంది. శ్రీమహావిష్ణువు వామనుడిగాను, నరసింహుడిగాను అవతరించడం అంశావతారాలకు విలక్షణమయిన ఉదాహరణలు.

ఆవేశ అవతారం, రెండింటికీ పూర్తిగా భిన్నమయినది. దేవతలు కొన్ని నిశ్చిత కార్యాలను నెరవేర్చడానికి కొందరి శరీరాన్ని తాత్కాలికంగా ఆవహిస్తారు [పూనకం]. శ్రీమద్భాగవతంలో వర్ణించిన విధంగా, శ్రీమహావిష్ణువు పరశురాముడిగా అవతరించడం ఆవేశావతారం. ఇక్కడ భగవంతుడు, చాలా పొగరుబోతులు గాను, దురహంకారులు

గాను తయారయిన క్రూరక్షత్రియ పాలకులను నాశనం చెయ్యడానికి, మహాయోధుడయిన పరశురాముడి శరీరాన్ని ఆవేశించాడు. ఈ పని నెరవేరిన తరవాత వెంటనే అతని శక్తి పోయింది. శ్రీమహావిష్ణువు మరో అవతారమయిన శ్రీరాముడు, సీతను పెళ్ళిచేసుకొని అయోధ్యకు తిరిగి వస్తూ, దైవశక్తిని పరశురాముడిలోంచి లాగేసుకొన్నాడని చెబుతారు.

భూతాలూ ప్రేతాలూ మానసికంగా బలహీనులయినవాళ్ళ ఒంటిమీదికి వస్తాయని చెబుతారు. సద్గుణ స్వభావం ఉన్నవాళ్ళనూ మంచివాళ్ళనూ (సాత్త్వికులను) (చిన్న) దేవతలు పూనతారు. సృజనాత్మకశక్తీ దార్ఢ్యమూ ఉన్నవాళ్ళను (రాజసికులను) దేవతల్లో ఇంకా చిన్నవాళ్ళు పూనతారు. అంధకారంతో, అజ్ఞానంతో నిండి ఉన్నవాళ్ళను (తామసికులను) దుష్టశక్తులు పూనతాయి. అరుదయిన, చాలా పరిశుద్ధాత్ములు కొందరి శరీరాన్ని దైవశక్తి స్వల్పకాలంపాటు ఆవేశిస్తుందని కూడా చెబుతారు. ఇందువల్ల పరశురాముణ్ణి అంశావతారంగా పరిగణించారు.

అమ్మ దైవభావాలను గురించి తెలుసుకోడానికి పాఠకులకు ఈ కింది ఉదాహరణ ఉపకరించవచ్చు: ఒకసారి, ద్వారకలో ఉండే శ్రీకృష్ణుడికి తన ప్రియభక్తుడయిన హనుమంతుణ్ణి చూడాలనిపించిందట. హనుమంతుణ్ణి పిలవడానికి కృష్ణుడు, తన వాహనమయిన గరుత్మంతుణ్ణి, హనుమంతుడు ఉంటున్న కదళీవనానికి పంపాడు. కాని, హనుమంతుడు రానన్నాడు. "నేను శ్రీరాముణ్ణి తప్ప మరెవ్వర్నీ చూడ్డానికి రాను," అని చెప్పాడు. హనుమంతుడిచ్చిన సమాధానాన్ని గరుత్మంతుడు కృష్ణుడికి చెప్పాడు. ఆయన గరుత్మంతుణ్ణి మళ్ళీ హనుమంతుడి దగ్గరికి వెళ్ళి ఇలా చెప్పమన్నాడు,"శ్రీరాముడు తన ప్రియభార్య సీతతో ద్వారకకు వచ్చాడనీ వాళ్ళు హనుమంతుణ్ణి చూడాలనుకొంటున్నారనీ చెప్పు."

గరుత్మంతుడు హనుమంతుణ్ణి తీసుకు వస్తూ ఉండగా ద్వారకలో కొన్ని సంఘటనలు జరిగాయి. శ్రీకృష్ణుడు తన సంకల్ప మాత్రంచేత అనేక యుగాలకు పూర్వం జీవించిన శ్రీరాముడి రూపాన్ని ధరించాడు. కృష్ణుడి భార్య రుక్మిణి, సీత రూపాన్ని ధరించింది. అప్పటికి హనుమంతుడు ద్వారకలోకి ప్రవేశించాడు. తన ఇష్టదైవాలయిన రాముణ్ణీ, సీతనూ దర్శించి, వారిని పూజించి తిరిగి తన నివాస స్థానానికి వెళ్ళి పోయాడు.

శ్రీరాముడు శ్రీమహావిష్ణువు అవతారాల్లో ఒకడు అయినప్పటికీ శ్రీకృష్ణుడి జీవిత కాలానికి కొన్ని వేల ఏళ్ళ కిందట అయోధ్యలో నివసించాడు. అన్నీ తెలిసినవాడయిన హనుమంతుడికి, కృష్ణుడు ద్వారకాధీశుడని పూర్తిగా తెలుసు. అయినప్పటికీ రాములవారి ఆ మహాభక్తుడు, శ్రీసీతారాములు ద్వారకలో కనిపించడమేమిటని శంకించలేదు.

భావాన్ని కృష్ణుడుతప్ప మరెవ్వరూ కనబరచలేరని హనుమంతుడికి నిశ్చయంగా
ు. నిజంగా జరిగింది ఏమిటంటే, హనుమంతుడు, తన సీతారాములను
రూపంలో మరోసారి చూడటానికి ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలని
యించుకొన్నాడు. భగవద్భక్తుల దాసుడయిన శ్రీకృష్ణుడు, తన మహాభక్తుడి కోరికను
తోషంగా తీర్చాడు; అనుగ్రహించాడు.

పూర్ణావతారం మాత్రమే ఏ దేవుడితోనయినా, దేవతతోనయినా ఒకటి
లుగుతుంది. కృష్ణుడు అటువంటి అవతారం కాబట్టి రామభావాన్ని సులువుగా
ించాడు. ఒకనాడు శ్రీకృష్ణుడు, తన ఇష్టభార్యల్లో ఒకతె అయిన సత్యభామతో సహా
భావం వహించమని భార్యలందరినీ అడిగాడు. ఎవరూ వహించలేకపోయారు. చివరికి,
్మీదేవి అవతారమయిన రుక్మిణి, సీతాభావాన్ని ప్రయత్నం లేకుండానే వహించింది.

ఆవేశావతార విషయంలో, దైవశక్తులు ఒక ప్రత్యేక వ్యక్తిలోకి ప్రవేశిస్తాయి;
నుకొన్న లక్ష్యాన్ని సాధించిన తరవాత వెనక్కి తిరిగి పోతాయి. శ్రీరుక్మిణీకృష్ణుల
విషయం ఇది కాదు. శ్రీకృష్ణుడు చేసినది రామభావాన్ని ప్రదర్శించడం; అంటే తనలో
ఇమిడి ఉన్న రామలక్షణాలను ప్రకటించాడన్నమాట. వంగదేశీయుడయిన చైతన్య
మహాప్రభువు జీవితంలో ఇలాటి చిన్న సంఘటన ఒకటి ఉంది.

ఒకనాడు, శ్రీనరసింహస్వామి గాఢభక్తుడయిన పండిత శ్రీవాసుడు తన ఇంట్లో దేవుడి గదిలో కూర్చుని, మామూలుగా చేసే మంత్రజపం చేస్తున్నాడు. హఠాత్తుగా, తలుపుకొట్టిన చప్పుడయింది. "ఎవరు?" అన్నాడు పండితుడు. "నువ్వు ఆరాధించే ఇష్టదైవాన్ని చూడు," అని సమాధానం వచ్చింది. పండిత శ్రీవాసుడు తలుపు తీసి చూశాడు. గది గుమ్మంలో, చైతన్యమహాప్రభువు దైవభావంలో నిలబడి ఉన్నాడు. ఆయన దేవుడి గది లోపలికి వెళ్ళి పూజకు ప్రత్యేకంగా సిద్ధంచేసి ఉన్న పీఠంమీద కూర్చున్నాడు. పండితుడు, చైతన్య మహాప్రభువులో వెలుగొందుతున్న శ్రీనరసింహస్వామిని దర్శించాడు; ఆయన రూపంలో ఉన్న నరసింహస్వామిని అత్యంత భక్తితో ఆరాధించాడు. ఇంట్లోవాళ్ళందరూ పూజలో పాల్గొనడానికి అనుమతించి, చైతన్యులు, పండితుడి కుటుంబాన్ని దీవించారు.

అందరూ దీవనలందుకొన్న తరవాత చైతన్యులు స్పృహలేకుండా పడిపోయారు. బయటి స్పృహ వచ్చిన తరవాత కొన్ని క్షణాలకు ఆయన, పండితుణ్ణి అడిగారు, "ఏం జరిగింది? నాకేమీ గుర్తుకు రావడం లేదు. నేనేమయినా తప్పు మాట్లాడానా?"సంపూర్ణ భక్తితో శ్రీవాసుడు చైతన్యులముందు సాగిలబడి ఇలా అన్నాడు, "ఓ భగవాన్, మీ దాసుణ్ణి ఇంకా భ్రాంతిలో పడేయకండి. మీ అనుగ్రహంవల్ల ఈ దాసుడు,

మీరెవరో చూడగలిగాడు!" ఇది విని చైతన్యులు, దాన్ని ధ్రువపరుస్తున్నట్లుగా అనుగ్రహంతో చిరునవ్వు చిందించారు. చైతన్యులు తమ భక్తులకు, వేరు వేరు భావాల్లో దర్శనమిస్తూ వచ్చిన విషయాన్ని తెలిపే అలాటి సంఘటనలు అనేకం ఆయన జీవితంలో ఉన్నాయి.

పై ఉదాహరణలనుబట్టి భావదర్శనమంటే ఏమిటో అర్థంచేసుకోవచ్చు. దేవుడి అవతారం భక్తుల కోరికల ప్రకారం వివిధ ఈశ్వర భావాలను - అంటే దైవభావాలను - ప్రత్యక్షంగా అవుపరచడం భావదర్శనం. బెంగాలులో ఉన్న ఆనందమయిమాత భజన కీర్తనలు పాడుతూ కృష్ణభావాన్నీ కాళీభావాన్నీ కనబరిచేది. అవతారాలు కనబరిచే ఈ భావాలు నిశ్చిత సందర్భాల్లో ఒక ప్రత్యేక లక్ష్యాన్ని నెరవేర్చడానికి - ముఖ్యంగా తమ భక్తుల గాఢమయిన అభిలాషను తీర్చడానికి - సంభవించేవి. అంతేకాకుండా, అవి కొద్దిసేపు మాత్రమే ఉండేవి. మాతా అమృతానందమయి వారానికి మూడు రాత్రులు దైవభావాలను ప్రత్యక్షంగా కనబరుస్తుంది; దర్శనానికి ఉన్న భక్తులను బట్టి ఒక్కొక్కటి 10 నుంచి 12 గంటలసేపు [నిరంతరాయంగా] దీర్ఘంగా సాగుతుంది. అమ్మకు సంబంధించినంతవరకు ఇది, ప్రాపంచికత అనే బురదలోకి దూకిన మానవులకు ఆమె సేవచేసే పద్ధతి.

శ్రీచైతన్య మహాప్రభువుకు రెండు రకాల భావాలు ఉండేవని చెబుతారు. వాటిలో ఒకటి, అయినలో తరచుగా కనిపించే భక్తిభావం; రెండోది, ఆయన వాస్తవస్థితి అయిన బ్రహ్మనిష్ఠను వెల్లడించే భగవద్భావం. శ్రీరామకృష్ణ పరమహంసకు కూడా అవే ఉండేవి. హనుమద్భావంలో ఆయన సాధనలు చేసే కాలంలో ఆయనకు చిన్న తోకలాటిది పుట్టుకొచ్చిందని కూడా చెబుతారు. కృష్ణ, దేవీ భావ సమయాల్లో దివ్యమాత తనలో ఉన్నదాన్ని [దైవాన్ని] బయలుపరుస్తుంది; ఆమె భక్తులను దీవించడానికి ఆ దేవతలను ప్రత్యక్షీకరిస్తుంది. ఈ భావాల గురించి దివ్యమాత ఒకసారి ఇలా అన్నది:

"భావాల్లో అమ్మ, తనకున్న ఆధ్యాత్మిక శక్తిలో అత్యంత సూక్ష్మాంశాన్ని కూడా బయలుపరచదు. దాన్ని బయలుపరచవలసే వస్తే ఎవరూ ఆమె దగ్గరికి చేరలేరు!" ఆమె ఇంకా ఇలా చెప్పింది, "ఒకే పరబ్రహ్మ తాలూకు అసంఖ్యాకమయిన పార్శ్వాలకు ప్రాతినిధ్యం వహించే, హిందువుల సర్వదేవతాగణంలోని దేవతలందరూ మనలో ఉన్నారు. దైవావతారం, లోక కల్యాణం కోసం సంకల్పమాత్రం చేత, వాటిలో దేన్నయినా ప్రత్యక్షంగా కనబరచవచ్చు. కృష్ణభావం, పురుషుడి - లేదా శుద్ధబ్రహ్మతత్త్వం తాలూకు ప్రత్యక్షీకరణం; దేవీభావం సనాతన స్త్రీ, సృష్టికర్త్రి, నిరాకార పరబ్రహ్మ క్రియాశక్తికి ప్రత్యక్షీకరణం. ఈ వెర్రిపిల్ల కొంతసేపు కృష్ణరూపాన్ని ధరిస్తుంది;

ంతసేపు దేవీరూపాన్ని ధరిస్తుంది. కాని ఈ రెండురూపాలూ ఈ వెర్రిపిల్లలోనే యం. అయితే, గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే, నామం కాని, రూపం ఉన్న వస్తువులన్నీ కేవలం మానసిక ప్రక్షేపణలే. ఏనుగును అలంకరించడం దుకు? వకీలు నల్లకోటు వేసుకోడం ఎందుకు? పోలీసు యూనిఫారం వేసుకోడం, పెట్టుకోడం ఎందుకు? ఇవన్నీ మనస్సులో ఒక ముద్రవేయడానికి పనికి వచ్చే మయిన ఉపకరణాలు మాత్రమే. అదే విధంగా అమ్మ, దర్శనానికి వచ్చే భక్తుల భావానికి పుష్టి కలిగించడానికి కృష్ణరూపాన్నీ దేవీరూపాన్నీ ధరిస్తుంది. నాలో ఉన్న మీలోనూ ఉంది. మీలో ఎల్లప్పుడూ వెలుగుతూ ఉండే ఆ అఖండ సత్తను రు అనుభూతం కావించుకొన్నట్లయితే మీరు అదే అయిపోతారు."

శ్రీకృష్ణుడూ దేవీ వారానికి మూడు రాత్రులు అమ్మ ఒంటిమీదికి పూనతారనీ నకం ముగిసిన తరవాత ఆమె ఒంటిమీంచి వెళ్ళిపోతారనీ నమ్మేవాళ్ళు కొందరు ప్పటికీ ఉన్నారు. ఈ దురభిప్రాయానికి కారణం, అమ్మ దైవభావాలను గురించి న అవగాహన లేకపోవడం. ఈ దైవభావాలు కేవలం, పరమాత్మతో ఆమెకున్న ంతత ఏకత్వానికి బాహ్యప్రకటీకరణ మాత్రమే. సాధారణంగా అనుకొనే పూనకంతో ని దైవానుగ్రహంతో కాని దీనికి ప్రమేయం లేదు.

భక్తుల ప్రశ్నలకు సమాధానాలు చెబుతూ అమ్మ, భావాలకు సంబంధించిన అనేక అంశాలను వివరించింది:

భక్తుడు: దైవభావాల సమయాల్లోనూ ఇతర సమయాల్లోనూ ఉన్న అమ్మ ఒకతేనని చాలామంది భక్తులు అంటూంటారు. అలాగయితే భావాలకున్న ప్రాముఖ్యం ఏమిటి?

అమ్మ: భావదర్శన సమయంలో అమ్మ, రెండు మూడు పొరలను (అంటే ముసుగులని భావం) భక్తులు పరమేశ్వరుడి క్షణిక దర్శనం పొందడానికని, తీసేస్తుంది. వేరు వేరు వ్యక్తులకు వేరు వేరు నమ్మకాలు ఉంటాయి. జనం ఎలాగో ఒకలాగ భగవంతుణ్ణి చేరడానికి సహాయపడాలని అమ్మ ఉద్దేశం. అమ్మను దేవీరూపంలోనో, కృష్ణరూపంలోనో చూస్తేనే కొందరికి ఆసక్తి కలుగుతుంది. అంతేకాదు.... ఆధ్యాత్మికతను గురించి ఏదయినా చాలా కొద్దిమందికే తెలుసు. మామూలు సమయాల్లో అమ్మ చెప్పిన మాటలు నమ్మడం కొందరికి కష్టంగా ఉంటుంది; కాని అదే విషయాన్ని దేవీభావ సమయంలో చెప్పినట్లయితే వాళ్ళు నమ్ముతారు.

భక్తుడు: అమ్మా, ఈ భావాన్ని చూపించడానికి ప్రత్యేకమయిన సమయమంటూ ఏదయినా ఉందా?

అమ్మ: లేదు. ఉండదు. ఏ సమయంలోనయినా చూపించవచ్చు. కేవలం సంకల్పముంటే చాలు.

భక్తుడు: అమ్మా, నువ్వు కృష్ణుడి వేషం, దేవీ వేషం ఎందుకు వేసుకొంటావు?

అమ్మ: భావం ఏమిటో జనం గుర్తుచేసుకోడానికి అది సాయపడుతుంది. నాయనా, ప్రతి వేషానికీ దాని ప్రాముఖ్యం దానికి ఉంది. మనం పుట్టినప్పుడు దిసమొలతో పుట్టాం. తరవాత, ఒక్కొక్క దేశాన్నిబట్టీ సమాజ ఆచారాన్నిబట్టీ జనం రకరకాల దుస్తులు వేసుకొంటూ వస్తున్నారు. దుస్తులు ఏవయినా వ్యక్తి ఒకడే. ఈ యుగంలో, జనం దుస్తులకు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. ఈ విషయానికి ఉదాహరణ ఒక కథలో వివరిస్తుంది అమ్మ. దారి పక్కన పెరుగుతున్న ఒక చెట్టును ఒకడు నరుకుతున్నాడు. దాన్ని చూసిన మరో వ్యక్తి, అతనితో ఇలా అన్నాడు, "చెట్టు నరక్కు! అది తప్పు. చట్టానికి విరుద్ధం", నరికేవాడు నరకడం మానకపోగా అతన్ని గట్టిగా తిట్టాడు కూడా. ఆ దుష్టుడు చెట్టు నరక్కుండా అడ్డుకోడానికి ప్రయత్నించినవాడు ఒక పోలీసు. అతను వెళ్ళిపోయి. అధికార సంబంధమయిన దుస్తులు తొడుక్కొని కాస్సేపట్లోనే తిరిగి వచ్చాడు. దుష్టుడు వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయేటట్లు చెయ్యడానికి ఆ పోలీసు పెట్టుకొన్న టోపీ ఒక్కటి చాలు. సాధారణ దుస్తుల్లో వచ్చినప్పుడూ అధికార సంబంధమయిన దుస్తుల్లో వచ్చినప్పుడూ ప్రభావంలో కనిపించిన తేడా చూడండి. కనక, అజ్ఞానులకు తెలియజేయడానికి ప్రత్యేక వేషం అవసరమయింది. అలాగే కృష్ణభావ, దేవీభావాల వేషాలు కూడా. అమ్మతో గంటల తరబడి మాట్లాడినప్పటికీ కూడా తృప్తి పొందనివాళ్ళు కొందరు, భావదర్శన సమయంలో ఆమెతో రెండు క్షణాలు మాట్లాడి నిండుగా తృప్తి పొందుతారు. తమ ఆందోళనలనన్నిటినీ నేరుగా భగవంతుడికి చెప్పి ప్రశాంతత పొందుతారు.

అవతారాలన్నీ స్వభావరీత్యా విలక్షణమయినవి రాముడికంటె కృష్ణుడు గొప్పవాడని కాని, బుద్ధుడికంటె రాముడు గొప్పవాడని కాని ఎవరూ చెప్పలేరు. వారిలో ఒక్కొక్కరు ఒక్కొక్క పనిని తాము నెరవేర్చవలసి వచ్చింది; మానవజాతిని ఉద్ధరించడానికి తగిన మార్గాలను వారు అనుసరించారు. అలాగని, వారికి వేరు వేరు జీవన దర్శనాలు ఉన్నాయని అర్థం కాదు. వారి పనులను పరిమితమయిన, మన తెలివీ తర్కమూ అనే కొలబద్దను ఉపయోగించి అంచనా వేయడం సాధ్యం కాదు. బహుశా, ఆధ్యాత్మిక సాధనవల్ల కలిగిన విశుద్ధమయిన సహజావబోధం ద్వారా [అంతర్ జ్ఞానంతో లేదా సహజ జ్ఞానంతో] వారి గొప్పతనాన్ని క్షణమాత్రంగా దర్శించగలుగుతాం. అమ్మద్వారా వేలాదిమంది భక్తులు పొందిన ఆధ్యాత్మికానుభవాలు ఈ మహాత్మురాలి అనిర్వచనీయ ఆధ్యాత్మిక శక్తిని సుస్పష్టంగా దర్శింపజేస్తాయి. దీని తరవాతి పుటల్లో, అమ్మ భక్తులు పొందిన దివ్యానుభవాల్లో కొన్నిటిని వారి మాటల్లోనే పాఠకులు తెలుసుకోవచ్చు.

భాగం

# 3

## ఆధ్యాత్మిక సాధకుల అనుభవాలు

### ఉన్నికృష్ణ

### (స్వామి తురియామృతానంద పురి)

అమ్మను కలుసుకొని ఉన్నికృష్ణ ఆమె దగ్గర చాలాకాలం ఉండే అదృష్టం కలిగిన వాళ్లలో మొదటివాడు ఉన్నికృష్ణ. అతను ఆరో తరగతి తరవాత బడిచదువు కొనసాగించలేదు. అతనిలో మనకు, అమ్మ దయకూ అనుగ్రహానికీ అద్భుతమయిన నిదర్శనం కనిపిస్తుంది. గురువు అనుగ్రహం కనక ఉన్నట్లయితే అక్షరమ్ముక్క రాని అతిసామాన్యుడు సైతం అనశ్వరుడయిన కవి కాగలుగుతాడు. ఉన్నికృష్ణ జీవితం దానికి ఉత్తమమయిన ప్రమాణం.

కొద్దికాలంపాటు బడిచదువు గడిచిన తరవాత, చిన్న ఉన్ని, రకరకాల వ్యాపకాలతో స్వేచ్ఛగా తిరిగాడు. 1976లో, అతనికి ఇరవైఏళ్ళ వయస్సప్పుడు, అమ్మను గురించి విని, ఆమెను చూడటానికి వెళ్ళాడు. అమ్మమీద అతనికి గొప్ప విశ్వాసమూ భక్తీ ఏర్పడ్డాయి; మొట్టమొదటసారి కలుసుకొన్నప్పుడే. ఆ తరవాత అతను తరచుగా అమ్మ దర్శనానికి వస్తూ ఆమె ఆదేశాలు కోరుతూ వచ్చాడు. ఈ విధంగా ఒక ఏడాది గడిచింది. ఒకనాడు అమ్మ అతన్ని, గుళ్లో నిత్యపూజ చెయ్యడానికి తన దగ్గర ఉండిపొమ్మని చెప్పింది. ఆమె అతనికి ప్రతిరోజూ లలితా సహస్రనామం, (అమ్మవారి వెయ్యిపేర్లు) చదవడం నేర్పింది.

అప్పటి నుంచి అతని జీవితంలో సంపూర్ణంగా విప్లవాత్మకమయిన మార్పు వచ్చింది. అమ్మ సాన్నిధ్యమే అతనికి, సత్యాన్ని సాక్షాత్కరింపజేసుకోవాలన్న బలమయిన కోరిక కలగడానికి స్ఫూర్తినిచ్చింది. ప్రతిరోజూ అతనికి కఠోర తపస్సు, విగ్రహారాధన, అమ్మతో సంభాషణలు, పవిత్ర గ్రంథ పఠనం, తదితర ఆధ్యాత్మిక కార్యకలాపాలతో నిండిపోయేది. ఈ విధమయిన క్రమశిక్షణతో కూడిన జీవితంవల్ల,

భావదర్శన సమయంలో కనిపించే దివ్యజననీ ప్రతిరోజూ తన మామూలు మనోవృత్తులతో కనిపించే అమ్మా, నిజానికి ఒక్కరేననీ, లోకకల్యాణంకోసం తన లీలలను చూపించే ఒకే అనంత దివ్యశక్తి తాలూకు రెండు పార్శ్వాలు లేదా ప్రత్యక్షీకరణాలు అనీ అతను క్రమక్రమంగా గ్రహించాడు. ఈ విధమయిన స్ఫూర్తి అతనిలో, సాధన చెయ్యాలన్న కోరికను గాఢంగా రేకెత్తించింది. అమ్మను తన జీవితానికి ఏకైక ఆధారంగా పరిగణించి ఆమె పాదసన్నిధికి తనను తాను సంపూర్ణంగా అర్పించుకొన్నాడు. కొంతకాలం గడిచేసరికి అతని ఆధ్యాత్మిక సాధనలు ఇంకా కఠోరంగా పరిణమించాయి. తిండి, నిద్ర, మాట్లాడటం తగ్గించేశాడు. ఒక్కొక్కప్పుడు అతను కొన్ని వారాల తరబడిగా ఉపవాసాలు చేస్తూండేవాడు. కటిక నేలమీద పడుకొని నిద్రపోయేవాడు. చలికాలంలో కాని, వానాకాలంలో కాని కప్పుకోడానికి దుప్పటికూడా తీసుకొనేవాడు కాడు. అలవాటుగా అప్పుడప్పుడు యాత్రలకు వెళ్లినప్పుడు అతను కాలినడకనే వెళ్ళేవాడు. కాని మరే విధమయిన ప్రయాణ సాధనాన్నీ వినియోగించుకోలేదు.

ఒకనాడు అతను నీళ్ళు నిండిన కళ్ళతో, పెల్లుబుకుతున్న భావావేశంతో అమ్మను ఇలా అడిగాడు, "నా అసలు తల్లి ఎవరు?" అత్యంత వాత్సల్యంతో అమ్మ అతని తలను తన ఒళ్లో పెట్టుకొని అంది, "నాయనా, నువ్వు నా కొడుకువి. నేను నీ తల్లిని." అనిర్వచనీయమయిన ఆనందం తనలో పెల్లుబుకడంతో ఉన్నికృష్ణ తబ్బిబ్బు అయాడు. ప్రకాశవంతమయిన అమ్మ ముఖంలోకి తేరి చూస్తూంటే అతని కళ్ళు ఆనందబాష్పాలు రాల్చాయి.

అమ్మ అపరిమితానుగ్రహంతో ఉన్నికృష్ణ ధారాశుద్ధిగల కవి అయాడు. అతని కవిత్వంలో గాఢమయిన తాత్త్విక భావసంపత్తీ భక్తియుక్తమయిన మాధుర్యమూ నిండుగా ఉంటాయి. అతన్ని ఇంటికి రప్పించడానికి అతని తల్లిదండ్రులు, కొందరు బంధువులను అతని దగ్గరికి పంపినప్పుడు అతను, తీక్ష్ణమయిన పద్యంతో సమాధానమిచ్చాడు [దాని భావం ఈ కింద చూడవచ్చు]:

ఇంటిని ఏనాడో వదిలిపెట్టి వచ్చాక
ఇప్పుడు మళ్ళీ లౌకిక జీవనం గడపాలంటే నేను,
ఆత్మశాంతి ఉంటుందా నాకు?
బతుకుతూ వచ్చినా అలాంటి బతుకు అనాది కాలంగా
కలిగింది ఏం లాభమని?

లోక సమ్మూఢ మార్గం నుంచి నేను

స్వేచ్ఛ పొందాలని పెనుగులాడుతున్నప్పుడు
బిచ్చగాడి సేవకు చేర్చే
మూఢమార్గం ఏర్పరుస్తారెందుకు నాకు?
హితవయినదేనా నాకది?

ఉన్ని, తాను మొట్టమొదటిసారి అమ్మని కలుసుకొన్న సందర్భాన్ని ఆవాహన
లో కవిత్వీకరించాడు. [దాని భావం ఇలా ఉంటుంది]:

దూరాన దేవాలయంలో వెలుగుతోంది
ఒక జ్యోతి ఆరిపోకుండా.
అపార కరుణామయి అమ్మ
ఆసీనురాలయింది అక్కడే,

దారిచూపించే వెలుతురయి,
చీకటిలో తడుముకొనే దీనులకోసం.
తిరుగుతూ తిరుగుతూ ఒకనాడు నేను చేరినప్పుడక్కడికి
ఆ ప్రభామయి పిలిచింది నన్ను ఒక పెడకు,

గర్భాలయాన్ని తెరిచి, పూసింది
నా నుదుటనొక చందన రేఖ.
మంజుల స్వరంతో హరిని కీర్తిస్తూ
తన పావన భుజస్కంధాలమీద చోటిచ్చింది నాకు.
దాపుకు వచ్చి, అద్భుత దివ్యస్వప్నం
ఒక సత్యాన్ని పలికింది నా చెవిలో:

"అవసర మేముందిప్పుడు నీ కన్నీళ్ళకు
తెలియదా నీకు, అఖిలేశ్వరి శ్రీపాద సన్నిధికి వచ్చావని?
మేలుకొన్నాను ఒక్క నిట్టూర్పుతో
ముద్రితమయింది నా చైతన్య ఫలకాన
ఆమె ముఖకమలం."

ఒకసారి ఉన్నికృష్ణ ఏదో అంతస్స్ఫురణ వల్ల, కొన్ని వారాల పాటు ఉపవాసం చేశాడు. ఈ సంగతి తెలిసినప్పుడు అమ్మకూడా అన్నం తినడం, తాగటం మానేసింది.

ఈ సంగతి తెలియక, ఉన్ని, తన నిరశనవ్రతం కొనసాగిస్తూనే ఉన్నాడు. రెండు రోజుల తరవాత, అతను నిత్యపూజకు వెళ్తూ ఉండగా, అమ్మ తండ్రి అతన్ని నిలదీశాడు; అన్నం తినడం మానేసినందుకూ ఆ కారణంగా అమ్మకూడా పస్తుండేటట్లు చేస్తున్నందుకూ ముక్కచివాట్లు పెట్టాడు. పూజ అయిన తరవాత అతను, బరువెక్కిన గుండెతో, నీళ్ళు నిండిన కళ్ళతో అమ్మ కుటీర ద్వారం దగ్గరకి వచ్చాడు. అమ్మ అతన్ని లోపలికి రమ్మని ఎంతో ప్రేమతో నిమిరింది. వణుకుతున్న అతని ఒంటిని చూస్తూ ఆమె ఇలా అంది, "నాయనా, ఉన్నీ, మనస్సులో ఏమయినా అలజడి ఉన్నట్లయితే నువ్వు వచ్చి ఆ సంగతి అమ్మకు చెప్పాలి. నీ శరీరాన్ని ఇలా హింసించకు. తపస్సు చెయ్యడానికి శరీరం అవసరం. కనీసం శరీరం నిలవడానికయినా తిను." ఈ ముక్క చెప్పి, ఆమె ఒక కంచంలో అన్నం తెప్పించి, తన చేత్తోనే అతనికి అన్నం తినిపించింది; తనుకూడా ఆ కంచంలోంచే తీసుకు తింటూ.

ఆశ్రమంలో కుదురుకొన్న కొన్ని నెలలకు, సంచార సాధువు స్వభావమున్న ఉన్ని, వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నాడు. ఎవరికీ చెప్పకుండా, ప్రయాణానికి తయారయాడు. అది దర్శనం రోజు. అతనింక బయలుదేరతాడనగా, అమ్మ పంపిన మనిషి ఒకతను హఠాత్తుగా వచ్చి ఇలా చెప్పాడు, "నువ్వు వెళ్ళడానికి తయారవుతున్నప్పటికీ నువ్విప్పుడు వెళ్ళకూడదని అమ్మ చెబుతోంది." అమ్మమాట కాదనలేక, ప్రయాణం విరమించుకొన్నాడతను. తరవాత మరో రోజున కూడా, వెళ్ళిపోవడానికి ప్రయత్నించాడు. కాని మళ్ళీ అలాగే జరిగింది. చివరికి, నిజంగా ఒకనాడు వెళ్ళిపోయాడు. కాని రెండురోజుల్లో తిరిగి రావలసి వచ్చింది. అమ్మకు తెలియకుండాను, ఆమె దీవనలు లేకుండాను ఏదీ చెయ్యలేమని అతనికి నమ్మకం కలిగింది.

"ఉన్నిపాటలు అతని ధ్యానంలోంచి పెల్లుబుకుతాయి," అని ఒకసారి అమ్మ చెప్పింది ఇంతకంటె గొప్ప గుర్తింపు ఏముంటుంది? అతను రాసిన రెండు పాటలకు అనువాదం ఈ కింద చూడవచ్చు:

సంచరించాను నేను దూరదేశాలెన్నెన్నో,
ఎంతో దుఃఖభారాన్ని మోసుకొంటూ.
చివరికి వచ్చి నీ దగ్గరికి, ఆత్మసమర్పణ చేసుకొన్నాను
నీ పాదపద్మాల సన్నిధిలో.
ఓ అమ్మా, కడిగేయవా దయతో,

అంతులేని బాధలనూ నా కన్నీళ్ళనూ నీ ప్రేమనీరాలతో ?
పాపిగా తలచకమ్మా ఈ దీనుణ్ణి,

నా కాధారం మరెవ్వరూ లేరు ఈ లోకంలో.
ఓ కరుణామూర్తీ, దయతలచి నన్ను లాలించు,

నీ సుందర నయనాల వెన్నెల వెలుగుతో.
ఓ అమ్మా, వేదవేదాంతాలు వర్ణించాయి నిన్ను,
ఈ దుర్భర చింతనాభారాన్ని విసిరేసి
నీ దాపున కూర్చుని, ధ్యానంలో మునిగిపోనియ్యి నన్ను!

సర్వ దేవీదేవులకు తల్లివయిన ఓ అమ్మా!
పరమాత్మలాభం పొందాలని, నా ఆత్మలో
పెల్లుబికే ఈ కోరికను నెరవేర్చవా నువ్వు?
ఓ అమ్మా, ఎన్నడు వస్తుంది రోజు,
నేను విషయలాలసను విడిచిపెట్టేసి
నీ పవిత్ర పాదాల్లో ఐక్యమయే రోజు?

## బాలు
## (స్వామి అమృతస్వరూపానంద పురి)

అమ్మ అనుగ్రహాన్ని గురించి తనకు కలిగిన అనుభవాలను బాలు [ఇప్పటిపేరు స్వామి అమృతస్వరూపానంద] ఈ కింది విధంగా వివరించాడు:

"నా బి. ఏ. పరీక్షలు పూర్తయిన కొత్తలో, అలౌకిక శక్తులు కలిగి దేవిగానూ కృష్ణుడిగానూ దర్శనమిచ్చే ఒక అమ్మాయిని గురించి విన్నాను. భగవంతుడి ఉనికి మీద నాకున్న విశ్వాసం గాఢమయినదే అయినప్పటికీ ఆమెను చూడాలన్న ఆసక్తి నాకు అంతగా కలగలేదు. అంతకు పూర్వమే ఆమె ఊరికి వెళ్ళివచ్చిన చుట్టాలూ స్నేహితులూ ఆమెను గురించి గొప్పగా చెబుతూ వచ్చారు; ఆమె ఆశ్రమాన్ని చూడమని నన్ను ఒత్తిడిచేస్తూ వచ్చారు. చివరికి ఒకనాడు సాయంత్రం నేను మా మామయ్యతో బాటు, సంశయగ్రస్తమయిన మనస్సుతో ఆశ్రమానికి వచ్చాను. అప్పటికే చీకటి పడింది. ఆశ్రమాన్ని సమీపిస్తూ ఉండగా, హృదయాన్ని ఆకట్టుకొనే భక్తి గీతం ఒకటి నా చెవుల్లో మారుమోగింది. దానిమీద నా మనస్సు నిలిచింది. నేను ఆశ్రమ ఆవరణలో అడుగుపెట్టాను. అందులో ఒక చిన్న గుడి ఉంది. అక్కడ, తెల్లదుస్తులు ధరించిన ఒక అమ్మాయి ప్రేమతోను, భక్తితోను నిండిన పాటలు పాడుతూ ఉంది. ఆమె పాట వింటూంటే, ఆమె హృదయంలో దివ్యానందం, ప్రేమ పెల్లుబుకుతున్నాయని తెలుస్తుంది. ఆ పాట సృష్టించిన స్పందనలు నా గుండెలోకి

దూసుకొని వెళ్ళి సున్నితమయిన అనుభూతులను కలిగించాయి."

"నా వంతు వచ్చినప్పుడు, నేను ఆలయం గదిలోకి ప్రవేశించాను. అక్కడ ఒక పీఠంమీద ఆమె కూర్చుని ఉంది. ఆమె ముందు నేను సాగిలబడ్డాను. నేను లేచినప్పుడు ఆమె నా చెయ్యిపట్టుకొని నా కళ్ళలోకి చూసింది. ఆమె కళ్ళు పూర్ణచంద్రబింబాల్లాగ వెలుగుతున్నాయి. ఆ చూపు నా అంతరంగంలోకి దూసుకుపోయింది; ఆ చిరునవ్వు నన్ను కట్టిపడేసింది; నేను కదలలేకుండా చేసింది. హద్దులన్నిటినీ ఛేదించుకొన్న సహానుభూతి ఆమె ముఖంలో సాక్షాత్కరించింది. మెల్లగా, ఆమె నా తలను తన భుజంమీద పెట్టుకొని మృదువుగాను, గాఢంగాను అంది, 'నాయనా, నేను నీ తల్లిని; నువ్వు నా బిడ్డవు'; తియ్యని స్వరం నా హృదయాంతరాల్లోకి వెళ్ళింది; అనిర్వచనీయమయిన ఆనందంతో నేను తన్మయుణ్ణయాను. నేను అన్వేషిస్తున్నది దీనికోసమే. నా కళ్ళు చెమ్మగిల్లాయి. సర్వసంపూర్ణంగా పరిశుద్ధమయిన ప్రేమ - విశ్వజనీనమయిన మాతృత్వం - రూపుగట్టింది. ఈ మొదటి అనుభవం కలిగించిన పులకింతతో, ఆ రాత్రి అంతా అమ్మ దగ్గరే కూర్చుండిపోయాను.

"మర్నాడు నేను ఇంటికి చేరేసరికి, నాలో కలిగిన గొప్ప మార్పును నేను గ్రహించుకొన్నాను. నా మామూలు కార్యకలాపాలన్నిటిపట్లా నాకు పూర్తి విముఖత ఏర్పడింది. ఆమెను మళ్ళీ చూడాలన్న కోరిక నాలో బలపడింది. నా ఆలోచనలన్నీ ఆమెమీదే నిలిచిపోయాయి. ఆ రాత్రి నేను నిద్రపోలేకపోయాను. నేను ఎప్పుడు కళ్ళు మూసుకొంటే అప్పుడల్లా అమ్మ నా ఎదుట సాక్షాత్కరించింది. మర్నాడు మళ్ళీ నేను ఆశ్రమానికి వెళ్ళాను. అమ్మను రెండోసారి కలుసుకొన్న తరవాత, ప్రాపంచికతాశృంఖలాలను తెగదెంచుకోవాలన్న కోరిక నాలో గట్టిపడింది. అమ్మను గురించి ఆలోచిస్తూ నేనొక పిచ్చివాడిలా తయారయాను. తిండి తినడం, నిద్రపోవడం, స్నానం చేయడం మరిచిపోయాను. బట్టలు వేసుకోడంలో, తల దువ్వుకోడంలో నాకున్న షోకులన్నీ విడిచిపెట్టేశాను. నాలో కలిగిన మార్పును నా తల్లిదండ్రులూ ఇతర కుటుంబ సభ్యులూ చూసి గాభరాపడ్డారు; నేను వళ్ళిక్కావుకు వెళ్లడానికి వల్లకాదన్నారు."

"మర్నాడు నేను భజనలో పాల్గొన్న తరవాత, 'అమ్మా, నేను నీ బిడ్డను. దయ ఉంచి నన్ను స్వీకరించు,' అన్న నిశ్చయంతో గుళ్ళోకి ప్రవేశించాను. నా తలను తన భుజంమీద పెట్టుకొంటూ అమ్మ, ప్రేమతో ఇలా అంది, 'నాయనా, నువ్వు పాడుతూండగా అమ్మ విన్నప్పుడు, ఈ స్వరం భగవంతుడిలో లీనం కావలసి ఉందన్న సంగతి ఆమె తెలుసుకొంది. అప్పటికప్పుడే అమ్మ నీదగ్గరికి వచ్చి నిన్ను తనలో కలుపుకొంది. నువ్వు నా సొంతం.'

"ఒకనాడు రాత్రి నేను గాఢనిద్రలో ఉండగా, ఒక విచిత్రమయిన సువాసన నా ...అంతటా నిండిపోవడం పసిగట్టాను. కళ్లు తెరిచాను. సువాసన నిజంగా ఉందనీ అది ...కాదు, నా ఊహ కాదనీ తెలుసుకొన్నాను. హఠాత్తుగా, ఎవరి చేతులో నా నుదుటిని ...మురుతున్నట్లు అనిపించింది. నేను పైకి చూశాను. నా తలాపి దిక్కున, మంచం చివర, ...మ్మ నిలబడీ ఉండటం చూసి ఆశ్చర్యపోయాను. నా కళ్ళను నేను నమ్మలేకపోయాను. ...మె చిరునవ్వు నవ్వుతూ ఇలా అంది, 'నా నాయనా, అమ్మ ఎప్పుడూ నీతోనే ఉంది; ...గులు పడకు.' ఈ ముక్క చెప్పి ఆమె అంతర్ధానమయింది.

"మర్నాడు పొద్దున నేను వళ్ళిక్కావుకు ఉరికాను. కాని అమ్మ అక్కడ లేదు. ...మె సాయంత్రం 4 గంటలకు వచ్చింది. ఒక్క పలుకు పలక్కుండా ఆమె, ఇంట్లో ...కి పరుగెత్తి అన్నం కంచంతో బయటికి వచ్చింది. తల్లి కొడుక్కు పెట్టినట్టుగా నాకు అన్నం పెట్టింది. అన్నం పెడుతూ ఇలా అంది, 'నిన్న రాత్రి అమ్మ నీ దగ్గరకి వచ్చింది.' సంతోషంతో తబ్బిబ్బు పడి, నేను పసిపిల్లవాడిలా ఏడ్చేశాను. నిజానికి, ఆ నాడు నేను [అప్పటిదాకా] ఏమీ తినలేదు.

"అమ్మ దగ్గర మంత్రదీక్ష తీసుకొన్నాక, నేను ఇంట్లో ఉండలేకపోయాను. అమ్మ సాన్నిధ్యంలో ఉండాలనీ ఆమె ఉపదేశాలు పొందాలనీ నాకున్న ఆకాంక్ష నానాటికీ పెరుగుతూ వచ్చింది. మా చుట్టాలు కల్పించిన అడ్డంకుల్ని వేటినీ ఖాతరు చెయ్యకుండా, నేను ఇల్లు విడిచిపెట్టేసి ఆశ్రమంలో చేరాను.

"ఆ తరవాత రెండేళ్ళకు, ఒక భక్తుడి ఇంట్లో కూర్చుని ఉండగా, ఆమె నాతో ఇలా అంది, 'నాయనా, బాలూ, నువ్వు తత్త్వశాస్త్రంలో ఎం. ఏ. డిగ్రీ సంపాదించాలి'. అంతకుముందు ఒకనాడు నేను, ఇంక చదువు కొనసాగించననీ ఆమెనే పిచ్చిగా తలుచుకొంటూ ఉండాలని ఉందనీ అమ్మకు చెప్పాను. ఇప్పుడు రెండేళ్ళ తరవాత, ఆమె నన్ను మళ్ళీ చదువుకోమంటోంది. ఒక ప్రయోజనం లేకుండా ఆమె ఏదీ చెప్పదనీ చెయ్యదనీ నాకు అనుభవంలో తెలిసింది. అంచేత నేను కోర్సులో ప్రవేశించాను. కాని అసలయిన సమస్య ఇప్పుడు ఎదురయింది; నాకు ఎవరు నేర్పుతారని! నేను ఎనిమిది పేపర్లకు చదవాలి. వాటిలో నాలుగు, భారతీయ తత్త్వశాస్త్రానికి సంబంధించిన విషయాలు. వాటితో నాకు కాస్త పరిచయముంది. తక్కిన నాలుగూ పాశ్చాత్య తత్త్వశాస్త్రానికి సంబంధించిన విషయాలు. ఇవి నాకు పూర్తిగా కొత్త. నేర్పేవారొకరు తప్పనిసరిగా కావాలి. దాన్ని గురించి నేను అమ్మను అడిగాను.

"దాన్ని గురించి దిగులు పడకు. ఒకరు ఇక్కడికి వచ్చి నీకు నేర్పుతారు. ఓపికగా కాచుకొని ఉండు," అంది ఆమె. కాని నాకు స్థిమితం లేకుండా పోయింది.

అదే ప్రశ్న తరచుగా ఆమెను అడుగుతూ వచ్చాను. ఒక వారం తరవాత, ఒక భక్తుడు నన్నొక తత్త్వశాస్త్ర ఆచార్యుల దగ్గరికి పంపాడు. నేను ఆయన దగ్గరికి వెళ్ళి నా పరిస్థితి వివరించాను. ఆయన నాకు చెప్పడానికి సిద్ధంగానే ఉన్నారు; కాని ఆశ్రమానికి రానన్నారు. చదువుకోసం నేను ఆశ్రమాన్ని విడిచిపెట్టి రావడంలో నాకున్న ఇబ్బందిని ఆయనకు తెలియజెప్పడానికి ప్రయత్నించాను. చివరికి ఆయన ఆశ్రమాన్ని సందర్శించడానికి ఒప్పుకొన్నారు. కాని, 'నేనక్కడ ఉండనూలేను, నీకు క్లాసులు నడపనూ లేను. నువ్వు చదువుకోదలిస్తే ఇక్కడికి వచ్చి తీరాలి. లేకపోతే ఇప్పుడే ఆ విషయం విరమించుకో,' అన్నారు. నాకు మరో మార్గం లేదు కాబట్టి, కనీసం ఆయన్ని ఆశ్రమానికి రానిచ్చి అమ్మను చూడనిద్దామని అనుకొన్నాను.

"మరుసటి గురువారం, నేను ఆయనింటికి వెళ్లి తీసుకు వచ్చాను. ఆశ్రమానికి చేరిన తరవాత నేను, ఆయన్ని లోపలికి వచ్చి అమ్మను చూడమని చెప్పాను. అందుకు ఆయన ఒప్పుకోలేదు. మామూలు ప్రకారం అమ్మ, భావదర్శనానికి ముందు పాటలు పాడటానికి కూర్చుంది. ఆయన దూరంలో ఉండి గమనిస్తున్నారు. దర్శనం మొదలయిన తరవాత కూడా ఆయన పట్టిపట్టి దూరంనుంచి చూస్తున్నారు. నేను ఆయన దగ్గరికి వెళ్లి, ఆయనకు ఇష్టమయితే గుళ్ళోకి వెళ్ళి అమ్మ దర్శనం చేసుకోవచ్చునని చెప్పాను. 'వద్దు; నేనింతవరకు ఎవరిముందూ సాగిలబడలేదు. అలా చెయ్యడం నాకు నచ్చదు,' అన్నారాయన. నేను ఆయన్ని ఒంటరిగా వదిలేసి పాటలు పాడటానికి కూర్చున్నాను. మరి రెండు నిమిషాల్లో ఆయన గుళ్లోకి ఉరుకుతూ ఉండటం గమనించాను; బిగ్గరగా అరుపు విన్నాను. ఆయన అమ్మ ముందు సాగిలబడి పసిపిల్లవాడి మాదిరిగా ఏడుస్తున్నారు. గంటా రెండు గంటలు గడిచాయి. గుళ్ళోంచి బయటికి వస్తూ ఆయన నన్ను పక్కకి పిలిచారు. 'ఈమె ఎంతో గొప్ప మహాత్మురాలు. ప్రతివారం నేను ఇక్కడికి వచ్చి నీకు చదువు చెబుతాను,' అన్నారు. ఆ విధంగా అమ్మే నాకు టీచరును ఏర్పాటు చేసింది.

"ఎన్నో గ్రంథాలను గురించి ప్రస్తావిస్తూ ఆ ప్రొఫెసరుగారు, నాకు చాలా నోట్సు చెప్పారు. కాని ఏదీ వివరించలేదు. దురదృష్టవశాత్తు, కొన్ని ఇతర కారణాలవల్ల , మేము సక్రమంగా చదువు సాగించలేకపోయాం. పాశ్చాత్య తత్త్వశాస్త్రం, నాకు తెలియని విషయంగానే ఉండిపోయింది. పరీక్షలకింక మూడునెలల వ్యవధే ఉంది. ప్రొఫెసరుగారు నాకు మరికొంత నోట్సు చెప్పి మొత్తమంతనూ సంగ్రహంగా వివరించారు. నేను ఆశ్రమంలో వివిధ కార్యకలాపాల్లో చిక్కుకొన్నందువల్లా తరచుగా అమ్మ వెంబడి ప్రయాణాలు చేస్తూ ఉన్నందువల్లా చదువు సాగించలేకపోయాను.

...ప్పుడు, పరీక్షలకు ఒక్క నెలే గడువు ఉంది. అమ్మ నన్ను ఎనిమిది పేపర్లూ ...వరసలో రాయమంది. మొదటి సంవత్సరం పరీక్షాపత్రాలూ రెండో సంవత్సరం ...క్షాపత్రాలూ కలిపి ఎలా రాయగలుగుతానా అని నాకు నిజంగా ఆందోళన కలిగింది. ...ను అంతా అమ్మ పాదాలకు అర్పించి, చదవడం మొదలుపెట్టాను. చివరికి, నేను ...పతి వెళ్ళడానికి ముందురోజు వచ్చింది. [తిరుపతిలో ఉన్న శ్రీవేంకటేశ్వర] ...విద్యాలయంలో తత్త్వశాస్త్ర విద్యార్థిగా నాపేరు నమోదు చేయించుకొన్నాను.

"మధ్యాహ్నంవేళ నేను [ప్రయాణానికి] సామాన్లు సర్దుకొంటున్నాను. అమ్మ ...రాత్తుగా, తన గదిలోంచి నన్ను పిలవటం వినిపించింది. నేను ఆమె గదిలోకి వెళ్ళి చూసేసరికి, ఆమె ఏవో ఒక సంచీలో సర్దుతోంది. చివరి వస్తువు పెట్టేసి సంచి మూసేసింది. ఆమె బల్లమీద మరో పెద్ద సంచీ ఉంది. ఎంతో ఆప్యాయంగా నన్ను ఆమె దగ్గరికి పిలిచి ఇలా చెప్పింది, 'నాయనా, నీ ప్రయాణానికి కావలసినవన్నీ సర్దిపెట్టాను.' బల్లమీదున్న పెద్దసంచీ చూపించి, 'ఆ పెద్దసంచీలో పంచెలు, చొక్కాలు, తువ్వాళ్ళు, రెండు దుప్పట్లు, తక్కిన బట్టలూ ఉన్నాయి. దీంట్లో కొబ్బరినూనె, సబ్బు, అద్దం, దువ్వెన, వేడిగా తాగడానికి ఏదయినా తయారుచేసుకొనేందుకు, పనికివచ్చే మరికొన్ని వస్తువులూ ఉన్నాయి. నీకున్న టైమును చదువుకు వినియోగిస్తావని ఇవన్నీ నేను సర్దిపెట్టాను.' నాకు నోట మాట రాలేదు. ప్రేమతో నిండిన అమ్మ ముఖంలోకి చూస్తూ ఉండిపోయాను. నా హృదయం ఆనందంతో పెల్లుబుకుతోంది. కళ్ళలో నీళ్ళు నిండగా, నాకు ఏడుపు వచ్చేసింది.

"అమ్మ దగ్గరకు వచ్చిన తరవాత, అమ్మకు దూరంగా ఉండవలసి రావడం ఇది నాకు మొదటిసారి; పైగా నెల్లాళ్ళు . నా గుండె బరువెక్కింది. నా కన్నీళ్ళను కప్పుకోడానికి, నేను రైలుబండిలో ఒక మూల కూర్చున్నాను. ప్రయాణికులందరూ కులాసాగా కబుర్లు చెప్పుకొంటున్నారు. కాని అమ్మ దగ్గరి నుంచి ఎడబాటు కలగడంవల్ల నా మనస్సంతా దుఃఖంతో నిండిపోయింది. ప్రయాణం పొడుగునా నేనామెను తలుచుకొంటూనే ఉన్నాను. మర్నాడు పొద్దుటికి తిరుపతి చేరాను. నా రోజులన్నీ ఎడబాటు బాధ కసిడికోతతో ఎడతెరిపి లేకుండా ఉన్నాయి. నీళ్ళలోంచి తీసిన చేపలాగ అనిపించింది నా పరిస్థితి. చదువుమీదే మనస్సు నిలపాలనుకొన్నాను; కాని సాధ్యం కాలేదు. ప్రతి ఒక్క నిమిషం నత్తనడక నడుస్తోంది. అమ్మ బొమ్మ వైపు కూడా చూడలేకపోయాను. ఆశ్రమంనుంచి తెచ్చిన ప్రతి ఒక్క వస్తువూ అమ్మనీ అమ్మ దివ్య స్వరూపాన్నీ గుర్తుచేస్తోంది నాకు. తిండితినడం నిద్రపోవడం మరిచిపోయాను. ఒక్కొక్కరోజు ఒక ఏడాదిలా ఉంది నాకు. అప్పుడప్పుడు సొమ్మసిల్లి పోయేవాణ్ణి.

ఎడబాటు బాధ భరించలేక ఏడ్చేసేవాడిని. చివరి సంవత్సరం పరీక్షలు మొదలయినాయి. ఎలాగో పేపర్లు రాయగలిగాను. నా దుఃఖాన్ని పంచుకోడానికి ఎవ్వరూ లేరు. ఆ సమయంలో నాకు అమ్మ దగ్గరినుంచి ఉత్తరం వచ్చింది. చాలాసార్లు చదివాను. మళ్ళీ మళ్ళీ చదువుకొన్నాను. నా కన్నీళ్ళతో ఆ ఉత్తరం తడిసి ముద్దయింది. అమ్మ నాకు రాసిన ఉత్తరానికి అనువాదం ఇది:

"బంగారు తండ్రీ, అమ్మ ఎప్పుడూ నీతోనే ఉంది. నాయనా, నువ్వు దూరంగా ఉన్నావని అమ్మకు అనిపించదు. బాబూ, నీ మనసులో ఉన్న కోరిక అమ్మకు తెలుసు. నీ ఏడుపులు అమ్మ వినగలదు. నాయనా, ఈ ప్రపంచం ఎంతో అందమయినది. ఈ పువ్వులూ విశాల మహాసముద్రమూ కిచకిచలాడే పిట్టలూ అంతులేని ఆకాశమూ చెట్టూ పొదలూ అడవులూ కొండలూ లోయలూ అన్నీ ఉన్నాయిక్కడ. భగవంతుడు ఈ ప్రపంచాన్ని అందంగా చేశాడు. ప్రతిదాంట్లోనూ ఆయన్ని చూడు. అన్ని జీవులగుండా ఆయన్ని ప్రేమించు. భగవంతుడినుంచి నిన్ను వేరుచేసే గట్టును తెగ్గొట్టు. నీ మనస్సు ఎడతెరిపి లేకుండా ఆయనవైపు సాగేటట్లు చెయ్యి. నాయనా, ఈ లోకంలో ఏదీ చెడ్డది కాదు. ప్రతిదీ మంచిదే. మంచినీ గుణవంతమయిన భాగాన్నీ చూడు. నీ మనసు పువ్వును వికసించనియ్యి; అంతటా పరిమళాన్ని వెదజల్లనియ్యి.

"ఆ రోజు రాత్రి నేను గది బయట కూర్చుని ఉన్నాను. చెట్లూ మొక్కలూ చల్లని పిల్లగాలిలో అల్లల్లాడుతున్నాయి. ఆకాశం మిలమిల మెరిసే చుక్కలతో నిండి ఉంది. జాబిల్లి వెండి వెలుగురేకలు, వాటి శోభ అంతటితో, నేలను వెలిగింపజేస్తున్నాయి. 'ఈ పిల్లగాలి నా అమ్మ దగ్గరికి వెళ్ళవచ్చు; అమ్మ ఒంటిని నిమిరే భాగ్యం దీనికి కలగవచ్చు. ఔను, ఇది అమ్మ దివ్యసౌరభాన్ని ధరిస్తోందనడంలో సందేహం లేదు. నాకే కనక రెండు రెక్కలుంటే అమ్మ దగ్గరికి ఎగిరిపోయేవాణ్ణి.' అదే రోజు రాత్రి నేను రాసిన కవిత ఇది:

తారాపథంలో తారకల్లారా, రాలేరా కిందికి?
లాలిపాట పాడుతోందిక్కడ అమ్మ మీకోసం.
తీరంలేని స్నేహవాహిని గదా ఆమె,
వెతికే మనసులకు నీడనిచ్చే వృక్షమే ఆమె.

మౌనరాగాలు రవళించే మూగరాత్రి వేళ
చల్లగా వీచే ఓ మందమారుతమా,
సాంద్ర మధురంగా నా చెవిలో, గుసగుసలాడినవి ఏ ఊసులు?
మాధుర్యమయమయిన మా అమ్మ కథలా ?

నీలమేఘమార్గంలో మెల్లగా ప్రతిరోజూ
ఉదయిస్తూ అస్తమిస్తూ ఉండే సూర్యచంద్రులారా,
మీకీ దివ్యప్రభలు ప్రసాదించిన
మా అమ్మను చూడాలనిపించడం లేదా?
నిర్జనంగా, నీరవంగా ఉన్న లోయల్లో, కొండచరియల్లో
విరివిగా పెరుగుతున్నాయి వృక్షలతాదులు
ఆశ్వాసమిస్తున్నాయన్నట్లుగా నాకు
రెమ్మలూ కొమ్మలూ ఆడుతున్నాయి గాలిలో!

"నేను పూర్తిగా భిన్నమయిన మనస్స్థితిలో ఉన్నాను. పిచ్చెత్తినవాడిలా గదిలో తిరిగాను. ఎలాగో నన్ను నేను సంభాళించుకొని, మర్నాడే వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నాను. చివరి సంవత్సరం పరీక్షల్లో ఇంకొక్క సబ్జక్టు మిగిలి ఉంది. మరో నాలుగు రోజుల్లో ప్రారంభం కాబోయే, మొదటి సంవత్సరం పరీక్షలకు వెళ్ళగూడదని నిశ్చయించుకొన్నాను. 'అమ్మ నన్ను అన్ని పరీక్షలకూ వెళ్ళమంది. ఇప్పుడు నేను ఆమె సలహాకు విరుద్ధంగా చెయ్యబోతున్నాను,' అనుకొన్నాను.

"చివరికి నేను ఒక చిత్రమయిన రీతిలో అమ్మ అనుమతి పొందాలని నిర్ణయించుకొన్నాను. సమానంగా ఒకే ఉరువున్న మూడు కాయితపుముక్కలు తీసుకొన్నాను. మొదటి ముక్కమీద, 'నాయనా, తిరిగి వచ్చెయ్యి,' అని రాశాను. రెండో దానిమీద, 'అన్ని పేపర్లూ రాశాక తిరిగి రా!' అని రాశాను. మూడో దానిమీద, 'నా నాయనకు ఏది నచ్చితే అది,' అని రాశాను. ఈ మూడు కాయితమ్ముక్కలూ ఒకే తీరుగా చుట్టలు చుట్టి, సంచిలోంచి అమ్మ బొమ్మ తీసి ఒక మూలగా పెట్టాను. 'ఓ అమ్మా, ఇక్కడినుంచి నేను ఏదో ఒక కాయితం తీస్తాను. నీ సంకల్పం ఏదయితే అది, నేను తెలుసుకొనేటట్లు చెయ్యి,' అని ఆమె ఎదుట ప్రార్థన చేశాను; అణకువగా ఆ కాయితాలు ఆమె దగ్గర పెట్టాను.

"కళ్ళు మూసుకొని, వణుకుతున్న చేతులతో ఒక కాయితం తీశాను. విప్పాను. అయ్యో! 'అన్ని పేపర్లూ రాశాక తిరిగి రా!' అని నేను రాసిన కాయితమే అది. మొదటి ప్రయత్నంతో తృప్తిపడక, మరో మూడు కాయితమ్ముక్కలతో లాటరీ వేశాను. అప్పుడు కూడా అదే సందేశం చేతికి వచ్చింది. అయినా కూడా, నా మనస్సు ఆమెను చూడాలని తహతహలాడుతోంది. చివరికి, మర్నాడే వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నాను.

"మర్నాడు, చివరి సంవత్సరం తాలూకు పరీక్షల్లో ఆఖరి పేపరు రాసేసి, నా గదికి పరుగెత్తి, సామానంతా సర్దేసుకొని గదిలోంచి వచ్చేయబోతున్నాను. చటుక్కున,

గదిలో మూలగా ఉన్న కొన్ని వస్తువులు కనిపించాయి. అవి, నేను ఆశ్రమంనుంచి వచ్చేటప్పుడు కొన్ని వస్తువులకు చుట్టబెట్టి తెచ్చిన పాత న్యూస్ పేపర్లు. పగిలిపోయిన సబ్బుపెట్టె కూడా ఉంది. 'నేను అమ్మను విడిచి వచ్చేటప్పుడు నా బాధ ఎంత గాఢంగా ఉంది! ఈ వస్తువులకు కూడా, నాలాగే బాధ కలగవచ్చు. వీటిని ఇక్కడ వదిలేయడం పాపం,' అనుకొన్నాను. వాటన్నిటినీ జాగర్తగా నా సంచీలో పెట్టాను.

"మర్నాడు నేను ఆశ్రమానికి చేరాను. అమ్మ గదికి వెళ్తూ ఉండగా, మా తమ్ముడు వేణును చూశాను. ఆశ్చర్యంగా, వాడు ఇలా అన్నాడు, 'నీకు అశాంతి కలుగుతోందనీ నువ్వీవేళ వస్తావనీ అమ్మ నిన్న రాత్రి నాకు చెప్పింది.' నేను అమ్మ గదిలోకి వెళ్లి ఏడుస్తూ ఆమె పాదాలమీద పడ్డాను. అమ్మ నన్ను లేవదీసింది; ఓదారుస్తూ ఇలా అంది, 'నాయనా, నీ హృదయం నాకు తెలుసు. ఈ ప్రేమ మంచిదే; కాని ఇంకా మనోబలం సంపాదించడానికి ప్రయత్నించు. సాధకుడు పువ్వులా మెత్తగానూ వజ్రంలా కఠినంగానూ ఉండాలి,' నువ్వు వెళ్ళి తక్కిన పేపర్లు రాసి తీరాలి. నువ్వు ఫెయిలయినా అమ్మ ఏమీ అనుకోదు. నువ్వు రేపే వెళ్ళి పరీక్షలయాక తిరిగి రా.

"మర్నాడు పొద్దునే బయలుదేరి నేను తిరుపతి వెళ్ళాను. వారం తరవాత, చివరి పరీక్ష అయిపోయిన తరవాత ఆశ్రమానికి తిరిగి వచ్చాను. నేను రాసిన సమాధానాలకు నాకు తృప్తి కలగలేదు; ఫెయిలవుతానేమోనని భయం కూడా వేసింది. అమ్మ ప్రశాంతంగా అంది, 'దాన్ని గురించి మరిచిపో. సంశయించకు. నువ్వు పాసవుతావు.' పరీక్షా ఫలితాలు వెల్లడి అయినప్పుడు, నేను సెకెండ్ క్లాసులో ఎక్కువ మార్కులతో పాసయినందుకు ఆశ్చర్యపోయాను.

"అమ్మ సమక్షంలో ఉండటమే ఒక తపస్సు. అందులో ఎప్పుడూ ఏదో ఒక కొత్తతనం, తాజాతనం ఉంటుంది. ప్రతి క్షణమూ భక్తుడికి, ఒక భిన్న ఆధ్యాత్మిక పరిధిలో కొత్త అనుభవాన్ని కలిగించి జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది; అతన్ని ఒక స్థాయినుంచి మరో స్థాయికి పరిణమింపజేస్తుంది. నా ఆ ధ్యాత్మిక జీవనపు తొలిదశల్లో, నేను అమ్మను అర్థం చేసుకొన్నానని ఒక్కొక్కప్పుడు అనుకొంటూ ఉండేవాణ్ణి. ఉత్తరోత్తరా, అమ్మను గురించి నేనేమీ అర్థంచేసుకోలేదని తెలుసుకొన్నాను."

## వేణు
## (స్వామి ప్రణవామృతానంద పురి)

వేణు, బాలు (స్వామి అమృతస్వరూపానంద) తమ్ముడు. తల్లి చనిపోయేనాటికి వాళ్ళిద్దరూ పసివాళ్ళు. ఆమె చనిపోయిన తరవాత బాలు తండ్రిదగ్గర పెరిగాడు; వేణు,

మ్మ సరస్వతీఅమ్మ గారింట్లో పెరిగాడు. కుటుంబ వాతావరణం ధార్మికమయినదీ మయినదీ వేణు. ఇంట్లోవాళ్ళకు గారాబు బిడ్డడు. అమ్మ ప్రేమానురాగాల ఎప్పుడూ అనుభవించలేదు. 15వ ఏట బడిచదువు పూర్తి చేసుకొని కాలేజి సం నాన్న దగ్గరికి వచ్చాడు. చిన్నతనంలోనే అతను ఆధ్యాత్మికతవైపు మొగ్గు నప్పటికీ కాలేజి చదువు కాలంలో, అలాటి గుణాలన్నీ వెనక్కి తగ్గాయి. అతను జీవనం గడిపాడు. అయినప్పటికీ కూడా, అతనెప్పుడయినా భక్తిరస ప్రధానమయిన చూసినా, కాషాయవస్త్రాలు వేసుకొన్న సన్యాసిని చూసినా, అతనిలో నిద్రాణంగా ఆధ్యాత్మిక ఆవేశంలో సంచలనం తోస్తూ ఉండేది.

ఈ సమయానికి, అతని అన్న, బాలు, అమ్మను కలుసుకోడం, ఆధ్యాత్మిక నానికి అంకితమయిపోవడం జరిగాయి. అమ్మను గురించి బాలు చాలా సార్లు డికి చెప్పినప్పటికీ వేణు పట్టించుకోలేదు. పైపెచ్చు, అతను అమ్మను దూషిస్తూ నొక్కిచెప్పాడు, "నే నా చేపలవాళ్ళ పిల్ల దరిదాపులకే రాను." అయితే, న్ని చూడకుండానే అమ్మ, బాలుతో ఇలా జోస్యం చెప్పింది. "మీ తమ్ముడు డా నా కొడుకే. అతనిక్కడికి వస్తాడు." ఇది విని బాలు కొంచం గాభరాపడ్డాడు. ఎందుకంటే, ఇంటినీ లౌకిక జీవనాన్నీ విడిచి పెట్టాలని తాను నిశ్చయించుకొన్నందుకే ఇంట్లో పెద్ద రభస జరిగింది. వేణుకూడా తన అడుగు జాడల్లోనే నడిస్తే ఇక ఏ వుతుంది? అయినప్పటికీ, దైవసంకల్పం సర్వోన్నతమయినది; సాధారణ మానవ దృష్టికీ అంచనాకూ అతీతమయినది. జరగవలసి ఉన్నది జరిగి తీరుతుంది.

వేణు, బి. ఎస్సి. డిగ్రీ కోర్సు చివరి సంవత్సరం చదువుతూ ఉండగా, అమ్మ ఒకనాడు, అతని దొడ్డమ్మగారి ఇంటికి వచ్చింది. వేణు కాలేజినుంచి ఇంటికి వచ్చేసరికి అమ్మ, ఆ ఇంటి వసారాలో నిలుచుని ఉంది. ఆమెవైపు చూడనుకూడా చూడకుండా వేణు, ఆమెను దాటుకొని లోపల తన గదిలోకి వెళ్ళాడు. అక్కడ శ్రీకుమార్, మరియు అమ్మ ఇతర ఆశ్రమవాసులు కొందరూ కూర్చుని ఉన్నారు.

చటుక్కున, ఎవరూ అనుకోకుండా, అమ్మ వేణు దగ్గరికి వచ్చి, ప్రేమించే తల్లిలాగ అతని చేతులు పట్టుకొని, "నువ్వు, నా చిట్టితండ్రి బాలు తమ్ముడివి కదూ? అమ్మ నిన్ను చూడాలని తహతహలాడుతోంది," అంది. వేణు మనస్సు కరిగింది. అమ్మ సాధారణ వ్యక్తి కాదనీ మాతృప్రేమ మార్దవాల నీటిబుగ్గ అనీ అతను క్షణంలో గ్రహించుకొన్నాడు. అయస్కాంతానికి ఒక ఇనపముక్క అంటుకుపోయినట్లుగా, వేణు ఆమె పట్ల ఆకర్షణ పొందాడు. మధ్యాహ్నం అమ్మ అందరికీ అన్నం పెట్టినప్పుడు వేణుకు కూడా ఒక అన్నం ముద్ద దక్కింది. అది అతనికొక మరవలేని అనుభవం.

ఆమె అపార ప్రేమను, సమాన దృష్టిని, పసిపిల్ల మాదిరి అమాయకత్వాన్ని చూసి అతను సమ్మోహితుడయాడు. ఆమె ముఖం, సంపూర్ణ ఆధ్యాత్మిక తేజస్సుతో ఉజ్జ్వలంగా ఉంది. ఆధ్యాత్మిక మర్మాలను విప్పిచెప్పడంలో సరళమయిన ఆమె పద్ధతి, పారవశ్యంతో మనోహరంగా చేసే భజనలు, వాటన్నిటినీ మించి ఆమెకున్న సంపూర్ణమయిన వినయం అతనిమీద గాఢంగా ముద్రవేశాయి. స్వల్పకాలంలోనే అతని మనస్సు అమ్మ మీదికి పోతూ వచ్చింది. అమ్మ ఇతరులతో మాట్లాడుతున్నప్పటికీ తన మనస్సులో మొలకెత్తిన సంశయాలకే నిజంగా అమ్మ సమాధానాలిస్తున్నట్లు వేణుకు అనిపించింది.

అమ్మను మొదటిసారిగా కలుసుకోడం, వేణు మనస్సుమీద గాఢమయిన ముద్రవేసింది. అమ్మను గురించీ ఆధ్యాత్మిక జీవితాన్ని గురించీ అతనికి ఏర్పడ్డ పూర్వాభిప్రాయాలన్నీ మటుమాయమయాయి. అమ్మను చూడాలన్న కోరిక అతనిలో రోజురోజుకూ పెరగసాగింది. చివరికి 1980 ఫిబ్రవరిలో అతను వళ్లిక్కావుకు వచ్చాడు. అమ్మను చూడగానే అతని కళ్ళు చెమ్మగిల్లాయి. అమ్మ అతన్ని పట్టుకొని తన దగ్గర కూర్చోబెట్టుకొంది. ఆ రోజు రాత్రి కృష్ణభావ దర్శనసమయంలో అతను గుళ్ళోకి వెళ్ళి నప్పుడు తను శ్రీకృష్ణ భగవానుడి ఎదుట నిలబడ్డట్టే అనిపించింది. అతని మనస్సు ఆనందంతో నిండిపోయింది; నవ్వాలేని ఏడవాలేని స్థితిలో ఉండిపోయాడు. తనకు శుద్ధభక్తి జ్ఞానమూ ప్రసాదిస్తూ దీవించమని అతను అమ్మను ప్రార్థించాడు. "నాయనా, నువ్వు కోరేది నెరవేరుతుంది," అంది అమ్మ. అమ్మ అతనికి, ఒక కాగితమ్ముక్క మీద రాసిన మంత్రం, తులసి ఆకుల మాల ఇచ్చింది.

వేణు మొదటిసారి అమ్మను కలుసుకొన్న తరవాత, అతనికి చదువు కొనసాగించాలన్న కోరికంతా పోయింది. ఆధ్యాత్మిక జీవితం గడపాలన్న దొక్కటే అతని కోరిక అయింది. అమ్మ పట్టుబట్టడంవల్ల వేణు, కాలేజి పరీక్షలకు చదివాడు. ఇంకొక్క నెలకే పరీక్షలు. తల నున్నగా గీయించుకొని, నుదుట విబూది పెట్టుకొని పరీక్షలు రాయడానికి కాలేజికి వచ్చిన వేణును చూసి ప్రొఫెసర్లూ విద్యార్థులూ ఆశ్చర్యపోయారు. అతనికి పిచ్చెత్తిందేమో అనుకొన్నారు. అతని మనస్సు పూర్తిగా అమ్మ లోనే నిమగ్నమయి ఉంది. అందువల్ల అతను, ఆ రోజు జరిగే పరీక్షకు కాక, మర్నాడు జరిగే పరీక్షకు తయారయాడు. మొత్తంమీద ఎలాగో పరీక్షలు అయాయనిపించాడు. ఇక అమ్మ దగ్గర ఉండిపోవడానికి 1980 సెప్టెంబరులో చక్కావచ్చాడు.

ఒకనాడు ఏదో పండుగ సందర్భంగా, ఆశ్రమంలో పాయసం వండారు. దాన్ని భక్తులకు పెట్టేముందు దేవుడికి నైవేద్యం చెయ్యడం ఆనవాయితి. వేణు ఒక గ్లాసు

పాయసం తీసు కొని వెళ్ళి ఆలయానికి ముందున్న చిన్న గుళ్ళో పెట్టాడు. ...ద మూత పెట్టడానికి ఏదీ కనిపించక, అమ్మ ఆ చుట్టుపక్కల ఎక్కడా ...ాయం చేసుకోడానికి ఒకసారి ఇటూ అటూ చూసి, గుడిదగ్గర పెరుగుతున్న చిన్న మొక్క తాలూకు కవటాకు ఒకటి తెంపాడు. అమ్మ దూరంనుంచి చూసింది. "...వేణూ!" అంటూ గట్టిగా పిలిచింది. అమ్మ గొంతు విని, అతను ఆ కవటాకును ...గుపరిచే తొందరలో గ్లాసు వంచేశాడు. అందులో ఉన్న పాయసమంతా ఇసకలో ...పోయింది. అప్పటికి వేణు బేజారెత్తిపోయాడు. అక్కడ ఏమీ కనిపించకుండా ...టానికి, ఇసకలో ఒలికిన పాయసాన్ని ఎత్తి గ్లాసులో పోశాడు; అది మళ్ళీ గుళ్ళో ...టడం తప్పని తెలిసికూడా.

ఇదంతా దూరంనుంచి గమనిస్తున్న అమ్మ అతని దగ్గరికి వచ్చి తీవ్రస్వరంతో ...లా అంది, "నాయనా, కుక్కయినా ముట్టదిది. మనుషుల మాట వేరే చెప్పాలా? అలాటప్పుడు దేవుడికి ఎలా నివేదిస్తావు? నాయనా, నువ్వయినా తింటావా? తినవు! నిజంగా ఇది పాపం. విశుద్ధమయిన ప్రేమతోను, భక్తితోను ఏది నివేదిస్తే అది - అది ఏదయినా సరే.- భగవంతుడు తీసుకొంటాడు. నువ్వు చేసేది ఏమిటో నిజంగా నీకు తెలియక చేసినట్లయితే నేను పట్టించుకొనేదాన్ని కాదు. నువ్వు చేసేది తప్పని పూర్తిగా తెలిసికూడా నువ్వు చేశావు. అదే కాదు. నువ్వు మరో తప్పు చేశావు. ఆ చిన్న మొక్కనుంచి కవటాకు తెంపావు. ఎంత నిర్దయగా చేశావు! ఆ మొక్కపిల్ల బాధతో ఏడుస్తూండటం కనిపిస్తోంది నాకు. ఎవరయినా నిన్ను గిల్లితే నీకెంత నొప్పి కలుగుతుంది? నాయనా, దాని బాధ నీకు తెలియకపోయినా అమ్మకు తెలుసు."

వేణు తన తప్పు తెలుసుకొని పశ్చాత్తాపపడ్డాడు. మన్నించమని వేడుకొన్నాడు. "నాయనా, నువ్వు ఏయే తప్పులు చేసినా నాలో ఏదో లోపంవల్లనే అవి జరిగాయని అనుకుంటాను. అమ్మకు నీమీద కోపమేమీ లేదు. కాని పరిపూర్ణత సిద్ధించే మార్గంలో నిన్ను నడిపించడానికి అలా నటించవలసి వస్తుంది," అంది అమ్మ.

వేణు ఇలా అంటాడు, "అమ్మ దగ్గర ఏదీ దాచలేం. ఆమెకు అన్నీ తెలుసు. ఈ యథార్థాన్ని నిరూపించే అనుభవం ఒకటి నాకు 5 ఏళ్ళ కిందట కలిగింది. ఒకనాటి రాత్రి భోజన సమయంలో అందరూ గంజి తాగుతూండగా, చటుక్కున నాకు, నంజుకోడానికి మాగాయ ఉంటే బాగుంటుందని గట్టి కోరిక కలిగింది. ఆశ్రమంలో అలాటి ఊరగాయలు ఉండటం నాకు తెలుసు. నేను చూశాను. అవి కూలివాళ్ళ కోసం, దర్శనానికి వచ్చే భక్తులకోసం. ఆశ్రమవాసులం వాటిని వేసుకోగూడదు. మసాలా ఘాటు, రొడ్డుపులుపు, మరీ ఉప్పతనం, వెర్రితీపి ఉన్న పదార్థాలను ఆధ్యాత్మిక సాధకులమయిన మేము తినగూడదని అమ్మ మాకు వెనకే చెప్పింది. తన ఆదేశాలను

పాటిస్తున్నారో లేదో తెలుసుకోడానికి అమ్మ తరచుగా, చెప్పా పెట్టకుండా, వంటింట్లోకి వస్తూండేది. ఈ సంగతి నాకు పూర్తిగా స్మృహలో ఉన్నప్పటికీ ఊరగాయ కావాలని పుట్టిన కోరిక ప్రబలం అయింది.

"చప్పుడు చెయ్యకుండా నేను వంటింట్లోకి దూరి రెండు పెద్ద మాగాయ ముక్కలు కాజేసి తిరిగి వెళ్ళబోతూండగా, చటుక్కున అమ్మ గొంతు వినిపించింది. 'వేణూ, ఏమిటి నీ చేతిలోది?' అని అడిగింది. నేను అదిరిపడ్డాను; పట్టుబడకుండా ఉండాలని, మాగాయ ముక్కలు దూరంగా విసిరేశాను. అప్పుడు అమ్మ వాటిని వెతికి పట్టుకొంది. నా దగ్గరికి వచ్చి నా చేతులు పట్టుకొని వాటిని స్తంభానికి కట్టేసింది. నేనెంతో సిగ్గుపడిపోయాను; భయపడిపోయాను."

పసివాడి మాదిరిగా అతనికి కలిగిన భయాన్నీ అమాయకత్వాన్నీ చూసి అమ్మ ఫక్కున నవ్వింది. నిజానికి అమ్మ, గోపికల ఇళ్ళలో వెన్నా పాలూ దొంగిలించినందుకు యశోద రోటికి కట్టేసిన బాలకృష్ణుణ్ణి వేణులో చూసి ఆనందిస్తోంది. రెండు క్షణాల తరవాత అతని కట్లు విప్పేసి, ప్రేమతో తనే అతనికి ఊరగాయ వడ్డించింది. "నాయనా, నాలిక రుచిని అదుపులో ఉంచుకొన్నప్పుడే హృదయంలో రుచిని ఆస్వాదించగలుగుతాం," అని చెప్పింది అమ్మ.

అమ్మకు, తన ఆధ్యాత్మిక సంతతిలో ఉన్న ప్రతికూల ధోరణులను హరింపజేసే సొంత విధానాలు ఉన్నాయి. ఒక్కొక్కప్పుడు ఇలా అంటూంటుంది, "నేను ఏమీ తెలియని ఒక పిచ్చిపిల్లను." ఆమె, తాను అవివేకురాలూ అమాయకురాలూ అయిన ఒక పల్లెటూరి పిల్లలా నటిస్తూ ఉంటుంది కాని, ఆమె కళ్ళు, ప్రతి విషయంలోనూ సత్యంకోసం గుచ్చిగుచ్చి చూస్తాయి. తప్పు కనిపెట్టిందంటే చాలు, ఆమెలో మహాగురువు ఉదయించడం, తన మాతృత్వాన్ని తాత్కాలికంగా మరుగుపరుచుకొంటూనే, విద్యార్థికి తగినట్లుగా ఉపదేశించడం చూస్తాం.

## శ్రీకుమార్
## (స్వామి పూర్ణామృతానంద పురి)

అమ్మ ఆశ్రమంలో ఉండే శ్రీకుమార్, ఆమె దగ్గరికి రాకపూర్వం ఒక ఎలక్ట్రానిక్ ఇంజనీరు. అతను 1979లో బి. ఏ. చదువుతున్న రోజుల్లో, దైవభావాలు చూపిస్తూ భక్తులను వారి ప్రత్యేక సమస్యలనుబట్టి దీవిస్తూ ఉండే ఒక స్త్రీని గురించి విన్నాడు. అతను దేవుడిమీద నమ్మకం ఉన్నవాడే అయినా మానవ వ్యక్తిద్వారా దైవత్వం వ్యక్తమవుతుందన్న విషయాన్ని శంకించేవాడు. కొదిమంది సుఖంగా ఉంటూ, చాలామంది బాధలుపడుతూ ఉండే ఈ ప్రపంచస్వభావాన్ని గమనించిన అతనికి,

మంచితనమున్న దేవుడిమీద నమ్మకం క్రమంగా తగ్గిపోయింది. ఈ స్థితిలో అతను అమ్మను గురించి విన్నాడు. ఆమెకు దైవశక్తి ఉందో లేదో స్వయంగా ...వెళ్ళాలని నిశ్చయించుకొన్నాడు.

...సంశయ మనస్కతతో అతను, 1979 మార్చిలో ఆశ్రమానికి వచ్చాడు. అమ్మ ... వస్తూ గుడిగదిలోకి ప్రవేశించాడు. ప్రేమతో, కరుణతో ప్రసరించిన ఆమె ... శ్రీకుమార్ గుండెలోకి చొరబడింది. కేవలం ఆమె సన్నిధే అతన్ని- దేవుడూ ... పావన నామమూ తానూ మాత్రమే ఉన్న- మరో లోకానికి తీసుకుపోయింది. ...ల పరిసరాలన్నీ అతని స్పృహలోంచి తొలగిపోయాయి. ఈ అనుభవం ... అమ్మకు బద్ధుణ్ణి చేసింది. కేవలం ఆమెను గురించిన తలపుతోనే నిండి ...ంది అతని మనస్సు.

అమ్మను రెండోసారి కలుసుకోడాన్ని గురించి శ్రీకుమార్ ఇలా అంటాడు, ...కొందరు ఆమెను 'అమ్మాయి' (కుంజు) అని పిలవడం, కొందరు 'అమ్మ' అని పిలవడం విన్నాను. భావదర్శనం తరవాత ఆమె భక్తులతో మాట్లాడింది. ఉన్నట్లుండి ఆమె అమాయకురాలయిన చిన్నపిల్ల మాదిరిగా ప్రవర్తించేది. భక్తులతో ఆటలాడేది. ఆమె అమాయకపు ఆటలు చూసి, తక్కినదంతా మరిచిపోయేవారు. వాళ్ళ హృదయాలు ఉల్లాసం పొందుతూ ఉండేవి. ఒక్కొక్కప్పుడు ఆమె పాటలు పాడేది; ఆటలు ఆడేది. మరుక్షణంలోనే ఏదో పాట వింటూ కన్నీళ్లు కార్చేది; ప్రపంచ స్పృహ కోల్పోయి నిశ్చలంగా కూర్చునేది. కొందరు ఆమెకు మోకరిల్లేవాళ్ళు; కొందరు ఆమె చేతిని ముద్దు పెట్టుకొనేవాళ్లు; ఇంకొందరు భక్తిగీతాలు పాడేవాళ్ళు. అప్పుడామె, పిచ్చెత్తినదానిలా నేలమీద పొర్లేది; నవ్వేది."

మొదట్లో, జగజ్జనని కాళికా అమ్మవారు, శ్రీకృష్ణుడు తాత్కాలికంగా అమ్మను ఆవహిస్తున్నారని అనిపించింది శ్రీకుమార్‌కు. కాని క్రమక్రమంగా, ఆమెతో సన్నిహిత సాహచర్యంవల్ల, వాస్తవంగా ఆమె, పరమాత్మతో తనకున్న ఆంతరిక ఏకత్వాన్ని ప్రత్యక్షీకరిస్తోందని తెలుసుకొన్నాడు.

అమ్మతో శ్రీకుమార్ సంబంధం రోజు రోజుకూ బలపడుతూ వచ్చింది. ఆమెకు దూరంగా ఉండటం అతనికి చాలా కష్టమయిపోయింది. సమయం చిక్కినప్పుడల్లా అతను, దాన్ని అమ్మదగ్గరే గడిపేవాడు. ఒక్కొక్కప్పుడు అమ్మ తన చేత్తో అతనికి అన్నం తినిపించేది; అలాగే ఆధ్యాత్మిక ఉపదేశాలు కూడా చేస్తూండేది. ఒకనాడు ఆమె అతన్ని ఇలా అడిగింది, "జపం చెయ్యడానికి అమ్మ నీకేమయినా మంత్రం ఇచ్చిందా?" అతను సమాధానమిచ్చాడు, "ఔను, నా చదువులో అభివృద్ధికోసం, ఒక చిన్న కాయితమ్ముక్క మీద రాసింది ఇచ్చింది." అప్పుడు అంది, "నాయనా,

దేవీభావ సమయంలో అమ్మ నీకు ఉపదేశం చేస్తుంది," ఆ రోజు రాత్రి అమ్మ శ్రీకుమార్‌కు మంత్రోపదేశం చేసింది. ఆ తరవాత అతను, అమ్మ మార్గదర్శకత్వంలో తాను జీవితాన్ని ఆధ్యాత్మికతకు అంకితం చెయ్యాలనుకొన్నాడు.

శ్రీకుమార్ తల్లిదండ్రులు అమ్మ భక్తులే అయినప్పటికీ అతను సన్యాసం తీసుకోడానికి మాత్రం వాళ్ళు ఒప్పుకోలేదు. వాళ్ళ అభ్యంతరానికి ప్రధానమయిన కారణం, అతని తండ్రి ఉద్యోగవిరమణ చేసినవాడు కావడం, చెల్లెలికింకా పెళ్ళి కాకపోవడం. అందువల్ల అతనికి, సుమారు 600 కిలోమీటర్ల దూరంలో ఉన్న బెంగుళూరులో ఒక ఉద్యోగం చూసిపెట్టారు. దుఃఖంతో గుండెలు అవిసిపోయి, ఆమె సాన్నిధ్యంకోసం అతను తపన చెందినప్పుడు అతనికి అమ్మ దర్శనం కలుగుతూ ఉండేది. అతన్ని ఓదార్చడానికి అమ్మ, అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూండేది. ఈ కాలంలో అతను ఈ కింది పాట రాశాడు:

నువ్వు దాపునున్నా కూడా, ఓ అమ్మా!
తిరుగాడుతున్నాను నిన్ను తెలుసుకోలేక.
కళ్ళున్నవి నాకున్నా కూడా వెతుకుతున్నాను నిన్ను కానలేక.
హేమంత నీల నిశీథినిలో ఉదయించే
అందాల జాబిల్లివా నువ్వు?

ఓ అమ్మా, ఆకాశాన్ని అందుకోలేక
తీరాన తలబాదుకొనే తరంగాన్ని నేను.
ఇహలోక సుఖాలన్నీ వ్యర్థమైనవేనని
పరమార్థం నేను తెలుసుకొన్నప్పుడు
రేయీ పగలూ కన్నీరు ఓడుస్తూ
నిన్నే తెలుసుకోవాలని కోరుకున్నాను - అమ్మా!
నిన్నే తెలుసుకోవాలని కోరుకున్నాను - అమ్మా!

దుఃఖభారంతో అలసిపోయిన నన్ను
ఆశ్వాసించడానికి రావా నువ్వు ?
తప్పకుండా నువ్వు వస్తావన్న కోరికతో
నిత్యమూ కాచుకొని ఉన్నాను - అమ్మా!
నిత్యమూ కాచుకొని ఉన్నాను -అమ్మా!

అమ్మను చూడాలనీ ఆమె సన్నిధిలో ఉండాలనీ కలిగిన గాఢమయిన కోరికవల్ల

కుమార్, బెంగుళూరులో ఒక నెల గడవకముందే ఇంటికి తిరిగి వచ్చాడు. ఇంటికి గానే జ్వరం వచ్చి అతను ఆస్పత్రిలో చేరవలసి వచ్చింది. అమ్మను చూడాలన రిక అతనిలో నానాటికీ పెరుగుతూ వచ్చింది. చివరికి ఒకనాడు, తెల్లారగట్ల 4 ంటలవేళ అతనికొక అద్భుతమయిన అనుభవం కలిగింది.

"నాకు కాఫీ తేవడానికని మా నాన్నగారు బయటికి వెళ్ళారు. గదిలో నేను ఒక్కణ్ణే ఉన్నాను. అకస్మాత్తుగా నా చేతులూ కాళ్ళూ పడిపోయినట్లు అయిపోయింది. ఒక చల్లని పిల్లగాలి నన్ను లాలించింది. అమ్మ నా గదిలోకి రావడం చూసి ఆశ్చర్యపోయాను. ముఖంమీద ప్రసన్నమయిన చిరునవ్వుతో, ఆమె నావైపు నడిచింది. నేను పసిపిల్లవాడి మాదిరిగా ఏడ్చాను. ఆ తరవాత ఆమె నా దగ్గర కూర్చుంది. నా తల తన ఒళ్ళో పెట్టుకొంది. ఆమె ఏమీ మాట్లాడలేదు. భావావేశంతో నేను ఉక్కిరిబిక్కిరి అయాను. గొంతుకలోంచి మాటలు పెకల్లేదు. ఒకానొక తేజస్సు అమ్మ శరీరంనుంచి వెలువడి గది అంతటా ఆవరించింది. ఆమెను కూడా దివ్యకాంతి ఆవరించుకొని ఉంది. ఆ క్షణంలో తలుపు తెరుచుకొంది; నాన్నగారు లోపలికి వచ్చారు. చటుక్కున అమ్మ అదృశ్యమయింది."

ఆ తరవాత కొన్నాళ్ళకు అమ్మ శ్రీకుమార్ ఇంటికి వచ్చింది. అది పొద్దుటి పూట. ఆమె ఇంటి ముందు కూర్చుని కొందరు పిల్లలతో ఆడుతోంది. హఠాత్తుగా ఆమె లేచి నిలబడింది. చేతులతో ఒక ముద్ర ధరించి ఆమె, తూర్పువైపు పొలాలగుండా నడిచి వెళ్ళింది. కొంత దూరం నడిచిన తరవాత ఆమె ఒక అడవిలోకి ప్రవేశించింది. అక్కడ ఒక కుటుంబం వాళ్ళు పాములకు పూజచేస్తారు. అరమోడ్పు కళ్ళతో, స్పృహ ఉండీ లేని స్థితిలో ఆమె, సమ్మోహకంగా ఒక చిరునవ్వు నవ్వి పాముల పూజకోసం కట్టిన ఒక చిన్న గుడిమీద కూర్చుంది. ఈ అసాధారణ దృశ్యాన్ని చూడటానికి చాలామంది అక్కడ గుమిగూడారు. అయితే, విషసర్పాలతో నిండి ఉన్న ఆ అడవిలోకి ఎవ్వరూ రారు. ఈ సంగతి విని, ఆ అడవి యజమానులు కూడా అక్కడికి వచ్చి చేతులు జోడించి అమ్మ ఎదుట నిలబడ్డారు.

"అమ్మా, మేము అంతరాయం లేకుండా పూజచేస్తూ వస్తున్నాం. ఇంకా మేమేమయినా చెయ్యాలా?" అని అడిగారు వాళ్ళు. "ప్రతి రోజూ ఇక్కడొక గ్లా సుడు మంచినీళ్ళు పెడుతూ ఉండండి. అది చాలు," అంది అమ్మ. అమ్మ ఇంటికి తిరిగి వచ్చిన తరవాత వాళ్ళు ఇలా అడిగారు, "అమ్మా, మీరక్కడికి వెళ్ళడానికి కారణం ఏమిటి?" దానికి ఆమె సమాధానం ఇలా చెప్పింది, "అక్కడ పాముల పూజ చాలాకాలం నుంచి జరుగుతూ వస్తోంది. అడవిలో ప్రతిష్ఠ అయి ఉన్న దేవతల

కోరిక నెరవేర్చడానికి అమ్మ అక్కడికి వెళ్ళింది. నేనిక్కడికి వచ్చిన క్షణం నుంచి వాళ్ళు నన్ను రమ్మని పిలుస్తున్నట్లు అనిపించింది."

ఆ తరవాత శ్రీకుమార్ తల్లిదండ్రులు, బొంబాయిలో అతనికొక ఉద్యోగం చూశారు. వాళ్ళు గట్టిగా పట్టుబట్టడంవల్ల, చివరికి శ్రీకుమార్ అక్కడికి వెళ్ళక తప్పింది కాదు. చాలా వైముఖ్యంతో అతను బొంబాయి వెళ్ళాడు. అమ్మనుంచి మళ్ళీ ఎడబాటు వచ్చింది. రైల్లో ప్రయాణం చేస్తూ ఉండగా అతనికి, అమ్మ అక్కడ ఉన్నట్లు గాఢంగా అనిపించింది. మగతలో ఉన్నప్పుడు అతనికి ఎడతెరిపి లేకుండా అమ్మ దర్శనాలు కలుగుతూ వచ్చాయి; ఆమె దివ్యసాన్నిధ్యపు ఆనందం కలిగింది. చివరికి, ఎనిమిది నెల్ల తరవాత, ఆమె నుంచి ఎడబాటు అతను ఏ మాత్రమూ ఓర్చుకోలేకపోయాడు. ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశాడు.

బొంబాయిలో ఉన్న రోజుల్లో అతను రాసిన కవితాఖండిక అతని హృదయ వేదనను వెల్లడిస్తుంది:

పడమటి కడలిలోకి కుంకాడు సూర్యుడు
వలపోతపోయింది పగలు.......
విశ్వవాస్తుశిల్పి క్రీడ మాత్రమే అది.
మరి, మీరెందుకు చిన్నబోతారు,
ముడుచుకొనే తామరపువ్వుల్లారా ?

బాధలతో దుఃఖంతో నిండి ఉన్న ఈ లోకం
జగన్నాథుడి నాటకం, మరి నేను, ప్రేక్షకుణ్ణి
ఆయన చేతుల్లో కేవలం ఒక కీలుబొమ్మని,

కార్చడానికి కన్నీళ్ళు కరువయినవాణ్ణి.
జ్వాలలా మండిపోతోంది, లోపల నా మనస్సు,
నీనుంచి ఎడబాటుతో ఈ శోకసాగరంలో.
అల్లాడిపోతున్నాను అటూ ఇటూ
ఒడ్డుకు చేరుకోడం చేతకానివాణ్ణయి.

అమ్మ దగ్గరికి రాకముందునుంచి లేదా ఆధ్యాత్మిక జీవనాన్ని గురించి శ్రద్ధ పట్టక ముందునుంచి కూడా శ్రీకుమార్‌కు అస్తిత్వపు సూక్ష్మతలంలో కొన్ని అనుభవాలు కలుగుతూండేవి. పడుకొని ఉన్నప్పుడు, తన సూక్ష్మ శరీరం స్థూలశరీరంలోనుంచి బయటికి వచ్చి చుట్టుపక్కల సంచారం చేస్తున్నట్టు

...అనిపించేది. అలాటి సమయాల్లో, కళ్ళు మూతబడి ఉన్నప్పటికీ కూడా, ...ప్రపంచాన్ని అతను స్పష్టంగా చూస్తూండేవాడు.

...బొంబాయిలో ఉన్న కాలంలో అతనికొక ఆహ్లాదకరమయిన అనుభవం ...ంది. అది పగటివేళ. ధ్యానం చేసుకొన్న తరవాత అతను కళ్ళు మూసుకొని ...తి తీసుకొంటున్నాడు. చటుక్కున అతని శరీరం కొయ్యబారిపోయింది. తన ...రూపం స్థూలరూపంనుంచి వేరుపడినట్లు అనిపించింది. వెంటనే అతనికొక ...ము వినిపించింది. ఆ తరవాత పెద్ద పెద్ద అలలుగా పొగ కమ్ముకు వచ్చింది. ...ంటా. వాటిమధ్య అతనికి అమ్మరూపం కనిపించింది. ఆమె దేవీభావ సమయంలో ...కొనే వన్నెల కోక కట్టుకొని ఉంది. బ్రహ్మాండ పరిమాణంలో ఉన్న అమ్మరూపం ...ని మనస్సులో భయసంభ్రమాన్నీ గౌరవాన్నీ కలిగించింది. ఈ మహోదాత్త ...శ్యాన్ని తిలకిస్తూ ఉండగా కొన్ని నిమిషాలు గడిచాయి; అతను మాత్రం కళ్ళు ...వలేకపోయాడు.

1980 జనవరి 28న సాయంత్రం శ్రీకుమార్, తన తల్లిదండ్రులను చూడ్డానికి ...ంటికి వెళ్ళబోతూండగా, అమ్మ అతన్ని ఆపి ఇలా చెప్పింది, "ఇక్కడే ఉండు; ఈ ...రోజున ఎక్కడికీ వెళ్ళకు." అతని మాటల్లో చెప్పాలంటే, "అమ్మ మాటలు విని నేనెంతో ...సంతోషించాను. బయటికి వెళ్ళడానికి వేసుకొన్న కార్యక్రమాలన్నీ రద్దుచేసుకొన్నాను. సాయంత్రం 6 గంటలవేళ నేను బయట నిలబడి కొందరితో మాట్లాడుతున్నాను. చటుక్కున, కాలిని ఏదో కరిచింది. బాధతో నేను కెవ్వున అరిచాను. నా కేక విని అమ్మ అక్కడికి పరుగెత్తుతూ వచ్చింది. వెంటనే గాయాన్ని చూసి, నెత్తురూ విషమూ తన నోట్లోకి పీల్చుకొని ఉమ్మింది. ఇంత చేసినా నొప్పి భరించడానికి శక్యం కాకుండా ఉంది. దుర్భరమయిన బాధవల్ల నేను నేలమీద పొర్లుతూ ఉండటం చూసి అమ్మ నన్ను ఓదార్చడానికి ప్రయత్నించింది. చివరికి, తక్కినవాళ్లు ఒత్తిడి చెయ్యడంవల్ల, నన్ను పాముకాట్లకు ప్రత్యేకంగా వైద్యంచేసే డాక్టరు దగ్గరికి తీసుకు వెళ్ళడానికి ఆమె అనుమతించింది. వైద్యుడన్నాడు, 'నిన్ను కరిచింది విషప్పామే. కాని చిత్రమేమిటంటే, విషం నీ ఒంటికి కాని రక్తానికి కాని హాని చేసినట్లు లేదు.' ప్రేమతో, ఆప్యాయంగా అమ్మ చేసిన సంరక్షణ వల్ల చివరికి, తెల్లవారగట్ల 3 గంటలకు నిద్రపోయాను; అదికూడా, అమ్మ తన గదిలోకి వెళ్ళిపోయిన తరవాత."

"మర్నాడు పొద్దున అమ్మ నాకు చెప్పింది, 'నాయనా, నువ్వు ఎక్కడ ఉన్నప్పటికీ పాముకాటు తప్పేది కాదు. అయితే అది అమ్మ దగ్గర జరిగింది కనక

దానివల్ల పెద్దగా ఏమీ జరగలేదు. అందుకే నిన్న నువ్వు ఇక్కణ్ణించి వెళ్ళకుండా అమ్మ అడ్డుకొంది. తరవాత ఇంటికి చేరుకొన్నాక నా జాతకం చూసుకొన్నాను. ప్రాణానికి ముప్పు తెచ్చేదేదో జరుగుతుందన్నట్టుగా అందులో రాసి ఉంది. '22వ ఏట విషంవల్ల ప్రమాదం వచ్చే అవకాశం ఉంది. కాబట్టి మంచి ఆరోగ్యంకోసం గుళ్ళో ప్రత్యేక పూజ చేయించడం, కానుకలు సమర్పించడం జరగాలి' అని ఉంది."

అమ్మ దయవల్ల శ్రీకుమార్‌కు చాలా ఆధ్యాత్మిక అనుభవాలు కలిగాయి. ఇవి ఎప్పుడూ, అతను తన సాధనను ఇంకా ఇంకా ఉత్సాహంతో కొనసాగించడానికి ఉపకరిస్తూ వచ్చాయి. అతను తన తల్లిదండ్రులకూ చెల్లెలికీ కావలసిన ఏర్పాట్లు చేసి ఆశ్రమంలో శాశ్వతంగా ఉండిపోవడానికి వచ్చాడు.

## రామకృష్ణన్
## (స్వామి రామకృష్ణానంద పురి)

రామకృష్ణన్, కేరళలోని పాలాటు వారయిన బ్రాహ్మణ దంపతుల కుమారుడు. 1978లో, అతను స్టేట్ బ్యాంక్ ఆఫ్ తిరువాన్కూర్‌లో ఉద్యోగిగా ఉండగా, తన స్నేహితుడిద్వారా అమ్మను గురించి విన్నాడు. ఒకనాడు సాయంత్రం ఆ స్నేహితుడితో కలిసి, అమ్మను చూడ్డానికి వచ్చాడు. రామకృష్ణన్ సనాతనాచార పరాయణుల కుటుంబంలో పుట్టినప్పటికీ కాలేజి చదువుల ప్రభావం వల్లా చెడు సావాసం ప్రభావం వల్లా ఇబ్బందిలో పడ బోతున్నాడు. అమ్మను చూసిన మొట్టమొదటి రోజునే అతను కళ్ళు నీళ్ళు పెట్టు కొన్నాడు. శుద్ధికారకాలయిన కన్నీళ్ళలో అంతా కొట్టుకుపోయే వరకు; అతనిలో ఉన్న మొరటు తనమంతా కరిగిపోయింది. అతను మృదుస్వభావిగా మారాడు. దీని తరవాత అతను, అమ్మను దైవభావంలో చూడ్డానికి, దాదాపు అన్ని దర్శనాలకూ వచ్చేవాడు. తన ఇష్టదైవమయిన మధుర మీనాక్షి దర్శనం కలిగించమని అతను పసిపిల్లవాడి మాదిరిగా ఏడుస్తూ ఆమెను ప్రార్థించేవాడు. దర్శనం కలగనందుకు గాఢమయిన దుఃఖంతో అతను కొన్ని కొన్ని రోజుల్లో ఉపవాసాలుండేవాడు కూడా. అటువంటి సందర్భాల్లో, అతని ఉపవాసాన్ని గురించి ప్రస్తావించకుండానే, అమ్మ అతని చేత పాయసం తినిపించేది. దేవీభావ సమయంలో అమ్మ ఒళ్ళో ఉండి గాఢమయిన లాలసతో కన్నీళ్ళు విడుస్తూ ఆమెను అతను అడిగేవాడు, "అమ్మా, రేపు నాకు దర్శనమిస్తావా? నీ కాలి అందెల గలగలయినా నాకు వినిపించు," అని. చిత్తశుద్ధితో చేసే విన్నపాలవల్ల అతను తన ఇష్టదేవత దర్శనాలు అటువంటివి చాలా పొందాడు. కొన్నిరోజులు అతను, అమ్మ కాలిపట్టీల గలగలలు వినేవాడు;

...క్కప్పుడు జగన్మాత దర్శనం కలిగేది; లేదా మరొకప్పుడు తన చుట్టూ ఉన్న ...వరణంలో వ్యాపించిన దివ్యపరిమళాన్ని ఆఘ్రాణించేవాడు.

రామకృష్ణన్, లౌకిక జీవనాన్ని విడిచిపెట్టి త్యాగజీవనాన్నీ ఆధ్యాత్మిక జీవనాన్నీ ...డానికి స్ఫూర్తినిచ్చిన చెప్పుకోదగ్గ సంఘటనలు రెండు ఉన్నాయి. మొదటిది, ...ను అమ్మదగ్గర దీక్ష తీసుకొన్న రోజు. ఆ శుభసందర్భంలో అనిర్వచనీయమయిన ...ఒకటి ఆమె నుంచి అతనికి ప్రసరించి, జీవితానికి అర్థం విషయంలోను, జీవిత ...త్వం విషయంలోను అతనికున్న భావనను పూర్తిగా మార్చేసింది. రెండో సంఘటన ...లా ఉంది:

ఒకనాడు అమ్మ, రామకృష్ణన్‌కు శ్రీరామకృష్ణ పరమహంస ఫోటో ఒకటి చూపిస్తూ ...లా అంది, "మీ ఇద్దరికీ ఉన్నది ఒకే పేరు; అయినా నువ్విలా అయావు". అమ్మ ...లికిన ఈ మాటలు రామకృష్ణన్ గుండె లోతుల్లోకి పిడుగుల్లా దూసుకుపోయాయి; ...జమయిన ఆధ్యాత్మికాభిలాషిని కావాలన్న అతని కోరిక బలపడేటట్లు చేశాయి.

ఒక వేసవికాలపు సాయంత్రాన రామకృష్ణన్, దేవీభావంలో అమ్మను దర్శిద్దామని ...చ్చాడు. అమ్మ కూర్చున్న గుళ్ళో చాలా ఉబ్బరంగా ఉంది అమ్మ అతన్ని ...విసనగర్రతో విసరమంది. అయితే, గుడిబయట కొందరు ఆడవాళ్ళు నిలుచుని ...ఉండటంవల్ల అతను కొంచం జంకాడు. 'స్టేట్ బ్యాంకులో ఉద్యోగిగా ఉన్న తనలాటి ...దువుకున్నవాడు ఒక స్త్రీకి విసురుతూ ఉంటే వాళ్ళు నన్ను చూసి [ఎగతాళిగా] నవ్వవచ్చు,' అని అనుకొన్నాడు. ఇలా అనుకొని విసరడం మానేశాడు. కాని, దర్శనం అయిన తరవాత గుళ్ళోంచి బయటికి వస్తున్నప్పుడు అతని తల, గుమ్మం గొడుగుబల్లకు ఫెడీమని తగిలింది. అది చూసి, అక్కడ నిలుచుని ఉన్న యువతులందరూ ఫక్కున నవ్వారు. రామకృష్ణన్ తెలావెలా పోయాడు; సిగ్గుపడిపోయాడు.

మర్నాడు రామకృష్ణన్, దర్శనానికి వెళ్ళినప్పుడు అమ్మ అతన్ని పిలిచి ఇలా చెప్పింది, "నిన్న నేను అడిగినా కూడా నువ్వు నాకు విసరలేదు. అందువల్ల, నువ్వు భయపడ్డ యువతులముందే నువ్వు నవ్వుల పాలు అయేటట్టు చెయ్యడం నీకు మేలు అనుకొన్నాను!" మరుసటి దర్శనం మొదలుకొని రామకృష్ణన్, అమ్మ అడక్కపోయినా వరసగా విసురుతూ ఉండటం ప్రారంభించాడు.

ఒకసారి రామకృష్ణన్‌ను ఆశ్రమానికి 100 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఒక బ్రాంచికి బదిలీచేశారు. ఇనప్పెట్టి తాళాలు తనదగ్గర పెట్టుకొని ప్రతిరోజూ పొద్దున 10 గంటలకు వేళ తప్పకుండా బ్యాంకుకు రావడం అతని విధి. ఆదివారం రాత్రి దర్శనం ముగిసిన తరవాత మర్నాడు పొద్దున ఆశ్రమంనుంచి బయలుదేరి బస్సు ఎక్కాడు

రామకృష్ణన్. తన ఆఫీసుకు 13 కిలోమీటర్ల దూరంలో ఉన్న బస్ స్టాపుకు చేరాడు. అక్కడ వాకబు చేసిన మీదట తెలిసింది ఏమిటంటే, పొద్దున 10 గంటలలోగా తాను అడంగుకు చేరడానికి వెళ్ళే బస్సు ఉండదని. అప్పుడిక టాక్సీకోసం ప్రయత్నించాడు. కాని ఏదీ దొరకలేదు. ఆందోళనపడి, నిస్పృహచెంది "అమ్మా!" అని గట్టిగా అరిచాడు. కొద్ది నిమిషాల్లో ఒక వ్యక్తి మోటారు సైకిలుమీద వస్తూ అతనికి ఎదురుగా ఆగాడు. అతనెవరో ముక్కూ మొహం తెలియని వాడు. రామకృష్ణన్‌వైపు తిరిగి అతను ఇలా అన్నాడు, "నేను పంపకుడా (రామకృష్ణన్ పనిచేస్తున్న గ్రామమే) వెళ్తున్నాను. పది గంటల తరవాత కాని బస్సులు లేవు. మీకు ఇష్టమయితే మిమ్మల్ని అక్కడ దింపుతాను." రామకృష్ణన్ ఒప్పుకొని, వెనక సీటుమీద కూర్చుని ఆ ఊరు చేరి సరిగ్గా 10 గంటలు కొట్టేసరికి బ్యాంకులో అడుగుపెట్టాడు!

రామకృష్ణన్ అడిగిన మీదట అమ్మ అతనికి చెప్పింది, "ఏకాగ్రతతో పిలిచినట్లయితే ఒక్క పిలుపు చాలు. భగవంతుడు అక్కడికి చేరతాడు." 1981 లో రామకృష్ణన్‌కు, ఆధ్యాత్మిక గురువుకు చూపించవలసిన విధేయత విషయంలో గుణపాఠం నేర్పిన అనుభవం ఒకటి కలిగింది. ఆశ్రమంలో రామకృష్ణన్ మరీ ఎక్కువకాలం ఉన్నట్లయితే సన్యాసి అయిపోతాడేమోనని అతని తల్లిదండ్రులు భయపడి, అతను వాళ్ళ దగ్గర ఉండటంకోసం, వాళ్ళ ఊళ్ళో ఉన్న బ్యాంకు బ్రాంచికి బదిలీ చేయించడానికి ప్రయత్నించారు. వాళ్ళు అదే పనిగా ఒత్తిడిచేస్తూ ఉండటంవల్ల అతను, అమ్మ సలహా కాని అనుమతి కాని తీసుకోకుండా, బదిలీకి దరఖాస్తు పెట్టాడు. కొన్నాళ్ళ తరవాత అతను మనస్సు మార్చుకున్నాడు. వెనక తాను పెట్టిన దరఖాస్తుమీద చర్య ఏమీ తీసుకోవద్దని కోరుతూ బ్యాంకు అధికార వర్గానికి అతనొక ఉత్తరం రాశాడు.

ఒకనాడు అమ్మ అతనికి ఇలా చెప్పింది, "బ్యాంకుకు పంపిన రెండో ఉత్తరం సంగతి కనుక్కోడం మంచిది. అది అక్కడికి చేరనట్టుంది." రామకృష్ణన్ చెప్పిన సమాధానం, "అవసరం లేదమ్మా, వాళ్ళకది అందీ ఉంటుంది, ఆమోదించీ ఉంటారు," అని. రెండో ఉత్తరాన్ని గురించి వాకబు చెయ్యమని అమ్మ చాలాసార్లు చెప్పింది. కాని, రామకృష్ణన్ ఆమె మాటలను పట్టించుకోలేదు.

త్వరలోనే, తిరువనంతపురంలో ఉన్న [బ్యాంకు] అధికారవర్గంనుంచి, రామకృష్ణన్‌కు బదిలీ ఉత్తర్వులు వచ్చాయి. బ్యాంకు ప్రధాన కార్యాలయం అక్కడ ఉంది. అతను అక్కడికి ఉరికాడు. సంబంధిత అధికారులను కలుసుకొన్నాడు. కాని అప్పటికే చాలా ఆలస్యమయింది. అమ్మ చెప్పినట్టుగా, మొదటి దరఖాస్తుమీద చర్య తీసుకోవద్దని కోరుతూ రాసిన ఉత్తరమేదీ వాళ్ళకు ముట్టలేదు. ఎలాగో పోయింది.

ముఖ్యం లేనట్టుగా కనిపించే తన గురువు చెప్పిన మాటలను ఉపేక్షించగూడదనే
మయిన గుణపాఠం నేర్చుకొన్నాడు రామకృష్ణన్.

ఒక నాడు మాటల సందర్భంలో అమ్మ, రామకృష్ణన్ వైపు తిరిగి, ముఖంలో
చిరుమందహాసంతో ఇలా అంది, "త్యాగ జీవనానికి పూనుకొన్న తరవాత కూడా ఆడ
వాళ్ల వైపు చూసేవాళ్ళు కొందరు ఉన్నారు." రామకృష్ణన్, "అమ్మా, ఎవరతను?" అని
అడిగాడు. "నువ్వు!"అని సమాధానమిచ్చింది అమ్మ. రామకృష్ణన్ దిమ్మెరబోయాడు.
"నేనా? నేనెప్పుడూ ఆడవాళ్ళవైపు చూడను. నా తప్పు ఏదీ లేకుండానే అమ్మ నన్ను
అంటోంది," అని వాదించాడు.

మరుక్షణంలో అమ్మ, రామకృష్ణన్‌కు బాగా తెలిసిన ఒకామె పేరు చెప్పింది.
ఆమె భర్త పేరూ, పిల్లల పేర్లూ ఇంట్లో తక్కినవాళ్ళ పేర్లూ ఏకరవు పెట్టింది. రామకృష్ణన్
నోరు వెళ్ళబెట్టి కొయ్యబారిపోయాడు. అమ్మకు బొత్తిగా తెలియని ఒక స్త్రీ తాలూకు
ఖచ్చితమయిన వర్ణన, ఠికాణా, తదితర వివరాలూ విని అతను మూగబోయాడు. "ఓయ్,
రామకృష్ణన్, నిజం చెప్పు. రోజూ ఆమెవైపు చూడవూ?" అని మళ్ళీ అడిగింది.

రామకృష్ణన్ గమ్మున ఉన్నాడు. అతను ఆమె వైపు రోజూ చూస్తాడన్నది నిజమే.
కాని ఎందుకో తెలుసా? ఆ స్త్రీ బయటి ఆకారం ముమ్మూర్తులా అమ్మను పోలి ఉంటుంది.
ఆమెను చూస్తూ తాను అమ్మనే చూస్తున్నట్లుగా అనుభూతి పొందేవాడు. అతను ఏ
మీ పలక్కుండా, తల వాల్చుకొని ఉండటం చూసి, అమ్మ పగలబడి నవ్వింది. ఆ
తరవాతనుంచీ రామకృష్ణన్, మళ్ళీ ఎన్నడూ ఆమెవైపు చూడలేదన్నది చెప్పనక్కరలేదు.

అమ్మ తన ఆధ్యాత్మిక సంతతి తాలూకు బాహ్యాంతరిక చర్యలను ఎంత నిశి
తంగా గమనించి, వాటినిబట్టి వాళ్ళకు ఎలా ఉపదేశిస్తుందో పై సంఘటన స్పష్టంగా
తెలియజేస్తుంది.

ఆశ్రమాన్ని ధార్మిక సంస్థగా, అధికారికంగా రిజిస్టర్ చెయ్యకముందు,
కొద్దిమందిని మాత్రమే ఆశ్రమంలో ఉండటానికి అనుమతించేవారు. ఆ కాలంలో
డబ్బు లేకపోవడంవల్ల చాలామంది అవసరాలు తీర్చడం అసాధ్యంగా ఉండేది. ఉన్న
ఉద్యోగాలు మానేసినందువల్ల కొందరు బ్రహ్మచారులు, అన్నవస్త్ర సదుపాయాలను
రామకృష్ణన్ దగ్గర ఆశించేవారు. అతనింకా అప్పటికి ఉద్యోగంలో ఉన్నందువల్ల,
అడక్కపోయినా వాళ్ళ అవసరాలు తీరుస్తూండేవాడు.

ఆశ్రమం ఆరంభ దినాల్లో రామకృష్ణన్, అమ్మను రెండు భిన్న వ్యక్తులుగా
భావించేవాడు - మామూలుగా ఉండే అమ్మగాను, భావదర్శన సమయంలో దేవతగాను.
ఈ భావం అతని మనస్సులో ఎంతో గందరగోళం సృష్టించింది. ఈ రకంగా

తలచినప్పుడు అతనికి తరచుగా దుఃఖం కలిగేది. చివరికి అతను, తనను దీవించమనీ తన తప్పుడు తలపు తీరును సవరించమనీ అమ్మకు విన్నవించుకొన్నాడు. ఒకనాడు అతనికి అమ్మ, ఆమె మామూలు భావంలో తెల్లటి వస్త్రాల్లో దర్శనం ఇచ్చింది. ఇది జరిగింది, అమ్మ తెల్లటి వస్త్రాలు ధరించడం ప్రారంభించడానికి పూర్వమే. ఈ దర్శనం కలిగిన తరవాత రామకృష్ణన్, ఆమె భావం ఏదయినప్పటికీ ఆమె ప్రధానంగా అదే వ్యక్తి అని నమ్మాడు.

రామకృష్ణన్‌కు అమ్మమీద విశ్వాసం గాఢం అయింది. అతని మనస్సు క్రమక్రమంగా ఆమె దివ్యరూపంమీదా నామంమీదా స్థిరంగా నిలిచింది. ఈ స్థితి, అతని కార్యస్థానంలో, ఇబ్బందిపెట్టే అనేక పరిస్థితులను కల్పించింది. ఒక్కొక్కప్పుడు డబ్బు లెక్కపెట్టడంలో కాని బ్యాంకు అకౌంట్లలో కాని తప్పులు చేస్తూండేవాడు. 1982 లో అతను వచ్చి ఆశ్రమంలో స్థిరపడ్డాడు. ఎలాగో ఆఫీసు పనికూడా కొనసాగిస్తూ వచ్చాడు. 1984లో ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఆశ్రమంలో శాశ్వతంగా నివసించడానికి వచ్చేశాడు.

## రమేశ్‌రావు
## (స్వామి అమృతాత్మా నంద పురి)

రమేశ్‌రావు కేరళలోని హరిప్పాడ్‌లో ఒక సంపన్న బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాడు. అతను ప్రాపంచిక సుఖలాలసుడయి తప్పుదారి పట్టి ఆధునిక యువకుడిలా పెరిగాడు. అయితే లౌకిక జీవనంలో మునిగినప్పటికీ అతను, దగ్గరిలో ఉన్న అమ్మవారి గుడికి వెళ్ళి ప్రార్థిస్తూ తన విశృంఖల విహారాలకు పశ్చాత్తాపపడుతూ ఉండేవాడు. మంచిదికాని, చెడుదికాని, ఏ పనికి పూనుకొన్నప్పటికీ అతను గుడికి వెళ్ళి అమ్మవారి దీవనలు కోరుతూ ప్రారనలు చేసేవాడు.

ఒకనాడు రమేశ్ స్నేహితుడు అతన్ని అమ్మ ఆశ్రమానికి రమ్మని ఆహ్వానించాడు. కాని అతను తిరస్కరించాడు. తరవాత, అతను ఉద్యోగంకోసం విదేశాలకు వెళ్ళే ప్రయత్నంలో ఉన్నప్పుడు, అమ్మకు దివ్యశక్తులున్నాయనీ ఎవరి భవిష్యత్తునయినా ముందుగా తెలుసుకొని ఆమె చెప్పగలదనీ విని ఉండటంవల్ల, తన భవిష్యత్తు ఏమిటో తెలుసుకోడానికని ఆశ్రమాన్ని సందర్శించడానికి నిశ్చయించుకొన్నాడు. ఆ విధంగా అతను, 1979 జూన్‌లో గుళ్ళోకి ప్రవేశించి, కృష్ణభావ సమయంలో అమ్మ దగ్గరికి చేరాడు. అతను ఏదీ చెప్పకముందే అమ్మ అతన్ని పలకరిస్తూ ఇలా అంది, "నాయనా, నువ్వు సముద్రం దాటి వెళ్ళడానికి ప్రయత్నం చేస్తున్నావు. నువ్వు కోరుకొంటే, నీ కది సాధ్యమయేటట్లు చేస్తుంది, అమ్మ. దిగులు పడకు."

మొదటిసారి కలుసుకొన్నప్పుడే రమేశ్‌కు అమ్మ దివ్యత్వంమీద నమ్మకం కుదిరింది. గాఢమయిన దివ్యప్రేమానుభూతి, ఆమెకు అతను కట్టుబడేటట్లు చేసింది. ఇంటికి తిరిగి వచ్చిన తరవాత అతను, మనస్సును బట్టల వ్యాపారంమీద నిలపడానికి ప్రయత్నించాడు. ఆ వ్యాపారం అతనికి తండ్రి దగ్గర నుంచి సంక్రమించింది. కాని అతని మనస్సు, అమ్మను గురించిన తలపులతో నిండిపోయింది. కొన్ని కొన్ని రోజుల్లో అతనికి, అమ్మను చూడాలన్న తహతహ గాఢం అయేది. అప్పుడు కొట్టు మూసివేసి ఆశ్రమానికి ఉరికేవాడు. ఒకనాడు అతను ఇంటికి తిరిగి వెళ్ళడానికి అమ్మ దగ్గర సెలవు తీసుకొంటూ ఉండగా ఆమె ఇలా చెప్పింది, "నాయనా! వెళ్ళేది ఎక్కడికి? నువ్వు ఇక్కడ ఉండవలసిన వాడివి."

ఒకనాడు రాత్రి రమేశ్‌కు ఒక కల వచ్చింది. [అందులో] విశ్వప్రళయకాలం వచ్చేసింది. ప్రతి చోటా అగ్నిగోళాలు వర్షిస్తున్నాయి. కడలి కెరటాలు, భూమికి ముంపుముప్పు తెచ్చేటట్టుగా మింటికి ఎగసిపోతున్నాయి. రమేశ్ తన బలాన్నంతనూ కూడగట్టుకొని, "అమ్మా!" అని బిగ్గరగా అరిచాడు. వెంటనే ఒక తేజఃప్రభ సంక్షుబ్ధ సాగరంలోంచి పైకి లేచి అంతటా అలుముకోడం మొదలుపెట్టింది. ఆ తేజఃపుంజంలోంచి దుర్గాదేవి మోహనాకారం వెలువడింది. ఆమె ఎర్రటి పట్టుచీర కట్టుకొని ఉంది. భీకరాకారమయిన సింహాన్ని అధిష్ఠించి ఉంది. "నేను నీ తోనే ఉన్నాక భయపడతావేం? నువ్వు నా బిడ్డవు. దిగులు పడకు," అంటూ బుజ్జగించింది. దీని తరవాత రమేశ్‌కు కలల్లో అమ్మ దర్శనాలు చాలా కలిగాయి.

అమ్మతో సన్నిహిత సాహచర్యంవల్ల రమేశ్‌కు, దైవసాక్షాత్కారం పొందాలనీ అమ్మ సాన్నిధ్యంలో [ఎప్పటికీ] ఉండిపోవాలనీ అంతఃప్రేరణ కలిగింది. ఒకనాడు అతను అమ్మ సమక్షంలో కూర్చుని ఉండగా అతనికొక అనుభవం కలిగింది. అది అతని అభిలాషాజ్వాలలను ప్రజ్వలింపజేసింది. అప్పుడు సాయంత్రం 4 గంటలు అయింది. మామూలుగా రమేశ్, గుళ్ళో కూర్చుని ఉన్న అమ్మను చూడ్డానికి వచ్చాడు. గుళ్ళో అడుగు పెట్టాడు. అమ్మకు దండవత్ ప్రణామం చేసిన తరవాత ఆమెకు దగ్గరలో కూర్చున్నాడు. అలా కూర్చుని తేజోవంతమయిన ఆమె ముఖాన్ని పరికిస్తూ ఉండగా, హఠాత్తుగా గుళ్ళో వాతావరణమంతా మారిపోయింది. ద్వంద్వాత్మకమయిన ప్రపంచం అతని దృష్టిలోంచి అదృశ్యమయిపోయింది. అమ్మ మట్టుకే కనిపిస్తోంది. ఆమెను తన తల్లిగా సాక్షాత్కరింపజేసుకొన్నాడు; తానొక 2 ఏళ్ళ పిల్లవాడిగా అనుభూతి పొందాడు. దివ్యప్రేమతో సొక్కి, ప్రపంచాన్నే మరిచిపోయాడు రమేశ్. ప్రేమతో అమ్మ, అతని తలను తన ఒళ్ళో పెట్టుకొంది.

రావు ఆంతరికానందంలో మునిగిపోయాడని గ్రహించి అమ్మ, మెల్లగా మెల్లగా అతని తల ఎత్తి, కొందరు భక్తులచేత అతన్ని గుడి నేలమీద పడుకోబెట్టించింది. రాత్రి 9 గంటలకు అమ్మ మళ్ళీ గుళ్ళోకి వచ్చింది. అతనింకా అదే స్థితిలో ఉన్నట్లు గమనించింది. "నాయనా," అని అమ్మ పిలిచిన పిలుపు విన్న తరవాత అతను మామూలు స్పృహలోకి వచ్చాడు.

ఈ సంఘటన జరిగిన తరవాత రమేశ్ జీవితం పూర్తిగా మారిపోయింది. అమ్మను చూడాలన్న తహతహ ఎక్కువయింది. ప్రపంచ విషయాలను అతను ఏ మాత్రం పట్టించుకోలేదు. కొట్టుకు వెళ్ళడం మానేశాడు. అమ్మ దగ్గరికి రావడాలు తరచయాయి. రోజుల తరబడి, వారాల తరబడి అమ్మ సన్నిధిలోనే గడిపాడు. అతనిలో హఠాత్తుగా వచ్చిన ఈ మార్పు వాళ్ళ ఇంట్లో అలజడి సృష్టించింది. అతన్ని లౌకిక జీవనంలోకి లాక్కురావడానికి అన్ని ప్రయత్నాలూ చేశారు. పెళ్ళి చేసుకోమని ప్రోత్సహించారు. కాని వాళ్ళ ప్రయత్నాలేవీ పనిచేయలేదు. ఒకనాడు అమ్మ, రమేశ్‌తో చెప్పింది, "నాయనా మీ అమ్మా, నాన్నా నిన్ను చూడాలని తహతహ పడుతున్నారు. నువ్వు ఇంటికి వెళ్ళి, ఇక్కడ ఉండటానికి వాళ్ళ అనుమతి తీసుకొని రా!" అప్పుడు రమేశ్, "అమ్మా, నువ్వు నన్ను దిక్కులేనివాణ్ణి చేస్తున్నావా? వాళ్ళు నన్ను చిక్కుల్లో పెడతారు," అన్నాడు. "అలాటి కష్టాల్లోంచి బయటపడ్డవాడే ధీరుడు," అని సమాధానం చెప్పింది అమ్మ.

మరొక ఆశ్రమవాసిని తోడు ఇచ్చి అమ్మ, రావును ఇంటికి పంపింది. ఇంట్లోవాళ్లు జబర్దస్తీచేసి రమేశ్‌ను స్వాధీనంలో ఉంచుకొన్నారు. అమ్మ ఏదో దుష్టశక్తిని ప్రయోగించి అతన్ని ప్రభావితుణ్ణి చేసిందేమోనని వాళ్ళు అనుకొన్నారు. వాళ్ళు, తమ కొడుకు మళ్ళీ లౌకిక జీవనంలోకి తిరిగి వచ్చేలా చెయ్యడానికి కొన్ని ప్రత్యేక క్రతువులు చేశారు. అతను ఆశ్రమాన్ని విడిచిపెట్టి లౌకిక జీవనం గడిపేటట్టు చెయ్యడానికి, కొన్ని ప్రత్యేక మంత్రాలు జపిస్తూ తయారుచేసిన ఒకరకం ప్రత్యేకమయిన నేతిని తినమని తల్లిదండ్రులు అతన్ని బలవంతం చేశారు. నేతిని గురించి అమ్మ అభిప్రాయం తెలపమని అతను కబురు చేశాడు. "నాయనా, నువ్వు తిను. చెడు ఏమయినా ఉంటే ఉండనియ్యి. నీ ఆధ్యాత్మిక లక్షణాలవల్ల నువ్విక్కడికి వచ్చావు. అటువంటి వ్యక్తికి, ఆ నెయ్యి తిన్నప్పటికీ ఏమీ కాదు," అని అమ్మ సమాధానం.

ఆమె మాటలను మన్నించి అతను నెయ్యి తిన్నాడు. కాని ఏమీ కాలేదు. ఆధ్యాత్మిక జీవనం కోసం అతనికున్న తృష్ణ తరగలేదు. ఇంకిప్పుడు అతని కుటుంబంవాళ్ళు వ్యూహాలను మార్చారు. అవి మరింత కఠోరమయినవీ అమానుషమయినవీ. విదేశాల్లో ఉద్యోగం రాక నిరాశ చెందడంవల్ల తమ కొడుక్కి ఏదో ఒక మానసిక వైకల్యం కలిగిన కారణంగా, అతనిలో హఠాత్తుగా మార్పు వచ్చిందని వాళ్ళు ఊహించారు.

అతని కొత్తదారులను నిరసించిన అతని స్నేహితుల సహాయంతో వాళ్ళు అతన్ని ఒక మనోవ్యాధుల వైద్యుడి దగ్గరికి బలవంతంగా తీసుకు వెళ్ళారు.

రమేశ్ ఆ డాక్టరుకు ఇలా చెప్పాడు, "నేనేమీ పిచ్చి వాణ్ణి కాను. నా గురువు మాటలకు గట్టిగా కట్టుబడి ఉంటాను. ఈ లోకంకోసం పిచ్చిపట్టినవాళ్ళు మీరు. అంచేత, మీ పిచ్చిని తక్కినవాళ్ళ మీద కూడా రుద్దుదామని చూస్తారు." రావు చుట్టాలు కోరిన ప్రకారం ఆ డాక్టరు అతనికి పదిరోజులపాటు వైద్యం చేశాడు. వాళ్ళ ఉద్దేశం, అతనికి లౌకిక జీవనం పట్ల ఎలాగో ఒకలాగ అభిరుచి కలిగించాలని. అందువల్ల, మనోవ్యాధి వైద్యం అయిపోయిన వెంటనే అతన్ని భిలాయి పంపేద్దామని నిశ్చయించుకొన్నారు. అక్కడ వాళ్ళ చుట్టాలున్నారు. వాతావరణంలో మార్పు వస్తే అతను తన పాత పద్ధతిలో జీవించడానికి అది సహాయపడుతుందని అనుకొన్నారు. దీనికి తోడు, రమేశ్‌కు తగిన వధువు కోసం వేట ప్రారంభించారు. అతను మానసిక దుర్నీతిలో పడి అమ్మకు ఉత్తరం రాశాడు, "అమ్మా, ఇంతవరకు నేను, వాళ్ళ క్షుద్ర ప్రలోభాలకు లొంగలేదు. ఇప్పుడయినా అమ్మ నన్ను కాపాడకపోతే స్వర్గంలో ఆమెలో లీనమవుతాను. ఆత్మహత్య చేసుకొంటాను."

భిలాయిలో నెల్లాళ్ళు ఉన్న తరవాత అతన్ని ఇంటికి తీసుకు వచ్చారు. ఇప్పటికి అతని కుటుంబంవాళ్ళకు, అతను ఆధ్యాత్మిక పద్ధతిలో ఆలోచించడం, జీవించడం మానేశాడని నమ్మకం కుదిరింది. బట్టల వ్యాపారం కొనసాగించమని చెబుతూ వచ్చారు. ఒకనాడు, ఎవరికీ తెలియకుండా, అతను అమ్మను దర్శించాడు. "అమ్మా, నువ్వు నన్ను వదిలేసినట్లయితే నేను చచ్చిపోతాను," అని చెప్పాడు. అమ్మ సమాధానంకోసం ఎదురుచూడకుండానే అతను ఆశ్రమంలో మళ్ళీ ఉండిపోయాడు. అతనున్న 3
రోజుల్లో అమ్మ, అతన్ని చాలాసార్లు హెచ్చరించింది. అతని మార్గంలో మళ్ళీ మళ్ళీ అడ్డంకులు కలిగించాలని అతని చుట్టాలు ఉద్దేశించిన విషయం తెలిపింది. ఇంటికి వెళ్ళిపోయి, తాను ఆధ్యాత్మిక జీవనం మొదలుపెట్టడానికి వాళ్ళు ఒప్పుకొనేవరకు కాచుకుని ఉండమని అతనికి అమ్మ సలహా ఇచ్చింది. కాని రావు వినలేదు. "నేను ఇంటికి వెళ్తే నా ఆధ్యాత్మిక సాధనలను కొనసాగించుకోనియ్యరు," అన్నాడు.

ఈపాటికి, రావు తండ్రి అమ్మమీద పోలీసులకు అర్జీ పెట్టుకొన్నాడు. తన కొడుకును అమ్మ, బలవంతంగా తన అధీనంలో ఉంచుకొందని నొక్కి చెబుతూ అతన్ని తిరిగి రప్పించడానికి పోలీసువారి జోక్యం కావాలని కోరాడు. మూడో రోజున, రావు తండ్రీ మరికొందరు చుట్టాలూ, ఒక వ్యాన్‌నిండా పోలీసులతో, ఆశ్రమానికి వచ్చారు. "నా జీవన విధానాన్ని నేను ఎంచుకోడానికి కావలసిన పరిపక్వత నాకు ఉంది; నేను ఉండేచోటు నిర్ణయించుకునే స్వేచ్ఛ నాకు ఉంది." అని ధైర్యంగా పోలీసు అధికారికి

చెప్పాడు. అతని మాటలను వాళ్ళు చెవిని పెట్టలేదు. పోలీసుల సహాయంతో, అతని బంధువులు అతన్ని తిరువనంతపురంలో మానసిక వ్యాధుల ఆస్పత్రిలో చేర్పాలని నిశ్చయించుకొన్నారు. దారిలో, మధ్యాహ్న భోజనానికని వాళ్ళందరూ కొళ్ళంలో దిగారు. రావు అన్నం తిననని చెప్పి కారులో కూర్చుండిపోయాడు. చటుక్కున అతనికి లోపలినుంచి ఒక స్వరం వినిపించింది, "ఇప్పుడు నువ్వు తప్పించుకొంటే బతికిపోతావు; లేకపోతే నాశనమవుతావు."

మరుక్షణంలో ఒక ఆటో రిక్షా వచ్చి సరిగ్గా అతని ముందు ఆగింది. ఒక్క క్షణం తాత్సారం కాకుండా అతను అందులోకి ఉరికాడు. డ్రైవరుకు వెళ్ళవలసిన చోటు చెప్పి వడివడిగా పోనిమ్మన్నాడు. అతని జేబులో ఒక్క పైస లేదు. ఆ రోజుల్లో, ఆశ్రమవాసి ఒకడు కొళ్ళంలో ఉంటూ తత్త్వశాస్త్రంలో ఎం. ఏ. డిగ్రీ పరీక్షకు తయారవుతున్నాడు. రావు జరిగిందంతా అతనికి చెప్పాడు. అదే రోజు రాత్రి, కొందరు భక్తుల సహాయంతో రావు, కేరళ విడిచి పెట్టి బొంబాయిలో చిన్మయ మిషన్‌కు వెళ్ళాడు. అతను బొంబాయిలో ఉన్న సంగతి తెలిసి, అతని చుట్టాలు, మళ్ళీ అతన్ని ఇబ్బంది పెట్టడానికి ప్రయత్నించారు. ప్రాణాన్ని కాపాడుకోడానికి అతను హిమాలయాలకు వెళ్ళిపోయాడు. రైలు ఖర్చుకు కాని, తిండికి కాని అతని దగ్గర డబ్బు ఏమీ లేదు. అక్కడ ఉండే, గడ్డకట్టించే చలినుంచి కాపుదల కోసం ఉన్నిబట్టలు ఏవీ లేవు.

ఎలాగో హిమాలయాలకు చేరి ఇక్కడా అక్కడా తిరిగాడతను. అతని బట్టలు చిరిగి పేలికలయాయి. స్ఫురద్రూపి అయిన ఈ పడుచువాడు, భిక్షాటనచేస్తూ ఒక చెట్టుకిందో, గుహలోనో ధ్యానం చేసుకొంటూ ఒక పరివ్రాజకుడిలా తయారయాడు. రోజులూ, నెలలూ గడిచాయి. చివరికి ఒకనాడు, అతనికి, ఒక చిరునామాకు అమ్మ దగ్గరినుంచి ఒక ఉత్తరం వచ్చింది. ఆ చిరునామా అతనే ఇచ్చాడు. అమ్మ ఇలా రాసింది, 'నాయనా, తిరిగి వచ్చెయ్యి. ఇక ఏ చిక్కులూ లేవు.'

రావు అమ్మ ఆశ్రమానికి వచ్చాడు. అప్పుడతన్ని అమ్మ, అతని తల్లిదండ్రులను చూడడానికి పంపించింది. అప్పటికే అతని తల్లిదండ్రులు మంచి గుణపాఠం నేర్చుకొన్నారు. కొడుకు తిరిగి వచ్చినందుకు వాళ్ళు సంతోషించారు. అయినప్పటికీ అతన్ని ప్రలోభపెట్టడానికి ప్రయత్నించారు. తమ ప్రతికూల పద్ధతి పనికి రాలేదని తెలిసిన తరవాత, వాళ్ళు ప్రేమపూర్వకంగా అతన్ని మార్చడానికి ప్రయత్నం చేశారు. కాని వాళ్ళ ప్రయత్నాలన్నీ రావు వైరాగ్యాగ్నిలో భస్మమయాయి. 1982 ఆగష్టు 27 న రావు, ఆశ్రమంలో శాశ్వత నివాసిగా చేరిపోయాడు; నిశ్చింతగా తన ఆధ్యాత్మిక సాధనలు కొనసాగిస్తూ వచ్చాడు.

## నీలు
## (స్వామి పరమాత్మానంద పురి)

1949లో చికాగోలో పుట్టిన నీల్ రోస్నర్ యువావస్థలో ఉండగానే పూర్వ సంస్కారాలను అనుసరించి, విచక్షణ చేసి లౌకిక జీవితంలో లోటుపాతులు మంచి చెడ్డలూ తెలుసుకున్నాడు. సంపూర్ణ మైన వైరాగ్యంతో అతను భారతదేశం చేరాడు. 1968 నుండి 1979 వరకు అతను తిరువన్నామలైలో సాధన చేస్తూ గడిపాడు. 1979లో వల్లిక్కావు చేరాడు. రైల్లో ప్రయాణం చేస్తున్నంత సమయము అతను అస్వస్థతతో బాధపడుతూనే ఉన్నాడు. అతను అలసట, నీరసం, వెన్నులో నొప్పి, కడుపు నొప్పి, ఆకలి లేకపోవడం, మరియు కూర్చోలేక నిల్చోలేక పోవడము వంటి వ్యాధులతో బాధపడుతూండే వాడు.

ఆశ్రమం చేరి, అమ్మను ప్రప్రథమంగా దర్శనం చేసుకున్నప్పుడు నీలుకు పత్యేకమైన అనుభవమేదీ కలుగులేదు. మరుసటి రోజు కృష్ణభావ సమయంలో పాత గుడిలోనుంచి తనలోకి ఆధ్యాత్మిక శక్తి ఏదో తనలోకి ప్రవేసిస్తున్నట్లు అతడిని ఆనందంలో ముంచెత్తుతున్నట్ల అనుభవం కలిగింది. కారణం తెలియ కుండానే అతను రోధించసాగాడు. ఎంతో కాలంగా అతను అనుభవిస్తున్న అస్వస్థతనుండి ముక్తి కలిగిందని గ్రహించాడు. గుడిలోకి ప్రవేశించి అమ్మ కళ్ళల్లోకి చూసినప్పుడు వాటిలో శాంతి మరియు ఆంతరిక ఆనందం కనుపించాయి. ఆమెనుండి పొంగి పొర్లుకూ ప్రవహిస్తున్న ప్రశాంతత మరియు అమ్మ ప్రకటిస్తున్న సమదృష్టి, ఆమె వద్దనుండి దివ్యానుభవం చూసినప్పుడు ఆమె జీవన్ ముక్తురాలని అతనికి నమ్మకం కలిగింది. భావ దర్శనాల సమయంలో మాత్రమే అమ్మ తమ దివ్యత్వాన్ని ప్రకటిస్తూ ఇతర సమయాల్లో వాటిని మరుగు పరుస్తున్నారన్న సంగతి, ఆమె దివ్యానుగ్రహం వల్ల మొట్టమొదటినుండి కూడా నీలు గ్రహించ గలిగాడు. తను దివ్యమైన ఒక పరమానంద స్థితిలోకి చేరుకుంటున్నాడని నీలు తెలుసుకున్నాడు. శాస్వతమైన ఆనందానికి దారి చూపించమని అతను అమ్మను ప్రార్థించాడు, అమ్మ అందుకు తమ సమ్మతిని తెలిపారు.

ఒక సారి నీలు అమ్మను, తనుకు అమ్మపై గాఢమైన భక్తి కలిగేటట్లు అనుగ్రహించమని అడిగినప్పుడు, అమ్మ చిన్న పిల్లవలెనే అమాయకంగా నవ్వుతూ, "నేనేమి చెయ్యగలను? నేనొక పిచ్చిపిల్లను" అని జవాబిచ్చారు ఆ రోజు దేవీభావం ముగియపోయే ముందు గుమ్మం వద్ద నిల్చుని అమ్మనే తదేకంగా చూస్తూ ఉన్న నీలును పిలిపించింది. ఉన్నట్లుండి

అమ్మ ముఖం కాంతివంతంగా అవడం గమనించాడు నీలు. ఆ కాంతి పెద్దదవుతూ అక్కడ మరింకేమీ కనుపించనంతగా విస్తరించింది. అంతా మాయమయ్యింది. అక్కడ అమ్మ లేదు, ఆలయం లేదు, చుట్టుప్రక్కలూ లేవు, ప్రపంచం లేదు. అమ్మ ఉన్న జాగాలో ఒక దేదీప్యమైన కాంతి పుంజం మాత్రమే కనుపిస్తోంది. ఆ కాంతి ఆ వెలుగు అన్ని దిశలలో ప్రసరించింది. అంతటా వ్యాపించింది. అంతలో ఆ కాంతి చిన్నదవుతూ వచ్చి కేవలం ఒక కణంగా మారి చివరికి మాయ మయ్యింది. నీలు నిర్ఘాంతపోయాడు. అవాక్కయ్యాడు. తనలో అమ్మయొక్క ఉనికిని స్పష్టంగా అనుభూతి పొందాడు. అమ్మ చూపించిన ఆ కాంతి కిరణం కేవలం జ్ఞాపకం వచ్చి నప్పుడు సహితం అతని కళ్ళలో నీళ్ళు నిండే స్థితిలోకి చేరుకున్నాడు. ఆ అనుభూతి లభించిన తరువాత నాలుగు రోజులు అతను నిద్రపోలేదు. ఆ దివ్య అనుభూతిలో మునిగిపోయాడు. అంతే కాక అన్ని వేళలా ఒక దివ్య సుగంధంయొక్క అనుభూతి అతనికి కలిగింది. వళ్ళిక్కావులో ఉంటూ సాధన చేయడానికి అతను నిశ్చయించుకున్నాడు. అమ్మ దానికి ఒప్పుడున్నారు. అమ్మ అతనికి ఒక రుద్రాక్ష మాలను అనుగ్రహించారు. ఎన్నో సంవత్సరాలు వివిధ పరిస్థితులలో ఆ మాల వైవిధ్యమైన దివ్య పరిమళాలు వెదజల్లుతూండేది.

ఎటువంటి చికిత్స తీసుకోకుండానే, కేవలం అమ్మ దివ్య సంకల్పం వల్ల మాత్రమే నీలుకు చాలా నయమయ్యింది. అతను, కూర్చోగలిగాడు, నిల్చో గలిగాడు, నడవ గలిగాడు, తిన గలిగాడు. ఎల్లవేళలా అమ్మ ఉనికిని అతని అంతరంగంలో అనుభవిస్తూ పరమానందమూ ప్రశాంతత యొక్క నిరంతర ప్రవాహాన్ని చవిచూసేవాడు.

ఒక మారు అతనికి తీవ్రమైన దగ్గు వచ్చింది. అది భరించరానిదిగా తయారయింది. ఒక దేవీభావ సమయంలో అమ్మ నీలు గుండెలపైనా అతని తలపైనా చేతులు ఉంచారు. అతనికి తిరిగి ఆ దివ్య ప్రకాశంయొక్క అనుభూతి కలిగి, ఈ తనువు తనది కాదు అన్న అనుభూతి కలిగింది. ఆ దివ్య మైకస్థితి చాలా కాలం వరకు అతడిని విడవలేదు. అంతటితో అతని వ్యాధి చాలా మట్టుకు తగ్గిపోయింది.

ఒక రోజు తలనొప్పితో బాధపడుతూండడం వల్ల భజనకు రాలేదు నీలు. తన గదిలో పడుకుని కళ్ళు మాసుకున్నప్పుడు ఒక వెలుగు కనుపించి కొంత సేపటిలోనే మాయ మయ్యింది. అది మరికొంత సేపటికి తిరిగి కనుపించి అమ్మ ఉనికియొక్క అనుభూతి

స్పష్టంగా అతనికి కలిగింది. వెంటనే అతని తలనొప్పి తగ్గిపోయి, అతను లేచి భజనలకు వచ్చి కూర్చున్నాడు.

అమ్మ కృపవల్ల నీలు అనుభవిస్తున్న అస్వస్థతలన్నీ నయమయ్యాయి. ఇంతే కాక నీలు ఎక్కడ ఉన్నప్పటికీ అమ్మ ఉనికి, శాంతి మరియు ఆనందాల అనుభూతిని స్పష్టంగా పొందేవాడు. ఇవన్నీ అమ్మ సాన్నిధ్యం వల్ల అతనికి లభించాయి. తిరువణ్ణామలైలో ఉండగా జ్ఞాన మార్గం అవలంబించిన అతను ఇప్పుడు భక్తిమార్గాన్ని ఎంచుకున్నాడు. "ఇది అమ్మ నుండి లభించిన అనుగ్రహం" అంటాడతను. అనేక సం వత్సరాలు కఠినమైన ఆధ్యాత్మిక సాధనలు చెయ్యకపోయి ఉంటే అమ్మ ఆధ్యాత్మిక ఉపదేశాలను అర్థం చేసుకోడమో వాటిని గ్రహించ గలగడమో జరిగి ఉండేది కాదంటాడతను. కేవలం అమ్మ అనుగ్రహం ఆశీర్వచనాల వల్ల మాత్రమే లక్ష్యాన్ని చేర గలము అంటాడతను.

ఆ కాలంలో డబ్బులకు కొదవ ఉంటూండేంది. "ఈ విధంగా ఉంటే ఆశ్రమాన్ని ఎలా నడప గలము? "అని ఎవరో అమ్మతో అన్నారు." మీరెవ్వరూ భయపడ వలసిన అవసరం లేదు. ఈ ఆశ్రమాన్ని నడిపించే వ్యక్తి త్వరలోనే ఇక్కడకు వస్తాడు" అంటూ అమ్మ జవాబిచ్చింది. అతి త్వరలోనే నీలు ఆశ్రమానికి వచ్చి ఆశ్రమ ఆర్థిక బాధ్యతనంతా తన భుజాలపై వేసుకున్నాడు. ప్రతి చిన్న విషయాన్ని జాగ్రత్తగా గమనిస్తూ అత్యంత శ్రద్ధా ఓరిమిలతో నీలు అమ్మకు నిష్కపటంగా సేవ చేయసాగాడు.

## సౌమ్య
## (స్వామిని కృష్ణామృత ప్రాణ)

1982లో సౌమ్య ప్రప్రథమంగా అమ్మ ఆశ్రమంలో ఉండడానికి రావడం జరిగింది. ఆమెకు ఆధ్యాత్మికతపై ఉత్సుకుత ఉండడం వల్ల, ఆస్ట్రేలియాలో ఇది వరకే ఒక ఆశ్రమంలో ఉంటూ, ముంబాయ్‌కి దగ్గరలో ఉన్న ప్రధాన ఆశ్రమం సందర్శించడానికి భారతదేశానికి వచ్చింది. చిన్మయా మిషన్‌లో చదువుకుంటున్న అమ్మ భకుడి ద్వారా ఆమెకు అమ్మ విషయం తెలిసింది. అతను అమ్మ గురించి చాలా వివరాలు ఆమెకు తెలుపుతూ ఆమె వద్ద అతను పొందిన అనేక అనుభవాలను గురించి తెలుపుతూ, సౌమ్యతో ఆమె తప్పకుండా అమ్మ బిడ్డ అని అనిపిస్తున్నదని ఆమె అమ్మ ఆశ్రమానికి వెళ్ళి

చూసినట్లైతే తప్పకుండా అక్కడే ఉండిపోవడానికి నిశ్చయించుకుంటుందని అతను అన్నాడు. అదే జరిగింది కూడా. ఎంతో మంది, అదీ పాశ్చాత్యులు నివసిస్తున్న ఆశ్రమంలో నివశించిన తరువాత వచ్చిన సౌమ్యకు కేవలం 14 మంది కొన్ని పూరి గుడిసెల్లో నివసిస్తున్న అమ్మ చిన్న ఆశ్రమం చూసినప్పుడు అద్భుతంగా అనిపించింది.

సౌమ్య ఆశ్రమం సందర్శించబోతున్నదని ఉత్తరం వ్రాసి ఆ భక్తుడు తెలిపాడు. సౌమ్య ఆశ్రమంలో దర్శనం జరుగుతున్న గుడిశలో ప్రవేశించగానే అమ్మ చటుక్కున వెళ్ళి ఆమెను కౌగిలించుకుంది. అమ్మ చూపిస్తున్న ప్రేమ మరియు వాత్సల్యాలను చూసి ఆమె అత్యంత ఆశ్చర్యంలో మునిగిపోయింది. ఆమె ఇదివరకు సందర్శించిన ఆశ్రమాలలో గురువుగారు దూరంగా సురక్షితంగా కూర్చుని ఉండగా, గురువుగారి పాదుకలను నమస్కరించి వాటిని తాకడం మాత్రమే సాధ్యమయ్యేది. అయితే ఇక్కడ అమ్మ భక్తులను ఆలింగనం చేసుకుని ప్రేమ కారుణ్యాలతో వారిని ఆప్యాయంగా నిమురుతూ ఉండడం ఆమె ఎన్నడూ ఊహించ లేనిది.

ఆ రోజుల్లో ఒక్కొఒక్కప్పుడు పిచ్చిదానిలా ప్రవర్తిస్తూ ఇసకలో పడుకుంటూండడమో లేక నేలపై పడిన అన్నం తినడమో చేసేది అమ్మ. భజనలు పాడూతూ లేక సాధారణంగా భక్తులకు దర్శనం ఇస్తూ కూడా అమ్మ సమాధి అవస్థలోకి వెళ్ళడం జరిగేది. రోజు ప్రతి క్షణం కూడా తన సమయాన్నంతా భగవంతునికి మరియు మనుష్యులకు వినియోగిస్తూ చాలా సామాన్యంగా జీవించేది అమ్మ. తనకంటూ ఏమీ ఉండేది కాదు. ఎల్లవేళలా ఇసుకలో కూర్చుని భజనలు పాడుతూ, భగవంతుడి ప్రేమలో మునుగుతూ, భగవంతునికై కన్నీరు కారుస్తూ ఉండాది. ఆమె దృష్టంతా భగవంతునిపైనే ఉండేది, భగవంతుని ధ్యాసలో లేనప్పుడు మమ్మల్ని , అందరిపైనా ప్రేమను ప్రసరిస్తూ ఉండేది. ఈ ప్రేమ దాచేది కాదు, ఆమె ప్రతి కణం నుండి అది ప్రవహిస్తూండేది.

అమ్మ వద్దకు రాక ముందు సౌమ్య వివాహం చేసుకుని కుటుంబంతో దేశ సంచారం చేద్దామని ఆశించేది. అయితే అమ్మను చూసిన తరువాత అటువంటి కోరికలన్ని విడిచిపోయాయి. ఈ మానవ జన్మ భగవద్ సాక్షాత్కారం కోసం లభించింది అనేటటువంటి ఆధ్యాత్మిక సత్యాలను విన్న తరువాత, పాశ్చాత్య దేశాలకు వెళ్ళి ఆ జీవితమే సత్యం అన్న కపట జీవితం గడపలేనన్న నిశ్చయానికి వచ్చింది. అమ్మను

...న గురువుగా స్వీకరించి, ఆమె శిక్షణ మార్గదర్శకత్వంలో అమ్మ వద్ద జీవిస్తూ ఉం...లని నిశ్చయించుకుంది.

ఆశ్రమంలో నివశించిన కొంత కాలానికే సౌమ్యను భావదర్శన సమయంలో తన ...వసరాలను చూసుకోమని అమ్మ ఆమెను ఆదేశించారు. ఇది ఎంతో గొప్ప విషయము మరియు ఆనందదాయకమైన విషయమైనప్పటికీ, సౌమ్యకు మలయాళం తెలియక ...వడం వల్ల ఇబ్బందిగా కూడా ఉండేది. భావ దర్శన సమయంలో అమ్మ ముఖం ...డవడం ఈ పనులలో ఒకటి. అమ్మకు చెమటలు పట్టనప్పటికీ, భక్తుల చెమటలు అంటుకుని ఒక్కొక్కప్పుడు అమ్మ ముఖం తడిసేది, అంతే కాక ఆలయంలో చాలా ఉక్క ...ను, జనాలతో నిండి ఉండడం వల్ల చాలా వేడిగా ఉండేది. ఇద్దరు ముగ్గురు వ్యక్తులు ...ర్శనం చేసుకుని వెళ్ళిన తరువాత అమ్మ ముఖం తుడవమనేది.

విశ్వమాత అయిన అమ్మ ముఖం తువ్వాలుతో తుడవడానికి సౌమ్యకు భయం ...సేది. అయితే ఆ కాలం అమ్మ తనే స్వయంగా చేసుకోకపోవడం వల్ల సౌమ్యకు తప్పేది కాదు. రాత్రి నిద్రపోతూ ఉండగా దేవి అమ్మ తీక్షణంగా చూస్తూ తన ముఖం తుడ...వమని ఆజ్ఞాపిస్తున్నట్లు, కలలో ఆమెకు కనుపించేది. ఈ కలలు ఎంతో యథార్థంగా ఉండేవంటే సౌమ్య ఉలిక్కి పడి, నిద్ర పోతున్నందుకు సిగ్గుపడుతూ లేచి కూర్చుని తువ్వాళ్ళకై వెతుక్కునేది. ఒక్కొక్కప్పుడు తన గదిలో ఉంటున్న మరొక అమ్మాయి, అర్ధరాత్రి చీకట్లో దేనికై వెతుకుతున్నాదో అర్థం కాక ఆశ్చర్యపోతూండేది. చివరకి తెలివి వచ్చిన తరువాత అర్ధరాత్రి అయ్యిందని దేవీభావం ముగిసిందని గ్రహించి, అంతా కలే నని, నిద్రపోయినందుకు అమ్మకు క్షమాపణలు చెప్పుకుని తిరిగి నిద్రపోయేది. ఈ విధంగా ఒక్కొక్కప్పుడు వారానికి ఒక సారి ఒక్కొక్కప్పుడు మూడు సార్లు జరిగేది. ఇలా ఎన్నో సంవత్సరాలు జరిగిన తరువాత ఆ కలలు నిలిచిపోయాయి.

అమ్మ వద్దకు వచ్చినప్పుడు సౌమ్య, లౌకిక జీవితంలో ఏ విధమైన ఆనందంలో శాశ్వతత్వం లేదని గ్రహించి, ఆధ్యాత్మిక జీవితాన్ని గడపడం నేర్చుకోవాలని నిశ్చయించుకుంది. ఆశ్రమం స్థాపించిన కొత్తలో అమ్మ సేవకు ప్రాధాన్యమిస్తూండే వారు, అయితే సౌమ్య తనకు ఆ మార్గం సరిపోదని భావించింది. అయితే రాను రాను అమ్మ సేవను గురించి దాని ప్రధాన్యతను గురించి ఇంకా హెచ్చుగా మాట్లాడుతూండే వారు. క్రమేణా సౌమ్య హృదయంలోఅమ్మ నాటిన ఆ విత్తనం అమ్మ తన ప్రేమ మరియు

ఆమెపట్ల అక్కరల సహాయం వల్ల మొలకెత్తి వికశించి లోకానికి సేవ చేయ్యాలన్న కోరిక ఆమెలో వృద్ధి పొందుతూ వచింది. ఇప్పుడు అదే ఆమె హృదయానికి అత్యంత గాఢమైన కోరిక. "ఈ ప్రపంచానికి సేవ చేసేందుకు ఆవశ్యమైన పరిశుద్ధత మరియు శక్తిని ప్రసాదించు" అన్నదే ఆమె రహస్యంగా చేసే ప్రార్థన.

## మధు
## (స్వామి ప్రేమానంద పురం)

మధు రియూనియన్ ద్వీపాలలో పుట్టిన భారతీయుడు. చిన్న వయస్సునుండి కూడా అతనికి సన్యసించాలన్న గాఢమైన కోరిక ఉండేది.

1976లో అతను భారతదేశానికి వచ్చి రామకృష్ణాశ్రమం గురించి తెలుసుకున్నాడు. బేలూర్ మఠానికి చెందిన స్వామి విశ్వేశ్వరానందను సాధన చేసేందుకు హిమాలయాలకు వెళ్ళనా, అని అడిగాడు. ఆయన మధును దక్షిణ భారతదేశానికి వెళ్ళమని ఆ ప్రదేశమే అతనికి అనువైనది అని తెలిపారు. ఆయన ఉత్తరవు అనుసరించి, అతను అరుణాచలం లో ఆధ్యాత్మిక అనుష్ఠానాలను చేస్తూ ఉండగా, ఒక భక్తుడు "నువ్వు కాళికాదేవి భక్తుడిలా కనుపిస్తున్నావు. వల్లిక్కావులో కాళికాదేవి ఉంది. ఆమెను సందర్శించు" అని అన్నాడు.

ఆ విధంగా అతను 1980 జూన్ 1వ తేదీన వల్లిక్కావు చేరుకున్నాడు. అది దేవీభావం సమయం. పాత మందిరంలో ఉన్న అమ్మ, గాయత్రితో, "నా కుమారుడు మధు బైట వేచి ఉన్నాడు. వెళ్ళి అతడిని లోపలకు తీసుకుని రా" అని అన్నారు. మందిరంలో కాలు పెట్టి అమ్మను చూసిన మధు రోధించ సాగాడు. అతనితో, "ఎన్నాళ్ళుగా నీ కోసం ఎదురు చూస్తున్నాను" అన్నారు.

మరుసటి రోజు విశ్వేశ్వరానంద ఫోటోను చూపిస్తూ అక్కడున్న అందరినీ ఇది ఎవరు అని అడగసాగారు. అమ్మ ప్రక్కనే కూర్చున్న మధు, "ఆయన విశ్వేశ్వరానంద" అని జవాహిచ్చాడు. "అతను ఒక మంచి వ్యక్తి" అన్నారు అమ్మ. అతడిని తన ధ్యానం లో చూశానని అమ్మ మధుకు చెప్పారు. ఆయన మధును దక్షిణ భారతానికి పంపించడం నిజంగా దూరదృష్టే కదా! దేవీ భావ సమయంలో అమ్మ మధుకు మంత్ర దీక్షను ప్రసాదించారు.

1982లో అమ్మ జన్మ దినోత్సవాలను రియూనియన్ ద్వీపాలలో జరిపాడు మధు. రియూనియన్‌లో మాతా అమృతానందమయి మఠాన్ని స్థాపించి ఆ ప్రాంతాలలో సనాతన ధర్మ ప్రచారాన్ని చెయ్యడంలో నిమగ్నమయ్యాడు. అణకువ, జ్ఞానం, కరుణ, మరియు, సేవా తత్పరత వంటి గుణాలున్న మంచి సాధకుడు మధు.

ఫిబ్రవరి 24, 1985లో మధు అమ్మ సన్నిధి అమ్మ శిక్షణలో ఉండగా బ్రహ్మచర్య దీక్ష ఇవ్వబడి అతను ప్రేమాత్మ చైతన్యగా అయ్యాడు. అమ్మ పట్ల తన కృజ్ఞతను చూపిస్తూ అతను ఇలా అన్నాడు: "నన్ను ఈ విధంగా మార్చింది అమ్మ. అమ్మకు కలిసి ఉండక పోయినట్లైతే నేనూ ఒక సాధారణ లౌకిక జీవితాన్ని గడిపి ఉండే వాడిని. అమ్మ కృప వల్ల మాత్రమే నేను సన్యాసమార్గంలో నడవ గలుగు తున్నాను. ఆధ్యాత్మిక పురోగతికి వ్యక్తిగతమైన సామర్థ్యం కంటే గురుకృప ఎంతో ఆవశ్యమైనటువంటిది."



భాగం

# 4

## ఆధ్యాత్మిక గురువుగా అమ్మ

పరిపూర్ణ వ్యక్తి ఎవరు? ఆధునిక యువకుడికి ఎవరికయినా ఈ ప్రశ్న వేసినట్లయితే అందమూ గొప్ప పలుకుబడీ ఉన్న బహూలక్షాధికారి కాని లేదా బహూశా ఉన్నత శ్రేణీ రాజకీయ నాయకుడు కాని ఆఅదర్శ వ్యక్తి అని చెబుతాడు. లేకపోతే, శృంగార పురుషులుగా కనిపించే సినిమా నాయకుల పేర్లో, క్రికెట్ ఆటగాళ్ళ పేర్లో చెబుతాడు. విచారకరమయిన విషయం ఏమిటంటే ఈ నాటి కుర్రవాళ్ళు ఎవళ్ళూ సినిమాలు కాని, రాజకీయాలు కాని, శృంగారం కాని లేని సమాజాన్ని ఊహించలేకపోవడం. అది వాళ్ళకు జీవశక్తి. కాని వీటికి, మన జీవితంతో కాని శీలవర్ధనంతో కాని ఏమయినా సంబంధం ఉందా? ఒక వ్యక్తిని సుందరంగాను పరిపూర్ణంగాను చేసేది ఏమిటి? ఒకరి చేతలకు మాధుర్యాన్నీ ఆకర్షణనూ ఇచ్చేది ఏమిటి? ఒకరిని అమరులుగాను పూజనీయులుగాను చేసేది ఏమిటి? వివేకం కలిగి, పరిపక్వత వచ్చిన వ్యక్తి, "కాదు, ఎంతమాత్రం కాదు!" అని చెబుతాడనడంలో సందేహం లేదు. అయితే ఏమిటది? ఒక వాక్యంలో చెప్పాలంటే, అది, ఆంతరిక గుణాల ఏకీకరణ; అవి మళ్ళీ, ఆ వ్యక్తి సంపూర్ణ అస్తిత్వం ద్వారా శాశ్వత గుణాలుగా అభివ్యక్తమవుతాయి. మాతా అమృతానందమయి సన్నిధిలో కలిగే అనుభవం ఇది; నిర్నిబద్ధమయిన ప్రేమానందాల చక్కని కలగలుపు.

వివిధ జీవనమార్గాల్లో ఉండే వ్యక్తులు, వారి వారి అవగాహన స్థాయినిబట్టీ, మానసిక పరిపక్వతనుబట్టీ అమ్మను గురించి రకరకాలుగా మాట్లాడతారు. ఉదాహరణకు, బుద్ధి ఎప్పుడూ స్థూలస్థాయిలోనే ఉండే వ్యక్తిని మీరు, మాతా అమృతానందమయి ఎవరని అడిగితే, అతను, "భయంకరమయిన, నయంకాని రోగాలను కేవలం ఒక్క స్పర్శతో లేదా చూపుతో నయం చేయగల అసాధారణ వ్యక్తి," అని చెబుతాడు. ఆమె మీ ప్రాపంచిక సమస్యలను కూడా పరిష్కరించగలదు; మీ కోరికలన్నిటినీ ఇట్టే నెరవేర్చగలదు," అని కూడా చెప్పవచ్చు. అదే ప్రశ్న, అంతకన్న సూక్ష్మమయిన బుద్ధి గలవాణ్ణి అడిగినట్లయితే అతను, "ఓ, అమ్మ నిజంగా అద్భుతమయిన వ్యక్తి. ఆమె మీకు మానసిక శక్తులు చాలా ప్రసాదించగలదు. మానసిక భావప్రసారణ, దూరదర్శన శక్తుల్లో ఆమె నిపుణురాలు. నీళ్ళను పంచామృతంగా కాని పాలగా కాని

మార్చడం ఆమెకు అతి సులభం. అష్టసిద్ధులూ ఆమెకు లోబడి ఉంటాయి," అంటూ చెప్పుకొని వస్తాడు. అదే ప్రశ్నకు నిజమయిన ఆధ్యాత్మికాన్వేషి చెప్పే సమాధానం ఇలా ఉంటుంది, "బ్రహ్మజిజ్ఞాసువయిన సాధకుడు సాధించవలసిన చరమ లక్ష్యం అమ్మ. ఆమె, సత్యాన్వేషకులకు మూలస్రోతం, ఆధారం. సంతత పరిణామ శీలమయిన జన్మపరంపరా సాగరాన్ని దాటడానికి ఆమె, వాళ్ళకు సహాయం చేస్తుంది. ఆమె సహజ ప్రకృతే ప్రేమా కనికరమూ. వేదాల్లోనూ ప్రపంచంలోని ఇతర మతగ్రంథాల్లో నూ చెప్పిన సత్యాలకు ఆమె నిజమయిన సాక్షి. ఆమె పాదాలను ఆశ్రయించినట్లయితే లక్ష్యం నిశ్చితంగా చేరువవుతుంది. ఆ మె పరిపూర్ణ గురువు, మహామాత కూడా."

భక్తియోగ మార్గాన్ని అనుసరించే వ్యక్తి దృష్టికోణంనుంచి చూసినట్లయితే అమ్మ సర్వశ్రేష్ఠురాలయిన నిజమయిన భక్తురాలు. ఆమెలో పరాభక్తి తాలూకు విభిన్నరీతులు నిర్నిరుద్ధంగా వ్యక్తమవుతూ ఉండటం చూడవచ్చు. జ్ఞానమార్గాన్ని అనుసరించేవాడు కనక అమ్మను గమనించినట్లయితే ఆమె మాటల్లోను, చేతల్లోను పరిపూర్ణ ఆత్మజ్ఞా నిని దర్శించగలడు. చిత్తశుద్ధితో కర్మయోగాన్ని అనుసరించేవాడికి, కర్మయోగుల్లో ఆమెను మించినవారెవరూ కనిపించరు. ఇవన్నీ వారివారి పరిమిత అనుభవాన్ని బట్టీ అవగాహనను బట్టీ ఏర్పడే పాక్షిక దృష్టులు. కాని, సన్నిహిత సాంగత్యం ద్వారాను, దురభిమానాలూ, ఊహలూ లేని పరిశీలన ద్వారాను, దురభిమానాలూ, ఊహలూలేని పరిశీలనద్వారాను, అమ్మ వీటన్నిటి సమాహారం [కలగలుపు] అని స్పష్టంగా అవగాహన చేసుకోవచ్చు.

'భూమాతంత ఓర్పుతో' అని మలయాళంలో ఒక పలుకుబడి ఉంది. భూమాత అన్నిటినీ భరిస్తుంది. జనం ఆమెను కాలితో తంతారు; ఆమె మీద ఉమ్ములు వేస్తారు; నాగలితో దున్నుతారు; గోతులు తవ్వుతారు; సేద్యానికీ ఇతర అవసరాలకూ గునపంతో ఆ మె రొమ్ము చీలుస్తారు. ఆమె మీద నూరంతస్తుల మేడలుకూడా కడతారు. అయినా ఆమె, ఓర్పుతో అన్నీ భరిస్తుంది. ఆమెకు ఫిర్యాదులు లేవు. ఆమె ఎవ్వరినీ ఏవగించుకోదు; అందరినీ అత్యుత్తమంగా సేవిస్తుంది, పోషిస్తుంది. అలాగే అమ్మకూడా తన సంతతి శీలాన్ని పునర్నిర్మించడంలో ఎంతో ఓర్పు చూపిస్తుంది. శిష్యులు క్రమశిక్షణ పొందడానికి తగ్గట్లుగా పరిపక్వత చెందేవరకు సహనంతో వేచి ఉంటుంది. అప్పటివరకు, వాళ్ళను ఆమె తన నిస్వార్థ ప్రేమలో ఓలలాడిస్తుంది; వాళ్ళు చేసే తప్పులన్నిటినీ క్షమిస్తుంది.

భారతీయ పురాతన ఋషుల, మునుల మహాపరంపరను నిశితంగా గమనించినట్లయితే, వారు తమ శిష్యులకు జ్ఞానబోధ చెయ్యడానికి అనుసరించిన

విధానాలను పరిశీలించినట్లయితే ప్రపంచంలో మరెక్కడా కనిపించని గురుశిష్య సంబంధంలోని విశిష్టస్వభావాన్ని అర్థంచేసుకోడం కష్టమేమీ కాదు. అమ్మ ఇలా అంటుంది, "మొదట్లో సద్గురువు తన శిష్యుడికి కఠినమయిన ఆదేశాలు ఇవ్వడు. అతన్ని ప్రేమిస్తాడంతే. నిర్నిబద్ధమయిన తన ప్రేమతో శిష్యుణ్ణి బంధిస్తాడు. గురువు ప్రేమవల్ల ఉత్పన్నమయిన గాఢ ప్రభావం, శిష్యుడి వాసనలను లేదా మానసిక ధోరణులను ఆయన ప్రభావితం చెయ్యడానికి తగినట్టుగా శిష్యుణ్ణి తయారుచేస్తుంది. గురువు మెల్లగా కఠినమయినప్పటికీ ప్రేమపూర్వకమయిన ఆదేశాలతో, శిష్యుడి వ్యక్తిత్వాన్ని క్రమశిక్షణలో ఉంచి తీర్చి దిద్దుతాడు. నిజమయిన గురుశిష్య సంబంధంలో గురువెవరో శిష్యుడెవరో విడబరచి చెప్పడం కష్టం. ఎందుకంటే శిష్యుడికంటే గురువు నమ్రతతో ఉంటాడు; గురువుకంటే శిష్యుడు నమ్రతతో ఉంటాడు." మొదట్లో గురువు, శిష్యుడి మీద ప్రేమ చూపించడంతోబాటు కొంతవరకు శిష్యుడి సరదాలకూ కోరికలకూ అనుగుణంగా వ్యవహరించడం కూడా జరుగుతుంది. కాని, శిష్యుడు ఆధ్యాత్మిక సాధన ప్రారంభించడానికి తగినంత పరిపక్వత పొందాడని గురువు గమనించినట్లయితే అప్పుడిక మెల్లమెల్లగా అతన్ని క్రమశిక్షణలో పెట్టడం మొదలుపెడతాడు. అయితే ఒకసారి క్రమశిక్షణలో పెట్టడం మొదలుపెట్టిన తరవాత- ఆ శిష్యుణ్ణి [లేదా శిష్యురాలిని] తనకొక కొడుకుగానో, కూతురిగానో నిండుప్రేమతో చూసుకుంటున్నప్పటికీ -తన ప్రేమను ఎక్కువగా కనబరచడు. శిష్యుడికి తన శుద్ధ ఆత్మస్వరూపాన్ని గురించిన చైతన్యం కలిగించడం ఒక్కటే ఆయన లక్ష్యం . మరో విధంగా చెప్పాలంటే, ఆయన క్రమశిక్షణలో పెట్టే పద్ధతే తన ప్రేమను వెల్లడించే మరో విధానం. అది నిజమయిన ప్రేమ - శిష్యుణ్ణి పరిశుద్ధమయిన రత్నంగా మార్చడం.

అమ్మ, తన పిల్లల్లోని [శిష్యుల్లో]లోపాలను చూపిస్తూ వాటిని సరిచేస్తూ ఇలా అంటుంది, "నేను తోటమాలిలాంటిదాన్ని. తోటంతా వన్నెవన్నెల పూలతో నిండి ఉంది. ఏ విధంగానూ లోపంలేని అందమయిన పూలను నేను సంరక్షించాలని నన్ను అడగలేదు. కాని చీడపట్టిన పూలనుంచీ మొక్కలనుంచీ పురుగులను తొలగించమని నన్ను అడిగారు. పురుగులను తొలగించాలంటే నేను పూలరేకులనూ ఆకులనూ గిల్లవలసి రావచ్చు. ఇది బాధాకరమనడంలో సందేహం లేదు. కాని, మొక్కలూ పూలూ నాశనమవకుండా కాపాడటానికే అది. అలాగే, అమ్మ ఎప్పుడూ పిల్లల బలహీనతల విషయంలో పని చేస్తుంది. తొలగింపు ప్రక్రియ నొప్పిస్తుంది కాని, అది మీ మంచికే. మంచి లక్షణాల మీద దృష్టి పెట్టక్కరలేదు. కాని, మీ బలహీనతలను తొలగించకపోయినట్లయితే అవి మీ మంచి లక్షణాలను కూడా నాశనం చేస్తాయి.

నా నాయనలారా, అమ్మ మీమీద కోపంగా ఉందని మీరు అనుకోవచ్చు. ఎంత మాత్రం కాదు. అమ్మ మిమ్మల్ని అందరికన్నా ఎక్కువగా ప్రేమిస్తుంది. అందువల్ల ఇవన్నీ చేస్తుంది. మీ ఆధ్యాత్మిక ప్రగతిని తప్ప, అమ్మ మరి దేన్నీ కోరదు."

అమ్మ ఎన్నడూ, ఒక రాజసింహాసనంమీద కూర్చుని తన ఆధ్యాత్మిక సంతతినీ భక్తులనూ ఇది చెయ్యమనీ అది చెయ్యమనీ శాసిస్తూండటం కనబడదు. ఆమె బోధిస్తుంది; అలాగే తన చేతలతో వరవడి పెడుతుంది. వినమ్రత, నిరాడంబరత గొప్పతనానికి చిహ్నాలు. దీనికి అమ్మ ఒక సజీవమయిన ఉదాహరణ. ఆమె, అధిక వినమ్రులకంటె వినమ్రురాలు; అధిక నిరాడంబరుల కంటె నిరాడంబరురాలు. ఆమె తనను గురించి తను ఇలా చెప్పుకుంటుంది, "నేను సేవకులకు సేవికను. ఈ జీవితం ఇతరుల కోసం. పిల్లల సంతోషమే తల్లికి భాగ్యమూ ఆరోగ్యమూ."

అమ్మ, తన పిల్లల అహంకారాన్నీ ఇతర వ్యతిరేక ధోరణులనూ హరింపజేసే పద్ధతి అద్భుతమయినది. ఆమె ఎప్పుడూ అజేయమయిన యోధురాలు. తన పిల్లల మానసిక పరిపక్వతనూ ఆధ్యాత్మిక ప్రగతినీ పరీక్షించడానికి, తగిన పరిస్థితి కల్పించి రంగం తయారు చేస్తుంది. అనుమానించే అవకాశం ఏ మాత్రం ఇవ్వకుండా రంగంలోకి నడిపిస్తుంది. పరిస్థితి తీవ్రతను గ్రహించుకొనే సమయానికి అంతశ్శత్రువులన్నీ పైకెగేసి వస్తాయి. విచక్షణాయుతమయిన బుద్ధి, ఆవేశపూరితమయిన మనస్సుకు దారి ఇస్తుంది. ఈ తరుణంలో అమ్మ, తన పిల్లల అహంకారాన్ని తొలగించడానికి అవకాశాన్ని చక్కగా వినియోగించుకొంటుంది. శక్తిమంతమయిన ఆమె ఆయుధాలు తప్పకుండా గురిని కొడతాయి; ఆమె మార్గదర్శకత్వాన్ని కోరేవాళ్ళ వ్యతిరేక ధోరణులు, క్రమక్రమంగా బలహీనపడుతూ వస్తాయి. ఈ కిందిది, అలాటి ఒక సంఘటన.

ఒకసారి, కొన్నేళ్ళ కిందట బ్రహ్మచారి నీలు (స్వామి పరమాత్మానంద), వెనక కొంతకాలం తానున్న తిరువణ్ణామలైనుంచి పోర్టబుల్ టైపురైటరు [తేలికగా చేత్తో పట్టుకొని పోగల టైపు మిషను] ఒకటి తెచ్చాడు. బాలు (స్వామి అమృత స్వరూపానంద, టైపుచెయ్యడం నేర్చుకోకపోయినప్పటికీ, ఒక కాగితమ్ముక్క తీసుకొని, వట్టినే సరదాకి, 'అమ్మా, నన్ను నీ బానిసను చేసుకో,' అని [ఇంగ్లీషులో] టైపుచేశాడు. కొంచం దగ్గరిలో కూర్చుని నీలుతో మాట్లాడుతున్న అమ్మ, చటుక్కున బాలువైపు తిరిగి అడిగింది, "నాయనా, ఏం టైపుచేస్తున్నావు?" అని. దానిమీదట బాలు, ఆ వాక్యం అర్థాన్ని మలయాళంలోకి అనువదించి ఆమెకు చెప్పాడు. దాన్ని గురించి ఇంకేమీ అడక్కుండా, చెప్పకుండా అమ్మ నీలుతో సంభాషణ కొనసాగించింది. 15 నిమిషాలు

పోయాక, అమ్మ నీలుతో చెప్పింది, "బాలును విదేశానికి పంపించబోతున్నాను," అమ్మ దగ్గర శాశ్వతంగా ఉండిపోయే ఉద్దేశంతో అప్పటికే రెండు ఉద్యోగాలు మానుకొన్న బాలుకు, అమ్మ నోటినుంచి వచ్చిన మాటలు వినడం మెరుపు దెబ్బ అయింది. "ఏ మన్నావమ్మా?" అని ఆత్రంగా అడిగాడు బాలు.

"ఔను. ఆశ్రమం నడపడానికి మనకు డబ్బు అవసరం. నివాసుల సంఖ్య పెరుగుతోంది. అందరినీ ఆదుకోడానికి ఆదాయం లేదు మనకు. కనక, నువ్వు వెళ్ళి పనిచెయ్యాలి," అని సమాధానం చెప్పింది అమ్మ.

ఇది చాలు బాలుకు. అతని అంతశ్శత్రువులు పడగలెత్తాయి. " వెళ్ళను. నాకు పనిచెయ్యాలని లేదు. నేనిక్కణ్ణించి వెళ్ళలేను. నేనిక్కడికి, అమ్మ దగ్గర ఉండటానికి వచ్చాను; అంతేకాని, లౌకికమయిన పని చెయ్యడానికి కాని డబ్బు సంపాదనకోసం కాని కాదు. అతనికి కోపం కట్టలు తెంచుకొనే వరకు అమ్మ, అతను వెళ్ళితీరాలని ఒత్తిడి చేస్తూనే ఉంది. అతని వ్యతిరేక ధోరణులు దాడిచెయ్యడానికి సిద్ధంగా ఉన్నాయి."

చటుక్కున అమ్మ, మృదువయిన స్వరంతో అంది, "నాయనా, కొద్ది నిమిషాలక్రితం నువ్వు ఏం టైపుచేశావు? నువ్వు దేవుడి సేవకుడివి కావాలంటే నీవన్నీ ఆయన పాదాలకు అర్పించాలి. మనస్సు పరిశుద్ధంగా లేకపోతే భగవంతుడు నీ హృదయంలో నివసించడు. భగవంతుడి సేవకుడివి కావాలంటే అన్ని అనుభవాలనూ కలగనివ్వాలి- మంచీ చెడూ, శుభమూ అశుభమూ- అన్నింటినీ సమదృష్టితో స్వీకరించాలి. చూడు, అంతా భగవంతుడి సంకల్పం. నాయనా, నాకు నీ సంపద అక్కరలేదు. నువ్వు భగవంతుడికోసం విలపిస్తూండటం చూసినప్పుడు నాకెంతో ఆనందం కలుగుతుంది; నా హృదయం నీమీద ప్రేమతో నిండిపోతుంది." ఈ చివరి మాట ఆమె పలికీ పలకగానే ఆమె దైవభావనలో సమాధిస్థితికి వెళ్ళిపోయింది. ఆమె కళ్ళనుంచి బాష్పబిందువులు జాలువారాయి; ఆమె శరీరం నిశ్చలమయింది. ఈ స్థితి సుమారు గంటసేపటి వరకు ఉంది. ఆ తరవాత ఆమె మెల్లగా లౌకికాస్తిత్వ తలానికి దిగివచ్చింది.

బాలు మనస్సు పశ్చాత్తాపంతో నిండిపోయింది. అతను ఆమె పాదాలమీద పడి క్షమించమని వేడుకొన్నాడు. "అమ్మా, దయచేసి నా హృదయాన్ని పరిశుద్ధం చెయ్యి. మలినమయిన ఆలోచనలనూ చేతలనూ నాలోంచి తొలగించు. నన్ను నీ చేతిలో దోషరహితమయిన ఉపకరణంగా చెయ్యి." అని విన్నవించాడు. ఆమె అతన్ని ఓదార్చి ఇలా చెప్పింది, "నాయనా, దిగులు పడకు. నువ్వు అమ్మ దగ్గరకి

వచ్చావు. నీ సంరక్షణ చూసే బాధ్యత, నిన్ను దోషరహితుడిగా [పరిపూర్ణుడిగా] చేసే బాధ్యత అమ్మది." ఈ మాటలు విన్నాక, బాలుకు సంపూర్ణమయిన శాంతి, ఆనందం కలిగాయి.

అమ్మ ఒకసారి ఇలా అంది, " నాయనలారా, అమ్మ ఎప్పుడూ చిరునవ్వు ముఖం కనబరిస్తే మీకు సంతోషంగా ఉంటుంది. మీ కోరికకు వ్యతిరేకంగా అమ్మ ఏదయినా చెబితే, అప్పుడు మీరు, అమ్మకు మీ మీద ప్రేమ లేదని అనుకొంటారు. కాని అది సరికాదు. అమ్మ ఎప్పుడూ మిమ్మల్ని ఇంకా బలిష్టులుగా చెయ్యడానికి ప్రయత్నిస్తోంది. మీకు ఆధ్యాత్మికంగా బలం చేకూర్చాలంటే మానసిక బలహీనతలనన్నింటినీ తీసి పారెయ్యాలి. ఆ లక్ష్యాన్ని సాధించడానికి అప్పుడప్పుడు ఆమె, మీమీద కోపం బయటకి కనబరుస్తుంది. ఒక్కొక్కప్పుడు మీకు [గుణపాఠం] నేర్పడానికి ఇది అవసరం. ఒక్క ఉదాహరణ తీసుకోండి.- ఒక ఆవు, కొబ్బరిమొక్కకున్న లేతాకులు సంతోషంగా తినేస్తూ ఉంటుంది. 'ప్రియమయిన ఆవూ, లేతాకులు తినకమ్మా! మొక్క ఎండిపోతుంది,'అని దానికి చెబితే చాలదు. ఆవు ఒక్క అంగుళం మేరకు కూడా కదలదన్నది నిశ్చితం. కాని, మీరొక కర్ర తీసుకొని, 'పో, పో', అంటూ దానిమీద అరిస్తే ఆవు వెంటనే తన దుండగం మానేస్తుంది. అలాటిదే అమ్మ కోప్పడడం. నాయనలారా, అమ్మకు మీమీద పిసరంత కూడా కోపంలేదు. అమ్మకు స్వార్థపూరితమయిన ఉద్దేశాలేవీ లేవనీ మీ ఆధ్యాత్మిక ప్రగతికోసం మాత్రమే వ్యవహరిస్తుందనీ ఎప్పుడూ గుర్తుంచుకోండి. అమ్మ ఎప్పుడూ మీకు ప్రేమా ఆప్యాయతా మాత్రమే చూపిస్తూ ఉంటే మీరు మీ వాస్తవమయిన ఆత్మను అన్వేషించడానికి లోపలికి చూడరు. నాయనలారా, లౌకిక వ్యక్తికి సంబంధించినంత వరకు, అతను తన భార్యనూ పిల్లలనూ సంరక్షించుకొంటే చాలు. కాని నిజమయిన సన్యాసి మాత్రం, మొత్తం ప్రపంచ భారాన్ని మొయ్యవలసి ఉంటుంది. అందువల్ల మీరింకా బలిష్టులు కావాలి."

ఒకనాడు ఏమయిందంటే, మామూలు దర్శనం ముగిసిన తరవాత అమ్మ, తెల్లవారగట్ల నాలుగు గంటలకు మాత్రమే విశ్రాంతితీసుకోడానికి వెళ్లగలిగింది. ఆమె తన కుటీరంలోకి వెళ్లి తలుపు మూసుకొన్న తరవాత, ఆశ్రమవాసి ఒకడు, ఎవరూ ఆమె గదిలోకి వెళ్ళి [విశ్రాంతికి] భంగం కలిగించకుండా ఉండాలని కావలిగా, మామూలు ప్రకారం, ఆమె గదికి ఎదురుగా పడుకొన్నాడు. సరిగా ఆ సమయంలోనే ఒక యువతి, బస్సు తప్పిపోవడంవల్ల, క్విలాన్ నుంచి 35 కిలోమీటర్ల దూరమూ నడుచుకొంటూ వచ్చి, అమ్మ దీవనలకోసం ఆశ్రమానికి చేరింది. అమ్మ పడుకొందని తెలిసి ఆమె

హతాశురాలు అయింది. అయినా, మినుకు మినుకుమంటున్న ఆశతో, అమ్మను రెండుసార్లు గట్టిగా పిలిచింది. ఆ స్త్రీ గొంతు విని అమ్మ కుటీరానికి ఎదురుగా పడుకొని ఉన్న ఆశ్రమవాసి లేచి, అమ్మ విశ్రాంతికి భంగం కలిగిస్తున్నందుకు ఆమెను చివాట్లు పెట్టాడు. అక్కణ్ణించి వెళ్ళిపొమ్మని కూడా చెప్పాడు. సరిగా ఆ క్షణంలో, జరుగుతున్నదేమిటో తెలుసుకొన్న అమ్మ, ఆ భక్తురాలిని కలుసుకోడానికి తలుపు తెరచి బయటికి వచ్చింది. ఆప్యాయంగా పలకరించిన తరవాత, అమ్మ ఆమెను ఓదార్చింది; ఆమె ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరిస్తానని ఆమెకు హామీ ఇచ్చింది.

గుమ్మం ముందు నిద్రపోయిన వ్యక్తివైపు తిరిగి అమ్మ, కఠిన స్వరంతో ఇలా చెప్పింది, "నేనిక్కడ ఉన్నది ఏదో విశ్రాంతి తీసుకోడానికీ సదుపాయం చూసుకోడానికీ కాదు; ఇతరులకు సేవ చెయ్యడానికీ వాళ్ళ బాధలకు ఉపశమనం కలిగించడానికీ. వాళ్ళ సుఖమే నా సుఖం. నాకు ఎవ్వరి సేవా అక్కరలేదు. నేనిక్కడ, అందరికీ సేవ చెయ్యడానికి ఉన్నాను. నేను ఎవరినయినా సరే, ఎప్పుడయినా సరే కలుసుకోడానికి స్వేచ్ఛ ఉండాలి. నా దగ్గర ఓదార్పూ సహాయమూ కోరి వచ్చే భక్తులను నేను కలుసుకోకుండా అడ్డగించడానికి ఎవ్వరినీ నేను అనుమతించను. హృదయంలో ఉన్న బాధను నా దగ్గర దించుకోడానికి, కూడబెట్టుకొన్న కొద్దిపాటి డబ్బులతో, వాళ్లు ఎంత ఎక్కువగా కష్టపడి ఇక్కడికి వస్తారో తెలుసా నీకు? నువ్వు కనక మళ్ళీ మరోసారి ఈ మొరటుతనాన్ని చూపించి ఫలానా ఫలానా సమయాల్లోనే నేను భక్తులను కలుసుకోవాలని నాకు నియమాలు విధించినట్లయితే నేను ఈ సంస్థను రద్దు చేసేస్తాను. బాధల్లో ఉన్న మానవులకు సేవ చెయ్యనట్లయితే సేవాసంఘం (మిషన్) లాంటిదేదీ నాకు అక్కరలేదు. సేవాసంఘం ఉండవలసింది సేవకోసం." ఇలా చెప్పి, ఆ ఆశ్రమవాసీ తక్కిన ఆశ్రమవాసులందరూ - ఎవ్వరూ తన కుటీరం ముందు నిద్రపోగూడదని నిషేధించింది.

మరో సందర్భంలో, అమ్మ సలహాకోసం ఆశ్రమానికి వచ్చిన ఒక వ్యాధిగ్రస్తురాలు అమ్మ దుస్తులమీద వాంతి చేసుకొంది. అమ్మకు వ్యక్తిగతంగా ఉపచారాలు చేసే, ఆశ్రమవాసిని అయిన ఒక అమ్మాయి మురికి అయిన ఆ గుడ్డను ఒక కర్రతో ఎత్తి, దాన్ని చాకలికి ఇవ్వబోతోంది. ఇది చూసి అమ్మ, ఆ అమ్మాయిని మందలించింది. "నువ్వు అందరిలోనూ ఒకే దైవాన్ని చూడలేకపోయినట్లయితే, అందరినీ సమానంగా సేవించలేకపోయినట్లయితే, మరి అన్నేళ్ళపాటు ధ్యానమూ సేవా చేసి ఉపయోగమేమిటి? నాకూ ఆ జబ్బు మనిషికీ తేడా ఏమయినా ఉందా?" ఈ మాటలు అని, అమ్మ ఆ

గుడ్డ తనే తీసుకొని ఉతికింది. ఆ తరవాత కొన్ని రోజులపాటు ఆ అమ్మాయి తనకు ఉపచారాలు చెయ్యకుండా నిషేధించింది.

కేవలం అమ్మ సాన్నిధ్యమే భక్తులకు ఉత్తేజకరంగా ఉంటుంది. ఆమె వాళ్ళను ఉత్తేజపరిచి, వాళ్ళు ఏదయినా సరే, ఎప్పుడయినా సరే చెయ్యడానికి వాళ్ళకు బలాన్ని ఇస్తుంది. మాటవరసకు ఆశ్రమంలో, కట్టుబడి కోసం ఇటుకలు, ఇసక, తక్కిన సామాగ్రీ మోసుకువెళ్ళడం కాని, సెప్టిక్ట్యాంకు ఖాళీచెయ్యడం కాని, ఆశ్రమ ఆవరణ ప్రదేశాలను శుభ్రం చెయ్యడం కాని, కాంక్రీటు పనిలో తాపీమేస్త్రులకు సాయం చెయ్యడం కాని- ఇలాటి పని ఏదయినా ఉన్నట్లయితే ఆశ్రమవాసులు, సాయం కోసం కొందరు భక్తులను కూడగట్టడానికి ప్రయత్నిస్తూ ఇక్కడికీ అక్కడికీ పరుగులు పెడతారు. ఒక్కొక్కప్పుడు, భావదర్శనం ముగిసి భక్తులందరూ నిద్రకు ఉపక్రమించే వేళ తెల్లవారగట్ల మూడు గంటలు కావచ్చు. హఠాత్తుగా అమ్మ, పని సాగవలసిన చోటికి చక్కావచ్చేది. పని మొదలు పెట్టడంలో అమ్మ ఎప్పుడూ మొదట ఉంటుంది. కిందటి రోజు సాయంత్రం 6 గంటలనుంచి మర్నాటి ఉదయం 3 -4 గంటల వరకు [కదలకుండా] కూర్చుని ఉన్నప్పటికీ కూడా ఆమె ఎంతో సంతోషంగా, ఉత్సాహంగా పని చేస్తూ ఉండటం కనిపించేది. ఇటుకలో, నీళ్ళో, మరేదయినానో అమ్మ మోసుకు వెళ్తోందన్న వార్త త్వరగా వ్యాపించేది; అన్ని వైపులనుంచీ భక్తులు పరుగు పరుగున వచ్చేవారు. అన్నింటికంటె ఆసక్తికరమయిన విషయం ఏమిటంటే, మామూలుగా 6-7 గంటలు పట్టే పని 1- 2 గంటల్లో పూర్తయిపోయేది.

పనిలో శ్రమను భక్తులు మరిచిపోయేటట్లు చెయ్యడానికి అమ్మ, తనకున్న గొప్ప హాస్యప్రవృత్తితో వాళ్లను నవ్వించేది. పని జరిగే చోటికి దగ్గరలో ఒక నెగడుకూడా వేసేది. పనిచేసే వాళ్ళందరికోసం పానీయాలు కలిపేది; వేరుసెనక్కాయలు వేయించేది. భక్తులకు స్వయంగా తానే పంచిపెట్టేది. పని జరుగుతూండగా అమ్మ, "నాయనలారా, ఏ రకమయిన పనిలో ఉన్నప్పుడయినా ఎప్పుడూ మీరు, మీ మంత్రాన్ని జపించడానికి కాని, భక్తిగీతాలు పాడటానికి కాని ప్రయత్నిస్తూ ఉండండి. భగవంతుడికి అర్పించిన కర్మలే [పనులే] నిజమయిన కర్మగా లెక్కలోకి వస్తాయి; అప్పుడు కర్మ, యోగం అవుతుంది. లేకపోతే అది కర్మభోగం (అనుభవించాలన్న కోరికతో ప్రేరితమయిన కర్మ) అవుతుంది," అంటూ ప్రతి ఒక్కరికీ బోధించేది.

"బృందావనంలో గోపికలు పాలూ, మజ్జిగా వంటివి అమ్మడానికి వెళ్ళినప్పుడు కూడా వాళ్ళు 'కృష్ణా, మాధవా, యాదవా, కేశవా....'అంటూ అరిచేవాళ్లు. వంటింట్లో సైతం వాళ్లు సుగంధ ద్రవ్యాల సీసాల మీదా తక్కిన సరుకులమీదా, కృష్ణుడికున్న

మునుపేరు పేర్లు రాని అతికించేవాళ్లు. వాళ్ళు ఇంటిపనులు కూడా చేసేవాళ్లు. ఎప్పుడూ క్షామిగా ఉండేవాళ్ళు కాదు; తమ హృదయాల్లో కృష్ణుడి రూపాన్ని ఎప్పుడూ నిలుపుకొని ఉండేవాళ్లు; పెదవుల మీద దైవనామాలు ఉంచుకొనేవాళ్లు. నాయనలారా, వాళ్ళలా ఉండటానికి ప్రయత్నించండి."

అమ్మను ఏ ప్రశ్నలు అడిగినా, ప్రశ్న అడిగినవారు ఎవరయినా - ఆస్తికుడయినా, నాస్తికుడయినా, హేతువాది అయినా, ప్రతికూలుడయినా - వాళ్ళను నొప్పించడం కాని వాళ్ల అభిప్రాయాలను కించపరచడం కాని చెయ్యకుండా మృదువుగా, ప్రశాంతంగా, ఆప్యాయంగా వాళ్లకు సమాధానాలు చెప్పేది. ఉదాహరణకు, ఆశ్రమాన్ని చూడటానికి వచ్చిన ఒక పడుచువాడు అమ్మకు ఇలా చెప్పాడు, "ఆధ్యాత్మిక తత్త్వశాస్త్రంమీదా ఆధ్యాత్మిక గురువులమీదా నాకు ఏ మాత్రం నమ్మకం లేదు. అంతకన్న మానవులకు సేవచెయ్యడం ఉత్తమం కాదా? చాలామంది పేదరికంవల్లా వస్తువల్లా బాధపడుతున్నారు. ఈ ఆధ్యాత్మికపరులు అనిపించుకొనేవాళ్లు వాళ్లకు చేస్తున్నది ఏమిటి? పనీ పాటూ లేకుండా కూర్చుని కాలాన్ని వృథాచెయ్యడం లేదా?" అని అడిగాడు.

అమ్మ ప్రశాంతంగా ఇలా జవాబిచ్చింది, "నాయనా, నువ్వన్నది నిజం. సహజంగా, మానవ సేవ ముఖ్యమయినది. నిజమయిన ఆధ్యాత్మిక జిజ్ఞాసువు జీవితం దానికి అంకితం కావాలి. నువ్వు చెప్పిన ఆ అంశంతో అమ్మ పూర్తిగా ఏకీభవిస్తుంది. కాని నిజమయిన సేవ ఏది? ఏదీ ఆశించకుండా సహాయం చెయ్యడమే నిజమయిన సేవ. ఆ పని ఎవరు చేస్తున్నారు? ఒక బీదకుటుంబానికి సహాయం చెయ్యాలన్న ఉద్దేశం ఎవరికయినా ఉందంటే, దాని వెనక స్వార్థపరమయిన ప్రేరణ ఒకటి నిస్సందేహంగా ఉంటుంది. ప్రతి ఒక్కరూ పేరు ప్రఖ్యాతులకోసం పాకులాడుతున్నారు. ఆధ్యాత్మిక ఉపదేశం పేదరికంలో మునిగి ఉన్నవాడి ఆకలిని తీర్చదని అమ్మకు తెలుసు. అటువంటి వాళ్ళ మీద మనకు సహానుభూతి, ప్రేమ ఉండి తీరాలి. నిజమయిన సహానుభూతీ ప్రేమా ఆధ్యాత్మికతవల్ల మాత్రమే వస్తాయి. మనకు జీవితంలో ఉన్నతాదర్శం తప్పకుండా ఉండాలి. ఆ ఆదర్శాన్ని నిలపడానికి మనం అన్నింటినీ త్యాగం చెయ్యడానికి సిద్ధంగా ఉండాలి. ఇదీ నిఖార్సయిన ఆధ్యాత్మికత. కేవలం భక్తి కల్పించినంత మాత్రాన ఎవరి సమస్యలూ పరిష్కారం కావు. మళ్ళీ అతనికి తిండి అవసరమవుతుంది. కనక, ఉత్తమమయిన మార్గం ఏమిటంటే, బాహ్యంగానూ ఆంతరికంగానూ కూడా సహాయం చెయ్యడం; అంటే వాళ్ళకు తిండి పెట్టాలి; అలాగే ఆంతరికంగా కూడా అభివృద్ధి చెందే అవసరాన్ని

వాళ్లు తెలుసుకొనేటట్లు చెయ్యాలి. ఇది ఆధ్యాత్మిక విద్యవల్లే సాధ్యమవుతుంది. ఈ విధమయిన సేవ, ఒకడు ఏ పరిస్థితిలో ఉన్నా - ఆకలితో మాడుతున్నా సరే - సుఖవంతమూ సమతులితమూ అయిన జీవనం గడపడానికి సహాయపడటం. నిజానికి ఆధ్యాత్మికత అనేది, ప్రపంచంలో పరిపూర్ణమయిన జీవనం గడపడం ఎలాగో మనకు నేర్పేది. నాయనా, ప్రతిదీ మనస్సు మీద ఆధారపడి ఉంటుంది. మనస్సు ప్రశాంతంగా, నిలకడగా ఉంటే అత్యంత హీనమయిన నరకం కూడా సుఖ నివాసమవుతుంది. కాని, మనస్సు కలత చెందినట్లయితే అత్యున్నతమయిన స్వర్గం కూడా మహాక్లేశాగారం అవుతుంది. ఆధ్యాత్మికత వల్లా ఆధ్యాత్మిక గురువులవల్లా పొందేవి శాంతీ నిలకడా. ఇవి లేనిదే బతకలేరు."

చెడ్డతనానికి అందరికన్నా పెద్దగా పేరుపడ్డవాడు - తన తల్లిదండ్రుల దృష్టిలోను, దగ్గర చుట్టాల దృష్టిలోను క్రూరుడయినవాడూ వాళ్లు ఏవగించుకొనేవాడూ - కూడా అమ్మకు ప్రియపుత్రుడు. అలాంటివాడు కూడా అంటాడు, "అమ్మ నన్ను అందరికంటే ఎక్కువగా ప్రేమిస్తుంది. నేనామెను, నాకు జన్మనిచ్చిన తల్లికంటె ఎక్కువగా ప్రేమిస్తాను. నేనామె కొడుకును."అమ్మ తన భక్తుల హృదయాల్లో కలిగించే అభిప్రాయం అది. దుర్మార్గుడి గురించి కూడా అమ్మ ఇలా అంటుంది, "ఎంత మంచివాడు నా బిడ్డ! చాలా అమాయకుడు." వాళ్ళలో చెడు లక్షణాలను ఉపేక్షించి వాళ్ళ మంచితనాన్ని - నిజానికి అది పిసరంత ఉంటుంది- గురించి ప్రశంసాపూర్వకంగా మాట్లాడుతుంది. ప్రత్యక్షానుభవం ద్వారా మనం, అమ్మ, తరగని ఆధ్యాత్మిక శక్తికీ క్రియాశీలక సృజనాత్మకతకూ మూలస్రోతమని గ్రహించగలుగుతాం. అమ్మ తన భక్తుల ఆధ్యాత్మిక, భౌతిక అవసరాలను నిశితంగా గమనించి తీరుస్తున్నప్పటికీ ఎప్పటిలాగే నిస్సంగంగా, పరిశుద్ధంగా ఉంటుంది.

భక్తినీ కృతజ్ఞతనూ తెలపడానికి భక్తుడు ఇలా చెప్పవచ్చు, "ఓ అమ్మా, నువ్వు నామీద ఎంతో దయ చూపిస్తున్నావు. నీ అనుగ్రహంవల్ల నేను బాగా ధ్యానం చేయగలుగుతున్నాను; నా మనస్సు పూర్తిగా ప్రశాంతంగా ఉంది." మరొకరు అంటారు, "ఓ అమ్మా. నీ దీవనలవల్ల ఇప్పుడు మా కుటుంబ సమస్యలన్నీ పరిష్కారమయాయి. చిరకాలంగా ఉన్న నా జీవితాకాంక్షలు నెరవేరాయి," అనవచ్చు. భక్తులు చెప్పే ఈ మాటలు విని అమ్మ, ఒక్కొక్కప్పుడు గట్టిగా నవ్వి ఇలా అంటుంది, "నమశ్శివాయ!" మిమ్మల్ని దీవించడానికి అమ్మ ఎవర్తె? ఆమె ఒట్టి పిచ్చిపిల్ల; ఆమెను పిచ్చాసుపత్రిలో పెట్టేవాళ్ళు ఎవరూ లేక చుట్టుపక్కల తిరుగుతోంది. నేనేమీ చెయ్యడం లేదు. దేవుడే అన్నీ చేస్తాడు; తానేమీ చెయ్యకుండా.

అమ్మ దర్శనానికి వచ్చేవాళ్ళ అభిరుచి స్వభావమూ భేదమూ ఎలా ఉంటాయో ఇప్పుడు గమనిద్దాం. కొందరు కుండలినీ యోగాన్ని గురించి (అంటే [మూలాధారంలో నిద్రాణంగా ఉండే] శక్తిని మేలుకొలిపే పద్ధతులను గురించి) అడిగితే, మరికొందరు పరమాత్మలో నెలకొని ఉండే స్థితి అయిన నిర్వికల్ప సమాధిని గురించి తెలుసుకోవాలన్న కుతూహలం కబరుస్తారు. ఇంకో వ్యక్తి అనారోగ్యాన్ని గురించి చెప్పుకొని వస్తాడు. కొందరు తల్లిదండ్రులు, తమకున్న ఒక్కగానొక్క కొడుకు పూర్తి చెడుదారి పట్టాడనీ అన్నీ ఘోరమయిన పనులు చేస్తున్నాడనీ ఏడుస్తూ వచ్చి చెప్పి, అమ్మ వాడిని కాపాడాలని వేడుకొంటారు. కొందరు పడుచువాళ్లు, తాము చాలాకాలం కిందటే చదువులు పూర్తిచేసినా తమకు ఉద్యోగం దొరకలేదని వాపోతారు. "అమ్మా, నాకు ఉద్యోగం రావాలని దీవించు" అంటారు. భర్తలు వచ్చి, తమ భార్య నిష్కపటంగా లేదని అంటారు. భార్యలు వచ్చి, తన భర్త తనను ప్రేమించడం లేదని అంటారు. తమ పొరుగువాడికి శాస్తి చెయ్యమని అమ్మను ప్రార్థించేవాళ్లు కూడా ఉన్నారు. లేకపోతే, తమ ఆవు, కావలసినన్ని పాలు ఇవ్వడంలేదని కాని, తమ దొడ్లో ఉన్న కొబ్బరిచెట్లు సమృద్ధిగా కాయలు కాయడంలేదని కాని చెబుతారు. పరీక్షలు పాసయేటట్లుగా దీవించమని అడిగేవాళ్లు కొందరయితే నయంకాని మొండిరోగంతో వచ్చే వాళ్లు కొందరు. తల్లిదండ్రులు కొందరు, తమ కొడుకు త్యాగజీవనం గడిపే [సన్యాసం తీసుకొనే] లక్షణాలు పొడగడుతున్నాయని ఆందోళన పడతారు. అమ్మను కలుసుకొన్న తరవాత శ్రద్ధగా సాధన చేయబోయే ఆత్మసాధకులు కొందరుంటారు; వాళ్ళు సాధనలో ముందుకు సాగడానికని అమ్మ ప్రత్యక్ష మార్గదర్శకత్వం కావాలని కోరతారు. ఈ విధంగా యావత్ప్రపంచమూ ఆమె ఆశీస్సులకోసం రావడం గమనించవచ్చు. అమ్మ ఎవ్వరినీ కాదనదు. వాళ్ళలో ప్రతిఒక్కరి మీదా సమానమయిన ప్రేమాభిమానాలు చూపిస్తూ ఒకే తీరుగా ఆదరిస్తుంది; వారి వారి మానసిక పరిపక్వతను బట్టి అవసరాన్ని బట్టి నేర్పుతుంది. ఆమె, వాళ్ళ సమస్యలను వినడమే కాకుండా వారి కోరికలన్నీ నెరవేరేటట్లు చేస్తుంది.

ప్రతిరోజూ పొద్దున 9 గంటలకు, అమ్మ తన దర్శనం కోసం అధిక సంఖ్యలో వచ్చిన భక్తులను కలుసుకోడానికి వస్తుంది. ప్రతి ఒక్కరినీ తన దగ్గరికి పిలుచుకొని వాళ్ళ సమస్యలను శ్రద్ధగా ఆలకిస్తుంది. అమ్మ ఇలా చెబుతుంది, "నాయనలారా, మీ దుఃఖాలభారం తప్ప మరేమీ నాకు అవసరం లేదు. వాటిని మొయ్యడానికి అమ్మ ఇక్కడ వుంది." ప్రతి ఒక్కరినీ చేరదీసి బుజ్జగించేవరకు ఆమె అక్కడ కూర్చుని ఉంటుంది. దాదాపు ప్రతి రోజూ ఆమె, మధ్యాహ్నం 2 గంటలకో 3

గంటలకో మాత్రమే ముగిస్తుంది దర్శనం. తన గదికి తిరిగి వెళ్ళి, వచ్చిన ఉత్తరాలు చదువుతుంది; లేకపోతే ఆశ్రమవాసులకు సూచనలు ఇస్తుంది. ఆశ్రమ పాలనలో నిర్వహణను గురించి అవసరమయిన సలహాలు ఇవ్వడంలో నిమగ్నురాలవుతుంది. అన్నం తింటూ కూడా ఆమె, ఎవరికో ఏదో చెబుతూ ఉంటుంది; లేదా ఎవరో రాసిన ఉత్తరం చదువుతూ ఉంటుంది. తరచుగా ఆమె, ఆలస్యంగా వచ్చిన ఒక కుటుంబాన్నో, వ్యక్తినో పిలుస్తుంది. అది భావదర్శనం రోజు అయితే, భజన కీర్తనలు జరిపించడానికి మళ్ళీ సాయంత్రం 5 గంటలకు వస్తుంది. పాటలు అయిన తరవాత భావదర్శనం మొదలవుతుంది. అది, మర్నాడు పొద్దున మూడు నాలుగు గంటలవరకు కొనసాగవచ్చు. అప్పటివరకు అమ్మ తన ఆసనం మీద కూర్చుని ఉండి భక్తులను ఒకరి తరవాత ఒకరిని చేరదీస్తూ, వాళ్ళ సమస్యలను అవి ఆధ్యాత్మికమయినవయినా, ప్రాపంచికమయిన వయినా వింటూ ఉంటుంది. వాళ్ళ సమస్యలను ఆమె వినడమే కాకుండా కేవల స్పర్శద్వారానో, చూపుద్వారానో, సంకల్పం ద్వారానో వాటిని పరిష్కరిస్తుంది కూడా. ఈ పవిత్ర భారతభూమిలో సైతం, మాతా అమృతానందమయి ఒక అద్వితీయ దృగ్విషయం. ఆమె, ఆదిపరాశక్తి భావాన్ని వహించి తన ప్రతి ఒక్క శ్వాసతోనూ ఈశ్వర సృష్టిని అవిచ్ఛిన్నంగా సేవిస్తూ ఉంటుంది. భారతదేశ ఆధ్యాత్మిక చరిత్రలో ఆమె, తప్పులు చేసే మానవాళిమీద అనుగ్రహాన్నీ అనుకంపనూ అపారంగా చూపించటంలో అసదృశంగా నిలుస్తుంది. పరమశాంతినీ ఆత్మసాక్షాత్కరణ ఆనందాన్నీ పొందగోరే వాళ్లందరికీ దారి చూపించే నక్షత్రంలా ఆమె దివ్యజీవనం ఉపకరించాలని ఆకాంక్ష.



# అమ్మ- జీవిత చరిత్ర

"చిరునవ్వు చిందిస్తూ దేవి ఒక దివ్యప్రకాశంగా మారి నాలో కలిసిపోయింది. వన్నెవన్నెల దివ్యకాంతిలో స్నానమాడి నా మనస్సు పువ్వులా వికసింది; నాల్లో గతించిన అనేక లక్షల సంవత్సరాలు పెల్లుబికాయి. అప్పటినుంది, ఏదీ నాకంటె వేరుగా లేనట్లుగా, ఉన్నది ఒకే ఒక్కటిగా చూస్తూ ఆనందమయి అయిన జగజ్జననిలో లీనమవుతూ ఆత్మకు వేరుగా సుఖం ఉండదనే భావనను వదిలిపెట్టేశాను." మాతా అమృతానందమయి, ఇంకా తాము తరుణ వయస్సులో ఉండగానే, దేవితో ఐక్యాన్ని సాధించడం ఉత్తేజకరమయిన ఈ మాటల్లో వర్ణించింది. మాతా అమృతానందమయి అనే పుస్తకం, సానుభూతిలేని బంధువులూ ఆమె ప్రేమద్వారా కలిగిస్తున్న మార్పులకు భయపడ్డంవల్ల ఆమెను నాశనం చెయ్యాలని పగబట్టిన అపనిందకులూ దాడులు చేస్తూ ఉన్నప్పుడు అమ్మ చూపించిన ధైర్యాన్ని గాఢమయిన దైవభక్తినీ స్పష్టంగా చిత్రిస్తుంది. చిన్నతనంనుంచే ఆమె, గురువెవరూ లేకుండానే, జగన్మాతనూ జగత్పతనూ అన్వేషించింది. తన కుటుబంవాళ్ళు ఇంటి పనిమనిషిగా చూస్తున్నప్పటికీ ఆమె, దైవసాక్షాత్కారానందంలో ఎప్పుడూ మునిగి ఉండటంవల్ల కార్యభారాన్ని వహించడం అసాధ్యమయేవరకు, ఆ పాత్రను నిర్వహిస్తూనే వచ్చింది. పైకి వెర్రిగా కనిపిస్తున్నా అమ్మ తమ కాలాన్ని భక్తిగీత గానంలోను, నాట్యంలోను, సమాధిస్థితిలోను గడిపేది. కాలక్రమంలో, మనసారా ఆత్మసాక్షాత్కారాన్ని కోరే అన్వేషకులు అనేకులు, దక్షిణ భారతదేశంలో ఒక మారుమూల పల్లెలో ఆమెకోసం వెతుక్కుంటూ వచ్చారు. ఆమె మార్గదర్శకత్వం పొంది ఆధ్యాత్మిక మార్గంలో నడవడానికి బలం సంపాదించుకొన్నారు. లక్షలకొద్దీ జనం అమ్మ దర్శనానికి వచ్చారు; ఆమెదగ్గర ఓదార్పు, ప్రేమ పొందారు. ఆమెను చూసినవాళ్ళు, అమ్మ అందరిమీదా సమానంగా చూపించే ప్రేమవల్ల రోగాలు అద్భుతంగా నయంకావడం, శక్తి పుంజుకోడం అనుభవంద్వారా తెలుసుకొన్నారు.

AMRITA BOOKS

Amrita BOOKS
Amrita Enterprises Private Limited
Amritapuri, Kerala, India.
Website: www.amritabooks.in
email: info@amritabooks.in

₹ 180